# నూరు సమీక్షలు

( 1964 – 1984 )



[ వివిధ పత్రికలలో ప్రచురింపబడిన
పుస్తక సమీక్షల సంకలనం ]



ఆర్. ఎస్. సుదర్శనం

ప్రథమ ముద్రణ : జనవరి 1987


ప్రచురణ :
శ్రీమతి ఆర్. వసుంధరాదేవి
9/258, కమ్మవీధి
మదనపల్లి - 517 325

ప్రతులకు :
నవోదయా పబ్లిషర్స్
ఏలూరు రోడ్, విజయవాడ

ముద్రణ :
శ్రీ రత్నా ప్రింటర్స్
ముత్తంగివారి వీధి,
రాజమండ్రి - 533 101
ఫోన్ : 6345

NOORU SAMIKSHALU

A Collection of Book-reviews) by R. S. Sudarshanam

వెల : రు. 35/-

# విషయసూచిక

## సవలా సాహిత్యం

విషయము | పేజీ


| | | |
|---|---|---|
| 1. | బద్దన్న సేనాని (విశ్వనాథ సత్యనారాయణ) | 1 |
| 2. | కొల్లాయి గట్టితే నేమి? (మహీధర రామమోహనరావు) | 8 |
| 3. | ఈ దారి ఎక్కడికి? (మహీధర రామమోహనరావు) | 12 |
| 4. | యమపాశం (గోపీచంద్) | 16 |
| 5. | చీకటి గదులు (గోపీచంద్) | 20 |
| 6. | జనపదం (దాశరథి రంగాచార్య) | 22 |
| 7. | విచలిత (నవీన్) | 25 |
| 8. | మనిషి - మిధ్య (ఆదివిష్ణు) | 27 |
| 9. | తాగుబోతు (వినుకొండ నాగరాజు) | 29 |
| 10. | రంగపతి (దుర్గానంద్) | 32 |
| 11. | విడీవిడని చిక్కులు (వీరాజీ) | 37 |
| 12. | దిగంతాలకు (నండూరి విఠల్) | 41 |
| 13. | ప్రతిమ (నండూరి విఠల్) | 45 |
| 14. | వత్తిగుల్లలు (తులసీకృష్ణ) | 47 |
| 15. | జీవన సంగీతం (హృదయం) | 49 |
| 16. | జీవన సమరం (అవసరాల రామకృష్ణారావు) | 51 |

| విషయము | పేజీ |
|---|---|
| 17. అమ్మ చెప్పింది (పి. వి. సుబ్బారావు) | 54 |
| 18. స్వయంవరం (కపిల కాశీపతి) | 60 |
| 19. తమసోమా.... (పి. రాజగోపాలనాయుడు) | 65 |
| 20. దాంపత్యం (వేదాంతం సుబ్రహ్మణ్యం) | 67 |
| 21. సుశీల (నిడమర్తి సత్యనారాయణమూర్తి) | 70 |
| 22. లాడ్జింగులో ఒకరాత్రి (కొనరాజు శేషయ్య) | 75 |
| 23. మిసెస్ పరాంకుశం అద్దెకిచ్చిన హృదయాలు (మల్లాది వేంకట కృష్ణమూర్తి) | 77 |
| 24. ప్రేమ పల్లకీ (శ్రీ రమణ) | 80 |
| 25. రాబందులూ, రామచిలుకలూ (వాసిరెడ్డి సీతాదేవి) | 81 |
| 26. శ్రీమంతులు, కలకాదు సుమా, ఎదగని మనసులు, సుషుప్తి (మాదిరెడ్డి సులోచన) | 88 |
| 27. నెరజాణలు - మగధీరులు (మాదిరెడ్డి సులోచన) | 88 |
| 28. రత్నమందిర్ (మాదిరెడ్డి సులోచన) | 90 |
| 29. సద్యోగం (మాలతీ చందూర్) | 92 |
| 30. జయ - లక్ష్మి (మాలతీ చందూర్) | 95 |
| 31. కృష్ణవేణి (మాలతీ చందూర్) | 97 |
| 32. సంఘర్షణ (తురగా జానకీరాణి) | 99 |
| 33. ఆశలూ - అనుభవాలూ (ఉన్నవ విజయలక్ష్మి) | 102 |
| 34. దైవమిచ్చిన భర్త (ఉన్నవ విజయలక్ష్మి) | 104 |
| 35. కాలచక్రం (కావలిపాటి విజయలక్ష్మి) | 106 |
| 36. మరుపులో మెరుపులు (చెరుకూరి రమాదేవి) | 107 |

| విషయము | | పేజీ |
|---|---|---|
| 37. | ఒక దీపం వెలిగింది (నేరెళ్ళ రామలక్ష్మి) | 109 |
| 38. | ఒక నీలిపు కథ (లత) | 111 |
| 39. | ఇది తులసివనం (లత) | 114 |
| 40. | శిథిల సౌధం (కె. రాధాదేవి) | 116 |
| 41. | నిష్కృతి (ఆర్. ప్రమీలా కుమారి) | 118 |
| 42. | తిరిగి దొరికిన జీవితం (డి. కామేశ్వరి) | 119 |
| 43. | ఛాయ (ఆలేటి నాగమణి) | 121 |
| 44. | అన్నపూర్ణ (ఆలేటి నాగమణి) | 123 |
| 45. | వీళ్ళూ మనుషులేనా? (కురుమద్దాలి విజయలక్ష్మి) | 125 |
| 46. | అపర్ణ (విమలారామం) | 127 |
| 47. | వసుంధర (విమలారామం) | 130 |
| 48. | కిరణ్మయి (విమలారామం) | 131 |
| 49. | ఆశలవల (గోవిందరాజు సీతాదేవి) | 134 |
| 50. | జానకి విముక్తి (రంగనాయకమ్మ) | 135 |
| 51. | ఇంద్రధనుస్సు (రేవనూరి శమంత) | 138 |
| 52. | రొయ్యలు (తగళి శివశంకరపిళ్ళై) | 141 |

## కథా సాహిత్యం

| | | |
|---|---|---|
| 1. | విశ్వనాథవారి చిన్నకథలు | 148 |
| 2. | చా:సో కథలు | 154 |
| 3. | కదిలే బొమ్మలు (అంగర వేంకట కృష్ణారావు) | 160 |

| విషయము | | పేజీ |
|---|---|---|
| 4. | ఆకులు రాలే కాలం (ఇచ్ఛాపురపు జగన్నాథరావు) | 162 |
| 5. | లైఫ్ ఇన్ ఎ కాలేజ్ (నవీన్) | 167 |
| 6. | రంగుటద్దాలు (శీలా వీర్రాజు) | 169 |
| 7. | ఊరు వీడ్కోలు చెప్పింది (శీలా వీర్రాజు) | 172 |
| 8. | బ్రెయిన్ డ్రెయిన్ (కవన శర్మ) | 173 |
| 9. | దిక్కుమాలిన కాలేజి (కె. ఎన్. వై. పతంజలి) | 176 |
| 10. | అత్తగారి కథలు (భానుమతి) | 178 |
| 11. | నాకు చచ్చిపోవాలని వుంది (రంగనాయకమ్మ) | 180 |
| 12. | మంచివాడు (వాసిరెడ్డి సీతాదేవి) | 184 |
| 13. | మాకీ భర్త వద్దు (ఆలూరి విజయలక్ష్మి) | 187 |
| 14. | డబ్బు ! డబ్బు !! డబ్బు !!! (బీనాదేవి) | 189 |
| 15. | ఆంధ్రయువకుడా దారి యిటు (యద్దనపూడి సులోచనారాణి) | 191 |
| 16. | మిథ్యాబింబాలు (కె. వి. కృష్ణకుమారి) | 192 |
| 17. | కొత్తనిజం (రాజీవ) | 194 |
| 18. | దర్పణం (ఆంధ్ర సారస్వత సమితి, మచిలీపట్నం) | 198 |
| 19. | ఆకర్షణ (ఆంధ్ర సారస్వత సమితి, మచిలీపట్నం) | 201 |
| 20. | శృంగారవనం (బెంగాలీ కథలు) | 203 |


## కవితలు


| | | |
|---|---|---|
| 1. | కట్టమంచి రామలింగారెడ్డి పద్యరచనలు | 208 |
| 2 | కృష్ణశాస్త్రి సాహిత్యం | 212 |

విషయము　　　　　　　　　　　　　　　　　　పేజీ

3. నా దేశం - నా ప్రజలు (గుంటూరు శేషేంద్రశర్మ) 215
4. తేజస్సు నా తపస్సు (సి. నారాయణరెడ్డి) 224
5. మూడు యాభైలు (శ్రీశ్రీ) 226
6. ఆనంద భిక్షువు (వి. వి. యల్. నరసింహారావు) 228
7. అగ్నిధార (దాశరథి) 231
8. నవత (పత్రిక) 232
9. దిగంబరకవులు 233
10. ఋతచేతన 239
11. బాపురెడ్డి గద్యకావ్యాలు 240
12. చర్య (కె. శివారెడ్డి) 242
13. అంతర్నేత్రం (ఎస్. ఎ. రవూఫ్) 244
14. కలలో కవిత (రావి రంగారావు) 246

## ఇతర గ్రంథాలు

1. శ్రీశ్రీ రేడియో నాటికలు 252
2. ఎనిమిది నాటికలు (అంగర సూర్యారావు) 253
3. చంద్రసేన (అంగర సూర్యారావు) 255
4. శరత్‌చంద్ర ఛటర్జీ (సుబోధ చంద్రసేనగుప్త) 257
5. కుమారన్ ఆశాన్ (కె. ఎం. జార్జి) 260
6. ఉదబిందువులు (జీ. వి. కృష్ణరావు) 262
7. హేతువాదమంటే ? (ఎమ్. వి. రామమూర్తి) 267

| విషయము | పేజీ |
|---|---|
| 8. సమానతా నువ్వెక్కడ? (వివిధ రచయితలు) | 268 |
| 9. దేవతలు అంతరిక్ష యాత్రికులు మాత్రమేనా? (ఎరిక్ వాన్‌డానికెన్) | 271 |
| 10. తెలుగు నవలాసాహిత్యంలో మనోవిశ్లేషణ (కోడూరి శ్రీరామమూర్తి) | 274 |
| 11. తెలుగు నవలా వికాసం (మొదలి నాగభూషణ శర్మ) | 278 |
| 12. తెలుగులో తొలి సమాజకవులు (వ్యాస సంకలనం) | 288 |
| 13. డా. వి. ఆర్. రెడ్డి పీఠికలు | 290 |
| 14. చలం శ్మశాన సాహిత్యం (వేంకటేశ్వరరావు) | 294 |




# బద్దన్న సేనాని

— విశ్వనాథ సత్యనారాయణ

విశ్వనాథ సత్యనారాయణ వ్రాసిన చారిత్రక నవలల్లో విశిష్టమైనది 'బద్దన్న సేనాని'. కారణం ఈ నవలలో కథానాయకుడు పంచమ కులస్థుడైన బద్దన్న. తెలుగుదేశంలో కులవ్యవస్థ పండ్రెండవ శతాబ్ది ప్రథమ భాగంలో ఎలా ఉండేదో 'బద్దన్న సేనాని' నవల ద్వారా మనకు అవగత మౌతుంది. విశ్వనాథ తమ బాల్యంలో కృష్ణాతీరంలోని గ్రామాల్లో కుల వ్యవస్థా, భిన్నకులాలకు చెందిన వ్యక్తుల మధ్య సంబంధాలూ ఎలా ఉండేవో అనుభవం నుంచీ గ్రహించిన విషయాలనే 'బద్దన్న సేనాని', 'వీరవల్లడు' నవలల్లో నిక్షిప్తం చేసినట్లు స్వీయ చరిత్రలో వ్రాశారు. 'బద్దన్న సేనాని'లో చిత్రింపబడిన సామాజిక వ్యవస్థలో గోచరించే యాథార్థ్యం, నేడు అర్థంకాని కొన్ని సామాజిక ధోరణులు అర్థమయ్యేలా వెలుగు నిస్తున్నది :

కథాకాలం క్రీ.శ. 1128, కృష్ణాగోదావరీ మధ్యస్థమైన తెలుగు దేశాన్ని వెలనాటి చోళులు పాలిస్తున్నారు. వెలనాటి చోళులు క్షత్రియులు కారు. చతుర్థకులజులు వీరి రాజధాని ధనదుపురము. పాలకుని పేరు రెండవ గొంకరాజు. ఈయనకు బంధువులు, సామంతులునైన దుర్జయ మందుడు నాదెండ్లలోను, నంబయ్య చేబ్రోలులోను రాజ్యం చేస్తున్నారు. వేంగిరాజు త్రిపురాంతకుడు, వీరికి బంధువు కాదు. వేంగి, రెండేరుల

సచివు విషయముల కధిపతియై చోళుల సర్వాధిపత్యాన్ని అంగీకరించిన
వాడు. కథాకాలానికి ఏడేండ్లకు పూర్వం పశ్చిమ చాళుక్యులు దండెత్తివచ్చి
వెలనాటి చోళులను ఓడించి తమ సర్వాధిపత్యం నెలకొల్పుటవల్ల ఆంధ్రదేశం
కన్నడదేశంలో భాగమై పరాధీనతను అనుభవిస్తున్నది. కన్నడదేశం నుండి
వచ్చిన వీరశైవులు, ఆంధ్రదేశములోని శైవులమీదా మతాధిపత్యాన్ని వహిం
చేందుకు ప్రయత్నం చేస్తున్నారు. 'బద్దన్న సేనాని' నవల అటువంటి సంఘ
టన ఒకదానితో ప్రారంభమౌతుంది. కరవాలభైరవుడు అనే పశ్చిమచాళుక్య
సేనాని శివరాత్రి రోజున వీరశైవుల ఉత్సవాన్ని విజయవాటము మీదుగా
ప్రాగ్దిశాభిముఖంగా బయలుదేరదీస్తాడు. దానిని విజయవాటములోని శైవు
లకు సవాలుగా ప్రకటిస్తాడు. ఆ సవాలు నెదుర్కొని బద్దన్న కరవాల
భైరవుని త్రిప్పికొట్టడమే కాకుండా, అద్భుతమైన ఖడ్గ విద్యానైపుణ్యంతో
అతణ్ణి ఓడించి సంహరిస్తాడు. ఇరవై రెండేండ్ల యువకుడూ, పంచమ
కులస్థుడూ అయిన బద్దన్న ఆ సందర్భంలో అనే మాటలు : "ఓరీ, శివుడు
శివుడందువు. నీవు శైవుడవు. నేనును శైవుడను. అతడు జ్ఞానాకృతి.
ఆత్మస్వరూపుడుగాని సంఘవ్యవస్థా రూపుడుగాడు. నీ శైవమేమిటి ?"
ఆ మాటల్లో బద్దన్న సంస్కారమూ, చదువూ. అతని వ్యక్తిత్వమూ
మనకు తేటతెల్లం అవుతవి.

కరవాల భైరవుని సంహారంతో అసహాయ శూరుడైన బద్దన్న
ప్రజల మనస్సుల్లో బద్దన్న సేనానిగా రూపుదిద్దుకుంటాడు. ఆనాటి
యుద్ధంలో తగిలిన గాయాలకు చికిత్సపొందే రోజుల్లోనే బద్దన్న ఊహాలు,
ఆశయాలు గగన విహారం చేశాయి. దేశంనుండి పశ్చిమ చాళుక్యులను
పారద్రోలేందుకు పథకాన్ని ఆలోచిస్తాడు. ఆరోగ్యం కుదుటబడగానే తోటి
ప్రజల్లోనూ, రాజుల్లోనూ, దేశాధిపతి గొంకరాజులోనూ ఏర్పడిన విరు
త్సాహాన్నీ, మాంద్యాన్నీ తొలగించే ప్రయత్నం చేస్తాడు బద్దన్న.
సైన్యసమీకరణం చేస్తాడు. తన వ్యూహంతో అందర్నీ ఉత్తేజితుల్ని

చేస్తాడు. బద్దన్న చాకచక్యాన్నీ, విజయ పరంపరనూ విశ్వనాథ వివరంగా వర్ణిస్తారు నవలలో.

కథానాయకుడైన బద్దన్నకు ప్రతినాయకుడు నంబయ్య. నంబయ్య రాజవంశీకుడు. గొంకరాజుకు సర్వసేనాధిపతి, బద్దన్నకు నంబయ్య అవరోధంగా నిలుస్తాడు. నంబయ్య వ్యక్తిత్వం ఎలాంటిది? ఈ నాటికి అధికారుల్లో, రాజకీయవాదుల్లో మనకు కనిపించే వ్యక్తిత్వమే తప్ప వేరు కాదు. "అమర్చిపెట్టినచో అనుభవించుటకు, అధికారము చేయుటకు తగినవాడు. తనయంతట తన్ను సమకూర్చుమన్నచో శక్తి చాలదు. అతడు ఫలమనుభవించుటకు పుట్టినవాడు. ధనవంతుడు. భోగి, అహంకారి అధికార ధూర్తమహుడు పరులశక్తి తెలిసికొనలేనివాడు. ఈర్ష్యాళువు" విశ్వనాథ యిలా వాచ్యముగా వర్ణించుటేకాదు, ఈ వర్ణనలోని ప్రతి అంశాన్నీ కథా సందర్భంగా, ఆయా సన్నివేశాలలో నంబయ్య ప్రవర్తనలో రుజువు చేశారు.

బద్దన్న పంచమకులంలో ప్రభవించిన మాణిక్యమైతే, నంబయ్య రాజవంశంలో జన్మించిన గాజుపెంకు. ఈ యిద్దరికిగల వ్యక్తిత్వ వైరుధ్య చిత్రణలో, వారు ఆయా కులాలకు చెందినవారు కావడంవల్ల, సామాజికంగా వారికి ఏర్పడిన అవకాశాలూ అవరోధాలూ ఎలాంటివో ఎత్తిచూపి, తద్వారా కులవ్యవస్థ అనేది ఈ దేశానికి పూర్వంనుంచీ ఎంతటిగుదిబండగా, అపకారం చేస్తూ వచ్చిందో ధ్వన్యాత్మకంగా, వ్యంగ్యంగా చిత్రించారు విశ్వనాథ. వ్యంగ్య చిత్రణమే తప్ప వాచ్యమైన విమర్శచెయ్యలేదు। చరిత్ర కథనంలో వాచ్యమైన విమర్శవల్ల నేటి భావాలు రంగ ప్రవేశంచేసి నవలను దెబ్బతీసి ఉండేవి. నంబయ్య కల్పించిన అవరోధాన్ని రాజకీయ చతురతతో అధిగమించి, దేశాన్ని పశ్చిమ చాళుక్యుల ఆధీనం నుంచి విముక్తం చేసే లక్ష్యాన్ని బద్దన్న సాధిస్తాడు. ఆ విజయానికి కారకుడు బద్దన్న

కాని ఆ కీర్తి ప్రతిష్ఠలు నంబియ్య పొందుతాడు. యుద్ధంలో పాల్గొన్న సేనానులకూ, మందయ్య, త్రిపురాంతకుడు వంటి రాజులకూ బద్దన్న కార్యశూరత, నిర్వహించిన కీలకమైనపాత్ర చక్కగానే తెలుసు. కాని బద్దన్నకు నంబియ్యస్థానం లభించుట ఆనాటి సామాజిక వ్యవస్థలో అనూహ్యము ; కారణం అతని కులము ; ఇక్కడ బద్దన్న నమ్రత, వైరాగ్యమూ, కేవలం వ్యక్తిగతమైనవికావు. అవి చాలవరకు కులసంబంధమైనవే ; "పంచమకులస్థుడి దేశమున ప్రభుత్వమెప్పుడు చేసెను ? బ్రాహ్మణులు, క్షత్రియులు చేసిరి. కొన్నివందల ఏండ్లుగా ఉత్తమకులజులైన శూద్రులు చేసిరి" అంటాడు బద్దన్న తన్నభిమానించిన చంద్రగౌడునితో. "మేము మంటిజీవులము. రాజ్యముచేసి అన్నికులముల వారిని పాలింతుము. కాని బ్రాహ్మణుల నెట్లు పాలింతుము ?" అన్న సందేహాన్ని వ్యక్తం చేసిన బద్దన్నతో అతని స్నేహితుడు, బ్రాహ్మణుడైన నన్నయ్య ఇలా అంటాడు : "పోరాపో, అది నీకులము యొక్క కర్మము, నీవంటి వారి యొక్క భయము యొక్క ఫలితము" దానికి బద్దన్న సంస్కారం యిలా సమాధానం చెబుతుంది : "భయము కాదుస్వామీ ; ఈ దేశమా వైరాగ్యము గల దేశము. నా కులము వైరాగ్యము గల కులము. యుద్ధము వచ్చినచో మేము సేన, లేనిచో పాలేరులము."

ఈ సంప్రదాయ బద్ధత, వైరాగ్యము బద్దన్నలో శ్రుతిమించి, చివరకు అతని వినాశానికి దారితీస్తుంది. యుద్ధం తర్వాత రాజు వీరులను, సేనానులను సన్మానించే వేళకు బద్దన్న రాజధానికి రాడు, విరక్తిగా తన గ్రామంలో ఉంటాడు. తన సేవలకు గుర్తింపు రాలేదనీ, గుర్తింపు లేకపోవడం కంటె తనపట్ల నిరాదరణ, నిర్లక్ష్యము వ్యక్తమైనవనీ లోపల బాధపడతాడు. ఎప్పుడో త్రిపురాంతకుడు తనకు ధారాదత్తం చేసిన విజయవాట పురాధిపత్యాన్ని వదులుకుంటాడు. తనమీద పరభార్యాపహరణం నేరం మోపడానికి, తాను పైకితెచ్చిన నాగయ్య ప్రయత్నించగా, బద్దన్న

అతనితో యుద్ధం చేసి ఆరోపణ నుంచీ బయటపడవచ్చునని పరిషత్తు తీర్పుచెప్పినప్పటికీ, ఔదాసీన్యం వహించి, తన ఖడ్గ విద్యను ఆత్మరక్షణ కోసం ఉపయోగించడానికి నిరాకరిస్తాడు. వేంగిలో త్రిపురాంతకుని కొమారుడు ఆప్యాయంగా 'మామా' అనిపిలిచి, తాను రక్షణ కల్పిస్తానని ముందుకు వస్తే, దానికి బద్దన్న చెప్పే సమాధానం : "బాబూ! ఆ గొంక రాజునకు నే నెవడనో తెలియదు. నా శరీరములోని ఈ నెత్తురు బానిస నెత్తురు. బానిస భావము నా జాతి నెత్తురుతో బాటు నా నెత్తురులోగూడ నిండియున్నది. ఆ విక్రమ చోళుడు నాకు చక్రవర్తియని, గొంకరాజు మహారాజని నా నెత్తురులో నేను నిద్రపోవుచున్నప్పుడు కూడ ఆ భావమే మేల్కొని యుండును. నేనేమి చేయుదును ?" కులం నుంచీ సంక్రమించిన ఈ దైన్యమే బద్దన్న విశిష్టవ్యక్తిత్వాన్ని నాశం చేసింది।

చివరకు గొంకరాజు నుంచీ ఆహ్వానం వస్తుంది. సన్మానం చేసేందుకుకాదు; బద్దన్నపై అభియోగం విచారించేందుకు. ఇక్కడ మళ్ళీ అదే సమస్య. బద్దన్న సేనాని అనీ, విజయవాటి పురాధీశుడనీ, త్రిపురాంతకుడు సమర్థిస్తాడు. అందువల్ల అభియోగం తెచ్చినవానితో ద్వంద్వ యుద్ధం తప్పదు. అతడు నంబయ్య. నంబయ్యకు బద్దన్నను గాయపరచ డానికి కూడా సామర్థ్యం చాలదు। బద్దన్న స్వయంగా తన దేహాన్ని బలిగా అర్పిస్తాడు నంబయ్య కత్తికి ఆక్షణంలోనే తన కత్తితో నంబయ్య కుడిచేతి అయిదువేళ్ళనూ ఒడుపుగా ఖండించివేస్తాడు. గొంకరాజు, మహావీరుడూ, రాజ్యతంత్రజ్ఞుడూ, అయిన బద్దన్ననూ సైన్యాధిపతి అయిన నంబయ్యనూ, యిద్దర్నీ కోల్పోతాడు. ఇది కులవ్యవస్థ, దానికి కట్టుపడిన వ్యక్తి మన సత్త్వాలూ దేశానికి తెచ్చిపెట్టిన అపారనష్టం।

విశ్వనాథ బద్దన్న వ్యక్తిత్వాన్ని రూపొందించడంలో అతణ్ణి విషాదాంత కథానాయకుడుగా చిత్రించారు. షేక్స్పియర్ సృష్టించిన మేక్‌బెత్, ఓథెల్లో, హేమ్లెట్ వంటి పాత్రల వరవడి యిక్కడ మనకు

కనిపిస్తుంది. ఉదాత్తుడైన నాయకునిలో ఏదో ఒక నాశప్రవృత్తి, అతని బలహీనతగా (tragic flow) రూపొంది, చివర అతని వినాశనానికి, మరణానికి దారితీస్తుందని షేక్స్పియర్ విషాదాంతనాటక విమర్శకుల నిగమనం దాని స్వరూపం నాయకునిలో జరిగే అంతస్సంఘర్షణగా అభివ్యక్తమౌతూ ఉంటుంది. బద్దన్న వ్యక్తిత్వంలో ఆ ప్రవృత్తి అతనికి బాదమ్మమీద గల ప్రేమ. ఇరవై రెండేళ్ళ బద్దన్నకు ముప్పైఏళ్ళ బాదమ్మ మొదట ఖడ్గవిద్యాగురువు, తర్వాత ప్రేయసి, బద్దన్న ఖడ్గవిద్యానైపుణ్యం కరవాల భైరవుని సంహారంతో లోకవిదితమైన సమయంలోనే, అతనికి అంతరాంతరాల్లో బాదమ్మ మీద గల వాంఛా, వలపూ కూడా బహిర్గత మౌతుంది. బాదమ్మ వివాహిత. పరస్త్రీ, ఈ పరిస్థితిని లెక్కచెయ్యని బద్దన్న ప్రేమ, అతని సంస్కారం కారణంగా, ఎన్నో తర్కవితర్కా లకు లోనవుతుంది. ఆ ప్రేమ లోకం దృష్టిలో అధర్మంగా తోచినా, బద్దన్నకు అది స్వధర్మంగానే అనుభూతమౌతుంది. విశ్వనాథ బద్దన్న ఆత్మధర్మాన్నీ, వ్యవస్థాధర్మాన్నీ విశ్లేషించి, ఆ రెంటింటినీ తర్కించిన భాగాలు నవలకు ధార్మికమైన విశిష్టతను చేకూర్చాయి. ఇది కేవలం ఒకా నొక చారిత్రక సందర్భమైన ధర్మప్రవక్తి కాదు. మానవప్రవృత్తిలో, వ్యక్తిహృదయంలో, ఏకాలంలోనైనా చెలరేగే ధర్మమీమాంస. "తాను బాదమ్మను ప్రేమించెను. అతని ఉద్దేశ్యములో అది ధర్మము, స్వాభిమానము వాని ఆత్మతో ముడిపడెను. ఒక శకపురుషుడు, ఒక జేత, ఒక మహాశిల్పి ఈ తరగతికి చెందినవారుగా కాన్పింతురు. వారియం దట్టిభావమే లేకున్నచో వారా మహాకార్యములు చేయజాలకుందురు. వారు నిరంకుశులుగా కన్పిం తురు. వారు లోకాతీతులు లోకము వారి కొరకుగాదు. వారు లోకము కొరకు" బద్దన్న విశిష్ట వ్యక్తిత్వాన్ని గూర్చి అది విశ్వనాథ తీర్పు....తమ ప్రేమానుబంధాన్ని గూర్చి బద్దన్న బాదమ్మతో యిలా అంటాడు: "ఇది భగవంతుడు చేసినపని. నీవును చేయలేవు దీనికి లోకము మతలబు

పొందించినచో భగవంతుని ఉద్దేశము తెలియకపోవుట అగును" దానికి బాదప్ప: "మనము లోకములో నున్నాము. నీవీ యుద్ధపు గొడవలు మాని, మనమే యడవులకోబోయి, ఏ సెలయేటి యొడ్డుననో గుడిసె వేసికొని యుందుము. మానవుల కంటబడము. అప్పుడిది తప్పని నాకని పించదు". ఇక్కడ మనకు చలంగారి 'మైదానం', ఆయన ప్రతిపాదించిన స్వచ్ఛంద ప్రేమానుభూతి జ్ఞాపకం వస్తాయి.

పురాధిపతులను, సేనానాయకులను. రాజులను వారు కోరిన స్త్రీ విషయంలో కాదని కట్టడిలోపెట్టే స్థితి నాటి పరిస్థితులకూ, సమాజానికి లేదు। ఆ స్వేచ్ఛా, ఆ అవకాశమూ తనకూ ఉన్నా, బద్దన్న వ్యవస్థా ధర్మాతిక్రమణకు శిక్షగా ప్రాణాల్ని అర్పిస్తాడు. శివుడు ఆత్మస్వరూపుడు గాని, సంఘవ్యవస్థారూపుడు గాదు" అని ఉద్ఘాటించిన బద్దన్న స్వధర్మం మీద పట్టువదలి వ్యవస్థాధర్మానికి లొంగిపోవడం మనకు అసంగతంగానే తోస్తుంది. కాని అదే వాస్తవం। కారణం బద్దన్నకు తనకులంతో గల తాదాత్మ్యం యిక్కడ కీలకమైన విషయం। అది సాంప్రదాయకంగా వినమ్రతనూ, లొంగుబాటునూ, వైరాగ్యాన్నీ ప్రబోధిస్తున్నది. ఆ మనస్తత్వంనుంచీ విముక్తి పొందనిదే వ్యక్తి వికాసంగాని, స్వధర్మరూపంగాని విజయం పొందవు। ఆ విముక్తికే ఆధునిక సమాజంలో, ప్రజాస్వామ్యంలో కృషీ, ప్రయత్నమూ జరుగుతున్నది. ఇది కేవలం ఆర్థిక, రాజకీయ పరిస్థితులతో ముడివడిన విషయంకాదు. తరతరాల, శతాబ్దాల సంప్రదాయం రక్తంలో జీర్ణించిన మనస్తత్వ విషయం। ఇటీవల శ్రీ కేశవరెడ్డి రచించిన నవల 'ఇన్‌క్రెడిబుల్ గాడెస్' ముగింపులోని సంఘటనకూడా దీన్ని రుజువు చేస్తున్నది. కథానాయకుడు హరిజనుడు, అతణ్ని ఆదుకున్న అగ్రవర్ణానికి చెందిన వ్యక్తి వళ్ళుకాలి దేవాలయ ప్రాంగణంలో మరణిస్తూ, ఆ హరిజనుణ్ని దేవాలయం లోపలికివెళ్ళి దీపపు పెమ్మెలలోని నూనె

తెచ్చి గాయాలకు రాయమని కోరితే, తనకులం రీత్యా. తాను దేవాలయం లోపలికి వెళ్ళలేనని సమాధానమిస్తాడు ఆ హరిజనుడు। వ్యక్తి వికాసానికి అవసరమైన మానసిక స్వేచ్ఛా సమానత్వాలు వ్యక్తి స్వయంగా పొంద వలసినవేతప్ప, యితరులు ప్రసాదించేవి కావు। ఇది బద్దన్న పాత్ర మన కిచ్చే సందేశం।

(కళాసాగర్ సంచిక - 1885) ❋

# కొల్లాయి గట్టితేనేమి ?

— మహీధర రామమోహనరావు

తెలుగులో చరిత్రాత్మక నవల అంటే ఏ అశోకుని కాలమో, మొగలుకాలమో, కాకతీయులకాలమో ప్రాతిపదికగా తీసుకుని వ్రాయబడిన కల్పితగాథ. పోతే, వీరేశలింగంగారి 'రాజశేఖర చరిత్రము' మొదలుకొని ఉన్నవవారి 'మాలపల్లి', విశ్వనాథవారి 'వేయి పడగలు' దాకా అన్నీ సాంఘిక నవలలే। సంఘం ప్రతి దశాబ్దికీ, కాకపోతే పాతిక, ముప్పై ఏళ్ళకైనా మార్పుచెందుతూ వుంటుందనీ, ఆ మార్పు దృష్ట్యా కొన్ని నవలల్లో వర్ణితమైన పరిస్థితులూ, పాత్రలూ ఒకానొక కాలానికి కట్టుపడి, దాని తాలూకు ముద్రతో వైలక్షణ్యంతో రూపొందుతాయనీ నిశితంగా వివక్షచేసే అలవాటు మనకు ఉన్నట్లే కనిపించదు। అంతదాకా ఎందుకు ? శరత్ నవలల్లోని సమాజాన్ని తెలుగు సమాజంగా, శరత్‌ని తెలుగువాడుగా భ్రమించిన పాఠకులు ఉన్నారు. ఈ రకం అజ్ఞతని 'భారతీయత'గా సమర్థించుకోవడంకూడా కద్దు. స్వాతంత్ర్యోద్యమంలో తెలుగుదేశం ఎలా వుంది ? అనే ప్రశ్నకు ఒక్క 'మాలపల్లి' నవలలో కొంత సమాధానం

లభిస్తుంది. అంతే! మరొక నవల మళ్ళీ కనిపించదు! చిలకమర్తి లక్ష్మీ నరసింహం పంతులుగారు రాచకీయాల సందడి తన నవలల్లోకి చొరకుండా జాగ్రత్తపడ్డారు. కొందరు రచయితలు వంగదేశమే ఆంధ్రదేశమను కున్నారు. తతిమ్మా వారు 'రొమాంటిక్' మైకంలో పడిపోయారు. ఫలితం, మనకు స్వాతంత్ర్యోద్యమం తెలుగుదేశంలో రూపొందిన వైనం, ఆఖ్యాయిక రూపంలో అందజేసే నవలలే కరవు. 'రొమాంటిసిజమ్' శృంఖలాలని వదిలించుకుంటున్న నేటి తెలుగు సాహిత్యంలో పైజెప్పిన కొరత తీర్చేందుకు చేసిన చక్కని ప్రయత్నంగా పేర్కొనవచ్చు మహీధర రామమోహనరావుగారి యీ నవలను.

"1921 మార్చి 31, ఏప్రిల్ 1 - ఆనాడు బెజవాడలో అఖిల భారత కాంగ్రెస్ కమిటీ సమావేశం జరిగింది" - ఆ తేదీని లక్ష్యంగా పెట్టుకుని, ఆనాటి తెలుగుదేశపు రాజకీయ, సామాజిక, ఆర్థిక పరిస్థితులను చిత్రిస్తున్నదీ నవల. కథానాయకుడు రామనాధం గాంధీ పిలుపు విని కాలేజీలో చదువుతున్న చదువుకి స్వస్తిచెప్పి యింటికి చేరుకోవటంతో ప్రారంభమై, అతను స్వరాజ్యం అనే అమ్మాయిని 'వర్ణాంతరం' మాత్రమే కాదు 'వివాహాంతరం కూడా అయిన వివాహం చేసుకోవడంతో నవల ముగుస్తుంది. తీగె కదిపితే డొంక కదుల్తుంది. బ్రిటిష్‌వారిని బహిష్కరించి, దేశం నుంచి వెడల నడిపే ఉద్దేశంతో ప్రారంభమైన ఉద్యమం, కాదు విప్లవం, భారతీయ సమాజంలో వ్రేళ్లు పాతుకుని ఉండిన విశ్వాసాల్నీ సంప్రదాయాల్నీ ఆచారాల్నీ పద్ధతుల్నీ యావజ్జీవన సరణినీ దాని మూలాధారాల్నీ - కదల్చి, పెకల్చి, సర్వమానవ సమాజమనే ఆదర్శానికి అర్జులు చాస్తుందనే హెచ్చరికతో, స్పృహతో వ్రాయబడిన నవల యిది! అంటే, రాచకీయ స్వాతంత్ర్యం రావటంతో, విప్లవం ముగిసిపోలేదు; విప్లవం సాగుతూనే ఉంది, సాగుతూనే ఉంటుంది అన్న ధ్వని యీ నవలకు విశిష్టత చేకూర్చింది. అదే ఈ నవలలో 'ఆధునికత' కూడా!

మార్పు విషయంలో మనస్సులు, హృదయాలు గాయపడక తప్పదు. మార్పు ప్రారంభం అయాక అది ఎక్కడ ఆగుతుందో చెప్ప లేము. కర్తవ్యం ముందుకు అడుగువేస్తూ ఉండటమే। ఈ సాహసం, జిగీష, వివేకవంతుడూ, ఆలోచనాపరుడూ అయిన రామనాథంలో కనిపిస్తుంది. "ఇక్కడ సమస్య....మనస్సు నొప్పించడం కానేకాదు.... మన జీవితం, మన బ్రతుకు పద్ధతులూ ఎలా వుండాలి? మనం యింత వరకూ అలవాటుపడిన జీవిత పద్ధతులు ఏవీ హేతువాదానికి నిలబడడం లేదు. అవి మన నడకకి అడ్డం అవుతున్నాయి. సంఘ సంస్కర్తలు ఒక్కొక్కరు ఒక్కొక్కదాంట్లోవున్న పేచీ చెప్తున్నారు కాని అసలు మన జీవిత పద్ధతి యావత్తూ మారిపోవలసే వస్తూంది....మార్చాలి. మార్చి తీరాలి" (278 పుట). 'కులభేదాలు దేశ స్వాతంత్ర్య యుద్ధానికీ ఆటంక కారులుగా ఉన్నాయని' రామనాథం గ్రహించిన పట్టున అన్న మాటలవి. కులభేదాల సంగతీ, మతభేదాల సంగతీ గాంధీ నెహ్రూ ఘోషిస్తూనే వచ్చారు; క్రమంగా దేశంకూడా గుర్తించింది, ఆచరణమాట ఎలావున్నా। కాని అంతకంటె ఒక్క అడుగు ముందుకేవేయాల్సి వచ్చింది రామనాథానికి: చివర అతన్ని ఎదుర్కొన్న సమస్య - వ్యక్తికీ సంఘానికీగల సంబంధం ఎటువంటిది? అది భవిష్యత్తులో ఎలా రూపొందాలి? అని. రామనాథానికి భార్య బ్రతికే ఉంది; స్వరాజ్యానికి భర్త బ్రతికే ఉన్నాడు. ఈ యిద్దరికీ పెళ్లి చేయడానికి ఏ సమాజం, ఏ సంస్కర్తలు ఒప్పు కుంటారు? ఇది వర్ణాంతర వివాహం అనే అభ్యంతరం పోయింది, దేశంలో వచ్చిన మార్పు మూలంగా. కాని యిది 'వివాహాంతర' వివాహం కూడా కావటాన్ని ఎవరైనా ఆమోదిస్తారా? రామనాథం స్వరాజ్యాల విషయంలో 'ఆమోదించరమే భావ్యం; ధర్మం' అనే రీతిగా సన్నివేశాలూ, పరిణామాలూ నవలలో మొదటినుంచి చివరి దాకా సహజంగా, యథార్థంగా సమర్థంగా చిత్రించబడ్డాయి. అంటే 'రొమాంటిక్' ప్రేమ పద్ధతిలో

కాదు. రామనాథం తన సంసారం చక్కదిద్దుకునేందుకు చిత్తశుద్ధితో సర్వ ప్రయత్నాలూ చేస్తాడు. స్వరాజ్యంకూడా అందుకే ప్రయత్నిస్తుంది. 'ఆ ప్రయత్నాలు విఫలం అయిన తర్వాతగాని నివృత్తమైన వారి 'మనస్సుల కలయిక' వారికి గోచరంకాదు. ఈ నవలలో '(ప్రేమ'కు యివ్వబడిన స్థానం చాలా చిన్నది; వ్యక్తిత్వానికీ, వ్యక్తిగతమైన విశుద్ధ ప్రవర్తనకూ యివ్వబడిన స్థానం చాల పెద్దది. తత్కారణంగా. ఎటుచూచినా, నవల ముగింపులో, రామనాథం స్వరాజ్యాల పరస్పరానుబంధం సమాజానికి ఒక సమస్య, ఒక సవాలు, అనక తప్పదు. "మేము ప్రపంచాన్నే ధిక్కరించి నిలబడతాము మాస్టారూ ! మేం చేస్తున్నది తప్పుకాదు....మా వివాహాన్ని గుర్తించని సమాజాన్ని మేమూ గుర్తించము" అంటాడు రామనాథం. రంగనాధరావు (కాలేజీలో అతని గురువు) సమాధానం: "స్త్రీ పురుష సంబంధాలు కేవలం వైయక్తికాలు కావు. అవి సాంఘికమైనవి మాత్రమే కూడా కావు అందుచేత కనీసావసరములైన పరిమితులతో వానిని ఆమోదించవలసి ఉంటుంది. రష్యాలో వాళ్లు అటువంటి దేదో తలపెట్టినట్లు తోస్తుంది. వాటిని నిందిస్తూ వస్తున్న అభిప్రాయాల్ని బట్టి అసలు ఏమిటో ఊహించవలసి వస్తున్నదేగాని, యథార్థస్థితి తెలియడంలేదు." రచయిత యిలా తేలిపోవడం, మార్గం కోసం రష్యావైపు వెఱ్ఱిచూపు చూస్తూ ఉండి పోవడం ఒక్కటే, అసంతృప్తి కలిగించే విషయం. ఆ 'కనీసావసరములైన పరిమితులు' ఏమిటో రచయిత పిసుర్శకూ ఊహకూ స్వోపజ్ఞకు అందటం లేదా ? పోనీ, భవిష్యత్పరిణామానికే ఆ సంగతి వదలిపెట్టరాదా ! పాఠకులకు వదలిపెట్టరాదా !

నవలలో సంఘటనలూ సన్నివేశాలూ వాస్తవంగా ఎక్కడా కార్య కారణ సంబంధం సడలకుండా కూర్చబడినవి. కీలకమైన ఒక్క సంఘటన మాత్రం 'విధివశాత్తూ' జరిగినట్లు తోస్తుంది: అల్లుడు రామనాథం ఖద్దరు దుస్తులతో తలవనితలంపుగా యింట్లో కనిపించటంమూలంగా పోలీసు

యిన్‌స్పెక్టరైన మామగారు పొరపాటున కొరడాతో కొట్టడం, తర్వాత ఆ పొరపాటుని దిద్దుకోకపోవడం. ఇది ఒథెల్లో (othelle) నాటకంలో డెస్డెమోనా చేతిరుమాలు పోగొట్టుకోవడంవంటి తిరుగులేని సంఘటన; 'విధివసాత్తూ' జరిగింది. పై సంఘటన కారణంగా రామనాథానికీ అతని భార్యకూ పెద్దఅఘాతం ఏర్పడి క్రమంగా పెద్దదైపోతుంది. ఆ సంఘటనే లేకపోతే ? నవలలో ప్రధానమూ బలీయమూ అయిన శక్తి విప్లవం; రామనాథం దానికి ప్రాతినిధ్యం వహించడంతో, వ్యక్తిగతమైన సంబంధాలు కొన్ని వాటంతటవే తెగిపోక తప్పదు. తెగిపోకుండా రామనాథం చేసే ప్రయత్నాలు అతనికంటె బలీయమైన విప్లవ శక్తిముందు నిరుపయోగమనే సత్యాన్నే ధ్వనిస్తుంది పై సంఘటన. అలా సమర్థనీయమే !

'కాస్త కాలు సాగితేనే నలిగిపోతామా ?' 'కలిపోసినా ఉట్టికేసి చూడడంగా శాస్త్రి దానిని జమకట్టేడు.' 'చమురు కాళ్ళ తల్లులు.' ప్రాంతీయమైన పలుకుబళ్ళతో సజీవంగా ఉంది ఈ నవలలో భాష. గోదావరీ తీరగ్రామమైన ముంగండ నవలకు కేంద్రం. రచయిత తన శక్తియుక్తుల నెరిగి చక్కని సంయమంతో లక్ష్యశుద్ధితో చేసిన రచన తెలుగువారు ఆదరించదగిన సాహిత్య కృషి. ("భారతి")

## ఈ దారి ఎక్కడికి ?

— మహీధర రామమోహనరావు

రచయిత వ్రాసిన ప్రసిద్ధ నవల "రథచక్రాలు" తరువాత కథ ఈ నవల. 1946 నాటికీ, 1969 నాటికి రాజకీయాల్లో అంటే కమ్యూనిస్టు రాజకీయాల్లో తెలుగు దేశంలో వచ్చిన మార్పుల్నీ, దోరణుల్నీ చిత్రించే

ప్రయత్నం అంటూ రచయిత "ముందు మాట"ని "హృదయావేదన"గా వెలిబుచ్చారు. ఈ నవల "ఆ నాటి మహోద్యమాలలో వచ్చిన విశీర్ణతను దిగ్భ్రమతో నెమరువేస్తూంది" అన్నారు.

ఇరవై రెండేళ్ళ క్రితం మలబారు పోలీసు అగ్రహారంలో దిగినప్పుడు అగ్రహారం జీవితానికి స్వస్తిచెప్పి "వెళ్ళిపోయిన వితంతువు జానకి కమ్యూనిస్టు నాయకుడు విశ్వాన్ని వివాహం చేసుకుని, బొంబాయిలో ఉద్యోగంచేస్తూ ఉండి, ఇన్నేళ్ళకు కొడుకు రవీంద్రతో అగ్రహారానికి తిరిగి రావడంతో కథ ప్రారంభం అవుతుంది. ఇందులో పూర్వపు వ్యక్తుల్ని జానకి వరసగా కలుసుకుంటూ రావడం, చివరకు జమీందారు దివానూ, విశ్వం తండ్రి అయిన తన మామగార్నీ, వారి కుటుంబాన్నీ ఆమె కలుసుకోవడం అనే సన్నివేశాల ద్వారా రచయిత ఇరవై రెండేళ్ళ చరిత్రనీ పర్యాలోచన చేసే ప్రయత్నం చేశారు. నిజానికి ఈ రచన రాజకీయ పరమైన రిపోర్టు వంటిది. నవలా ప్రక్రియకు ప్రధానమైన వ్యక్తుల ద్వారా, వాళ్ళ దోరణుల ద్వారా, ఆకర్షణీయంగా తయారుచేయబడిన రిపోర్టు. దీన్ని నేటి కమ్యూనిస్టు పక్షాలు ఏవీ అధికారికంగా అంగీకరించి ఆమోదించే పరిస్థితిలో లేవు. ఎవరి సమర్థనలూ, విశ్లేషణలూ వారికున్నాయి. కాని రచయితకు కమ్యూనిస్ట్ పార్టీలకంటె కమ్యూనిస్ట్ ఉద్యమం, ఉద్యమం కంటె దాని వెనకఉన్న మానవ సమతాధ్యేయం ప్రీతిపాత్రం కావడం వల్ల విజాయితీతో చేదునిజాన్ని ఆవిష్కరించే ప్రయత్నం చేశారు. అందుకు వారిని అభినందించక తప్పదు. పార్టీ రాజకీయవాదు లందరికీ ఈ రచయితకున్న కమిట్‌మెంట్ ఉండి ఉంటే, ఈ నాటి పరిస్థితి ఇలా ఉండేది కాదు, 'హృదయావేదన'కు ఆస్కారమూ ఉండేదికాదు. "ఈ విశీర్ణతకు తప్పెవరిదనేది కాదు; ఎవరి భాగం ఎంత అనీ కాదు. విశీర్ణత చారిత్రక సత్యం. దీన్నింకా ఎంత దూరం కొనసాగనివ్వాలనేదే ప్రశ్న" అన్నారు రచయిత ఎవర్నీ నొప్పించే ఉద్దేశం లేకుండా.

ఈ నవలలో పొందుపరచిన రాజకీయపు రిపోర్టు తాలూకు అంశాలన్నీ పేర్కొని చర్చించాలంటే ఈ సమీక్ష చాలదు. అది పెద్ద గ్రంథం అవుతుంది. పాఠకులు నవల చదివి ఎక్కడికక్కడ ఆలోచించుకోవలసిన, విమర్శించుకోవలసిన విషయం అది. దురదృష్టవశాత్తు ఇలాంటి నవలల్లోని అంశాల్ని చర్చించే రకం పత్రికలు మనకు లేవు। పోనీ పార్టీల వాళ్ళయినా ఈ నవల వాళ్ళ సమావేశాల్లో చర్చించుకుంటారా అంటే అందుకూ దాఖలాలు లేవు. కాని రచయిత ఉద్దేశం పార్టీలూ, ప్రజలూ అటువంటి సమాలోచన జరపాలనీ, అందుమూలంగా ఏ కించిత్తు మేలు జరిగినా మేలేనని, రచయిత ఈ ఉద్దేశాన్ని బట్టి ఆయన స్వతహా ఏ రకం రాజకీయవేత్తో అర్థం అవుతున్నది. ఈ నవలలోనూ, దీనికి పూర్వభాగం అయిన 'రథ చక్రాలు'లోనూ సత్యానందం పాత్రలో, దృక్పథంలో రచయిత రామమోహనరావు దర్శన మిస్తాడంటే అది రచయితతో పరిచయం ఉన్నవారికి అనుభవైకవేద్యం అయిన సంగతే। ఈ నవల 62 పుటలో సత్యానందం భారతంలోని పద్యం 'ఒరులే యని యొనరించిన... దా నొరులకు నవి సేయకునికి పరాయణము' ఉదహరించి, 'కమ్యూనిస్టు జీవిత పద్ధతుల్లో అదొక సూత్రమని నా అభిప్రాయం' అనగానే, రామేశ్వరరావు అనే పాత్ర ఇలా వ్యాఖ్యానిస్తాడు – "మీరు కమ్యూనిస్టు అయినా, గాంధీయిజాన్ని వదలలేదు।" ఈ వ్యాఖ్య అక్షరాలా రచయితకు అన్వయిస్తుంది; ఈ నవలే దానికి తార్కాణం.

పోతే రాజకీయాల విశీర్ణతను గూర్చి నవలలో వెలిబుచ్చిన అభిప్రాయాల్ని కొన్నింటిని ఉల్లేఖించి ఈ సమీక్ష ముగిస్తాను. "కసికి, తిట్టుబోతుతనానికి, భిన్నాభిప్రాయాన్ని చెవిని పెట్టలేకపోవడానికి, వ్యతిరేకులతో సామాన్య మర్యాదలు కూడా పాటించలేకపోవడానికి దేశంలో "మార్క్సిస్టు" పర్యాయపదం అయింది". (72 పుట). "వాళ్ళ (నక్సలైట్ల) పనులు చూస్తే అధికారంలో ఉన్న వాళ్ళనుంచి పెద్ద ఆశలు పెట్టు

కుని, అవి జరగకపోయేసరికి అగ్గిపుల్లంత అయిపోయారనిపిస్తూంది లేకపోతే ఆ ఆవేశాలూ, ఆక్రోశాలూ ఉండవు". "ఇంకా ఎంతకాలం అనే ఆదుర్దా. మేం బతికుండగానే అదేదో చూడాలనే అహంభావం. ఏదో మూలనుంచీ ప్రారంభిస్తే అదే తేలుతుందనే దుస్సాహసం. తాము తప్ప మిగతా ప్రపంచం వట్టి వాజలనే ఒంటెత్తుతనం. ఇవి శత్రువులకి గొప్ప ఆసరా." (89 పుట). "మీ రాజకీయాలు పదట కలపండి. మీ లెఫ్టైరైట్‌లతో నాకేం పనిలేదు. మనం మనుషుల్లా బతకాలి. పశువులకి రాజకీయాలెందుకు ? వాటికి అవేమి తెలియవు. వాటి ఆవేశాలూ, అభిమానాలూ — అన్నీ ఎలిమెంటల్. కాని ఈ మనుష్య పశువులు...." (95 పుట). "మావో నాశం చేసింది కమ్యూనిస్టుల్నీ, కమ్యూనిస్టుపార్టీనే.... అనుమానాలతో దేశాన్ని నాశం చెయ్యవద్దంటున్నాం. అంటూనే రుజువు లేని అనుమానాలతో ఎవరి మీదనో నింద వెయ్యడం మంచిది కాదు. "(96 పుట)" యువత ఎందరో విద్యావంతులు, ఈ దుస్సాహసిక పంథాకు ఎందుకు విరగబడుతున్నారు ? మావో పిలుపు ఒక సద్యః కారణం కావచ్చు. కాని 1920 — 35 లో ఆకర్షించలేని దుస్సాహసికత ఈ వేళ ఎల్లా, ఎందుకు ఆకర్షిస్తూంది ? తమ కార్యక్రమాలు దాని కెంతవరకు బాధ్యం ? ఉగ్రవాదుల్ని తమకు ద్రోహం చేసిన వారినిగా నిందించే మార్క్సిస్టుల వద్దా, వారిని దారి తప్పిన స్వార్థత్యాగులుగా వర్ణించే తమ వద్దా (సి. పి. ఐ.) కూడా ఈ ప్రశ్నలకు సమాధానం దొరకదు. కాగితం ఖర్చు కన్న తాము ఇద్దరూ ఇంతవరకూ ఈ విషయమై విశేషంగా చేసిన దేమీ లేదనే ఎరగను" (132 పుట). "దేశమూ, ప్రజలూ తన్న పార్టీకి భిన్నమైన ప్రయోజనాలు లేవు. వాటిని రెంటినీ బలపరచడంలోనే పార్టీ బలపడుతుంది మన పనులు ఆ లక్ష్యానికి తోడ్పడకపోతే పార్టీ బలపడదు. పార్టీని బలపరచుకొని ప్రజాసేవ చేస్తామనడం పాలకొల్లు గోపురం ఎత్తాలంటే ముందు ఆరు వెల్లు బలియ పెట్టమన్నట్లే ఉంటుంది." (112-

113 పుటలు). "బలప్రయోగం సమాజంలో మంత్రసాని వంటిదని మార్క్స్ అన్నాడుట. దానిని తాము (ఒక పార్టీ) ఖచ్చితంగా బలపరుస్తున్నారు. మార్క్స్ నాటి పరిస్థితులు వేరు. నేడున్న పరిస్థితుల్లో శాంత పద్ధతుల్లో కూడా సోషలిజం వచ్చే అవకాశం లేకపోలేదు. అది విఫలం అయితేనే బలప్రయోగం అంటున్నారు రెండో వర్గం. ఈ రెండు ధోరణులకి ఐక్యత ఎలాగ? పార్టీ ప్రజల కోసమా? ప్రజలు పార్టీ కోసమా? ప్రజలా? పార్టీయా?" (157 పుట). ప్రజలా? పార్టీయా? అని తేల్చుకోలేక పోవడమే కమ్యూనిస్టు ఉద్యమాన్ని పీడిస్తున్న జబ్బుగా రచయిత తీర్పు ఇచ్చారు. "మనం ప్రజలలో ఒక దశలో పనిచెయ్యడానికి పనికి వచ్చాం. ఆ దశ మారేసరికి మనకి కాళ్ళూ చేతులూ ఆడలేదు, ప్రజల ఉద్యమానికి జీవం ఇవ్వలేకపోయాం. మావో ధర్మమా అని ఉద్యమం చీలికలై పోయినా పూర్తిగా నిర్జీవం కాకుండా నిలబడిందని నా వూహ. ఐక్యతకి కూడా డైలెక్టిక్స్ వర్తిస్తుందన్నాడు మావో. ఎంత సర్వనాశనం అవుతూంది? ఎంత నష్టం? తప్పదు. ప్రకృతి సూత్రం. ప్రకృతిలోనే ఉంది బోలెడు నష్టం, వ్యర్థం." (255 పుట). "ప్రజల కోసం పార్టీగాని, పార్టీ కోసం ప్రజలు కాదంది" (256 పుట) అని తేల్చి చెబుతున్నది ఈ నవల. తప్పక చదవదగింది.

(ఆంధ్రప్రభ వారపత్రిక - 1-10-80) ❋

## యమపాశం

— గోపీచంద్

గోపీచంద్‌గారి చివరి నవల కాబోలు యిది. సమకాలీన హైదరాబాద్ జీవితాన్ని విపులంగా చిత్రించే ఈ నవలలో కథానాయకుడు పెద్రె

షేరియట్‌లో గుమాస్తా అయిన నారాయణరావు. కథ అధ్యాయాలుగా విభజింపబడలేదు. మొదటినుంచీ, చివరిదాకా ఇంచుమించు కథానాయకుని స్వగతమే: అంటే నారాయణరావు మనోదృక్పథంతో సంఘటనల్ని అనుభూతుల్ని రచయిత ఉన్మీలనంచేస్తూ వచ్చాడు. చిట్టచివర మాత్రం నారాయణరావు భార్య దృక్పథం నుంచీ ఒక వ్యాఖ్యానం లాంటిది ఉంది. రచయిత కథ ప్రారంభించటంలోనూ ముగించటంలోనూ కొత్తదనం చూపించాడు. జీవిత ప్రవాహానికి మొదలూ తుదీ నిర్ణయించటం కష్టం: కథ కోసం అలా నిర్ణయించినా అది కృత్రిమమే అవుతుంది. సంఘటనల రీత్యా ఒక నిర్దిష్ట స్వరూపాన్ని ఎన్నుకోవడం బదులు కథానాయకుని మనోదృక్పథంద్వారా విషయానికి ఒక నిర్దిష్ట స్వరూపాన్ని కల్పిస్తూ జీవితా చిత్రణం వ్యాఖ్యానం చేయబడ్డవి ఈ నవలలో. అందువల్లే నవలలో ప్రవేశించి నిష్క్రమించే కొన్ని పాత్రలను గురించిన తదుపరి విశేషాలు, కథ దృష్ట్యా మనకు లభించవలసినవి, ఇందులో లభించవు. ఈ నవలలో గడిచే కాలపరిమితి రెండురోజులు మాత్రమే: కాని కథానాయకుని మనోగమనం ద్వారా కొన్ని ఏళ్ల దాంపత్యజీవితం, అందలి ఒడిదుడుకులు, ఆశానిస్పృహలు మనకు అనుభూతం అవుతాయి.

'మెరపుల మరకలు', 'పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామా' వ్రాసిన తర్వాత గోపీచంద్ దృక్పథం ఆధ్యాత్మిక హిమవత్ శిఖరాలనుంచీ సహనమూ, క్షమా, సానుభూతి, విశ్వాసమూ జలధారలుగా పర్వత సానువుల్లో ప్రవహిస్తూ సామాన్య మానవుడనే పల్లపునేలకు గంగావతరణిగా అవతరించింది. ఆ అవతరణి "యమపాశం నవలలో చూడవచ్చు: అవినీతిని గూర్చి ఆయన దృష్టి - "కట్టుబాట్లు పెట్టుకుకూర్చున్న వాళ్లు వాదస్తులుగా తయారవుతున్నారు. అలా కాకుండా జీవితాన్ని ఎడాపెడా కొట్టేవాళ్లె విశాల దృక్పథం గడించుకో గలుగుతున్నారు. వాళ్లు జీవి

తాన్ని బహుముఖాలుగా అనుభవిస్తున్నారు. అందువల్ల బహుముఖాలుగా పరిశీలించవలసిన అవసరం కలిగి వారి దృక్పథం విశాలపడుతూ ఉంది."....
"నేటి మన నైతిక విలువల పట్ల విషేధాజ్ఞలే.... నిషేధబుద్ధితో జీవితాన్ని చూచిన ఏ వ్యక్తి వికసించదు. వికసించని ఏ వ్యక్తికి విముక్తి లేదు. జీవితాన్ని బహుభంగుల అనుభవించిన వ్యక్తే సంపూర్ణతను పొందగలుగుతాడు." జీవితాన్ని గూర్చి— "దబ్బు వ్యసనమైతే, భోగాలు మలుపులైతే ఇంద్రియాలు గుర్రాలైతే, మనస్సాక ముళ్ళకిరీటమైతే ఇక జీవితానికి ఆదర్శం ఏమిటి? విముక్తి!".... కాని విముక్తి ఎలా వస్తుంది? నైతిక విలువల్ని అంటిపెట్టుకొని జీవితాన్ని నిరాకరించటంవల్ల రాదు. "జీవితాన్ని కృత్రిమంగా విభజించి, ఏదో ఒక ముక్కను పట్టుకొని అదే సర్వస్వం అనుకోవటం వల్ల మానవుడు ఒక ఘనీభవించిన పదార్థం అయ్యాడు.... ఇలా తయారైన మానవుల్లో తానొకడు: తనకంటె ఘన పదార్థంగా ముడుచుకు పోయింది తన భార్య. తామిద్దరూ జీవితం అనే గోడకు కొట్టబడి ఎండిపోయిన రెండు పిడకలు.... అయితే ఆదర్శాలవల్లా, నిషేధాత్మలైన నైతిక విలువలవల్లా జీవిత రహస్యం విముక్తి, స్వేచ్ఛా లభించక పోతే, మరెలా లభిస్తుంది? జీవితాన్ని యథాతథంగా అంగీకరించి అనుభవించాలి.... "జీవితానికి పెడగా నిలుచున్నవాని కంటె అన్ని విధాలా జీవితాన్ని అనుభవించే వారంటేనే నాకు ఇష్టం. అప్పుడు యిష్టపడతాను. నమ్మకం కూడాను." అంటాడు గోపీచంద్.

"పరిస్థితులు మారిపోతున్నాయి. విలువలు మారిపోతున్నాయి. జీవితం మహావేగంగా ప్రవహిస్తూ ముందుకు దూసుకెళ్తుతూ ఉంది. ఆ వేగం ఒరిపిడికి నూతనమైన అందచందాలు అనేకం బహిర్గతమయి కనులకు మిరుమిట్లు గొల్పుతున్నాయి. అవి భ్రాంతులు గనుక బహుశా మనకు అందుబాటులో లేవుగనుక వాటిని నిరసించటం జరుగుతూ ఉంది." అంటూ జీవిత దృశ్యాన్ని సరిక్రొత్తగా సానుభూతితో ఉత్సాహంతో అవ

లోకించాడు గోపీచంద్. 'ప్రతి మానవుడూ జీవితానికి తన పరిస్థితికి అను కూలమైన అర్థం చెపుతాడు : విలువలు సాపేక్షమైనవి (Relative) అని గుర్తించిన గోపీచంద్ జీవితంలో మారటం, ముందుకుపోవటం, రిస్క్ (Risk) తీసుకోవటం నేడు ముఖ్యమైన విలువలుగా గుర్తించాడు. ఈ స్థాయికి అందుకోనివారు జీవితాన్ని చూచి బాధానర్పదష్టులుగా భయపడే వారు 'యమపాశం'లో చిక్కినవవారు చాల మంది : నారాయణరావు అలాంటివాడు : "అడుసు తొక్కవలసివచ్చినప్పుడు ఏడుస్తూ, తొక్కు తాడు. కాళ్లు కడగవలసి వచ్చినప్పుడు అంతకంటె ఏడుస్తూ కడుక్కుం టాడు. "కాని అతడు స్తబ్దుడు మాత్రం కాడు. క్రమంగా జీవితాన్ని గూర్చిన రహస్యం తనలోవున్న లోపం ఏమిటో తనకు తాను గుర్తిస్తాడు. అయితే అప్పటికి నారాయణరావు ముందుకువెళ్లె పరిస్థితిలో లేడు. గతంతో తెగతెంపులు చేసుకునే శక్తి తనలో ఉందా ? అని సందేహిస్తాడు కూడా. అతని కొమార్తె అరుంధతి అంటుంది : "ఎందుకు కాదు నాన్నా ? కదలదలచుకున్నవాళ్ళు ఎప్పుడైనా కదలవచ్చు. కాటికి కాళ్ళు చాచుకున్న వాళ్ళు కూడా కదలవచ్చు... 'పరిస్థితుల ప్రభావం' అంటున్నారు గాని.... మానవుడు పెరిగిన కొద్దీ పరిస్థితుల ప్రభావం క్షీణిస్తుంది.... .... మన సంకల్పంలో ఏదో లోపం ఉంది, చీటికీ మాటికీ పరిస్థితులను సాకుగా, డాలుగా వాడుకుంటున్నామేమో ననిపిస్తూవుంది నాకు." ఈ ఆత్మ విశ్వాసమే నారాయణరావువంటి వారికి కొత్త యుగపు ఉషారేఖ. సాంప్ర దాయికమైన జీవిత పద్ధతీ, నైతిక ప్రమాణాలూ పోయాయన్న నిస్పృహ: ఈనాటి సాంఘిక - ఆర్థిక వ్యవస్థ హెచ్చుతగ్గులుగా ఉన్నదన్న అసం తృప్తీ. వ్యక్తిగతంగా ఆదర్శాల స్వప్నాలు ఫలించలేదన్న ఆవేదనా- వీటన్నింటికీ గోపీచంద్ చెప్పిన సమాధానమే పై నుదాహరించిన వాక్యాలు జీవితాన్ని కొత్తగా దర్శించి ముందుకు వెళ్ళమని ఆయన సందేశం : "నడకతప్పి మనం బాధపడుతున్నాం గాని, నిజానికి బాధపడవలసిన

అవసరం నాకేమీ కనపడటంలేదు.... ఎవరి బ్రతుకు వారిది. ఒకరితో పోల్చుకుని వ్యథపడటం ఎందుకు? మనం చూడగలగాలే కాని ఏ నడకలో వున్న మాధుర్యం ఆ నడకలో వుంది. అడుగు తప్పకుండా పడితే సరి."

(ఆంధ్రపత్రిక 12-7-84) ❋

# చీకటి గదులు

— గోపీచంద్

ఒకానొక మాసపత్రికలో ధారావాహికంగా ప్రచురిస్తూ గోపీచంద్ పూర్తిచెయ్యని నవల 'చీకటి గదులు'. నవల పూర్తిచేసిన తర్వాతే పత్రికలో ప్రచురించటం సాధారణంగా జరిగే పద్ధతి. గోపీచంద్ ప్రముఖ రచయిత కావటంవల్ల ఆయన మాసం మాసం వ్రాసిపంపుతూ ఉండే వేస్తూ వచ్చారు. ఫలితం గోపీచంద్‌గారు పోవటంతో నవల అసంపూర్ణంగానే నిలిచిపోయింది. అంతేకాదు, పై విధంగా వ్రాస్తూ ప్రచురిస్తూ పోవటంవల్ల నవలలో ఉండవలసిన జిగి, బిగి లుప్తం అయ్యాయి. గోపీచంద్ వ్రాసిన యితర నవలల్తో పోల్చి చూస్తే ఈ సత్యం మనస్సుకు తట్టుతుంది. ఇలాంటి లోపమే డికెన్సు నవలలు: 'మార్టిన్ చజిల్ 'విట్' 'పిక్‌విక్ పేపర్స్' వంటి వాటిల్లోనూ చూడవచ్చు. గ్రంథం దీర్ఘం అవుతూ పోవడమే కాక, ఒక్కొక్క సంఘటనా రెండు పేజీల్లో చెప్పవలసింది ఆరు పేజీలదాకా సాగుతుంది. కొంత మేర గడచిన తర్వాత, ఎక్కడ కుదించాలో, ఎక్కడ కత్తిరించాలో అక్కడ అలా చేసేందుకు, ఆ భాగాలు అచ్చయి, ప్రచురణై పోవటంతో వీలుపడదు. ఫలితం: నవల నిర్మాణ

దృష్ట్యా బిగుపు పోగొట్టుకుంటుంది. ఒక్కొక్క నెల విధిగా వ్రాయవలసి రావటంతో, మనస్థితి ఒక్కొక్కసారి భిన్నంగానూ, రచనకు ఉన్ముఖంగానూ ఉండకపోవటంతో, అలాంటి సమయాల్లో రచయిత తన ప్రతిభను పూర్తిగా వ్యక్తం చేయలేకపోతాడు. రసవత్తరంగా చిత్రించవలసిన పట్టుల్లో ఏదో హరికథలోలాగా ఈడుస్తూ గుడిసుళ్లు తిరుగుతూ కథనం సాగిస్తాడు. ఇటువంటి లోపాలు, ప్రచురించిన ఈ 9 ప్రకరణాల నవలలో కనిపిస్తూ ఉన్నవి. ఇది ఏవిధంగానూ గోపీచంద్ సాహిత్య కృషిలో చెప్పుకోతగిన భాగం కాదు.

విషయం మాత్రం ముఖ్యమైనదే. గోపీచంద్ ఆత్మకథ. అందువల్లే కాబోలు కాలానుగతంగా మొదటి నుంచీ శ్రమ లేకుండా మాసం మాసం వ్రాయవచ్చుననే నమ్మకంతో ఆయన యిలా ప్రచురణ ప్రారంభించారు. కాని ప్రచురించిన భాగంలో కథానాయకుడైన గోపాలం (గోపీచంద్) బాల్యం, మారుటి తల్లికీ అతనికీ ఏర్పడిన అనుబంధం, గోపాలం స్నేహితులూ చదువూ గోపాలం తండ్రియైన కృష్ణస్వామి (శ్రీ రామస్వామి చౌదరిగారు) స్వభావం —యీ విషయాలు సుదీర్ఘంగా 600 పేజీలలో చెప్పబడినవే కాని "ఆంధ్రదేశపు సాంఘిక, రాజకీయ, సాంస్కృతిక చరిత్రల సమగ్ర దర్పణం" అని ప్రచురణకర్తలు చెప్పినందుకు పెద్దగా ఋజువేమీ కనుపించదు. బ్రాహ్మణ, బ్రాహ్మణేతర విభేదాలూ, కమ్యూనిస్టు కాంగ్రెసు పార్టీల ప్రభావం ముఖ్యంగా విద్యార్థుల మీద, అక్కడక్కడ స్పృశింపబడిన మాట వాస్తవమే కాని దీన్ని 'చరిత్ర సమగ్ర దర్పణం' అనడానికి అవకాశం లేదు. మరొక విషయం; పాత విషయాల్ని చెప్పటంలోనూ, ఆనాటి సంఘర్షణల్ని, వ్యక్తులమధ్య సంబంధాల్ని చిత్రించటంలోనూ గోపీచంద్ యీ నాటి తన సమన్వయ దృక్పథం, సహనమూ క్షమాదృష్టి అందులోకి ప్రవేశపెట్టుతూ రావటం వల్ల ఆ సంఘర్షణల యదార్థ స్వరూపం మారి అప్పటి ఉద్వేగ తీవ్రతలు

తగ్గి, అది అనుభూతిగా పాఠకుని మనస్సుని అంటిపెట్టుకోలేక పోతున్నది. గోపాలం యొక్క మనస్థితి ఎలా మారుతూ వచ్చిందో తెలియజెయ్యట మైతే ఉన్నది కాని, అది సహజంగా, స్వతంత్రంగా సంఘటనలతో పరిణామం చెందుతూ వచ్చే వైనం మాత్రం అనుభూతం కావటంలేదు. ముఖ్యంగా ఉత్కంఠత లోపించింది. దమయంతి (మారుటి తల్లి) పైన రచయితకు గల అభిమానం, ఆరాధనాభావం స్థాయిని అందుకోవటం వల్ల దమయంతి పాత్ర స్పష్టంగా దృశ్యం కావటంలేదు. పోతే, కృష్ణస్వామి పాత్ర సజీవంగా పలకరిస్తూ ఉంది. కాని ఆయన వ్యక్తిత్వాన్ని గూర్చిన విశ్లేషణం కూడా, గోపీచంద్ యిటీవల చేసినదాన్ని ఆనాటి సంఘటనల్లోకి వ్యాఖ్యానంగా చొప్పిస్తున్నట్లుగా అనిపిస్తూంది.

గతానుభవాల్ని స్మరించుకుంటూ, పరిశీలిస్తూ, విశ్లేషిస్తూ గోపీచంద్ ప్రారంభించిన యీ ఆత్మకథ నవలగా సాహిత్యపు విలువలకు పెద్దగా నోచుకోకపోయినా, ఒక ప్రముఖ రచయిత కలం నుంచీ రావటం వల్లా, ఆయన జీవిత విశేషాల్ని స్పృశించేదిగా ఉండటంవల్లా ఆసక్తితో ఆదరించ దగ్గదే.

(ఆంధ్రపత్రిక : 10-7-64) ❋

# జనపదం

— దాశరథి రంగాచార్య

1948 నుంచీ సుమారు 1967 మధ్యకాలం నాటి తెలంగాణా ప్రజల జీవితాన్ని, రాజకీయ - సామాజిక పరిణామాల్ని చిత్రించడమే ఈ నవల ఉద్దేశమని రచయిత తొలిపలుకు ('మనసు మాట') లో చెప్పుతున్నారు.

రచయిత లక్ష్యం చాలవరకు నెరవేరిందనే చెప్పుకోవాలి, కేవలం మార్క్సిస్ట్ దృష్టితో కాని, ప్రజా పిప్లవానికి దోహదం చేసినప్పుడే రచన సాఫల్యం అనే అభిప్రాయంతో కాని, నవలను ఉపలక్షించే వాళ్ళకు ఇది చాల అసంతృప్తి కలిగిస్తుంది. కాని ఒక ప్రాంతపు ప్రజల మనస్తత్వాన్నీ ఒకానొక చారిత్రక ఘట్టంలో అది రూపొందిన తీరునీ — నవలవంటి సాహిత్య ప్రక్రియ ద్వారా చిత్రించ బూనుకున్నప్పుడు రంగాచార్య వేసు కున్న పథకం, ఎన్నుకున్న పాత్రలు, వాళ్ళల్లో చూసిన పరిణామం వగైరాలు ఔచిత్యపూర్ణంగానే ఉన్నాయని అంగీకరించక తప్పదు. ఇక్కడ (మార్క్సిస్టు లేక మరో) ఆదర్శం ప్రకారం ఏ పాత్ర ఎలా ఉంటే బావుండేది? అనే ప్రశ్నకు స్థానం లేదు. వాస్తవానికి దగ్గరగా, ఏం జరిగిందో ఆ చరిత్రకు ప్రతిబింబంగా పాత్రలూ, పరిణామాలూ ఉన్నవా, లేవా అనే ప్రశ్నకు చాలవరకు ఉన్నాయనే సమాధానమే వస్తుంది. పోతే, కొన్ని పాత్రల విషయంలో రచయిత తన అభిమానాన్నీ, రొమాంటిసిజమ్‌నీ వ్యక్తం చెయ్యకమానలేదు. అలా చేసినచోట్ల సెంటిమెంటలిజమ్, అయోమయత్వం ఏర్పడ్డాయి. మొత్తంమీద నవల పాఠకునికి యథార్థ జీవితం తాలూకు అనుభూతి కలిగిస్తూ ఉండడమూ, తెలంగాణా గ్రామీణ ప్రజలను గూర్చిన అవగాహన పెంపొందిస్తూ ఉండడమూ నిర్వివాదాంశము.

నవలలో మంగమ్మ భర్త జగ్గయ్య మరణానికి కారకుడైన ఉద్యమ ద్రోహి రాముడే ఆమెను చేరదీసి గర్భవతిని చేస్తాడు. వీరభద్రం మార్క్సిస్ట్, ప్రజానాయకుడు, శాసనసభాసభ్యుడు ఆమె పక్షం మాట్లాడేందుకు రాముడి దగ్గరకు వెడతాడు. రాముడు మొదట్లో భయపడి డబ్బు పరిహారంగ ఇస్తాననీ పెండ్లి చేసుకోవడం మాత్రం సాధ్యం కాదనీ చెబుతాడు. వీరభద్రం ఒప్పుకోక నలుగురికీ చెబుతాననేప్పటికి, రాముడు తెగించి, అడ్డం తిరిగి వీరభద్రమే మంగమ్మ ఇంట్లో ఉంటూండటం వల్ల

అతనే కారణమై ఉంటాడని వారిస్తాను. ఇక్కడ వీరభద్రం జాపగారి పోతాడు. చివరకు వీరభద్రం మంగమ్మను పెండ్లి చేసుకోవడం, ఆమె పిల్లవానికి పితృత్వం వహించడం (లోకం దృష్టిలో), కాని ఆమెను సోదరిగానే చూడటం, ఈ వివాహం మూలాన తను ప్రేమించిన స్త్రీకి దూరం కావడం వగైరా చిత్రణ సెంటిమెంటల్‌గానూ మార్క్సిస్టు దృక్పథానికీ, కార్యవాదిత్వానికే గాక సహజత్వానికి కూడా భిన్నంగా ఉన్నది (101) వీరభద్రం వ్యక్తిత్వంలోని 'ఆదర్శవాది' సెంటిమెంటలిస్టుగా కనిపిస్తూ అడుగడుగునా అతని వైఫల్యాన్నే నిరూపిస్తున్నాడు. మంగమ్మ వ్యవహారాన్ని పరిష్కరించే మార్గాలెన్నో ఉన్నాయి. విధవయై కాలుజారిన మంగమ్మను వివాహంతోనె ఉద్ధరించే అవసరం ఏమీ కనిపించదు. అలా చేసినందువల్ల ఆమెకూ, ఆమె పిల్లవానికి జరిగిన మేలూ నిరూపించబడలేదు నవలలో.

వీరభద్రం మొదటిరోజుల్లో ప్రేమించిన సరస్వతి, విద్యావతి, విప్లవవాదీ — బలరామయ్యను (ఇద్దరు వేషధారిగా మారిన భూస్వామిని) వయసు మీరినవాణ్ణి వివాహం చేసుకుంటుంది; ఇది మారిన పరిస్థితుల్లో ఏర్పడిన ఒకానొక పరిణామంగా వాస్తవ చిత్రణగానే ఉన్నది. కాని వీరభద్రం సరస్వతీ హాస్పిటల్లో కలుసుకున్నప్పుడు (378 - 380 పుటలు) వాళ్ళిద్దరి మధ్యా రచయిత పెట్టిన సంభాషణా, "మనం దూరంగానే ఉందాం ప్రేమించుకుందాం" వగైరాలు చక్కని వాస్తవిక నవలను కాస్తా చౌకబారు రొమాంటిక్ రోకటి పాటలోకి దింపి తప్పుదారి పట్టించాయి. ఇలాంటి సెంటిమెంటే మంగమ్మ పాత్రను కూడా ధ్వంసం చేసింది. ఒకానొక సన్నివేశంలో మంగమ్మ ప్రజావాహినికి చక్కని ప్రాతినిధ్యం వహిస్తూ ఎలెక్షన్లో నిలబడి నాయకత్వం వహిస్తుందన్న సందర్భంలో, మంగమ్మను రాముడు రహస్యంగా వెళ్ళి ప్రాధేయపడగా, మంగమ్మ అంగీకరిస్తుంది; (324 పుట) ఎందుకు అంగీకరించింది? తన జీవితాన్ని ధ్వంసంచేసి,

అన్నివిధాలా స్వార్థపరుడుగా నీచుడుగా బ్రతుకుతున్న రాముడికోసం, మంగమ్మ ఈ త్యాగం ఎందుకు చేసిందో రచయిత తగిన సమర్థన చూపలేకపోయారు. ఇక్కడ మళ్ళీ రొమాంటిక్ సెంటిమెంట్ నవల యథార్థ చిత్రణను దెబ్బతీసింది. 'చిల్లరదేవుళ్ళు' నవల ముగింపు ఏ విధంగా ఆ నవలకు దిష్టిచుక్క అయిందో, ఈ నవలలో స్త్రీ పురుష ప్రేమను గూర్చిన రొమాంటిక్ సెంటిమెంట్ (త్యాగం) రచయిత ప్రతిభకు పట్టిన గ్రహణమై నవల సహజ వాస్తవికతను భంగపరచింది. ఈ నవల తరువాయి లోనైనా రచయిత వాస్తవికతా దృక్పథంలో స్పష్టతను సాధిస్తారని ఆశిద్దాం.

( ఆంధ్రప్రభ వారపత్రిక : 1?-6-1977 ) ❋

— నవీన్

ఉపేందర్ విద్యార్థి దశలో, వివాహానికి పూర్వమే కాలు జారాడు. చవకబారు స్త్రీలతో సంబంధం పెట్టుకున్నాడు. అతడు వివాహం చేసుకున్న శకుంతల పరిస్థితుల ప్రాబల్యం వల్ల, వివాహమైన తరవాత, చీకటి తప్పు చేసింది. చేసి పశ్చాత్తాపపడి తన్ను క్షమించమని ప్రాధేయపడింది. మగవాణ్ణి క్షమించి మార్గంలో పెట్టిన వ్యవస్థ, సంప్రదాయం, నీతి, గౌరవం స్త్రీని మాత్రం దారుణంగా వెలివేసి, ఆమెను హింసించి, ఆమె జీవితాన్ని సర్వనాశనం చేశాయి. ఏమిటీ పక్షపాతం ? ఇది ఈ నవల వేస్తున్న ప్రశ్న.

ఉపేందర్ పతనానికి కారకుడైన ప్రభాకర్ పాత్ర చిత్రణలో, స్త్రీ పట్ల వ్యామోహమనే సహజ ప్రవృత్తి మన సమాజంలో పొందిన విపరీత పరిణామాన్ని, అది ప్రథమ యౌవనావస్థలో ఉపేందర్ వంటి అమాయకుల మీద చూపే దుష్ట ప్రభావాన్ని రచయిత సమర్థంగా చిత్రించారు. ప్రభాకర్ తరువాత జగన్నాథం. కొంత ముదిరితే ఊసరవెల్లి అన్నట్లు విద్యార్థి దశలో ప్రభాకర్‌లా ఉండేవాడే తరువాత జగన్నాథంలా తయారౌతాడు. ఈ జగన్నాథంలో 'కన్యాశుల్కం'లోని గిరీశం ఛాయలు ఒకటీ, రెండు కనిపిస్తాయి. ప్రభాకర్, జగన్నాథం వంటి చీడ పురుగుల దగ్గర పాఠాలు నేర్చుకున్న ఉపేందర్‌కీ అటు ఇంటి వాతావరణంలోనూ స్త్రీ బానిసత్వమే కనిపిస్తుంది. "భార్యలు ఇంట్లో నాలుగుగోడల మధ్య అందంగా, అణకువగా పనిపాట్లు చేసుకుంటూ ఆడబిడ్డలకు, వాళ్ళ పిల్లలకు కావలసినవి అందిస్తూ వదినె లలితమ్మలా ఉండాలి అనే అభిప్రాయం అతని రక్తంలో జీర్ణించిపోయింది. అందమైన శకుంతల, కొంత చదువుకుని పట్టణవాతావరణంలో పెరిగిన శకుంతల, ఈ పంజరంలో హింస ననుభవించింది. ఆమెలో కసి, ఆ ఇంటివాళ్ళ మీద పగ కలిగించిన వెర్రి ఆవేశం, ఆమె జగన్నాథాన్ని ఆహ్వానించేలా చేశాయి. శకుంతల పాత్రను తీర్చిదిద్దడంలో రచయిత ఎంతో మెలకువను ప్రదర్శించారు. శకుంతల చలం పాత్రల మూసలో తయారైంది కాదు. ఇక్కడ సెక్స్ విషయంలో అసంతృప్తి కాదు ప్రధానం. తన వ్యక్తిత్వానికీ, తనూ మనిషిననే భావానికీ గుర్తింపు లేని వివాహ వ్యవస్థ మీద చేసిన తిరుగుబాటే శకుంతల కాలు జారడం. ఫలితం అంత దారుణంగా ఉంటుందని ఆమె ఊహించలేదు. అసలు ఊహకే అవకాశం లేని విధంగా హింస ఆమెను ఆ సాహసానికి పురికొల్పింది. ఆమెను పుట్టింటి నుంచి కూడా క్షమకాని, ఆదరణ కాని లభించలేదు. చివరకు చెడిపోయిన స్త్రీల పక్షంలో చేరి, భర్త మీదా వాళ్ళ కుటుంబం మీదా కసి తీరేలా ఆ గ్రామంలోనే కాపురం పెడుతుంది

నవల ప్రారంభానికీ, నవల ముగింపుకీ చక్కని సమన్వయం ఏర్పడింది. చెడిపోయిన స్త్రీలు, చవకబారు స్త్రీలు ఎక్కడో తయారై సంఘానికి చీడపురుగుల్లా వచ్చి చేరడం లేదు. వివాహ వ్యవస్థలో ఉన్న దారుణమైన పక్షపాతం, దురన్యాయమే వాళ్ళని తయారుచేస్తున్నది అన్న సూచన ఈ నవలకు ప్రాణం. చదవదగిన నవల.

( ఆంధ్రప్రభ వారపత్రిక : 5-1-1977 ) ❋

# మ ని షి - మి థ్యా

— ఆదివిష్ణు

ఆంధ్ర వారపత్రిక పోటీలో బహుమతి పొంది, ధారావాహికంగా వెలువడిన నవల యిది. శంకరం అనే యువకుడు కథానాయకుడు. అతని కుటుంబానికీ, స్నేహితులకూ సంబంధించిన కథలు గుది గ్రుచ్చటంతో ఏర్పడినదే కథా సంవిధానము. కథలు ఒక్కొక్కటీ దేనికదిగా ఉన్నా, వాటిని గ్రుచ్చెత్తిన సూత్రం మానవ నైజాన్ని గూర్చి శంకరం చూపే కౌతూహలం. అందువల్ల అతనికి గోచరమయ్యే సత్యం : తెల్లనివన్నీ పాలుకాదు, నల్లనివన్నీ నీళ్లు కాదు ! శంకరం స్నేహితుడు రంగారావు-అతను చాలా అదృష్టవంతుడుగా పైకి కనిపిస్తాడు. అతని భార్య సుజాతకూ, అతనికీ గల కలుపుగోలుతనం కనులపండువుగా, స్వర్గతుల్యంగా కనిపిస్తుంది. కాని తీరా చూస్తే, 'వాళ్ళు అన్యోన్యాను రాగాల్లో తేలిపోవడం లేదనీ, అనుక్షణం ఒకరిమీద ఒకరు ద్వేషం, పగ, ఈర్ష్యల్తో సతమతమై పోతున్నారనీ' గ్రహింపుకు వస్తుంది. ఇది ఒక కథ. శంకరం అన్నయ్య నిరంజనం - అతనూ చాల అదృష్టవంతుడే : ప్రేమించిన

అమ్మాయిని, ధనవంతురాల్ని వివాహం చేసుకున్నాడు. మామగారి కంపెనీలో బ్రాంచి మేనేజరుగా ఉంటున్నాడు. కాని అతనికి మనశ్శాంతి లేదు. తన ప్రయోజకత్వం మామగారి ప్రాపకం వల్ల మాటుపడిపోయిందనీ, తన ఆత్మగౌరవాన్ని అవతలి వాళ్ళు లెక్క చెయ్యటంలేదనీ అతని బాధ. ఇది రెండో కథ. శంకరంతో ఆఫీసులో పనిచేస్తున్న ముఖ్య స్నేహితులు—వాసుదేవరావు, లక్ష్మీపతి, ప్రసాదరావు. వీరుకాక కుసుమ అనే టైపిస్టుగర్ల్. వీళ్ళ నలుగురి కథలూ నాలుగు విధాలు. తీరాచూస్తే కుసుమ శంకరానికి బంధువర్గంలోని అమ్మాయే కాదు, సొంత చెల్లెలు కూడా కావటం; వాసుదేవరావు ఒక అద్భుతకథకు (Melodrama) హీరో అయిపోవటం. లక్ష్మీపతి అజ్ఞాతవాసం చేస్తున్న ఒక ధనవంతుడి కొడుకై శంకరం చెల్లెలు సుశీలను వివాహం చేసుకోవాలనుకోవడం — ఇది ఆయా వ్యక్తుల వెనకాలవున్న 'మిస్టరీ' స్వరూపం. ఈ అద్భుత కథల మధ్య ప్రసాదరావు మేనత్త కూతుర్ని 'వూ' (Woo) చెయ్యడం మొత్త 'కామిక్ రిలీఫ్'. అన్నింటి కంటె మనస్సును ఆకట్టే కథ వృద్ధుడు టానికి రామయ్యది. కాని ఆయనకూ ఒక అద్భుతమైన జీవిత రహస్యం అంటగట్టి, కుసుమను ఆయన కూతుర్ని చెయ్యటం కేవలం రచయిత చాపల్యం అనాలి. 'జీవితాన్ని అంటిపెట్టుకుని కథ నడుస్తుంది'. అంటూ కథని గూర్చి తన అభిప్రాయం చెప్పుకొన్న రచయిత పైన చెప్పిన "మిస్టరీ"లను ప్రవేశపెట్టడం చూస్తే రచయితపై సినిమా కథల ప్రభావ ప్రాబల్యం గోచరిస్తోంది. పాత్రల్ని సహజంగా చిత్రించటంలో రచయితకు ప్రతిభ ఉన్నప్పుడు, అభూత కల్పనలు, అద్భుత రహస్యాలు జోలి ఎందుకు; ప్రతి మనిషికీ, ఏదో "మిస్టరీ" ఉంటుంది అనే ఊహాకి కళ్లెంవేసి అదుపులో ఉంచుకోవాలిగాని, దాన్ని యిలా సినిమా గాలికి వదిలిపెట్టడం వల్ల చక్కని నవల చివరిలో బోల్తా కొట్టేసింది. అసలీ మిగతా కథల జోలికి పోకుండా రంగారావు, సుజాతల కథనీ, నిరంజన పాత్రనీ పూర్తిగా

తీర్చిదిద్ది ఉంటే నవల గొప్పగా ఉండేది; అప్పుడు మనిషి మిథ్యాకాదు, మిస్టరీనుకాదు అని తేలివుండేది.

పాత్ర చిత్రణంలో కథాకథనంలో రచయితకున్న నేర్పు మెచ్చుకో దగ్గది. దాన్ని లక్ష్యశుద్ధితో ఉపయోగించుకుంటే ముందు ముందు చక్కని నవలలు వ్రాయవచ్చు అనే విషయం ఈ నవల నిరూపిస్తున్నది.

( భారతి )

# తాగుబోతు

— వినుకొండ నాగరాజు

ఈ నవలను 'ల్యాండ్ స్కేప్ నవల' అన్నారు రచయిత. అంత కంటె 'ఇన్‌స్కేప్ నవల' అనటం బాగుంటుందేమో; భౌతికదృశ్య వర్ణన కంటె వ్యక్తి మనస్స్రోతస్సు వర్ణనకే ఇందులో ప్రాధాన్యం. ఇది ఏకపాత్రాభినయం వంటిది. మాదిగలింగడు తాగుబోతు, కథానాయకుడు. సంధ్యవేళ పొలం దగ్గర బయలుదేరి పడుతూ లేస్తూ చీకటి పడుతూండగా గ్రామం దాటి ఊరు మాటుమణగే వేళకు మాదిగపల్లి చేరుతాడు. ఈ ప్రయాణంలో అతని మనస్సంచలన చిత్రమే నవలలో వస్తువు. అతని జీవితంలోని అనుభవాలను స్పృశిస్తూ అతని వ్యక్తిత్వాన్ని చిత్రించే ప్రయత్నం జరిగింది. ఇది ఆధునిక పద్ధతి. ఇరవయ్యోశతాబ్దంలో నవల పొందిన పరిణామం—సంఘటనల క్రమానుస్యూత పద్ధతిని వదలిపెట్టి, కాలగతికీ, బాహ్య ప్రపంచ గమనానికీ ప్రాధాన్యం ఇవ్వకుండా త్రికాల సంకీర్ణమగు వ్యక్తి అనుభూతికీ, మనస్తత్వ వైచిత్రికీ ప్రాధాన్యత యిచ్చే పద్ధతి. ఇది రచయిత చిత్తశుద్ధికి గీటురాయి. భావనాశక్తి సహానుభూతిగా

పరివర్తనం చెంది, రచయిత పరకాయ ప్రవేశం చేస్తే తప్ప కావ్యఫలసిద్ధి ఫలించదు. ఈ ప్రయోగాత్మకమైన రచనపట్ల నాగరాజుగారు ప్రదర్శించిన శ్రద్ధాసక్తులకు ఆయనను అభినందించవలసినదే।

రచయిత హెమింగ్వే వ్రాసిన "Old man and the sea", అన్న గ్రంథాన్ని దృష్టిలో పెట్టుకున్నట్లు తెలుస్తోంది. హెమింగ్వే శైలిని కూడా అనుకరించాలని ప్రయత్నించారు. ఈ రెండు విషయాల్లోను కృతకృత్యులు కాలేదు. కాకపోయినా ఫరవాలేదు. లింగడి ఏకపాత్రాభినయం ఒడుదుడుకులు లేకుండానే రూపొందింది. "Life is a tale told by an idiot" అన్నట్లు జీవితానికీ, తాగుబోతు చిత్తవృత్తికీ కూడా సామ్యంఉంది. తప్పతాగిన లింగణ్ణి జీవితానికే ప్రతీకను చేయటానికి—అలా నవల చివరి పేరాలో సూచించి ముగించటం — రచయిత పొందిన ఫలసిద్ధి. "....ఆడది, ఆకలి, పట్టుదల, పగ, దొంగతనం, హింస, బలమైనవాళ్లు, బలహీనులు, కృతఘ్నత, చేతకానితనం, విశ్వాసం గల కుక్కలు, విశ్వాసం లేని విషజీవులు, లోపల అగ్ని, అరచేతిలో స్వర్గం, కష్టంలో సుఖం, సుఖంలో కష్టం. ఎన్నో పదజాలాలు చేరిస్తే పెదాప్పులు. సాహిత్యంలో విలువైనవి. జీవితంలో ప్రతినిత్యం ఉంతా నిద్రపోతుంది. తిరిగి లేచేవరకూ. పశ్చాత్తాపంలేని టీపులు. ఇందులో — మాదిగ లింగడు." ఈ ముగింపు బాగానే ఉంది— ఏమంటే పైన యిచ్చిన జాబితాలో అక్షరాలా ఒక్కొక్కటీ లింగడి మనస్సు ద్వారా నవలలో పాఠకునికి అనుభూతం చెయ్యబడినవే। కానీ యింలా చేసి, మళ్ళీ రచయిత జోక్యం ఎందుకు ? "ఎన్నో పదజాలాలు చేరిస్తే పెదాప్పులు. సాహిత్యంలో విలువైనవి" అన్న రచయిత మాటల్ని "పశ్చాత్తాపంలేని టీపులు" అన్న రచయిత వ్యాఖ్యానాన్ని తీసివేస్తే ఆ ముగింపు మరీ చక్కగా ఉండేది. ఇలా ఒక్కచోటే కాదు, ఈ పొరపాటు ఈ గ్రంథంలో అక్క-

డక్కుడా చాలచోట్ల జరిగింది. గ్రంథం ఎత్తుగడలో మొదట పిచ్చమ్మనీ, కూలిమనిషి వెంకమ్మనీ ప్రవేశపెట్టటం, పెట్టినా, వెంకమ్మను గూర్చిన సుదీర్ఘమైన చరిత్ర కథనం చాలపరకు, అనవసరమే. ఆ యిద్దరిమీదా లింగడి వ్యక్తిత్వ ప్రభావం చూపించటమే రచయిత ఉద్దేశమైతే, అది లింగడి ఏకపాత్ర ప్రాధాన్యతకే భంగం కలిగించేటంత మేర సాగటం, శిల్పం దృష్ట్యా లోపమే. కావ్యం ఏకాగ్రతని అది చెడగొట్టుతోంది. అలాగే కొన్నిచోట్ల లింగడి మనస్సుకూ ఊహకూ సంబంధంలేని రచయిత వ్యాఖ్యానాలూ, భావాలూ, పానకంలో పుడకల్లా ఉన్నాయి.

లింగడి పాత్రను సహజంగా సంపూర్ణంగా చిత్రించటం, వాడిని జీవితానికి ప్రతీక చెయ్యటం ఒక విజయం — కాని హెమింగ్వే పొందిన ఫలసిద్ధి పొందాలంటే యీ మొత్తం చిత్రణమీద ఒక ధ్వని రూపమైన సౌందర్య స్ఫురణ కూడా ఉండాలి. ఆ ధ్వని సౌందర్యం సాధించలేక పోయినందువల్లే నాగరాజుగారి విశేష ప్రయత్నం కావ్యగౌరవాన్ని పొందలేకపోతోంది. శైలి విషయంలోనూ, పట్టుబట్టి హెమింగ్వే శైలి రాలూకు పైపై మెరుగులు సాధించబోవటం ఒక్కొక్క చోట హాస్యాస్పదంగా తయారైంది. భాషను అనవసరంగా ముక్కలూ, చెక్కలూ చేస్తూ, (అవసరమైనప్పుడు చేసినా ఫరవాలేదు) అదృష్టవశాత్తూ రచయిత యొక్క యీ పట్టుదల గ్రంథం మొదట్లోనే కనిపిస్తూ ఉంది. తర్వాత, తర్వాత వస్తువుమీద దృష్టితో వ్రాయడం వల్ల శైలి సహజంగా ఉండి యీ లోపం కనిపించటం లేదు. ఈ నవలకు కూర్చబడిన "పరిచయం" క్రొత్త రచనా విధానాన్ని వ్యాఖ్యానించబోయి లేనిపోని అపోహల్ని కలిగించేదిగా ఉండటంవల్ల తృప్తికరంగా లేదు.

(భారతి)

# రంగపతి

— దుర్గానంద్

ఊరు పేదిసీపురం. లోగిలి పోతరాజువారిది. పోతరాజు వంశస్థుడు రంగపతి ఆయుర్వేద వైద్యుడు. అతని అన్న మంగపతి పండితుడు. ఈ కుటుంబంలోని వ్యక్తుల్ని — పెద్దవారినీ పిన్నవారినీ — సుదీర్ఘంగా వర్ణిస్తూ, వారిలోని వైవిధ్యాన్ని వ్యక్తంచేస్తూ, తద్వారా తెలుగుదేశంలో తెలుగువారి నాగరికతలో, సంస్కారంలో, ఈ శతాబ్దిలో వచ్చిన మార్పుని అభివ్యక్తం చేసే ప్రయత్నమే నవల ఉద్దేశం. నవలలో కథ అంటూ పెద్దగా ఏమీ లేదు.

రంగపతి యిద్దరి అల్లుళ్ళలో చిన్న అల్లుడు అంభోనిధి పండితుడు, కవి. తిరుపతి వెంకట కవుల ప్రభావంతో ప్రస్తరిల్లిన అవధానాల, పద్యాల సాహిత్య సంరంభానికి ప్రతీక. నవలలో ఇతని ప్రతిభ తెరచాటు దీపం వత్తుగానే ఉంటుంది. కారణం, రచయిత ఉద్దేశంలో, "అందమైన స్త్రీలో సిగ్గు ఉన్నట్లు" ప్రతిభకు కూడా బిడియం అవసరమట । "పూర్తి వికాసం పొందిన తర్వాత బిడియం సాహసంగా మారుతుంది"ట । అంభోనిధిలో బిడియం సాహసంగా చివరిదాకా రూపొందనేలేదు । ఇల్లరికపు టల్లుడుగా వచ్చినవాడు వచ్చినట్లు చివరకు పేదిసీపురంలోనే స్థిరపడిపోవటంలో 'సాహసం' బయట పడలేదు ।

రంగపతి అన్నగారైన మంగపతి కొడుకు భగీరథుడు. లండన్ వెళ్ళి బి. ఎస్‌సి. చదివి వచ్చినవాడు; కొమార్తెకు 'జూలీ' అని పేరు పెట్టడం, కుక్కని పెంచడం, ఇంగ్లీషులో మాట్లాడ్డం, వగైరా విషయాల్లో పాశ్చాత్య నాగరకతా ప్రభావానికి లోనైన భారతీయునికి ప్రతినిధి. ఒకసారి అంభోనిధీ, భగీరథుడూ శారసిల్లి సాహిత్యాన్నిగూర్చి దాని భిన్న (ప్రాచ్య - పాశ్చాత్య) లక్ష్యాల్నిగూర్చి మాటాడుకుంటారు.

[పుటలు 107 - 110]. తర్వాత అంభోనిధి ఏర్పాటు చేసిన నీలకంఠశాస్త్రి అష్టావధానానికి భగీరథుడు హాజరవుతాడు. అష్టావధానంలో భగీరథుడు కొంత అసహనంతో, కాని న్యాయంగానే, గ్రామమునసబుని మందలిం చటం కారణంగా, కొంపలంటుకుపోతాయి. గ్రామంలో వైషమ్యాలు చెలరేగుతాయి. భగీరథుడు కొందరు రౌడీలను అండగా పెట్టుకుంటాడు. మునసబు వర్గంవారు రంగపతి కుటుంబం వారిమీద - పోతరాజుదొడ్డిమీద- కక్షగట్టుతారు. రచయిత ఉద్దేశం - పాశ్చాత్య నాగరికత, సంస్కారం, తత్సంబంధమైన భావాలూ, తద్ వ్యావహారికనీతీ ప్రవేశించడంద్వారా, అంతవరకు ఏకంగా ఉండిన పాలవంటి గ్రామీణ సౌహార్దభావంకాస్తా విరిగిపోయిందని ఆరోపించడంగా తోస్తుంది. ఇది సమర్థనీయమైన, చారిత్రకంగా సత్యమైన, ఆరోపణకాదు. కథలోకూడా దోషం యిరు వైపులా ఉన్నట్లు చిత్రింపబడింది. అందుచేత భగీరథుని పాత్ర నవలలో అభివ్యక్తం చేయవలసిన అంశం ఏదైనా ఉంటే అదీ ప్రస్ఫుటం కాలేక పోయింది.

పోతే మురారి - రంగపతి పెద్దల్లుడు - రచయితకు అభిమానపాత్రగా కనిపిస్తాడు. అతనిద్వారా ఒక సమన్వయాన్ని లేక ఒక చరమసత్యాన్ని సూచించాలని రచయిత ఉద్దేశం కావచ్చు. మురారి వ్యక్తిత్వం "పుస్తకా లనే స్తంభాలమీదా, ఆచారాలనే గోడలమీదా కట్టబడిన గుడివంటిది కాదు. ఎక్కడి కక్కడే మండి, ఎక్కడి కక్కడే ఆరిపోయే అగ్నిలాంటిది. ప్రపంచంలో చాలమంది మనుష్యులు ప్రతివిషయాన్నీ వెర్రిగా తెలుసు కోవాలనీ ఆరాటపడుతుంటారు. తెలుసుకోవడానికి పూర్వజ్ఞానం ఆధారమై ఉంటుంది. మురారికి అలాంటి ఆధారాలు లేవు. ఎక్కడ ఉంటే అక్కడే అతనుంటాడు. * ఎక్కడా లేనిచోట ఎక్కడా లేకుండా పోతాడు. లేనిచోట కూడా అతణ్ణి తెచ్చి కలుపలేము. అందువల్ల అతని వ్యక్తిత్వం తుంపులు

తుంపురుగా ఉంటుంది. * అతని ప్రవాహమే అతని జీవితం. ఆ ప్రవాహ దిశలను అందుకోలేనివాళ్లు సుభద్రమ్మవలె (అతనిభార్య) సుళ్లుతిరిగి పోతుంటారు. నరములేని మాంసం శరీరమనిపించుకుంటుందా? మురారి మాంసంలో నరాలు, ఊహలో ఆధారాలు ఉన్నాయో లేవో తెలియదుకాని అతడు నిర్గుణుడు, నిరాకారుడు మాత్రం కాదు. అతనికి ఆకారముంది. గుణముంది. ఆ గుణాన్ని కనిపెట్టేశక్తి సుభద్రమ్మలో లేదు. అందుకని సుభద్రమ్మను అనభిజ్ఞ అనలేము. మురారిని మాత్రం చపలుడు అనవచ్చు.... అతడొక్కడే ఒక్కడు. అతనికి లోకంలో పౌరసత్వపు హక్కులేదు. అతడు చపలుడు. అతని చిత్తం చపలమైంది. అతణ్ణి కొందరు తిక్క మురారి అనికూడా పిలుస్తూ ఉంటారు." (42 - 43 పుటలు). ఈ నవలలో పాత్రలను వర్ణించిన విధానానికి ఈ ఉటంకింపు ఒక ఉదాహరణ. ఇందులో స్పష్టతకంటె అస్పష్టత ఎక్కువ. ముఖ్యంగా * —— * గుర్తుపెట్టిన వాక్యాలు మంచిరచన అనిపించుకోవు. పైగా ఈ రకం వర్ణనాపద్ధతి వ్యాసానికి పనికివస్తుందికాని నవలకు కాదు. నవలలో పాత్రలు వారి ఆలోచనల ద్వారా మాటలద్వారా, చేతలద్వారా, స్వయంగా రూపొందాలి. ఆ సంగతి అలా ఉంచితే, మురారి పాత్రద్వారా రచయిత వ్యక్తం చెయ్యదలచుకున్న అంశం ఏమిటి? మురారి అసలైన సిసలైన మానవుడు - ఏ ఆచారాలూ, అడ్డుగోడలూ, సూత్రాలూ, చుట్టుకొలతలూ లేని కేవలం మానవుడు: సంగీతం, నాట్యం, వేట అతని అభిమాన విషయాలు. అంతేకాదు, మురారి ఋతువుల ననుసరించి వేషధారణ చేస్తాడట. "అతని ఋతుధర్మముల మార్పులను గమనించని మనుష్యులు అతణ్ణొక పైలాపచ్చీసుగా భావించి లెక్కచెయ్యరు. అతడు విలాసపురుషుడు. కాని అతనిలో ప్రకృతి సహజ ధర్మాలు ఉన్నై." ఈ ప్రకృతి మానవుడు (natural man) దాస్యత, సంయమనంలేని స్వైరప్రవృత్తికి ప్రతీక.

కవిత్వంలో దేశి, మార్గ విభేదాలను దృష్టిలో పెట్టుకుని బహుశా రచయిత మురారి, అంభోనిధులను రంగపతికి అల్లుళ్లుగా నిర్దేశించాడేమో ! మురారి దేశికవిత్వం లాంటివాడు. అతను 'జనత'లో కలిసి మెలిసినట్లుగా మరెవ్వరూ కలియలేరు. మురారి అత్తమామలను లెక్కచెయ్యడు. అతనిది స్వచ్ఛంద ప్రవృత్తి. పిల్లల భవిష్యత్తు విషయమై ఆలోచించడు. కొడుకు అభిరుచి గుర్తించి వాణ్ణి 'డోలు వాయించడం నేర్చుకునేందుకు మంగలి ఇంటికి పంపిస్తాడు. ఈ విషయమై మురారీ సుభద్రమ్మా వివాద పడతారు. మురారి కొడుకునూ కూతుర్నీ వెంటబెట్టుకుని దేశంమీదికి వెళ్లిపోతాడు. కూతుర్ని కులస్థుడైన ఒక బస్సు డ్రైవరుకి కట్టబెట్టి చక్కా వస్తాడు. (ఇక్కడ వరుడు కుల మదే కావటం ఎందుకో ?) కట్నం కానుకలూ, ఏ హడావుడీ లేకుండా ఎవరికీ చెప్పకుండా కూతురికి పెళ్లిచేసి వచ్చాడని అందరూ విడ్డూరపడతారు. ఇది రచయిత మురారిద్వారా సూచించదలచుకున్న ఒక రకం సాంఘిక విప్లవంకాబోలు - కట్నం వగైరా వివాహ సమస్యలకు 'మానవతా' దృక్పథంనుంచీ పరిష్కారం ! గ్రామవైషమ్యాల విషయంలో మురారి ప్రబోధం : "అబ్బాయిలూ ! మనది సన్యాసుల దేశం. బుద్ధుడు మన దేశంలో పుట్టాడు. గాంధీ మన దేశంలో పుట్టాడు. ఆనందమిచ్చేది మన కావ్యం. హంసతో సందేశం పంపేది మన పురాణం.... దుర్యోధనుడూ, శకునీ ఎప్పుడూ గుసగుస లాడుతూనే ఉండే వాళ్ళు. వాళ్ళు బాగుపడ్డారా ? దేశాన్ని బాగుపరిచారా ? ఈ ప్రపంచం బంధనరహితం. సృష్టిలో రహస్యమంటూ ఏమీలేదు.... మిమ్మల్ని మీరెందుకు గాటుపెట్టుకుంటారు ?" మురారి భగీరథునిమీద హత్యాప్రయత్నం జరగకుండా సమయానికి హెచ్చరిస్తాడు. భగీరథుడు రక్షింపబడ్డా, అతని కుక్క చంపబడుతుంది. రచయిత ఉద్దేశం, మానవుల మధ్య 'విశ్వాసం' చచ్చిపోయిందని ! రాచకీయా లెక్కువయ్యాయని !

రంగపతి తన వైద్యపరిజ్ఞానాన్ని మనుమ సంతానానికి నేర్పాలను కుంటాడు. వాళ్ళకు దానిలో ఆసక్తి లేదు. శంభుడు కమ్యూనిస్టుపార్టీ అభిమాని. కళాధరుడు సంగీతం అభ్యసించడానికి తంజావూరు వెళతాడు. రంగపతి మంచానపడి, సంధిలో అందరికీ వీడ్కోలుచెప్పి మరణిస్తాడు.

రంగపతి గతించిన ఒకనాటి తెలుగుదనం; గ్రామీణమైన తెలుగుదనం! రంగపతికి వారసులెవరు? అంభోనిధిలో (సంస్కృత పాండిత్యము, సాంప్రదాయికమైన విద్య) నవజీవనానికి కావలసిన సాహసం క్రొత్తదనం లేవు. భగీరథునిలో (పాశ్చాత్యవిద్య) సౌహార్ద్రము, సౌమనస్యం లేవు. అతను గ్రామజీవనంలో యిమడకపోవడమే కాదు, గ్రామసౌహార్ద్రాన్ని భగ్నంచేశాడు. మురారిలో (దేశీయత) వైరాగ్యం పాలు ఎక్కువ, అతనికి బాధ్యతలేదు, వారసత్వంలేదు; విముక్తి, స్వేచ్ఛకావాలి. శంభుడు (కమ్యూనిజం) వారసత్వాన్ని బొత్తిగా నిరాకరిస్తాడు. రంగపతికి - అంటే ఒకనాటి తెలుగుదనానికి - నేడు వారసులు లేరంటూ నవల ముగింపు. పోతరాజు నాటిన రాతి స్తంభంవైపు చూస్తూ ఒక పిల్లవాడు రాయి విసిరి వేశాడు అన్నది. చివరివాక్యం - క్రొత్తతరంవాళ్లు తెలుగుదనాన్ని ఎలా పునర్నిర్మించే ప్రయత్నం చేస్తారని ప్రశ్నార్థకమైన ధ్వని! తెలుగుదనాన్ని గూర్చిన పై విశ్లేషణ (Analysis) అసమగ్రంగా ఉందని వేరుగా చెప్ప నక్కరలేదు.

తెలుగుదనం అంటే ఏమిటి? అది అందరూ వేసుకోవలసిన ప్రశ్నే. ఆ ప్రశ్నను ఈ నవల రూపంలో వేసినందుకు రచయిత అభినంద నీయుడు.

(భారతి) ❀

# విడీవిడని చిక్కులు

— వీరాజీ

ఆంధ్రదేశంలో సామాన్యస్థితిగతులకు చెందిన బ్రాహ్మణ కుటుంబాల్లో ఏర్పడుతున్న 'చిక్కుల్ని' గురించి మంచి అవగాహనతో, అపేక్ష, అంతఃకరణా గల యువకుడు వ్రాసిన నవల యిది. ఈ 'చిక్కులు' కేవలం ఆర్థికమైనవికావు. ఆర్థికమైన కారణాలకు తోడు, వాటికంటె ప్రధానంగా, యువతరం వారి జీవితాల్ని అడకత్తెరలో నొక్కివేస్తున్న శక్తులు : వ్యక్తుల మనోవైఖరికీ, సంస్కారానికీ సంబంధించినవి. ఇందులో మగవారికంటె స్త్రీలు వహించవలసిన బాధ్యత ఎక్కువగా ఉంది. ఇది సంఘ సంస్కరణకు చెందిన విషయమూకాదు. వ్యక్తిగతంగా కొంత సహనమూ, జాలీ, సానుభూతీ పెంపొందించుకుంటేచాలు, ఈ మనుష్యుల్లో ఈ సంసారాల్లో సుఖమూ సంతోషమూ ఎంతో అభివృద్ధిచెందే అవకాశం ఉన్నట్లు కనిపిస్తుంది. కాని అదే లోపిస్తోంది ! ఇదంతా అవలోకించి, అర్థంచేసుకునే నిశితమైన పరిశీలనా, ఆర్ద్రమైన హృదయమూ ఉన్న ఒక యువకుడు, ఎవరి కష్టమని తీర్చగలడు, ఎవరి కన్నీరని తుడవగలడు ? చిక్కులన్నీ, అందరినీ, ఒక్కసారిగా విడిపోతే బాగానే వుంటుంది ! గాని అలా జరగడం తన ఒక్కడి చేతిలోలేదని గుర్తించడమే, ఈ నవల ముగింపు విషాదాంతం కావడానికీ, నవల పేరు 'విడీవిడని చిక్కులు' కావడానికీ కారణం.

కథానాయకుడు సూర్యం యువకుడు; గుమాస్తాఉద్యోగం చేస్తున్నా, ఇంకా బామ్మసంరక్షణలోనే ఉంటూన్న అవివాహితుడు; ఎటువంటి సమస్యలూ లేనివాడు. అందుకే అందరి సమస్యలూ, ముఖ్యంగా ఆ లోగిలిలో ఉన్న ఐదు వాటాలలోని కుటుంబాల సమస్యలూ, ఆఫీసులో హెడ్

గుమాస్తా కుటుంబం సమస్యా, అతనివే అయినవి. అంటే మానసికంగా మాత్రమే; వాళ్ళ వ్యవహారాల్లో జోక్యం చేసుకునే తత్త్వంకాదు అతనిది. పదమూడేళ్ళ అమ్మాయి రాజ్యలక్ష్మికి సూర్యందగ్గరా అతనిబొమ్మ నరసమ్మదగ్గరా చనవు. రాజ్యలక్ష్మి సాంబశివం కూతురు; వివాహానికి పూర్వం కలిగిన అక్రమ సంతానం; సాంబశివం వదినె, ఔదార్యంతో రాజ్యలక్ష్మిని తన బిడ్డగా పెంచి, మరణిస్తూ, సాంబశివం భార్య లలితాంబకు అప్పజెప్పగా, విధిలేక ఆ పిల్ల భారం వహిస్తున్నది లలితాంబ. చివరకు రాజ్యలక్ష్మి జన్మవృత్తాంతం, దూరపుబంధువులైన యిద్దరు విధవరాండ్రు, స్వప్రయోజనం నిమిత్తం, లలితాంబ చెవిలో ఊదుతారు. లలితాంబ రాజ్యలక్ష్మిద్వారా 'అనాచారం' 'భ్రష్టత్వం' ప్రాప్తించినట్లు భావిస్తుంది; ఆ రహస్యం నలుగురికీ తెలిసిపోకుండా ఆ విధవరాండ్రు చెప్పిన ఒక ముదివగ్గుకు రాజ్యలక్ష్మిని కట్టబెట్టి తన సంతానంయొక్క భవిష్యత్తుని భద్రపరచుకోవాలనుకుంటుంది. ఇందులో సవతి మాత్సర్యమూ, రాజ్యలక్ష్మికోసం ధనం వ్యయం చెయ్యలేకపోవడమూ రెండూ కలిసి ఉన్నాయి. రాజ్యలక్ష్మి సుగుణాల రాశి. రచయిత ఆ అమ్మాయికి జీవంపోసి, మాటల్లో చేతల్లో, కదలికల్లో, ఒక అమృతమూర్తిగా తీర్చిదిద్దాడు. రాజ్యలక్ష్మి గతి ఏంకావాలి? ఆమె "చిక్కు" ఎలా విడిపోవడం? రాజ్యలక్ష్మి తన కొమార్తె అంటూ భార్యతో చెప్పి ఆ అమ్మాయికి న్యాయం చేకూర్చే ధైర్యం సాంబశివంలో లేదు; తన బిడ్డగా చెప్పినమాటవింటూ పెరిగిన రాజ్యలక్ష్మి సుఖదుఃఖాలు రవంతైనా ఆలోచించే ఔదార్యం కాదు మానవాంశ కూడా లలితాంబలో లేదు. సూర్యం తను రాజ్యలక్ష్మిని వివాహం చేసుకుంటానని ముందుకు రావడంద్వారా ఈ సమస్య పరిష్కారం కావాలా?

"ఒక కుటుంబంలో ఒకరి తప్పిదానికి మిగిలినఅందరూ నైతికంగా కట్టుబడి ఉండాల్సిందేనా? ఒకరు తప్పుచేస్తే శిక్ష మరొకరికా?" అని

ప్రశ్నిస్తుంది నిర్మల. నిర్మల కుటుంబ సంప్రదాయాన్ని విమర్శించి ఆమెను కట్టుకున్న భర్త ఆమెను తిరస్కరించాడు. నిర్మల వితంతువుగా వ్యవహరిస్తూ ఆ లోగిట్లో ఒక వాటాలో కాపురం ఉంది. ఆమె చరిత్ర విచారించకుండానే సూర్యం, రాజ్యలక్ష్మి ప్రోత్సాహం వల్ల, ఆమెకు సహాయం చేస్తాడు. కాని నిర్మల సమస్య ఎలా పరిష్కారం కావాలి? సూర్యం బొమ్మ నిర్మల పట్ల చూపించే సానుభూతి మిగతావాళ్లు చూపించరు. వాళ్ళు నిర్మల రహస్యం ఏమిటో తెలుసుకోవడానికీ, ఆమె ప్రవర్తనమీద అభాండాలు వెయ్యడానికీ కాచుకూర్చున్నారు. వాళ్ళలో లోపించిందీ సహనమూ ఔదార్యమే! వాళ్ళలో ఒకరు "నిరంజనంగారి విధవప్ప చెల్లెలు" అనబడే వ్యక్తి. ఆమె యింట్లో చేసే పెత్తనానికి మేనల్లుడు యింటి ముఖమే చూడడు; అతని భార్య కుమిలిపోతూ వుంటుంది! ఈ సమస్యకు పరిష్కారం ఎప్పటికి? ఆ "విధవప్ప చెల్లెలి"కి తన దౌష్ట్యం తన కెప్పటికి తెలిసివస్తుంది?

మరొక వాటాలో సుభద్రమ్మా వెంకటరత్నం దంపతులు - భర్తకు ఎక్కడలేని ఆచారం; పైగా అతనికి భార్యమీద ఎప్పుడూ అనుమానం; ఆమె ఎవరితోనూ మాట్లాడకూడదు. నిత్యమూ భార్యాభర్తల మధ్య పోట్లాటలే! ఆ భర్తలో లోపించిందీ ఔదార్యమే!

సూర్యం ఆఫీసులో హెడ్‌గుమాస్తా శంకరంగారికి సంతానం ఆరుగురు ఆడపిల్లలు. శంకరంగారి సౌహార్దానికి ముగ్ధుడై సూర్యం అతని యింటికి వెళ్తాడు, తీరికసమయంలో చిన్నవాళ్ళయిన చివరి అమ్మాయిలకి చదువు చెబుతాడు. ఇది శంకరం భార్య జానకమ్మలో ఆశను రేకెత్తిస్తుంది; ఆఫీసులో తోటి గుమాస్తా మంగపతి వెకిలిమాటలకూ కారణమౌతుంది! శంకరంగారి పెద్దమ్మాయి ఇంటర్మీడియేటు ప్యాసైంది. తగిన సంబంధం "కొనగల" తాహతు ఆయనకు లేదు. సూర్యం ఆ అమ్మా

యిని చేసుకోవటానికి పూనుకున్నా, శంకరం సమస్య ఏమి తీరినట్లు? మిగతా అయిదుగురికీ ఎలా అవుతాయి పెళ్ళిళ్ళు?

పోతే, సూర్యానికీ ఉంది ఒక చిక్కు. సూర్యం తండ్రి ఇంట్లోంచి లేచిపోయాడు ఎవర్తెనో తీసుకుని. అతని అక్కయ్యా అలాంటిపనే చేసింది. సూర్యం బామ్మ ఈ "అప్రతిష్ట"ను ఎలాగైనా తుడిచిపెట్టి సూర్యానికి మంచి సంప్రదాయంగల కుటుంబంలో పెళ్ళి చెయ్యాలని చూస్తోంది. మేనమామ జయరావు తన కూతురు మీనాక్షిని కట్టబెట్టాలని వస్తాడు. అతని ఉద్దేశం 'అప్రతిష్ఠ'ను తెలివిగా ఉపయోగించుకుంటే, కట్నం విషయంలో సులువుగా ఉంటుందనీ. సూర్యం, సూర్యం బామ్మా, తన చెప్పుచేతల్లో ఉంటారనీ। ఈ విషయం గ్రహించిన సూర్యానికి మేనమామంటే యిష్టంలేదు. బంధుత్వాన్ని పురస్కరించుకుంటే హృదయాలు కలిసే అవకాశం ఉన్నచోటే, జయరావు చూపే "లౌకికం" ఒక ప్రతిబంధకమే అవుతుంది మేనమామ కూతురు మీనాక్షి మాత్రం సూర్యాన్ని ఆకర్షిస్తుంది — ఆ అమ్మాయి చక్కనిదీ, చదువుకున్నదీ, పైగా ఇంగిత జ్ఞానమూ, ఔదార్యమూ గల వ్యక్తిగా రుజువు చేసుకున్నది. ఆ అమ్మాయిని చూచి మేనమామనూ భరించటానికి సూర్యం అంగీకరిస్తాడు. కాని యింతలో రాజ్యలక్ష్మికి జరగబోతున్న "ముదిమగ్గుతోటి పెళ్ళి" అతని మనస్సు అతనికి తెలిసేలా చేస్తుంది. పరిష్కారంగా రాజ్యలక్ష్మిని తనే పెళ్లాడతానని బామ్మతో చెబుతాడు. సంప్రదాయాన్ని ముఖ్యమైన విలువగా పట్టుకుని ప్రాకులాడుతున్న బామ్మకు సూర్యం కోరిక తీర్చవించే సంప్రదాయాన్ని వదలిపెట్టడమేనని అవగాహన అవుతుంది. సూర్యం కోసం, రాజ్యలక్ష్మి కోసం, మానవత్వం కోసం, ఆమె అందుకు సిద్ధపడుతుంది. అయితే బామ్మగారు నిర్ణయానికి వచ్చేటప్పటికే సమయం దాటిపోయింది। ఆ రాత్రే రాజ్యలక్ష్మి బావిలో దూకి ఆత్మహత్య చేసుకుంది। ఆ రాత్రే నిర్మల - సూర్యం తండ్రి తన తండ్రి ఒక్కరేనని

గ్రహించి, ఆ రహస్యం తెలిస్తే బామ్మ తనకి ఆదరం చూపదనే అభిప్రాయంలో — అక్కడి నుంచి వెళ్ళిపోతుంది. అందువల్ల బామ్మ ఔదార్యం సంప్రదాయాన్ని వదలుకోవాలనే ఆమె నిర్ణయం, "చిక్కుల్ని" విడీవిడనట్లుగానే ఉంచేశాయి. నవల ముగింపు సుఖాంతంచేసి, చిక్కుల్ని విడగొట్టనందుకు కారణం రచయిత యిలా చెప్పాడు — "ముఖ్యంగా యిక్కడ కావల్సింది ముగింపుకాదు. మార్పు అనుకుంటాను. అది రావల్సినచోటు వేరే ఉన్నది. సమాజమే అది." కథలోని బామ్మ ఒక్కర్తేలో కాదు, సమాజంలోని "బామ్మ" లందరిలో సంప్రదాయాన్ని వదలుకునే సాహసం, 'మానవత్వా'నికి విలువ యిచ్చే మార్పు. వచ్చినప్పుడే "కథ" — అంటే సామాజిక జీవితం — సుఖాంతం అవుతుందనీ, అంతదాకా నవలని సుఖాంతం చేసి లాభంలేదనీ రచయిత ఉద్దేశం. రచయిత అభినందనీయుడు.

(భారతి) ❋

# దిగంతాలకు

— శ్రీ నండూరి విఠల్

సమాజంలో నేటి పరిస్థితుల్నీ, నాగరిక జీవనాన్నీ ప్రతిబింబింపజేసే ప్రయత్నంలో ఈ మధ్య తెలుగులో వచ్చిన నవలలు ప్రేమ శైథిల్యాన్నీ, వివాహ వ్యవస్థ విచ్ఛిత్తినీ ప్రధానాంశంగా చిత్రిస్తున్నాయి. ఈ ధోరణికి వరవడి పెట్టిన నవలలు 'చివరకు మిగిలేది', 'మెరుపుల మరకలు' అనటంలో సందేహంలేదు. కాని ఆ రెండు నవలలకూ, గడ

చిన ఏడాదిలో ఆ ధోరణిలో వచ్చిన కొన్ని క్రొత్త నవలలకూ ఒక ముఖ్యమైన భేదం కనిపిస్తుంది. వ్యక్తి ప్రత్యేకతనూ, వ్యక్తి ధర్మాన్ని నిరూపిస్తూ, శిథిలమౌతున్న వ్యవస్థనూ మారుతున్న సమాజాన్ని చిత్రించటం — అంటే పైకి అవ్యవస్థగా కనిపించే జీవన ధోరణుల్లో కూడా సానుభూతితో చూస్తే, అర్థం చేసుకుంటే, వ్యక్తిగతమైన ఆత్మాన్వేషణా, ధర్మసాధనా అనివార్యంగానే ఉన్నాయని చూపించటం — బుచ్చిబాబు, గోపీచంద్ వ్రాసిన నవలల విశిష్టత. వ్యవస్థ మారుతున్న కల్లోల పరిస్థితిలో కూడా వ్యక్తిపట్ల, మానవునిపట్ల విశ్వాసం అందులో వ్యక్తమౌతుంది. అంతేకాదు, యాంత్రికమైన ధోరణిలో ఆలోచనారహితంగా, మూగగా సామాజిక శక్తులకు లోబడి జీవించటం కంటె స్వధర్మాన్ని చేపట్టి వ్యక్తి ఆచరణ ద్వారా, అనుభూతిద్వారా, చేసే అన్వేషణలోనే, నేటి పరిస్థితుల్లో, జీవితగమ్యం చేరుకోవటానికి వీలౌతుందని సూచింపబడింది. అందువల్లే వ్యక్తిధర్మం అనే ప్రధానమైన విలువతో జీవితాన్ని సరిక్రొత్తగా మనకు వ్యాఖ్యానించే సాహిత్యంగా ఆ నవలల్ని పరిగణించటానికి వీలవుతున్నది. కాని, ఈ మధ్య వచ్చిన, వస్తున్న నవలల్లో సమాజంలోని అవ్యవస్థా, వివాహ విచ్ఛిత్తి, వ్యక్తి ధర్మంతో, వ్యక్తి తాలూకు అన్వేషణతో కాదు, వ్యక్తిలో సంకల్పశూన్యతతో, అయోమయత్వంతో, ఆశయరాహిత్యంతో ముడిపెట్టబడి ఉంటున్నాయి ! వ్యక్తి విశిష్టత కాదు, వ్యక్తిత్వశూన్యత ఇందులో ప్రధానంగా కనిపిస్తోంది. [illegible] జీవితానికి అర్థంలేదు, జీవితంకంటె మరణం మేలు, జీవితంలో ఎంతదూరం వెళ్ళినా, ఏంచేసినా సాధించేది ఏమీలేదు. అనే నిస్పృహా అయోమయత్వం ! ఇదీ ఒక ప్రత్యేక దృక్పథం ఎందుకుకాకూడదు, అని ప్రశ్నిస్తే ఈ రచయితల్లో ప్రతిభ లోపించటమే కారణం తప్ప, వీళ్ళకు అటువంటి ప్రత్యేక దృక్పథం అంటూ ఏమీ లేదని కూడా ఈ నవలలు వ్యక్తంచేస్తున్నాయి మరి !

జీవితంకంటె మరణం మేలు, జీవితంలో సాధించేది ఏమీలేదు అనే దృక్పథం సాహిత్యంలో క్రొత్తదికాదు. థామస్‌హార్డీ నవలలు ఒక ఉదాహరణ. కాని ఆ నవలల్లో విస్పష్టమైన అర్థస్ఫూర్తి దేనివల్ల కలుగుతోంది? అజ్ఞాతశక్తి, విధివిలాసం అనే ఒక ప్రతిపాదనవల్ల ఆ అర్థస్ఫూర్తి కలుగుతోంది. అలాగే వ్యవస్థా, దాని అనుల్లంఘనీయమైన శక్తులూ వ్యక్తి ఆశల్నీ ఆశయాల్నీ భగ్నం చేస్తున్నాయి—అనే ప్రతిపాదనద్వారా మరొక తరహా అర్థస్ఫూర్తి కలిగించవచ్చు. కాని సమాజం మారుతున్న నేటి పరిస్థితుల్లో అలా ప్రతిపాదించటానికి 'వ్యవస్థ' కటువంటి స్వరూపమూ, శక్తీ లేదు; పోతే, 'అజ్ఞాతశక్తి' మీద అసలే విశ్వాసం లేదని నేటి వాతావరణంలో, ఆ ప్రతిపాదనా చెయ్యబడటంలేదు; ఇక వీళ్ళు చిత్రించే వ్యక్తి వైఫల్యానికి కారణం ఏమిటీ? పోనీ యిది యుగసంధి, అందువల్ల వ్యక్తి పాత కొత్తల మధ్య యిటూ అటూ తెమలక ఈ వైఫల్యానికి, నిస్పృహకు, లోనౌతున్నాడు. అనే విషయాని మాత్రమే చెప్పదలచుకున్నా రనుకుంటే ఆ వ్యక్తిలో ఒక చిత్తప్రవృత్తి, మనస్తత్వం, దాని పోకడ అంటూ స్పష్టం చెయ్యాలి కదా; అదేమీ లేకుండా నేటి సమాజాన్ని, జీవన ధోరణినీ చిత్రిస్తున్నామంటూ కొన్ని సంఘటనల్ని గూర్చి వ్రాసే నవలలు చిన్నపిల్లలు గీచే పిచ్చిగీతల్లాగే ఉంటాయి;

'దిగంతాలకు' అనే పెద్ద పేరు పెట్టుకున్న ఈ నవల అలాగే ఉంది. ఇందులో కథానాయిక జయలక్ష్మి ఒక పెద్ద పిచ్చిగీత. ఆ గీత చుట్టూ అడ్డదిడ్డమైన గీతలు మిగతా పాత్రలు. సత్యమూర్తి అనే 'బ్రతకనేర్చినవాడి' పాత్రలో లీలగా ఒక స్వరూపం గోచరిస్తుంది. అదైనా నీళ్ళల్లో ప్రతిబింబంలా అప్పుడప్పుడూ చెదరిపోతూనే ఉంది; కథావస్తువులో, సంఘటనల్లో వాస్తవికత లేదు అనటానికి వీల్లేదు. కాని కథాకదనంలో, పాత్రోన్మీలనంలో, జీవితాన్ని గూర్చి ఏవోకొన్ని 'వూహలు'

కాకుండా ఒక దృక్పథాన్ని ఏర్పరచుకోలేకపోవటంలో, రచయిత వైఫల్యం కనిపిస్తోంది — ముఖ్యంగా కథ చెప్పటంలో, పాత్ర పోషణలో కనీసం ఈ రెండూ చేతనైతే తప్ప నవల వ్రాయబూనుకోవటం పొరపాటే! ఈ శైలి చూడండి: "సృష్టికి ప్రాణమైన యౌవనం ఘనీభవించి, సౌందర్యాన్ని కప్పుకుంటే జయలక్ష్మి శరీరమైంది. ఇంతకాలం మండుతున్న యౌవనాన్ని కోర్కెలతో పీటముడి పెట్టి గుప్తంగా దాచుకుంది ఆ జవ్వని. రోజు రోజుకూ శరీరం తనమీద పగతీర్చుకుంటూ హింసిస్తున్నది. ఆ పైశాచిక ఆనందంతో, అది క్షణక్షణానికీ మత్తెక్కి, కఠినమై, క్రూరనాగులాగ బుసలు కొడుతూంది.... ఆకాశం పగిలేలా ఏడవాలనిపిస్తుంది. భూమి బ్రద్దలయ్యేలా నవ్వాలనిపిస్తుంది. ఆద్యంతాలు లేని సృష్టి రహస్యాన్ని దాచుకున్న ఆకలి అడవిమంటలా ఆమెను దహించివేస్తోంది. అలాగే ఉద్రేకాల ఉరవడిలో ఉక్కిరిబిక్కిరియై, అచేతనమై, నిద్రాదేవిని కౌగిలించుకుంది జయలక్ష్మి. కన్నీటితో పునీతమైన దివ్య కుసుమం జయలక్ష్మి!" జయలక్ష్మి యౌవన సహజమైన కోర్కెలతో సతమత మౌతోంది అనటానికి యింత హంగామా! పోతే ఆ చివరి వ్యాఖ్యానానికి అర్థమేమిటో మరి! 6వ అధ్యాయంలో ఇంత ఉద్రిక్త పరిస్థితిలో ఉన్న కథానాయికకు, పాపం, 18వ అధ్యాయం దాకా పెళ్ళికాదు! పెళ్ళి అయినా ఆమె బావుకున్నదీ ఏమీలేదు! "వైవాహిక జీవితంలో ఈనాడు దిగంతాలకు చిలవలు పలవలుగా ప్రాకే అనేక అయోమయ పరిస్థితులనూ స్త్రీల అగాధ మనస్తత్వాలనూ" ఈ నవల చిత్రిస్తోందని అట్టమీద ప్రచురణకర్తల ప్రకటన! అయోమయ పరిస్థితులను వ్యాఖ్యానించలేని ఈ రచనలో పరిస్థితుల అయోమయత్వం కంటె రచయిత అయోమయత్వమే ఎక్కువగా కనిపిస్తోంది.

(రా ర)

# ప్రతిమ

— నండూరి విఠల్

నాయుడు గారు వేయిస్తున్న నాటకం రిహార్సల్స్‌లో నాయికా నాయకులుగా కలుసుకుంటారు ప్రతిమ, రమణ, చిన్నతనంలోనే తల్లి దండ్రులు పోవడంతో మేనమామ ఇంట్లో పెరిగిన రమణ ఆస్తికి వారసు డైనా, ఆప్యాయతను నోచుకోలేదు. "ప్రతిమ భోజనం పెట్టింది. వడ్డిం చటంలో, నవ్వడంలో, చూడటంలో, చివరకు సాగనంపడంలో ఆమె ప్రదర్శించిన అప్యాయత జీవితంలో ఎప్పుడూ ఎరగనిది. టానిక్ లాంటి మనిషి." "దప్పికతో ఒయాసిస్సుని దర్శించిన" రమణ ప్రతిమతో అను బంధం పెంచుకుంటాడు. ఆమెకు శీలం లేదనీ, బజారు మనిషి అనీ లోకం (రమణ మేనమామ, స్నేహితులు వగైరా) వారిస్తుంది. ప్రతిమ ఎలాంటిదైనా సరే, ఆమెను తనదాన్ని చేసుకుందా మనుకుంటాడు రమణ. "బురదలోంచి పుట్టింది పద్మం. కాని అది పద్మం. బురదను మరచిపో. ఆ పద్మాన్ని నీ పాదాల ముందు ...." అంటూ ప్రతిమ తన గతాన్ని విస్మ రించమంటుంది. కాని గతం అంత సులువుగా వీళ్ళని వదిలిపెట్టదు. ప్రతిమ అసలు పేరు కాకినాడ పాప. తల్లి ఎవరో తెలియదు. పెంపుడు తల్లి మహూచికం వేసి మరణించగా, కాకినాడ వాసి "టాగూరు" అనే సంస్కర్త ప్రతిమని పదిహేనేళ్ళ వయస్సులో తన "రక్షణ"లోకి తీసు కున్నాడు. శీలం పోగొట్టుకున్న ప్రతిమ కాకినాడ నుంచి పారిపోయింది. రమణా, ప్రతిమా కలిసి మద్రాసులో, హైదరాబాదులో కొత్త జీవితం ప్రారంభిస్తారు. కాని వాళ్ళ మధ్య "టాగూరు" నీడపడుతుంది. టాగూరు రమణ మరదలు ఇందిరను తీసుకొస్తాడు. ప్రతిమ మీద తనకున్న హక్కూ, ఇందిరకు రమణమీద ఉన్న హక్కూ అసలు చెయ్యడానికే వాళ్ళ ఇంటిలో తిష్ఠవేస్తాడు. ఇది సున్నితమైన వ్యూహం. ఈ వ్యూహంలో

రమణా, ప్రతిమా సాలెగూటిలో కీటకాల్లా బందీలై నలిగిపోతారు లోకానికి భయపడి, గతానికి బందీఅయి, అంతర్యంలో వాటికి చోటిచ్చిన ప్రతిమ తన ప్రేమని రక్షించుకోలేకపోతుంది. తన్ను "బలిపశువుని"గా ఊహించుకుంటుంది. "టాగూరు"కి ఉద్వాసన చెప్పే మనోబలం ఆమెకు లేదు. ఆమెను వాత్సల్యంతో చూసే నాటకాల నాయుడుగారు ప్రతిమా, రమణల దాంపత్యాన్ని హర్షించి ఆశీర్వదించేందుకు వచ్చికూడా ప్రతి ఒక సహాయం చెయ్యలేకపోతాడు ఆయనకు తన పరిస్థితి తెలియనివ్వకుండా, సంతోషంగా ఉన్నట్లే కనిపిస్తుంది ప్రతిమ. "జీవించడం మానేసి నటించడం మొదలుపెట్టాం. నాయుడుగారు మన ప్రేక్షకుడు, కథలు చదివి, నాటకాలు చూసి ఏడ్చే నవ్వే ఈ వెర్రి ప్రపంచానికి ప్రతినిధి" అంటుంది రమణతో. పర్యవసానం ప్రతిమా, రమణా విడిపోవటం. ప్రతిమ టాగూరుతో వెడుతుంది. రమణ ఇందిర బాధ్యత స్వీకరిస్తాడు. హృదయానుబంధం మీద 'బాధ్యత', విధి' అనేవి సాధించిన విజయం ఈ పర్యవసానం. "ఏది నిజం? ఏది కల? ఏది జీవితం? ఏది నటన? ఎవడు రాక్షసుడు? ఎవడు మనిషి? ఆలోచించి తర్కించుకుని, పరీక్షించి నిజాన్ని శోధించే శక్తి లేదు, ఓపిక లేదు, ఆసక్తి కూడా లేదు!" అంటుంది అలసిపోయిన ప్రతిమ. అందుకే ఆమె జీవితంలో, ప్రేమలో ఓడిపోతుంది. బలిపశువై వెళ్ళిపోతుంది. ప్రతి వ్యక్తిలోనూ జీవితాన్ని గూర్చి, ధర్మాన్ని గూర్చి, కర్తవ్యాన్ని గూర్చి జిజ్ఞాస రేకెత్తించేలా నడిచిందీ నవల.

( ఆంధ్రప్రభ వారపత్రిక . 29-10-75 ) ❋

# నత్తగుల్లలు

— తులసీకృష్ణ

"ప్రపంచం పది కిలోమీటర్లు ముందుకు నడిస్తే నత్తగుల్ల నాలు గడుగులు వెయ్యడానికి భయపడుతుంది. రాళ్ళవాన పడినా, ఆచారాల సంప్రదాయాల పెంకు నుంచీ బయటకు రావడానికి బెదిరే మధ్యతరగతి ఎంత మిథ్యా విలువలతో బతకాలనుకుంటోందో! వాళ్ళు సుఖపడలేరు. ఎదుటి వారు సుఖపడ్డం చూడలేరు. ఏ పోరాటానికీ, ఏ మార్పుకూ పనికి రారు. ఎటువంటి నీచత్వంతో నైనా రాజీపడి బతుకుదామనే నీచత్వం వీళ్ళలోనే ఉంది." యువతరం, పెద్దతరం అనే తేడా లేకుండా మధ్యతర గతి అడుగు మెట్టుకు చెందిన ఒకానొక కుటుంబంలోని అందరి వ్యక్తుల మనస్తత్వాలనూ, వారి చరిత్రలనూ విపులంగా, నిర్దాక్షిణ్యంగా విశ్లేషించి, ప్రదర్శించే ప్రయత్నం జరిగింది ఈ నవలలో. ఈ రచనలో విశేషం - రచయిత సానుభూతి ఏ పాత్ర వైపూ ప్రసరించక పోవడం! కాని అక్కసు, అవహేళన, అతిశయోక్తి లాంటివేమీ జీవిత యథార్థ చిత్ర ణని ఒక వ్యంగ్యచిత్రం కింద మార్చే ప్రమాదం తెచ్చిపెట్టలేదు. కలాన్ని పదునైన కత్తిలా ఉపయోగిస్తూనే ఒక వైద్యునిలా, శాస్త్రజ్ఞునిలా వ్యవ హరించిన ఈ రచయితను తప్పకుండా అభినందించాలి.

మొదటి ఇరవై పుటల్లో ఆదిశేషయ్య కుటుంబంలోని వ్యక్తుల ప్రవృత్తులను, పరస్పర సంబంధాలనూ ఒక దృశ్యంలో ఆవిష్కరించిన రచయిత, పెద్దమ్మాయి భారతి చరిత్రను మొదలెట్టి చెబుతాడు. "భారతి కాలిపోయిన బతుకులో కాలిపోని గత ముంది." (ఇది రచయిత శైలికి మచ్చుతునక.) భారతి కథలోని విలన్ ఎవరంటే మధ్యతరగతి మనస్త త్వమే తప్ప, ప్రత్యేకంగా ఏ ఒక్క వ్యక్తి విలన్ కాకపోవడమే ఈ కథ నంలో, రచయిత చేసిన విశ్లేషణంలో ఉన్న కొత్తదనం. తరవాత

80 - 104 పుటల మధ్య భారతి తమ్ముడు, ఎమ్. ఎ. చదువుతున్న హరీంద్ర రొమాన్స్ కథ. ఈ కథలో కళ్యాణి వ్యక్తిత్వం శరత్ స్త్రీ పాత్రల వ్యక్తిత్వానికి దీటు వచ్చేలా గొప్పగా ఉంది. హరీంద్ర కాలేజీలో చదువుతున్న యువకుడే అయినా, జీవితం పెట్టిన ఆ మొదటి పరీక్షలోనే ఫెయిలయ్యాడు! అటువంటి హరీంద్ర, ఆదిశేషయ్య కుటుంబాన్ని కుల దీపకుడై ఉద్ధరిస్తాడా? అతనికి పిల్ల నిస్తానన్న మేనమామ కూడా మరో సంబంధం చూసుకున్నాడు! ఆ తరవాత చదువులో పైకెక్కలేక ఇంటా బయటా రౌడీగా తిరిగే వెంకటరమణ కథ. తండ్రి అప్పుచేసి ఇంట్లో తెచ్చిపెట్టుకున్న రొక్కంతో, ఒక కన్నెపిల్లతో ఉడాయిస్తాడు వీడు! కాని. ఎక్కడికి? మళ్ళీ తిరిగి వస్తాడు. కుటుంబాన్ని బజారులో పెడతాడు. క్షమించబడతాడు. పోతే ఆదిశేషయ్య తన కూతుళ్ళ సౌశీల్యాన్ని గూర్చి పడే ఆదుర్దా ఒక తమాషా చిన్న కథ. ఇక్కడా కుటుంబరావుగారి సీతప్ప (బెదరిన మనుష్యులు) గుర్తు వస్తాడు. ఇంతకీ ఈ కథల తరవాత ఆదిశేషయ్య కుటుంబం సాధించిన విజయం ఏమిటి? శోభ పెళ్ళీ, హరీంద్ర పెళ్ళీ! ఈ రెండు పెళ్ళిళ్ళూ ఇవ్వవలసిన కట్నాన్నీ, రావలసిన కట్నాన్నీ జోడించి ఒకే ముహూర్తంలో జరిపించి, తను గొప్ప కార్యం సాధించా ననుకుంటాడు ఆదిశేషయ్య. కాని రావలసిన కట్నం రాదు ఇవ్వవలసిన కట్నం ఇవ్వలేక పోతాడు. అందువల్ల, అటు హరీంద్ర దూరమైపోతాడు, ఇటు కూతురు శోభ ఇంట్లోనే మకాం పెడుతుంది! ఈ రెండు త్రాళ్ళూ కంఠానికి బిగిస్తున్న ఉరిత్రాటి రెండు కొనల్లా ఆదిశేషయ్యని చివరికి ఆత్మహత్యకు పురికొల్పుతాయి! కాని ఆత్మహత్య చేసుకునే తెగువైనా అతనికి ఉందా? ఆ ప్రశ్నతోటే ఈ నవల ముగుస్తుంది! అపరిష్కృతంగా ఇలా కథను వదలి వెయ్యడంలోనే గడుసుగా తను చెప్పదలుచుకున్న దాన్ని గట్టిగా చెప్పి ప్రత్యేకతను నిరూపించుకున్నాడు రచయిత. (ఆంధ్రప్రభ వారపత్రిక 13-10-76) ✸

# జీవన సంగీతం

— 'హృదయం'

కథానాయిక ప్రియంవద బావను ప్రేమించింది. తండ్రి ఆమెను బ్రహ్మానందం అనే యువకుడి కిచ్చి పెళ్ళిచేశాడు. బ్రహ్మానందం అమృత హృదయుడు. ప్రియంవద బావ అయిన విష్ణువర్ధనునికి ప్రాణమిత్రుడు. ఈ ముగ్గురి మధ్య స్నేహానుబంధం కథలో ఒక ఘట్టం. బ్రహ్మానందం మరణించాడు. ప్రియంవద బావను వివాహం చేసుకొన్నది. సంతాన ప్రాప్తి అయింది. కాని విధివశాత్తూ ఆ బిడ్డ మరణించాడు. విష్ణువర్ధనుడు ఆ దుఃఖాన్ని భరించ లేకపోయాడు. మళ్ళీ సంతానం కలిగినా ప్రథమ శిశువు స్మృతి అతణ్ణి బాధిస్తూనే వుంది. చివరకు ఆరోగ్యం క్షీణించి అతనూ మరణించాడు. ఇది రెండో ఘట్టం. రెండవసారి భర్తృవిహీన అయిన ప్రియంవద రోగగ్రస్తుడైన బిడ్డతో పినతండ్రిని వెదుక్కుంటూ శ్రీకాకుళం వెళుతుంది. పినతండ్రి కనిపించడు. శ్రీకాకుళంలో ప్రభా కరుడు అన్న వివాహితుని ఆశ్రయంపొంది తన బిడ్డ మరణించగా అతణ్ణి చేపట్టుతుంది. ప్రభాకరుని భార్య ప్రభావతి పుట్టింటి నుంచి తిరిగివచ్చి ప్రియంవద పట్ల సవతి మాత్సర్యాన్ని చూపుతుంది. ఆమెకు ప్రేమయొక్క వైశాల్యాన్ని నచ్చచెప్పబోయి విఫలురాలై, తన నిజాయితీని నిరూపించు కోడానికి ప్రియంవద యిల్లువదలి వెళ్ళిపోతుంది. వెళ్లేనాటికి ఆమె నిండు చూలాలు. ఇది మూడోఘట్టం. కొన్ని సంవత్సరాలతర్వాత, ప్రియం వద బిడ్డ యౌవనవంతుడయాక ప్రభాకరుని కుటుంబంతో తల్లీ కొడుకుల పునస్సమాగమం జరుగుతుంది. అదిచివరి ఘట్టం. కథ మంగళాంతం. దీన్ని 'ప్రియంవద కరుణగాథ' (ఉపశీర్షిక) అనడం కంటె 'ప్రియంవద ప్రేమగాథ' అనడం బాగు. ప్రతి ఘట్టంలోనూ 'మరణం' ద్వారానే కథ

మలుపు తిరగడం గమనిస్తే రచయిత కల్పనా సామర్థ్యం ఏపాటిదో తెలుసుకోవచ్చు.

పోతే పై కథకు మూలాధారమైన విశ్వాసం ఒకటున్నది. సెక్సు విషయంలో అసూయ, మాత్సర్యం బొత్తిగా అనవసరం. హృదయాన్ని విశాలపరచుకుంటే, ప్రేమించడం నేర్చుకుంటే, అందరూ అన్యోన్యంగా ఉండవచ్చు. ఈ భావాన్ని నవలలో పదేపదే (127, 210–211, 266, 274 పుటలు) చెప్పడం, ఉపాఖ్యాన సహితంగా చెప్పడం జరిగింది. చివరకు 'ప్రేమే దైవం' అంటూ అవకతవగ్గా దాన్ని గాంధిగారి 'సత్యాహింసల'తో ముడిపెట్టడమూ జరిగింది. (288 – 289). ఆ అవకాశాన్ని దొరకపుచ్చుకుని నేడు దేశంలో పెచ్చుపెరిగిన ధన వ్యామోహం, అవినీతి, రాజకీయాల్లో కుళ్లు వగైరా విషయాలమీద రిమార్కులు పాస్‌చెయ్యడం కూడా కద్దు. ఇదంతా ఒకవిధమైన అమాయకత్వం. కాకపోతే అజ్ఞానం క్రింద జమకట్టుకోవాలి. తాత్త్వికమైన విచారణ చేసే మేధాశక్తి కొరవడినప్పుడు దాని జోలికి పోవడం మంచిదికాదు. నవలలో పైరకం రచన నవల స్థాయిని చాలవరకు తగ్గించింది. ప్రియంవద పాత్ర పోషణలో లోపం లేదు. ఆమె కరుణగాథ లేక ప్రేమగాథ ఏ విధంగానూ ఎబ్బెట్టుగా లేదు. కాని ప్రియంవదను ఉదాహరణంగా లేక ఆదర్శంగా తీసుకుని వివాహ వ్యవస్థను గూర్చి కాని సెక్సు ప్రవృత్తిని గూర్చి కాని సామాజికంగా లేక తాత్వికంగా సిద్ధాంతీకరించబోవడమే సమంజసంగా లేదు. ప్రియంవద అసాధారణ వ్యక్తి. ప్రేమించిన వాళ్ళను కోల్పోవడమేమిటి, మళ్ళీ మళ్ళీ ప్రేమించడమేమిటి — ఆమెకే సరిపోయింది. "ప్రేమించు" హృదయాన్ని విశాలపరచుకో" అంటూ బోధించడం సులువే, కాని మానవ ప్రకృతి, ముఖ్యంగా సమాజం అనే చట్రంలో ఒత్తిడి పడే మానవ ప్రకృతి, అంత సులువుగా 'ప్రేమించు' అనే నినాదంతో ఉన్నట్లుండి మారిపోదు. మారిపోతుంది అని ఊహించడం కేవలం సుందర [illegible]

Utopianism. స్వర్ణ యుగాన్ని గూర్చిన కలలకీ (Utopianism), అభ్యుదయానికీ (Progressionism), గల విభేదాన్ని తెలుగు రచయిత లింకా అవగాహన చేసుకోకపోవడం దురదృష్టం. "If to do were as easy as to know what were good to do, chapels had been churches, and poor men's cottages princes palaces. The brain may devise laws for the blood, but a hot temper leaps over a cold decree...." (Shakespear). ప్రియంవద వంటి పాత్ర సృష్టిద్వారా జీవన సమస్యల మీద ఒక క్రొత్త దృష్టిని కలిగించడమే నవల ఉద్దేశమైతే, ఆ ఉద్దేశానికి భిన్నమైన భావోద్రిక్తత (Sentimentalism) రచనలో చాలచోట్ల కనబడుతూ నవల స్థాయిని దిగజారేటట్లు చేసింది.

( భారతి ) ❀

# జీవన సమరం

— ఎ. రామకృష్ణారావు

సంఘ పరిస్థితుల వివరణతోబాటు మార్గోపదేశం చేసిన మహత్తర మణిదీపం ఈ "జీవన సమరం" అంటూ ప్రచురణ కర్తలు ఈ నవలను గూర్చి అట్టమీద వివరణలో వర్ణించారు. నిజానికి సంఘ పరిస్థితులను గూర్చిన విశ్లేషణ కాని సామాజిక స్పృహ కాని ఈ నవలలో లేదు ఇది కొందరు వ్యక్తుల సెక్సు సమస్యలనుగూర్చిన నవల. ప్రతిపాదించిన ఆ సమస్యలకు చూపిన పరిష్కారమూ పరిష్కారంగా, అంటే 'మార్గోపదేశం'గా కనిపించదు. చావు, పారిపోవడం లాంటివి పరిష్కార మార్గాలుగా ఎవరు ఆమోదిస్తారు ?

ప్రొఫెసర్ మహేశ్, అతని భార్య సుందరి మధ్య ఒక సమస్య. మహేశ్ సెక్స్ పర్వర్ట్. 'అతని ప్రణయంలోని హింసాప్రవృత్తి' భార్య సహించలేకపోతుంది. లాయర్ శ్రీనివాస్ దగ్గరకు వెడుతుంది విడాకులు ఏర్పాటు చెయ్యమని. "ఎటన్నా పారిపోండి. కొన్నాళ్ళు అజ్ఞాతవాసం చెయ్యండి. అప్పుడాలోచిద్దాం" అని అతను సలహా ఇస్తాడు. కొన్నాళ్ళు సుందరి ఇందిర అనే ఒక అమ్మాయి ఇరుకు గదిలో అజ్ఞాతవాసం చేసి, అంతకంటే భర్త చేతిలో నరకమే మేలేమో అనుకునే పరిస్థితిలో, భర్తకు కనిపించి అతని చేత ఇంటికి లాక్కుపోబడుతుంది. తరవాత ఈ మహేశ్ డాక్టర్ మాధురిని హత్యచేసి, నేరాన్ని డాక్టర్ కృష్ణమోహన్ మీదికి నెట్టే ప్రయత్నం చేసి, విఫలుడై, జైలుకు పోవడంతో సుందరి సమస్య పరిష్కారమౌతుంది!

లాయర్ శ్రీనివాస్‌కు ఆకర్షణ లేని భార్య జానకి మీద కంటె తన రక్షణలో ఉన్న నవయౌవనవతి వైజయంతి మీద ఎక్కువ ఇష్టం. కాని ఆ ఇష్టాన్ని వ్యక్తపరిచేందుకు ఎన్ని ప్రతిబంధకాలు - నైతికమైనవీ, వ్యక్తిగతమైనవీ, వైజయంతి అతని కంటే దిట్టమైన వ్యక్తిత్వం కలిగి ఉండడం వల్ల, ఎదురుచూచి ఎదురుచూచి, చివరకు శ్రీనివాస్‌ను ధైర్యంగా తనే లొంగదీసుకుంటుంది. పరిష్కారం మాట ఆలోచించకుండానే (ఆస్తి, డబ్బు, ఆసరా ఉన్నవనే ధీమాతో) గర్భవతి అవుతుంది. తోణకదు, బెణకదు. దిక్కుతోచని శ్రీనివాస్ నవల చివర పలాయనమంత్రం పఠిస్తాడు. "నేను లేని సందర్భంలో మీ రిద్దరూ (అంటే వైజయంతీ, జానకీ) ఒకటవుతారు. వాడిని (పుట్టబోయే పాపాయిని) పెంచుకుంటూ నా కోసం ఎదురుచూస్తూ ఉంటారు" అని ఉత్తరం ఒకటి వ్రాసి వెళ్ళిపోతాడు. ఇదొక పరిష్కారం!

డాక్టర్ మాధురి డాక్టర్ కృష్ణమోహన్‌ని ప్రేమించి, డాక్టర్ భూపాల్‌ని పెళ్ళాడింది. భూపాల్‌కి మాధురిమీద అనుమానం. ఇద్దరి

మగవాళ్ళ మధ్య నలుగుతున్న మాధురి సమస్యకు రచయిత చూపించిన పరిష్కారం - ప్రొఫెసర్ మహేశ్ అనే మూడో మగవాడిచేత ఆమెను హత్య చేయించడం బాగుంది కదూ !

శ్రీకాంత్, నీహారిక భార్యాభర్తలు. నీహారిక పేరుమోసిన రచయిత్రి కావడమే వీరి మధ్య సమస్య. ఇద్దరూ వేరుగా ఉంటుంటారు. ఒక పార్టీలో పక్కన పక్కన కూర్చోవడం తటస్థిస్తుంది. ఉప్మాలో జీడిపప్పు తిని ఉప్మా వదిలేస్తాడు శ్రీకాంత్. ఉప్మా తిని జీడిపప్పు వదిలేస్తుంది నీహారిక. ఇద్దరినీ కళ్ళు మూసుకొమ్మని ఒకరి ప్లేటు ఒకరికి మార్చుతాడు, అమర్ అనే సెంటిమెంటల్ యువకుడు. దానితో భార్యాభర్తలు ఏకమైపోతారు. ఇదో పరిష్కారం. అన్ని పరిష్కారాల్లోకీ ఇదే బాగుంది !

పోతే, సెంటిమెంటల్ అమర్ నల్లగా, పొట్టిగా ఉండే ఇందిరని చేసుకోవడంతో ఆమెకు వివాహ సమస్య పరిష్కారమై పోతుంది. శః ఇందిర మగవాళ్ళతో తిరుగుతుంది. కాని ఎవర్నీ ఆకర్షించలేదు. చివరకు తన భార్య సుందరిని దాచిపెట్టిందనే కసితో మహేశ్ ఇందిరను బలాత్కారం చెయ్యబోయి, తను మాధురిని హత్యచేసిన వైనం కాస్తా బయట పెట్టి, ఇందిరద్వారా పోలీసులకు అప్పగించబడతాడు. నవలలోని కథాసంవిధానంలో ఇందిర పాత్రకున్న ప్రయోజనం ఇదొక్కటే. యువతరంలో నిరుద్యోగులకు ప్రతినిధులుగా ఇందిర, అమర్ చిత్రించబడ్డారు. కాని నిరుద్యోగానికి రచయిత చూపిన పరిష్కారం ఏమిటి ? సెంటిమెంటల్ అమర్ సుందరిని 'అక్కా' అని పిలవడంతో ఆమె తన నగల్ని అతనికి ఇచ్చి, బ్రతుకుతెరువుకు ఉపయోగించకొమ్మంటుంది. అమర్ అవి తాకట్టు పెట్టి, ఆ డబ్బుతో వ్యాపారం చేసి ధనవంతుడౌతాడు ! ఇది ఒక పరిష్కారం.

'రచన వల్ల ప్రయోజనం లేదంటారా ?' అనే ప్రశ్నకు నవలలోని రచయిత్రి నీహారిక చేత ఇలా అనిపించారు : "సమస్యలను ఎత్తిచూపటం వరకే జరుగుతుంది. పరిష్కారం చెయ్యడానికి మన మెవరం ? అన్ని జీవితాలకూ ఒకే లాంటి సమస్యలుండటానికి మానవులు యంత్రాలుకాదు !" నిజమే. కాని సమస్యలను నవలలో వ్యక్తుల పరంగా చూపినప్పుడు, ఆ వ్యక్తుల వైశిష్ట్యానికీ, సామాజిక పరిస్థితులకూ అనువైన, సబబైన, సమర్థ నీయమైన సమస్యా పరిష్కారం చూపిండంలోనే రచయిత వివేకం. ప్రతిభ, జీవితాన్ని గూర్చిన దృక్పథం అభివ్యక్తమై, ఆ రచన ఆనందాన్నీ, ప్రయోజనాన్నీ కలిగిస్తుంది. రచయితకు జీవితాన్ని గూర్చిన విస్పష్టమైన దృక్పథం లేకపోవడంవల్లే ఈ నవలలో చాలా చోట్ల పాత్రల మధ్య జరిగే ఉబుసుపోక కబుర్లు వినిపిస్తాయి కాని పాత్రవైశిష్ట్య నిరూపణ జరగదు. ప్రతిపాదించిన సమస్యలకు చివరకు అర్థం పర్థం లేని పరిష్కారాలు తయారయాయి. నవల వ్రాయడం చేతనయ్యా, మంచి నవల వ్రాయ లేక పోవడం అంటే ఏమిటో ఈ రచన పరిశీలిస్తే అర్థమౌతుంది.

( ఆంధ్రప్రభ వారపత్రిక : 4-8-76 ) ❋

# ఆమె చెప్పింది

— పి. వి. సుబ్బారావు

"యధార్థాన్ని మించిన నీతిగాని, మానవత్వాన్ని మించిన పవిత్రత గాని, ఏ యుగంలోనూ లేదనుకుంటాను. ఎంటే అది నీతి కాదు. అది పవిత్రత కాదు. ఆ నీతి పేడిపందు .... ఆ పవిత్రత దానిలోని పురుగులు

మాత్రమే" అని ముగిస్తూ, ఈ నవల ఏ దృక్పథంతో వ్రాయబడిందో స్పష్టంచేశారు రచయిత. ఇది 'మౌలిక మానవత్వవాద (Radical Humanist) దృక్పథం. దీనికి అవతలిమెట్టులో ఉంది అస్థిత్వవాదం (Existentialism) కేవలం సామూహికమూ లేక సామాజికమూ (Group or Social) అయిన విలువలమీద ఆధారపడిన దృక్పథంలోని అసంపూర్ణత్వాన్ని గ్రహించి దానిమీద తిరుగుబాటు చెయ్యటంలో ఒక వ్యక్తికీ, అతని స్వేచ్ఛకూ వైశిష్ట్యానికీ లేక కేవలం అతని అస్తిత్వానికీ, విలువనూ, ప్రాధాన్యతనూ యిచ్చిన యీ రెండు వాదాలూ ఒక మార్గానికి చెందినవే. ఇది ప్రస్తుతం సాహిత్యంలో (మన సాహిత్యంలోనే కాదు విశ్వసాహిత్యంలో) క్రమంగా ప్రస్ఫుటమౌతున్న మార్గం.

వైజ్ఞానిక విప్లవం (Scientific Revolution) పారిశ్రామిక విప్లవం (Industrial Revolution) తెచ్చిన ఎన్నో మార్పుల్లో కీలకమైనదీ, యిప్పుడిప్పుడే స్పష్టంగా అవగత మౌతున్నది, మన స్తత్వవిషయం ఒక్కటుంది. అది వ్యక్తికీ, సమాజానికీ మధ్య గల సంబంధం 'మానసికంగా' ఎలా పరిణామం చెందుతూ వచ్చిందనే విషయం. సంప్రదాయబద్ధమైన మత విశ్వాసాలూ, సామాజిక నియమాలూ వైజ్ఞానిక విప్లవంద్వారా సడలిపోవటం, కృశించటం బాగా గుర్తింపబడిన సంగతే. అవి పోవటంతో మళ్లీ ఒక సునంఘటితమైన సామాజిక రాజకీయ వ్యవస్థ ఏర్పడటానికి అనువుగా, ఆధారంగా ప్రజాస్వామ్య సిద్ధాంతమూ, దాని తరువాత సామ్యవాద సిద్ధాంతమూ గడచిన 150 ఏళ్ళలో ఎలా మానవాళి దృష్టిని ఆకర్షిస్తూ వచ్చాయో అదీ సువిదితమే. అయితే ప్రజాస్వామ్య సిద్ధాంతం కాని సామ్యవాద సిద్ధాంతం కాని పూర్వయుగపు మత విశ్వాసాల ప్రగాఢ శక్తినీ, ఉన్నత స్థానాన్ని, సాంఘికంగా పొందినా, వైయక్తికంగా పొందలేకపోయాయన్న సత్యం యిప్పుడిప్పుడే గుర్తింపబడుతోంది. అందుకు కారణం అన్వేషిస్తే, తేలే విషయం :— పూర్వ యుగంలో,

మతంలోకాని, రాజకీయాల్లో కాని సామూహిక దృక్పథానికీ, వ్యక్తి దృక్పథానికీ ఒక సమైక్యత (Integration) ఉండేది. ఆ సమైక్యత విశ్వాసం మీదా, భక్తి ప్రపత్తులమీదా ఆధారపడినది; హృదయగతమైనది; దానికి హేతువాదంతో, వ్యక్తియొక్క స్వయం వివేచనతో పనిలేదు; ఉన్నా, అటువంటి వివేచన సంప్రదాయానికి ఎప్పుడూ విధేయంగానే జరిగేది; అలా జరుగనిచోట్ల సంఘాన్నే మార్చి తనవైపుకు త్రిప్పుకో గలిగేది. ఏమైనా సమైక్యతకు భంగపాటు లేదు. వైజ్ఞానిక యుగంలో హేతువాదం, స్వయం వివేచన, యివే ప్రాముఖ్యత వహించటంతో ఒక వ్యక్తి మనస్సుకూ, మరియొక వ్యక్తి మనస్సుకు సంబంధం ఉన్నా సమైక్యత మాత్రం లేదు. సమాజంలో మనుష్యుల సంబంధాలు పారిశ్రామిక విప్లవం వల్ల క్లిష్టమై, సంకీర్ణం కావటంతో, జీవన విధానంలోని వైవిధ్యంతోబాటు దృక్పథ భిన్నత్వమూ నిరవధికంగా పెరగటంతో ఎవరి విశ్వాసాలూ, ఎవరి విలువలూ వారివే అవుతున్నాయి. వాటికి తగినట్లే హేతువులూ, వివేచనా ఉంటాయి. ఈ పరిస్థితిలో సామాజిక దృక్పథానికీ, వ్యక్తి దృక్పథానికీ సమైక్యత ఏర్పడటం అరుదు. సమైక్యత బదులు సంఘర్షణే తరచూ ఏర్పడుతూ ఉంటుంది. ఉదాహరణకు సామాజిక దృక్పథంలో ముఖ్య విలువలైన 'ప్రజాస్వామ్యాన్నీ', 'మానవ సమానత్వాన్నీ' అందరూ అంగీకరించినా, ఈ అంగీకారము కేవలము బాహ్యమే. వినాదాలకు పరిమితం. ఏమంటే ఆంతర్యంలో ఒక్కొక్కరూ ఈ వినాదాలకు ఒక వ్యక్తిగతమైన అర్థాన్ని, స్వార్థంతో ముడిపడ్డదాన్ని అపాదిస్తారు. అలాగే సిద్ధాంతరూపేణా అందరికీ సాధారణంగా అంగీకారమైన ఒక సామాజిక వ్యవస్థకానీ, ప్రతిపాదన కాని ఉందంటే, దాని ననుసరించి ఒక వ్యక్తి జీవితమూ ఆచరణా సాగుతూందో లేదో, ఆ వ్యవస్థ కొన్ని పరిస్థితుల్లో వ్యక్తి ప్రకాశానికీ (Self. expression), వ్యక్తి వికాసానికీ (Self - development) అవకాశమే అవుతుందో, అఘాతమే అవుతుందో నేటి

సమాజంలో చెప్పటం కష్టం. ఇదీ యీ యుగానికి విశిష్టమైన లక్షణం. పూర్వయుగంలో 'సమాజం — సంప్రదాయం' ఒక పెద్ద అద్దం పలక అనుకుంటే, అందులో ప్రతి వ్యక్తీ తన ముఖం చూచుకొని అందులోనే యితరుల ముఖం చూడటానికి వీలుండేది. ఈ యుగంలో ఆ అద్దం ముక్కలు చెక్కలై పోవటంతో ప్రతి వ్యక్తికీ తన ముక్కలో తన ముఖమే కనిపిస్తుంది కాని ఇంకొకరి ముఖం కనిపించదు. కనిపించినా వంకరగా తప్పుగా కనిపిస్తుంది. సవ్యంగా కనిపించాలంటే అవతలి వ్యక్తి దగ్గరిగా వెళ్ళి అతని అద్దం ముక్కలోకి తొంగిచూడటం ఒక్కటే మార్గం. అటు వంటి అనుభూతి ప్రసాదించటమే సాహిత్యం యొక్క పరమ ప్రయోజనం యీ యుగంలో।

ఉదాహరణకు వివాహ వ్యవస్థ ఉన్నది; ఏకదేశమైన ప్రేమ ధర్మం ఆలంబనముగా ప్రతిపాదితమైనది ఆదర్శదాంపత్యం. సామాజికంగా దీనికి ఎంతో విలువా, ప్రయోజనం ఉన్నాయి. వ్యక్తిగతంగా కూడా దానికి అలానే అనర్ఘ్యమైన విలువ — అందరి వ్యక్తుల విషయంలోనూ — ఉంటుందనీ, ఉండాలనీ సాధారణమైన అభిప్రాయం. కాని ఎంతమంది విషయంలోనో, వేరు వేరు కారణాలవల్ల పరిస్థితులవల్ల, అలా లేకపోవ టము నిత్యమూ మన కన్నులముందు కనిపించే నిజం. దాన్ని మనం సహనంతో అంగీకరించలేము. ఆ వ్యక్తుల్ని గౌరవించలేము. వారిని నీతిపథచ్యుతులుగా తీసిపారవెయ్యటమే సామాన్యమైన తీర్పు. ఎందు వల్ల? వైజ్ఞానిక విప్లవం తర్వాత సమాజంయొక్క సామూహిక మనః ఫలకము ముక్కలు ముక్కలై ప్రస్తుతము వ్యక్తులమధ్య భిన్న భిన్న సంబంధాలు తప్ప ఒక అవిచ్ఛిన్న సమైక్య మానసిక దృక్పథమంటూ ఏదీ లేదనీ, ఉండటానికి వీల్లేదనీ, యింకా మనం గుర్తింపకపోవటమే అందుకు కారణం। అయితే యిప్పటి దృక్పథం — మంచి చెడ్డలనూ,

నీతి అవినీతులనూ నిర్ణయించేందుకు — దేనిమీద, ఏ ప్రమాణంమీద ఆధారపడాలి? అనే ప్రశ్న వెంబడే ఉదయిస్తుంది.

ఒక్కొక్కరినీ ప్రత్యేక వ్యక్తిగా పరామర్శ చెయ్యటం అవసరం. సంప్రదాయబద్ధమైన లేక సమాజ ప్రతిపాదితమైన ఆదర్శాన్ని లేక విలువలను ఒక వ్యక్తి అనుసరించలేక పోవచ్చు. కాని ఆ వ్యక్తి 'మానవత్వానికి' లేక 'అస్తిత్వానికి' సంబంధించిన విలువలంటూ ఏవో ఉండి తీరుతాయి. అవి ఏవో పరామర్శించి మనం తెలుసుకోవాలి; అలా తెలుసుకునే ఓపిక, ఆకాంక్ష, లేనిచోట్ల కనీసం అవతలి వ్యక్తికి కూడా మనవలెనే ఒక దృక్పథమూ, విలువలూ ఉంటాయని సహనంతో గుర్తించాలి. ఇదీ ప్రస్తుత యుగంలో తప్పనిసరిగా మనుష్యుల్లో ఏర్పడవలసిన దృక్పథం. అటువంటి దృక్పథమే వసుధైక కుటుంబానికీ, శాంతియుత సహజీవనానికి యీ యుగంలో పునాది అవుతుంది.

ఐన్‌స్టీన్ ప్రతిపాదించి నిరూపించిన (Relativity) సాపేక్ష సిద్ధాంతము వంటిదే యిదీను: 'కాలం' అనే వస్తువుకు ప్రదేశబాహ్యంగా (Unlinked with space) అస్తిత్వం ఎలా లేదో 'కాలం' ఒక్కొక్క స్థలానికీ సంబంధించి ఎలా భిన్నంగా ఉంటుందో, ఆయన ఋజువు చేసినట్లే — మనోదృక్పథం అనేది కూడా ఒక్కొక్క వ్యక్తి అస్తిత్వంమీదా ఆధారపడినదే కావి, దానికి వ్యక్తి బాహ్యంగా కేవలం సమాజంమీదే (On a social abstraction) ఆధారపడిన అస్తిత్వం ఏమీలేదు, అని మనం గ్రహించాలి. ఉందనుకుంటే ఆ అభిప్రాయం, కాలాన్నిగూర్చి ఐన్‌స్టీన్‌కు పూర్వం మనకున్న అభిప్రాయం లాంటిదే అవుతుంది — అనగా కేవలం భ్రమ మాత్రమే అవుతుంది. ప్రస్తుత సమాజంలో ఈ భ్రమ అభివృద్ధి నిరోధకము, అశాంతికరము అని మాత్రం చెప్పక తప్పదు.

ఈ విషయాన్నిగూర్చి యింత విస్తృతంగా చర్చించటానికి కారణం ప్రస్తుత సాహితీరంగంలో వస్తున్న మార్పు ముఖ్యంగా 'మనోదృక్ప

థానికి' చెందినదనీ, యీ మార్పు విశ్వశ్రేయస్సుకు, మానవుని పురోగమ నానికీ భంగకరం కాదనీ సూచించే ప్రయత్నమే। నూతన దృక్పథాన్ని గూర్చి రేకెత్తుతున్న అపోహల్ని దూరం చెయ్యటానికే। ప్రస్తుతం సమీక్షకు వచ్చిన నవల యీ దృక్పథానికి చెందినది. కాని దృక్పథం నూతనమూ, మంచిదీ అయినంతమాత్రాన రచయిత సాహితీక్షేత్రంలో సఫలీకృతుడు కాలేడు అనటానికీ యీ నవలే చక్కని ఉదాహరణ। కథావస్తువు మృణాళిని అనే ఒక సినిమా తారయొక్క సంప్రదాయ విముక్తమైన జీవితం. ఆమెవ్యక్తిత్వం విశిష్టమైనది. ఆమెలోని 'మానవత్వపు' విలువలు ఎటువంటివో విరూపించటానికి ప్రయత్నించారు రచయిత. అలాగే వివాహ వ్యవస్థలో "నీతి"కి కట్టుబడకపోయినా ఆమె సోదరి సుజాత, పినతల్లి కూతురు స్వరాజ్యలక్ష్మి "చరిత్రహీనులు"గా తీసివేయదగిన వ్యక్తులు కారనీ, వారిని సానుభూతితో చిత్రించటానికి ప్రయత్నం జరిగింది. మృణాళినీ రజనీకాంతుల సంబంధం సామాజిక సూత్రాలకు అతీతమైన ఒక అనుబంధం. దాని ముగింపూ వింతగా విచిత్రంగా ఉంది. కాని అసంభావ్యమేమీ కాదు।.... అయితే రచయిత పాత్ర చిత్రణంలో గాని మానసిక ప్రవృత్తుల విశ్లేషణంలో గాని చూపవలసిన ప్రతిభ చూపలేకపోవటం విచార్యము. కథాగమనం "సోదె"లాగ తయారైంది. చాలచోట్ల అనవసరంగా సాగదీయటంతో ఉత్కంఠ చచ్చిపోయింది; ముఖ్యమైన విషయానికి రాకుండా శాఖా చంక్రమణం జరిగింది. ఇంతా చేసి "ఇది కల్పన" కాదు, 'యదార్థం' అంటూ గమ్మత్తుగా ఏదో పెద్ద సాంకేతిక విజయం (Technical Triumph) సాధించినట్లనుకోవటం కేవలం భ్రమ। నేటి సాహితీరంగంలో నవల ఉద్దేశం యదార్థాన్ని చిత్రించటమే అయినప్పుడు దాన్ని యిలా చమత్కారంగా నొక్కి చెప్పవలసిన అవసరమేమీ లేదు. "అలా కాదు, నేను యదార్థం అలానే వ్రాశాను అక్షరాలా. నాకు దొరికిన వ్రాతప్రతిని అలానే ప్రకటించాను"

అంటే, అందులో గొప్ప ఏమీలేదు. సాధించిన సాహిత్యప్రయోజనమూ లేదు ; తగు సంస్కారంలేని రచనకు కావ్య గౌరవం లోపించి ఊరుకుంటుంది. పోతే, యిలా గమ్మత్తుచేసి, రచయిత తాను ఒక పాత్రగా నవలలో ప్రవేశించటంవల్ల ప్రయోజనానికి బదులు అనర్థమే సిద్ధించింది. పతివ్రతలమీద నాలుగు అక్షింతలూ, నవలలో ప్రవేశం లేని తన భార్యామణిమీద విసుర్లూ, ఏదో సాహిత్య సమావేశాన్ని గూర్చి, కవులను గూర్చి అనవసరపు అభిప్రాయాలూ, యిలా ఉన్నాయి ఆ దుష్ఫలితాలు.

నవలలో శిల్పం ఎలా ఉన్నా, సుబ్బారావుగారి దృక్పథం కొత్తది. అది ఆయన చివర చెబితేగాని తెలీని రీతిగా నవలలో అంతర్గతమైంది.

[ భారతి ] ❋

# స్వయంవరం

— కపిల కాశీపతి

"సుందరానికి ఎంతమంది స్త్రీ స్నేహితులతో తిరిగినా, జీవితంలో ఒక వివాహం చేసుకోవాలి, భార్య అంటూ వుండాలి అనే ఆలోచన రాలేదు. ఆ రోజుల్లోనే అతనికి వసంతకుమారి పరిచయం కలిగింది. అప్పుడే తాను పురుషుణ్ణనీ, ఆమె స్త్రీ అనీ జ్ఞానం కలిగి, కామశాస్త్ర గ్రంథాలు చదవడం ప్రారంభించాడు. ఎంతచదివినా, ఒక పురుషుడు ఒకానొక స్త్రీని ఎందుకు ఆకర్షిస్తాడు ? అదేవిధంగా ఎంతమంది అమ్మాయిల్నో ఎరిగున్నా తనకి ఒక్క వసంత విషయంలోనే స్త్రీభావం కలగడానికి గల కారణం ఏమిటీ అనే ప్రశ్నకి జవాబు దొరకలేదు. ఈ సంబంధం. ఆకర్షణా కేవలం శారీరకమా, మానసికమా, రెండూనా ? ఈ స్త్రీ - పురుష

సంబంధంలో ఏరుకోవడం, ఎన్నుకోవడం, నిజంగా హృదయాలు కలవడం వుంటుందా? శరీరాలు కలుస్తూవుంటే మనసులు వాటంతటవే కలిసిపోతాయా? అసలు ధర్మం ఏమిటి? ఇందులో ఆరోగ్యవిషయాలూ, సాంఘిక కట్టుబాట్లు అటుంచి నైతికంగా స్త్రీ పురుషులకి బాధ్యతలు వుండడం అవసరమా? ఈ ప్రశ్నలతో సతమతం అవుతూ, తాను బిగబట్టుకొని ఉద్రేకం అణుచుకుందామని శాయశక్తులా ప్రయత్నిస్తున్నాడు. తన నడవడికి సరిహద్దులేమిటో తెలుసుకుందామని పరిశోధన చేస్తున్నాడు. ఆ పరిశోధన వసంతకుమారి స్నేహంలో సాధిద్దామనే ఒక అంతర్భావం ప్రేరేపించడంవల్ల ....” ఆవిడను తనతో ఏకాంతంగా ఒక వారంరోజులు క్రొత్తపట్నం బంగళాలో గడపమని కోరుతాడు। నిజంగా ఆకలితో వున్నవాడెవరూ అన్నం ముందు కూర్చుని “ఆకలి అంటే ఏమిటి? అన్నానికీ ఆకలికీ గల సంబంధం ఏమిటి? లోకంలో అందరూ అన్నమే తింటున్నారా? కొందరు రొట్టెలు తినడం లేదా? అంటూ జిజ్ఞాసలో పడడు. అలా జిజ్ఞాసలో పడటమే అతనికి నిజంగా ఆకలిలేదని గుర్తు; అందరూ విస్తళ్ళముందు కూర్చుంటున్నారు, కాబట్టి తనూ కూర్చోవటం, ఆకలి వుందని వూహించుకుని ఆ విషయమై “పరిశోధన” చేయబూనటం, ఆ పరిశోధనలో తన “అరుచి”ని గూర్చి గొప్పగా - ఆకలికి అన్నంతిని తీరవలసిన అగత్యం ఏమీలేదనీ, తనకు అందరికి అల్లే ఆకలి లేకపోవటం తనలో ఏదో అతీతమానవత్వ లక్షణమనీ చెబుతూ అన్నం వదలిపెట్టి లేచిపోవటం। యిలాగేవుంది “సెక్స్” ప్రవృత్తి విషయమై యీ నవలలో కథానాయకుడు సుందరమూర్తి చేసిన “పరిశోధన”.

జీవితంలో కొన్ని సమస్యలు మేధాగతమైనవి. కొన్ని హృదయగతమైనవి, కొన్ని శారీరకమైనవి. గణితంలో ఒక్క లెక్క రాలేదనుకోండి దాన్ని గురించి ఎంత హృదయావేదన పడినా, ఎంతగా కన్నులుతెరచీ చెవులు రిక్కించీ ప్రయత్నించినా, మేధాశక్తి కొరవడినప్పుడు ఆ లెక్క

రాదు। హృదయావేదనా శరీరయత్నమూ మేధస్సు పురికొల్పవచ్చు, దానికి సాయం చెయ్యవచ్చు; కాని దానికి స్వతఃశక్తి లోపించినప్పుడు ఫలితం వుండదు। అలాగే పుత్రశోకం సంభవించిన పరిస్థితిలో మేధాగతమైన తత్త్వపరిజ్ఞానమూ, అంత్యక్రియలపట్ల చూపే శ్రద్ధా ఏవీకూడా వ్యక్తి తన హృదయం ద్వారా అనుభవించవలసిన శోకానికి ప్రత్యామ్నాయం కాలేవు. ఆ శోకాన్ని అనుభవించి అధిగమించటం వేరు. శోకానుభవమే లోపించిన స్థితిలో తాత్త్వికంగా ఎంత గింజుకున్నా, నెత్తీనోరూ బాదుకున్నా, శోకాన్ని భ్రమింపచేయవచ్చునేమోకాని లోపం లోపమే। అలాగే శరీరం ప్రధానసాధనమైన అనుభవాల విషయంలోనూ। ఆకలీ "సెక్స్" ప్రధానంగా శారీరకమైనది అనుభవాలు. వాటిని గూర్చి ఎంత ఆలోచించినా, ఎంత ఉద్రేకపడినా శరీరం ద్వారానే తప్ప ఆ అనుభూతి లభించదు। అయితే నిస్సంగత్వం, నిర్మోహత్వం, నిశ్చలతత్వం, అనే ఊర్ధ్వపథం మాటేమిటీ? అంటే ఆ మార్గం ఒక్క శరీరానికి మాత్రమే అన్వయించేదికాదు. అది ఆలోచనలో, ఆవేశంలో కూడా కలసివచ్చే మార్పు. అప్పుడు సాధారణ వ్యక్తి అసాధారణుడూ, అతీతుడూ అవుతాడు. అంతేకాని శరీర ప్రవృత్తిలో నాకు విజయం. "సెక్స్" ప్రవృత్తి అంతా యథాతథంగా హృదయగతమూ, మేధాగతమూ అయింది. అది నా వాసనత్వం అంటే అది విశిష్టమైన ఆధ్యాత్మిక విజయం కాదు. కేవలం శరీరధర్మంలో లోపం, నపుంసకత్వం లని సమాధానం. అందువల్లే ఈ నవలలోని సుందరమూర్తి ప్రవర్తనలో, ఆలోచనలో, ఆవేశంలో - అతని "పరిశోధన"లో వ్యక్తమౌతున్నది. మేధాగతమైన "సెక్స్" తప్ప నిశ్చలతత్త్వంగా, దివ్యానుభూతిగా పరిణామం చెందే (sublimate) అయ్యే "సెక్స్" కానేకాదు। రచయిత శ్రమపడి నపుంసకత్వాన్ని అలా చూపేందుకు చేసిన ప్రయత్నమే ఈ నవల కావటంతో పాఠకులకు ఈ హెచ్చరిక చెయ్యక తప్పలేదు। ఈ మేధాగతమైన 'సెక్స్' సాధనకాదు. దీనినే డి. హెచ్. లారెన్స్ 'Sex in the head' అని ఏవగించుకున్నాడు.

సుందరమూర్తి నపుంసకత్వం నవలలో బాగానే రుజువౌతుంది. ఇది పాఠకుడూ, విమర్శకుడూ స్వయంగా చేసుకోవలసిన నిర్ణయంకాదు! కథానాయిక వసంత పూర్వచరిత్రవల్ల ఆమెలో 'సెక్స్' అంటే భయమూ, సంకోచమూ ఏర్పడివుండటం నవలలో చాల సహజంగా చిత్రింపబడిన విషయం. ఆమె హృదయంలో సుందరమూర్తి పట్ల స్నేహమూ, విశ్వాసమూ ఏర్పడటం వల్ల అంటే హృదయం పురికొల్పటం ద్వారా - శారీరకమైన అవరోధాన్ని తొలగించుకో గలుగుతుంది. (పేజీ - 162). శారీరక అనుభవానికి ఉన్ముఖురాలవుతుంది. కాని సుందరమూర్తి హృదయోద్వేగమూ, పుస్తక పరిజ్ఞానమూ, ఆలోచనా అన్నీ కలసినా అతడు చివరకు మాట దక్కించుకోలేకపోతాడు. కారణం: మేధ, హృదయం కలసి ఏదైనా అవరోధాన్ని తొలగించగలవేమో కాని, శరీరానికిలేని ప్రవృత్తిని కలిగించలేవు కదా! సుందరమూర్తి వైఫల్యాన్ని గూర్చి రచయిత వ్యాఖ్యానం: "ఏమిటా సత్యం? సురత సంస్పర్శలేని స్త్రీ పురుష స్నేహం అసహజం కాదని. అధర్మంకూడా కాదని తనకి తోస్తోంది. ధర్మం అంటే అనేక అర్థాలు. సృష్టి ధర్మమే, లయమూ ధర్మమే. కాని మానవ జీవితంలో గీటురాయి స్థితి. ఏ ప్రవర్తన స్థితికి అనుకూలమో అది ధర్మం." ఒక వ్యక్తిలో నైసర్గికమైన నపుంసకత్వం కనిపిస్తే దాన్ని 'ధర్మం' కాదని ఎందుకనాలి? పుట్టుగ్రుడ్డివాడు మానవుడు కాడా? ఈ దృష్ట్యా రచయితపై వాక్యాలు సమంజసంగా వున్నాయి. నపుంసకత్వంలో సిగ్గుపడవలసిందీ, కించపడవలసిందీ ఏమీ లేదు. ఈ ఇతివృత్తాన్నే జీన్‌పాల్ సార్త్రే తన "ఇంటిమసి" (Intimacy) అనే కథలో చక్కగా ప్రస్తావించాడు. ఈ నవల కూడా నపుంసకత్వాన్ని గూర్చి వ్యక్తిధర్మంగా చిత్రించి వుంటే ఎవరు కాదంటారు? అలా కాకుండా నపుంసకత్వాన్ని విష్వంగత్వంగా, నిర్మోహత్వంగా రూపొందించే ప్రయత్నం "మనం"గా సాగటంవల్లె ఈ రచన అస్తవ్యస్తంగా, కలగాపులగంగా తయారైంది। చూడండి: "ఈ వారం రోజులూ నిరంతరాయ

సంపర్కంలో తన శీలంగాని, అతని శీలంగాని చెడిపోలేదంటే అసంభవం అంటారు. నిజానికి జరిగింది అదే, అదే సత్యం. వారు చేసిన సాధన లభించిన సిద్ధి." ఇక్కడ శీలం ప్రస్తావన క్రొత్తపట్నం వెళ్ళటానికి ఏ ముంది? శీలం ప్రస్తావన నిర్ణయించుకోవటంలో, వెళ్ళకముందే వుండాలి; వెళ్ళిన తర్వాత పుంస్త్వం ఉన్నట్లా లేనట్లా అని పరీక్షేగాని శీలాన్ని గూర్చిన ప్రశ్నరాదు! అక్కడ సుందరం, వసంతా, చేసిన "సాధన" ఏముంది? "ఎంత సాత్త్వికుడు కాకపోతే, సముద్రస్నానం చేస్తూ వుండగా, అలల తాకిడికి తాను పడిపోయి, చీర వూడిపోయి, తాను నగ్నంగా తంటాలు పడుతోంటే ఆ సౌందర్యం మీద కవిత్వం చెప్పాడు గాని, తాను పురుషుడిలా ప్రవర్తించలేరు...." సుందరంలో ఈ నపుంసకత్వాన్ని సత్త్వగుణంగా భ్రమింపజేయాలనే ప్రయత్నమే (పైగా వసంతే అలా అనుకున్నట్టు చూపించటం) నవలలోని ప్రధానమైన లోపం! పోనివ్వండి, సుందరం ఒక్క వసంతపట్ల శారీరకంగా విముఖుడైనంత మాత్రాన నపుంసకుడని ఋజువా? అని ప్రశ్నించుకున్నా నవల ముగింపులో రచయిత సూచించదలచుకున్నదేమిటో స్పష్టంగా లేదు. కథ ముగింపు చిట్టి అతని మరదలు, అతను వివాహం చేసుకోవాలని నిశ్చయం చేసుకున్న పిల్ల, క్రొత్తపట్నం నుంచీ అతను తిరిగివచ్చిన రాత్రి ప్రక్కను పడుకుంటే - "అతనికి ముచ్చెమటలూ పోశాయి; గుండెదడదడ కొట్టుకుంది"ట! ఏం జరిగిందో స్పష్టంగా లేదు! సుందరం నపుంసకుడు కాడు. జితేంద్రియుడే అయితే అతడు మరదల్ని పెళ్ళిచేసుకుంటానని చెప్పటమెందుకో వవ్యసించక? అన్నమంతా పట్టిచూడాలా! నపుంసకుడైనప్పుడు, చిట్టి 'స్వయంవరా'న్ని కాదనటం అతని ధర్మం కాదా? రచయిత తర్వాతి కథ వ్రాయలేదు! బహుశా వ్రాస్తారేమో!

[ ఆంధ్రపత్రిక : 17-1-65 ] ❁

# తమసోమా

— పి. రాజగోపాలనాయుడు

సుమారు అర్ధశతాబ్దం క్రితం తెలుగుదేశంలో నాటి సంస్కారణోద్యమానికి అనుబంధంగా స్వేచ్ఛా ప్రేమ సిద్ధాంతానికీ ప్రచారం జరిగింది. తెలుగు సాహిత్యంలో చలం దానికి ప్రతినిధిగా ప్రత్యేకమైన స్థానాన్ని సంపాదించుకున్నారు. విశ్వనాథ సత్యనారాయణగారి నవల 'చెలియలికట్ట' లోని రంగారావు కూడా ఆ సిద్ధాంతం తాలూకు ప్రతినిధిగా రూపొందిన వాడే. ఈ నవలలో ఆ నాటి ఉద్యమం కొందరు యువతీ యువకుల జీవితాల మీద చూపిన ప్రభావాన్ని చిత్రించారు రచయిత. స్థల నిర్దేశం (కాకినాడ) చేశారు గాని, కాల నిర్దేశం చెయ్యలేదు. చెయ్యకపోయినా, ఈ నవలలోని పాత్రలు అర్ధశతాబ్దం వెనకటి వారే గాని ఈ నాటి వారు కారని వాళ్ళ హావభావాలు ప్రవర్తన గమనిస్తే చప్పున పోల్చుకోవచ్చు. ఉదాహరణకు, డిగ్రీ చదువు చదివిన ఒక యువతి గుడివాడ నుండి కాకినాడకు వెళ్ళడానికి వాళ్ళ బావ "ఒంటరిగా ఎలా వెళతావమ్మా! నేను రావాలనుకున్నా రెండు మూడు దినాలు పడుతుంది" అంటూ ఒంటరిగా పంపడమే సాహసం అన్నట్లు మాట్లాడతాడు! కాకినాడకు రాకుండా గుడివాడలోనే ఆ అమ్మాయిని ఎలాగైనా ఉంచేస్తే, ఆమె స్వేచ్ఛా ప్రేమ సమాజంతో సంబంధం వదులుకొంటుందని, అమాయకంగా ఏవో తంటాలు పడతాడు తండ్రి బ్రహ్మయ్య. ఈయన రిటైర్డు పోలీసు ఉద్యోగి, ఈయన పాత్ర కూడా అర్ధశతాబ్ది వెనకటిదే. ఈ నాటిది కాదు. ఈ స్వేచ్ఛా ప్రేమ సిద్ధాంతానికి బలి అయిపోయిన లలిత అనే మెడికోని చూస్తేనూ పనరు కాలంలో వచ్చిన మార్పు కనిపిస్తుంది. ఈ నాడు ఒక మెడికో అలా అమాయకంగా గర్భవతి కావడం కాని, అయిన తరవాత ఆ కథా

నాయకుడి దగ్గరకు వెళ్ళి, "నేను గర్భంగా ఉన్నాను. ఇక ఒంటరిగా ఉండడం చాల కష్టం" వంటి డైలాగు చెప్పడం గాని మనం ఊహించ లేము। కాని, అర్థశతాబ్ది క్రిందటి వ్యక్తుల చిత్రణగా ఇందులో అసహజత్వం మనకు తోచదు. ఆ నాటి ఫోటోల్లో ఆ కట్టూ బొట్టూ చూస్తే మనకు కలిగే భావన లాంటిదే ఈ నవలలోని పాత్రల పట్ల కూడా కలుగుతుంది. ఇది ఈ నవల విశిష్టత. వ్యవహారాల్లో, వైఖరిలో కాలం తెచ్చిన మార్పులను సున్నితంగా ఎన్నింటినో చూపిస్తుంది.

కాని, రచయిత దీన్ని చారిత్రాత్మకమైన నవల కంటె, ఒక సిద్ధాంతం — వివాహ వ్యవస్థను త్రోసి రాజనే సిద్ధాంతం— సమాజంలో ఆచరణాత్మకంగా ఎలా వైఫల్యాన్ని పొందుతుందో నిరూపించే ఉద్దేశ్యమే ప్రధానమైన రచనగా రూపొందించ దలచినట్లు తోస్తుంది. అలా చెయ్యడానికి నవలలో తగిన ఉపపత్తిని సమకూర్చుకోలేకపోయారు. నాస్తికవాదంతో ప్రారంభించి దానికీ, వివాహ వ్యవస్థను నిరాకరించడానికీ ఏదో అవినాభావ సంబంధం ఉన్నట్లు సూచించారు. నిజానికి రెండింటికీ ఏమీ సంబంధం లేదు. నాస్తికవాదులు సామాజిక నీతినీ, వ్యవస్థలనూ తిరస్కరించ నక్కరలేదు। ఆస్తికవాదులు నీతినీ, వ్యవస్థలనూ ఫలానా విధంగానే నిలబెట్టే మార్గమూ లేదు। దైవభీతి పోగానే మనస్సుకి కళ్ళెం వదలి, నీతిమార్గం తప్పి ఏ డొంకలోనో మనిషి పడతాడనే అభిప్రాయం కూడా అర్థశతాబ్ది పూర్వం నాటిదే. అన్ని రంగాలలోనూ అథారిటీ అనేది తలక్రిందులు అవుతున్నప్పుడు వ్యక్తీ, సమాజమూ కొత్త ప్రమాణాల వైపూ, విలువల వైపూ మొగ్గుచూపుతూ అన్వేషణ సాగిస్తున్నప్పుడు, స్వేచ్ఛా ప్రేమ సిద్ధాంతాతం లాంటి అతివాద ధోరణులు పొడసూపి మాయం కావడం సహజమే. ఆ అతివాద ధోరణులను కాదనటానికి, మార్పునే కాదనబోవడం గడియారాన్ని వెనక్కి తిప్పే ప్రయత్నమే

అవుతుంది ! ఈ నవలలో విశిష్టత ఉన్నదంటే ఒక చరిత్రాత్మకమైన నవలగానే ఉన్నది తప్ప, తాత్త్వికమైన నవలగా సామాజికమైన నవలగా మాత్రం కాదు ! (ఆంధ్రప్రభ వారపత్రిక 9-2-77) ❋

# దాంపత్యం

— వేదాంతం సుబ్రహ్మణ్యం

ఈ నవల ఇతివృత్తం దాంపత్యజీవితంలో ఎదురయ్యే సమస్యలు, రకరకాల దాంపత్యాలనుగూర్చి చర్చించేందుకు అనువుగా నవలా నిర్మాణం కొత్త పద్ధతిలో సాగింది. ఎత్తుగడ రాజా అనే వ్యక్తి రాణీ అనే యువతిని పెళ్ళి చేసుకోవాలనుకుంటూ దాంపత్యంలో ఎదురయ్యే సమస్యల విషయమై ఆమెకు వ్రాసిన ఉత్తరాలు. ఉత్తరాలలో తొమ్మిది దాంపత్యగాథలు చర్చకు వస్తాయి. రాజా రచయిత కావడంవల్ల, అతను సన్నిహితుల జీవితాల్ని జాగ్రత్తగా గమనించడంవల్ల, ఇలా తను ప్రేమించిన రాణీకి, తుది నిర్ణయం ఆమెకే వదలివేస్తూ ఒక సుదీర్ఘ లేఖను ఈ నవల రూపంలో వ్రాసినట్లు సరిపెట్టుకోవచ్చు. రచయిత వేసిన మౌలికమైన ప్రశ్న : "మనుష్యుని జీవితధ్యేయం కాపురంలో శాంతి హార్మ్యం నిర్మించుకోవడం. దానికొరకు వివాహం చేసుకుంటాడు. సంసారం చక్కబెట్టుకుంటాడు. కాని వాటివల్ల శాంతి లభిస్తుందా ?" నవలలో చర్చించిన తొమ్మిది గాథల్లోనూ పర్యవసానం శాంతి లభించకపోవడమే ! అందుకే చివర రాజా, రాణీలు పెళ్ళి చేసుకున్నారో లేదో ఈ నవలద్వారా మనకు తెలియదు.

మొదటి కథ స్వప్న అనే అమ్మాయి చిత్రకారిణి–అరుణ్, ప్రతాప్ అనే యువకుల్లో ఎవర్ని చేసుకోవాలో తేలక గోపాల్ అనే యువకుణ్ణి

చేసుకుని వాళ్ళ కుటుంబ పద్ధతుల్లో, ఆచారాల్లో ఇమడలేకపోవటం. కలల్లో జీవించే స్వప్నకు — "ఒక చిత్రంపైన మరోచిత్రం ఏదీ స్పష్టంగా లేదు కాని అవన్నీ ఫ్రేముమీద వాటి చిహ్నాల్ని వదలిపెట్టిపోయినాయి.... స్వప్నాలన్నీ ఒకదానికొకటి పేనుకొనిపోయి గట్టి పలుపులా పెనవేసుకున్నాయి." ఫలితం వాస్తవికతతో సంబంధం తెగిపోవడం. ఆమెను మానసిక చికిత్సకు తీసుకువెడదామంటారు. కలకూ, వాస్తవానికీ గల తేడా తెచ్చిపెట్టే సమస్య తీవ్రమైతే ఇలా ఉంటుంది.

రెండవ కథ మీనాక్షీ-పీటరుల దాంపత్యం. ఇది అంతర్జాతీయ వివాహం. భిన్న సంస్కృతుల కలయికే అయినా 'ప్రేమవాత్సల్యం, సానుభూతి' ఉంటే ఆ దాంపత్యం, 'స్థాన, కాల, పాత్రలతో' సంబంధం లేకుండా సుఖప్రదమౌతుందని మీనాక్షి తాత తీర్పు ఇస్తాడు. ప్రేమను గుణప్రేమ, దైహికప్రేమ, రూపప్రేమ అంటూ విభజిస్తే, గుణప్రేమ దాంపత్యానికి నిలకడ నిస్తుందట। మూడో కథ 'కమలక్కయ్య కథ'లో కమలను ప్రేమించిన సుందరం కళారాధకుడు, సంగీతవేత్త. సంగీతమూ, భార్యా....ఈ సపత్నుల సంఘర్షణలో ఒక పత్నిని — అంటే సంగీతాన్ని త్యజించాను అంటాడు సుందరం. మొదటి కథలో స్వప్న చెయ్యలేని పని సుందరం చెయ్యగలిగాడంటే కమల వ్యక్తిత్వంపట్ల అతనికున్న ప్రేమాదరణలే కారణం.

నాలుగోది మూర్తి దంపతుల కథ. మూర్తి ఇంగ్లండు వెళ్ళి వెరా అనే ఆంగ్ల యువతిని - సౌందర్యవతిని - వివాహం చేసుకున్నాడు. దేశం వదలివెళ్ళి ఇరవైఏళ్ళయినా మూర్తికి స్వదేశంపట్ల మమకారం చావలేదు. ఇది గ్రహించిన వెరా, మూర్తికి తిరిగివెళ్ళే స్వేచ్ఛనిచ్చే ఉద్దేశంతో కొంత వైముఖ్యం నటిస్తుంది. ఆమె జీవితం తనవల్ల పాడైపోయిందని అనుకుని ఆమెకు స్వేచ్ఛనిచ్చే ఉద్దేశంతో మూర్తి - బాటిల్‌ని వరించి....

చవక అమ్మాయిలతో తిరగటం - ప్రారంభిస్తాడు. ఫలితం విడాకులు. విడాకులిచ్చుకున్నా వాళ్ళల్లో ఒకరిమీద ఒకరికి గౌరవం, ప్రేమ తగ్గక పోవటం ఆశ్చర్యం అంటారు రచయిత. "బయట చర్మం డాగుపడినప్పటికీ లోపల పండు పాడుకాకుండా తాజాగా ఉంది" అంటూ ఒక సన్నివేశంతో ఈ కథ ముగుస్తాడు. ఒకరికోసం ఒకరు త్యాగం చేసిన కథ ఇది.

అయిదో కథ రామం మావయ్య, ఆయన భార్య స్వాతి దాంపత్యం. పెళ్ళి తరవాత స్వాతి వేరుకాపురం పెట్టిస్తుంది. రామం ఆమె సౌందర్యానికి దాసుడు. కాని వేరుకాపురంలో ఒంటరితనం అనుభవించే స్వాతి, నిత్యానందం అనే ట్యూషన్ మాస్టరుతో సంబంధం పెంచుకుని, అతనితో లేచిపోతుంది. అప్పటికి బాధగానే తోచినా, ఈ పర్యవసానం రామం విషయంలో సుఖప్రదమే అయింది. ఏమంటే అతనికి దాస్యవిముక్తి లభించింది. ఇది పొసగని వ్యక్తిత్వాల ఉదంతం. ఆరో కథలో శంకరం దాంపత్యంకూడా మూడో వ్యక్తి ప్రవేశంతో ఇంచుమించు రామం కథలాగే నడుస్తుంది కాని పర్యవసానం వేరు. ఈ మూడో వ్యక్తి అంకుల్ ఫ్రాంక్ శంకరం దంపతులిద్దరితోనూ, వాళ్ళ కొడుకుతోనూకూడా అనుబంధం పెంచుకుంటాడు. చివరకు శంకరం సంసారంలో అతను భాగస్వామిఅయి స్థిరపడతాడు. "బాగా ఉందోలేదో నాకు తెలీదుకాని దీన్ని మించి ఉపాయమేమిటి?" అంటాడు శంకరం.

ఏడో కథలో సుభద్ర అనే వితంతువును ఠాకూర్ ప్రసాద్ ద్వితీయం చేసుకుంటాడు. ఠాకూర్ ప్రసాద్‌కి ఒక కొడుకు. వాణ్ని సొంతబిడ్డలాగే చూస్తుంది సుభద్ర. కాని ఆమెకు స్వయంగా సంతానం కలగటంతో బంధువుల మాటలవల్ల ఠాకూర్‌కి, అతని కొడుక్కీ సుభద్రపట్ల అనుమానాలు ఏర్పడతవి. సుభద్ర చూపే అభిమానంమీదే ఈ అనుమానం. క్రమంగా సుభద్ర సంఘసేవలో కాలం గడుపుతూ, పిల్లలూ, భర్తా అని

పట్టించుకోకపోవడంతో, అనుమానాలు నివృత్తమై, చివరకు పిల్లలు ఎదిగి వేరుపడతారు. ఇందులో సుభద్ర చేసిన త్యాగంవల్ల సంసారంలో ఆమె పొందదలచిన తృప్తి ఆమెకు దక్కలేదు. ఎనిమిదో కథలో శరత్ రాయ్ దంపతులకు పట్టిన ఐశ్వర్యం వాళ్ళని వేరుచేస్తుంది. అది పోవడంతో మళ్ళీ వాళ్ళు ఇద్దరూ ఒకటవుతారు. తొమ్మిదో కథలో తాగుబోతైన భర్తవల్ల పిల్లలు చదువూ సంధ్యా శిక్షణా లేక పెరుగుతూఉంటే, తిండికి కరువైన పరిస్థితిలో, పెద్దపిల్ల చిట్టితల్లిపట్ల చూపిన ప్రేమ - తత్ఫలితంగా చిట్టి దుర్మరణంపాలవడం ఒక కరుణామయగాథ. ఇన్ని దాంపత్యాలుచూశాక ప్రేమికులు వివాహం చేసుకోవాలా, వద్దా? నేర్చుకోవలసిన పాఠమేమిటి? అనే ప్రశ్నలతో ముగుస్తుం దీ పుస్తకం. ఇది ఒక బెంగాలీ మాతృకకి అనుసరణ అన్నారు రచయిత.

(ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక 23-3-77) ❋

# సుశీల

— నిడమర్తి సత్యనారాయణమూర్తి

ఈ నవల 1927 లో వ్రాయబడి అముద్రితంగానే ఉండిపోయి, ఈ ఏడాది ఫిబ్రవరిలో మొదటిసారిగా వెలుగుచూచింది. కథావస్తువులో, నిర్మాణములో, చిలకమర్తివారి సాంఘిక నవలల వరవడి ఈ నవలలో కనిపిస్తుంది. యాభై ఏళ్ళనాటి రాజమహేంద్రవరం, వీరేశలింగంపంతులుగారి సంస్కరణోద్యమం, దాని తాలూకు ప్రభావం అభివర్ణించే యీ నవల మనకు ఒకవిధంగా ఆసక్తి కలిగిస్తుంది - సంఘ పరిణామందృష్ట్యా

నాటి స్థితిగతుల్నీ నేటి స్థితిగతుల్నీ పోల్చిచూచుకోవచ్చు. ప్రకాశకులుకూడా ఈ లక్ష్యాన్నే సూచించారు.

వితంతువులకు చదువు చెప్పించడం, పునర్వివాహాలు జరిపించడం : వీరేశలింగంపంతులుగారి సంస్కరణం ఒక ఎత్తు, తత్ఫలితంగా ఏర్పడిన వ్యక్తిగతమైన, ఆర్థికమైన, నైతికమైన సమస్యలు మరొక ఎత్తు. ఒక సంస్కరణం తలపెట్టడంతో స్పష్టంగా కనిపించే, ఒక దురన్యాయాన్ని రూపుమాపడమే అవుతుంది కాని తద్ద్వారా ఉత్పన్నమయ్యే క్లిష్టసమస్యలు ఎన్నో మళ్ళీ ఉంటాయి: ఈ సమస్యల్లో కొన్ని పంతులుగారి వృద్ధాప్యంలో ఆయన దృష్టికి రావడం, ఆయన సహజధోరణిలో, నిస్స్వార్థంతో ఆయా వ్యక్తులకు పరిష్కారమార్గం చూపిస్తూ వారి శ్రేయస్సుకోసం శ్రమిస్తూ అందరికీ మాన్యులుగా ఉండటం ఈ నవలలో కనిపిస్తుంది. ఇక్కడ కథావస్తువు ప్రధానంగా పంతులుగారి సంస్కరణోద్యమంకాదు; సంస్కరణ ఫలితంగా ఉత్పన్నమౌతున్న నూతన సమస్యలు. ఈ సమస్యలన్నింటికీ పంతులుగారే పరిష్కారమార్గం చూపించి ఉండవలెననుకోవడం లేక వారి సంస్కరణనే మనం తప్పుపట్టడం కేవలం అవివేకం. ఈ పరిస్థితిని - అనగా వీరేశలింగంగారి ఉద్యమ సాఫల్యదశను, వాస్తవికంగా, దాని తాలూకు పరిణామాన్ని గుర్తిస్తూ అభివర్ణించడమే ఈ నవల సుగుణం.

కథలో ఆనాడు సంస్కరణ వివాహం చేసుకున్న రెండు జంటలు; రత్తమ్మ, వెంకట్రావు; కనకమ్మ, నారాయణరావు. రత్తమ్మ చిన్నతనం నుంచీ లేమిలో పెరిగి, పంతులుగారి సమాజంలో పనిచేస్తూ లౌక్యం నేర్చుకుని సర్వతంత్ర స్వతంత్రురాలైన వ్యక్తి: వెంకట్రావు అనే చిన్న ఉద్యోగిని సంస్కరణ వివాహం చేసుకున్నా, సంఘంలో ప్రముఖవ్యక్తిగా తిరగాలని రత్తమ్మ ఉబలాటం. రత్తమ్మ తన కొమార్తె రామాబాయిని ప్రోత్సహించి, కాలేజీలో చదువుతున్న రామయ్య అను యువకుణ్ని ఆక

ర్షించి రామాబాయితో అతనికి చనువు కల్పించి, అతణ్ని నైతికంగా బాధ్యుణ్ని చేసి, రామాబాయిని అతనికి కట్టబెడుతుంది. రామాబాయి తల్లి పెంపకము ఫలితంగా స్వతంత్ర ప్రవృత్తి కల వ్యక్తి. చదువుమీదకంటె సరదాలమీద ఆసక్తి హెచ్చు. పెళ్ళి తర్వాత రామయ్య ఉపాధ్యాయవృత్తి చేసి సంపాదించి చదివిస్తూవుంటే రామాబాయి హాయిగా కాలేజికి వెళ్ళి వస్తూ బి. ఏ. పరీక్ష ఫెయిల్ అవుతుంది. ఆమెకు అంతటితో సరదా తీరి నట్టులేదు. ఒకనాడు భర్త స్నేహితుడైన పాపారావుమీద 'ఆసక్తి' చూపి స్తుంది. పాపారావు ఆమెకు బుద్ధులు చెప్పి మనస్సు మారుస్తాడు. స్త్రీ స్వాతంత్ర్యము, స్త్రీ విద్య, వైయక్తిక ప్రవృత్తినిబట్టి మంచి ఫలితాల్నీ, చెడ్డఫలితాల్నీ యిస్తూ క్రొత్త సమస్యల్ని సృష్టిస్తాయనడానికి యిది గుర్తు. రామయ్య రామాబాయిని 'ప్రేమించి' పెళ్ళి చేసుకున్నాడనడానికీ వీల్లేదు; అలా కాదనడానికీ వీల్లేదు. 'ప్రేమ' అనే ఆదర్శం రత్తమ్మవంటి వాళ్ళ చేతుల్లో అప్పటికే ఒక 'లౌక్యం'గా, కట్నం యివ్వలేని పెళ్ళికి 'సాధనం'గా తయారైపోయింది। 1927 లో నవల వ్రాస్తూ ఈ విషయాన్ని చక్కగా చిత్రించినందుకు రచయిత అభినందనీయుడు. రామయ్యలో, పాపారావులో 'చదువుకున్నవాళ్ళమ'నే ఆత్మాభిమానమూ, తద్ద్వారా వారిలో కనిపించే నైతికదార్ఢ్యమూ, (Moral Strength) మనకు కాస్త వింతగానైనా కనిపించవచ్చు। కారణం 'చదువు' బాగా విస్తరించడంద్వారా నేడు దాని విశిష్టతాపోయింది, దానినుంచి కలిగే నైతికమైన పుష్టి ఏమీ ఎక్కడా కనిపించటంలేదు।

కనకమ్మ బాలవితంతువు కాదు, కట్టు తప్పిన పిల్ల. ఆనందరావు అను యువకునిచే మోసగింపబడి తనకు కలిగిన కొమార్తెను అక్కగారికి అప్పగించి, తదుపరి నారాయణరావును సంస్కరణ వివాహం చేసుకొన్న దామె ఆమెలో సుగుణం - ఆమె తన చరిత్రను నారాయణరావుకు చెప్పడం। అంతకంటె ముఖ్యం ఆమె అదృష్టం - నారాయణరావు పెద్ద

మనసుతో ఆమెను ఆదరించడం, ప్రేమించడం, గౌరవించడం! ఆ కనకమ్మ కొమార్తె సుశీల. సుశీలతో కనకమ్మ అక్కగారు పేదరికంలో శ్రీరాములు అనే న్యాయవాది యిల్లు చేరుతుంది. ఆ దంపతులకు పిల్లలు లేక వాళ్ళు సుశీలమీద మమకారం పెంచుకోవడం, సుశీలను పెంచి పెద్ద దాన్ని చేసి చదువు చెప్పించడం, చిట్టచివర సుశీల కనకమ్మను తన తల్లిగా తెలుసుకోవడం - ఊహించడానికీ కథలో సుఖంగా చదువుకోవ డానికీ బాగుండే విషయాలు; వాస్తవికత అంత సుఖప్రదంగా ఉండదు మరి, కనీసం చాలమంది అనాథబాలికలపట్ల!

పై రెండు కుటుంబాలకూ లంకె 'విలన్' ఆనందరావు. ఆనందరావు సుశీలకే కాదు తండ్రి! పుల్లమ్మ (ఈమె పేరు తర్వాత సుబ్బమ్మగా పేర్కొనబడింది నవలలో, బహుశా పొరపాటు కావచ్చు) అనే మరొక కన్యను ఆనందరావు చేరదీసి అన్యాయం చేసిఉండడం మూలంగా, అతను రామయ్యకు (రత్తమ్మ అల్లుడు) కూడా తండ్రి! ఇలా చల్లగా పితృత్వం వహించి బాధ్యతలకు దూరమై, 'సన్న్యాసం' స్వీకరించి, రామానంద స్వామిగా, సంఘంలో సదాచారం సంరక్షించే సనాతనుడిగా వీరేశలింగం గారికి తరచు అడ్డు తగుల్తూ వుంటాడు ఆనందరావు. నవలలో చివర కనకమ్మకూ అతనికీ జరిగిన సంవాదంలో పాత్రపోషణ, ఔచిత్యం చక్కగా పాటించబడ్డాయి. అంతేకాదు ఆ సంఘటనలో, కనకమ్మ సాహసమూ ఆనందరావు కర్కశత్వమూ ఢీకొని కనకమ్మ విజేత కావడం ఆనాడు సంస్కరణకూ సంప్రదాయానికీ ఏర్పడిన ఘర్షణలోని పరమార్థమేమిటో (మానవత్వానికీ దురన్యాయానికీ ఘర్షణ) దాన్ని నాటకీయంగా వ్యక్తం చెయ్యడం జరిగింది. ఇది నవలలో పతాక సన్నివేశం అనడంలో సందేహం లేదు! ఈ ఘర్షణ నేటికీ ఉన్నదే!

వీరేశలింగంగారి పేర హైస్కూలు స్థాపించబడటం, సంఘంలో విద్యాభిమానం పెరుగుతూవుండటం, విద్య అంటే సంస్కారానికీ సత్ప్రవర్తనకూ మొదటిమెట్టు అన్న విశ్వాసం నెలకొనివుండటం, నవలలో మనం గమనించే మరొక విషయం. కాని ఆనాడుకూడా యువవిద్యార్థులు ఆడపిల్లలను ఏడిపించడం, వీలుచూచుకొని వాళ్ళమీద అత్యాచారం చెయ్యడం ఉండేదని ఈ నవలలో ఒకానొక సన్నివేశంద్వారా తెలుస్తుంది. పోనీ ఆనాడు స్త్రీవిద్య ఒక వింతగా కనిపించడమే అందుకు కారణమని సరిపెట్టుకోవాలన్నా, ఈనాటికీ పరిస్థితిలో మార్పు కనిపించడంలేదు! ఇలాంటి సమస్యల్ని కేవలం విద్యాసంస్థల్లో క్రమశిక్షణకు సంబంధించిన సమస్యలుగా పరిగణించడానికి వీల్లేదు. వీరేశలింగంగారివంటి ఉపాధ్యాయుడూ, ఆదర్శప్రాయుడూ శిష్యులతో అక్కడ ఉండగానే ఒకానొక విద్యార్థి ఒక బాలికమీద అత్యాచారంచేసి, పైగా "ఇవన్నీ మీ కెందుకండీ? దోవన పోయేవారు పోక? పొరబాటున చేయి తగిలితే దానికేం తంటా యేమిటి? ఇరుకుసందు. అందులో చీకటి" అంటూ దబాయిస్తాడు! (పుటలు 255 - 256) ఇది ఆనాటినుంచీ ఈనాటివరకూ సమస్యగానే ఉన్నదంటే, ఇలాంటివి జాతిలక్షణాలనీ, కేవలం ఉపాధ్యాయులమీదా విద్యావిధానంమీదా నెపంపెడితే పోయేవికావనీ అర్థమవుతుంది!

ఈ నవలలో సంభాషణలు సహజ వ్యావహారికంలో సజీవంగా ఉన్నాయి. కథాకథనానికి ఉపయోగించిన భాష ఆనాటి నవలల్లో వాడబడిన సరళ గ్రాంథికం. (భారతి)

# లాడ్జింగులో ఒక రాత్రి

— కొసరాజు శేషయ్య

'లాడ్జింగు'ల పేర చలామణీ అవుతున్న వ్యభిచారగృహాలు కొన్ని పట్టణాల్లో పెద్దఎత్తున వ్యాపారసరళిలో అభివృద్ధికావడానికి దోహద మౌతున్న ఆర్థిక, రాజకీయ, సాంఘిక పరిస్థితులను విశ్లేషణాత్మకంగా అభివర్ణించే ఈ నవల ప్రధానంగా సంఘసంస్కరణోద్దేశంతో వ్రాయ బడింది. ఇందులో కథానాయకుడు మోహనరావుద్వారా ఒక 'లాడ్జింగు' వ్యవహారం బయటపడి, పోలీసులదాకా వెళ్ళి ఆ 'లాడ్జింగు' రద్దుకావడం, అందులోని స్త్రీ పురుషులకు మరోవిధమైన బ్రతుకుదెరువు ఏర్పడడం కథ. మోహనరావుని 'లాడ్జింగు'కి తీసుకువెళ్ళిన రిక్షావాలా నాగేశ్వరరావు, చదువుకున్న యువకుడు, నిరుద్యోగి. అక్కడ మోహనరావుకి తారసిల్లిన స్త్రీలు కనకం, అతను చిన్నతనంలోనే ఎరిగున్న కరణంగారి కూతురు. తార అతని ప్రాణస్నేహితుడు కోరి వివాహమాడిన నవవధువు। ఈ యిద్దరి స్త్రీలనూ ఆ నరకకూపంలోనుంచీ తప్పించేందుకు మోహనరావు ప్రయత్నించి నెగ్గుతాడు. మోహనరావు డబ్బూ, పలుకుబడీ రెండూ ఉపయోగించడంవల్లె కాదు, పోలీసుశాఖలో అదృష్టవశాత్తూ మోహనరావు బంధువు సూపరింటెండెంట్‌గా ఉండటంవల్ల కూడా వెంటనే కార్యసాధన వీలైంది. అప్పటికీ దోషులైన వ్యక్తులు దొరకకుండా పారిపోయారు. ఇదీ నేటి వాస్తవికమైన పరిపాలనా పరిస్థితి। 'లాడ్జింగు'నీ నడిపిన వ్యక్తులకంటె 'లాడ్జింగు'కి మద్దతు కల్పించే కొందరు లాయర్లు, లాయరు గుమాస్తాలు, వ్యాపారస్తులు, ధనికులు, యింకా ఎందరో స్త్రీ పురుషులూ, సంఘంలోని ఈ రకం మురికికూపాలకు బాధ్యులు. అంటే సంఘంలో పరివర్తన రావాలి, సంస్కారం పెరగాలి. ఇక్కడ రచయిత ఉద్దేశం:

స్త్రీ పురుషులందరూ సీతారాముల ఆదర్శాన్ని తు. చ. తప్పకుండా అనుసరించే ఒకానొక స్వాప్నిక సమాజం (Utopian Society) అవతరించాలని కాదు. ఏ యుగంలోనైనా 'సెక్స్'కు సంబంధించిన స్వేచ్ఛాప్రవర్తన, నీతిసూత్ర వ్యతిక్రమణ వ్యక్తుల్లో కొద్దిగానో గొప్పగానో ఉంటూ వస్తున్నదే. అది మానవ ప్రకృతికి లక్షణం. అలాకాక సంఘంలోని కొన్ని శక్తుల్ని - డబ్బు, అధికారము, పలుకుబడివంటి శక్తుల్ని - కూడగట్టుకుని వ్యక్తుల జీవితాన్ని నాశనం చెయ్యడానికీ, కలుషితం చెయ్యడానికీ వ్యాపార సంస్థలు ఏర్పాటుచెయ్యడం మానవుని దుష్టస్వభావానికి లక్షణం. ఇది సహింపరానిది. ఈ రచయిత పాశ్చాత్యదేశాలలోని క్లబ్బులు వగైరాలతో ఈ 'లాడ్జింగు'లని పోల్చి రెండింటికీగల భేదాన్ని వివరిస్తూ నవలలో, యిలా వ్రాశారు: "ఉభయులకూ ఇష్టమైతే వాళ్ళు లాడ్జింగులకు పోయినా, క్లబ్బులకు పోయినా వారిని మనము అనవలసిన పనిలేదు. కాని అమాయిక యువతులను, స్త్రీలను బలాత్కారముగా యీడ్చుకుపోయి వ్యభిచారానికి వినియోగించుకుంటున్నారండీ. ఈ విషయమే తమ దృష్టికి తీసుకురావాలని నా అభిప్రాయం." రచయిత దృష్టి యిలా సహనంతో కూడుకున్నదీ, విశాలమైనదీ (Liberal), వాస్తవికమైనదీ కావటంవల్లే ఈ నవలలో మోహనరావు, తార - అందరూ మన సానుభూతిని పొందేలా వారివారి సహజ స్వభావాలతో రూపొందటం జరిగింది. కథ శుభాంతం అయింది.

"తప్పు చేయడం మానవనైజం అన్నారు పెద్దలు. తెలిసో తెలియకో ఏ వ్యక్తి అయినా ఒక పొరపాటు చేస్తే దాన్నే ఆధారంగా తీసుకుని ఆ వ్యక్తియొక్క నైతిక విలువలను అంచనా వేయడం సరియైన పద్ధతి కాదేమో అనుకుంటాను." ఈ ప్రబోధంతో కథానాయకుడు మోహనరావు, కనకం నాగేశ్వరరావులకు వివాహం కుదిర్చి, తారను ఆమె భర్త స్వీకరించేటట్లు చేసి, వారి జీవితాల్ని పునరుద్ధరిస్తాడు. క్షమ

అనేది లేకపోతే సంఘసంస్కరణం సాధ్యంకాదు. సంఘ పురోగతి, మానవజీవితంలో సుఖశాంతులూ, మనుష్యుల్లో క్షమ, ఔదార్యం పెరగడం మీదే ఆధారపడతాయి. సంఘ జీవనంలో నైతిక కర్కశత్వం ఆత్మపరంగా కాక, యితరులమీద కేంద్రీకరింపబడుతూ ఉండటమే సంఘంలో ఎప్పటి కప్పుడు తెట్టెలు కట్టే కశ్మలానికి మూలం. దాన్ని క్షాళనం చేసే ఉద్దేశంతో వ్రాయబడిన ఈ నవలలో మానవతాదృక్పథం ప్రధానం కావడం ఎంతో సముచితంగా ఉంది. ఈ నవలకు సాహిత్యంలో పెద్దగణన లేక పోవచ్చు, సాంఘికంగా చక్కని ప్రయోజనం ఉన్నది. (భారతి)

# మిసెస్ పరాంకుశం అద్దెకిచ్చిన హృదయాలు

— మల్లాది వేంకట కృష్ణమూర్తి

"సౌదామినిని నాకు పన్నెండు - పధ్నాలుగేళ్ళప్పుడు చూశాను విజయవాడలో.... అనేకమంది వేశ్యల్లాగే సౌదామినికూడా పడుపువృత్తి లోకి బలవంతంగా తేబడింది. ఈ నవలలో వాళ్ళనా స్థితికి దిగజార్చిన పరిస్థితుల గురించి వ్రాయలేదు. అక్కడ జరిగే ఘోరాల గురించి వ్రాయ లేదు. పది రూపాయలు సంపాదిస్తే మూడు రూపాయలే మిగుల్తాయన్న విషయాలలాంటివి రాయలేదు.... నేను చూడని హీరోని సృష్టించి సౌదామిని లాంటి వాళ్ళని ఏవిధంగా సంస్కరించి, 'మనలాంటి మనుషులు'గా తీర్చిదిద్దవచ్చో రాశాను" అంటూ రచయిత 'మిసెస్ పరాంకుశం'లోని ఇతి వృత్తాన్ని గూర్చి ముందుమాటగా చెప్పుకున్నారు. ఇందులో పరాంకుశం

స్టెనో ఉద్యోగం చేస్తున్న పెళ్ళి కావలసినవాడు, తనని పెళ్ళి చేసుకోవ డానికిష్టపడే పక్కింటి అమ్మాయిని కాదని, సౌదామిని అనే వేశ్యని సంస్క రించి మనిషిని చెయ్యాలనే ఉద్దేశంతో పూనుకొని పెళ్ళి చేసుకుంటాడు. ఈ ప్రయత్నంలో సౌదామినిని సంసారిగా మార్చే ట్రెయినింగు ఇవ్వడానికి పరాంకుశం అక్కయ్య ఎంతో సహనంతో, ఔదార్యంతో, ఆరు నెలల పాటు తన సంసారం వదిలివచ్చి, తమ్ముడితో సహకరించి సహాయం చేస్తుంది. అట్లానే పరాంకుశం మిత్రుడు శ్రీకంఠం, ఒక సబ్-ఇన్స్పెక్టర్ ఆఫ్ పోలీస్, మారల్ హైజిన్ స్పెషలిస్టు నాయుడుగారు - అందరూ సహకారం అందజేస్తారు. సౌదామిని పతివ్రత అవుతుంది. పరాంకుశం ఆమె శీలానికి పెట్టిన పరీక్షలోకూడా నెగ్గుతుంది. ఇదీ కథ. ఇందులో పరాంకుశం, అతని అక్కయ్య - వీళ్ళ మన స్తత్వాలను గూర్చి ఎటువంటి వివరణా లేదు. వాళ్ళెందుకీ మంచిపని తలపెట్టారంటే, ఇది మంచిపని కాబట్టి అని మాత్రమే సమాధానం! పోతే రచయిత సిద్ధాంతం - వేశ్య సంఘం చేసిన మనిషి; అలాగే పతివ్రతకూడా సంఘం చెయ్యగలిగిన మనిషి. కాబట్టి సంఘంలో మనం, అంటే పరాంకుశంలాంటి వాళ్ళు వేశ్యలని పతివ్రతల్ని చెయ్యవచ్చు, చెయ్యాలి అనేది. ఇక్కడ 'వేశ్య' అంటే కేవలం బలవంతంవల్ల వేశ్యగా జీవిస్తూ, ఇల్లాలిగా జీవించాలని అవకాశంకోసం చూచే నిస్సహాయ స్త్రీ కాదట. 'వేశ్య' అంటే సౌదామిని లాగ 'మనసా, వాచా, కర్మణ నిజమయిన వేశ్య' అని రచయిత గట్టి ఉద్దేశం (పుట - 68). మనసా, వాచా, కర్మణ నిజమైన వేశ్య సంఘం చేసిన మనిషి మాత్రమేనా? అనేది ఒక పెద్దప్రశ్న. 'మనసా, వాచా, కర్మణ' మనమంతా మనంగా సంఘంవల్లనే రూపొందినట్లయితే ఆ సంఘాన్నీ, వ్యవస్థనీ మార్చడం కేవలం పరాంకుశంవంటి వ్యక్తులద్వారా ఏమౌతుందీ? సౌదామినికంటె సులువుగా, మనసా వాచా మార్పు కోరుతూ ఉండే అభాగ్యురాండ్రైన వేశ్యలని కాదని, సంస్కరణ పొదా

మినిలాంటి వాళ్ళతో ఎందుకు ప్రారంభం కావాలి? ఈ ప్రశ్నలకు రచయితనుంచీ సమాధానం లేదు। తీరా చూస్తే రచయిత చిత్రించిన సౌదామిని పాత్రలో 'మనసా, వాచా' వేశ్యగా ఉండాలనే ప్రవృత్తి ఏమీ కనిపించదు। మనసా, వాచా, కర్మా ఒకలా ఉండటమంటే ఏమిటో రచయిత అవగాహనకు అందినట్లూ లేదు। రచయిత ఉద్దేశంలో మంచి ఎలా ఉన్నా, అది మాత్రమే చాలదు మంచి రచన చెయ్యటానికి.

'అద్దెకిచ్చిన హృదయాలు' ఒక తియ్యటి పగటి కల. కాలేజీ విద్యార్థులూ, బ్రహ్మచారి యువకులూ అద్దెగదుల్లో కాలక్షేపం చేసే ఏకాకులకు, కాలక్షేపం బఠాణీవంటిది ఈ నవలిక. ఒక్కసారిగా ఆరుగురు అమ్మాయిలనుంచీ తీయని తొలివలపు పొందగలిగితే ఎలా ఉంటుందీ? ఒక ఊహ, ఒక కల. కాని ఆరుగురిలో ఒకరినైనా గట్టిగా ఎన్నుకోలేని యువకుని మనస్తత్వంలో ఉన్న మెలిక ఏమిటి? అటువంటి నిలదీసే ప్రశ్నకు సమాధానం లేదు। ఆరుగురినుంచీ ఎలా తప్పించుకోవాలి అనే సమస్యకు ఒక సైకాలజీ ప్రొఫెసర్ సలహా అడుగుతాడు హీరో అచ్యుతం. అంతకంటె తన అనిశ్చిత మనస్థితికి కారణమేమిటో సైకియాట్రిస్టుని సంప్రదిస్తే బాగుండేది. రచనద్వారా ఆత్మపరీక్ష చేసుకుని వెలుగును వెదజల్లిన రచయితలున్నారు. ఈ రచయితకింకా ఆ దారి కనిపించలేదు। కనిపించేదాకా ఈ అయోమయత్వం పోదు।

(ఆంధ్రప్రభ వారపత్రిక : 4-2-76) ❋

# ప్రేమ పల్లకీ

— శ్రీ రమణ

దాంపత్యజీవితంలోని మాధుర్యాన్ని శృంగార, హాస్యసమ్మిశ్రితంగా, సర్వజనాదరణీయంగా నిత్యానుభవంగా 'కాంతం కథల' ద్వారా శ్రీ ముని మాణిక్యం నరసింహారావుగారు చిత్రించారు క్రిందటి తరంలో. మారిన పరిస్థితుల్లో, అభిరుచుల్లో నేటి దాంపత్య జీవనంలో హిపోక్రసీని, ఆర్థిక సమస్యల్నీ రచయితలు చిత్రిస్తున్నారు తప్ప హాస్యమూ, లలిత శృంగారమూ తెలుగుకథా సాహిత్యంలో అరుదైపోయింది. రచయిత్రుల్లో ఏ ఒక్క బీనాదేవిలో తప్పితే, హాస్యం మృగ్యం. ఇలాంటి స్థితిలో శ్రీ రమణ మునిమాణిక్యం వారికి సరిక్రొత్త వారసుడుగా ఈ నవలలో దర్శనమిస్తున్నాడు. ఇందులో రాంపండు - గీత యువదంపతులు. ఇద్దరూ ఉద్యోగాలు చేస్తూ సంపాదిస్తున్న వాళ్ళు. వున్నట్టుండి రాంపండుకి తాను 'ప్రేమ పల్లకీ' ఎక్కకుండానే గృహస్థుణ్నయ్యాననీ, జీవితంలో ఏదో 'మిస్' చేశాననీ దిగులు పట్టుకుంది. ఇది కనిపెట్టిన గీత "కొన్నాళ్ళపాటు మీరూ నేనూ ఆలుమగలు కాకుండా అసలు సిసలు లవర్స్‌గా మారిపోదామంటారా?" అంటూ టిఫిన్ బాక్స్‌లో పెట్టిన లేఖద్వారా ప్రపోజ్ చేస్తుంది. నిజానికి ఈ ప్రపోజల్ గీత - రాంపండుల వ్యక్తిత్వాల ఒరవడిలో వచ్చిన ఒక వెలుగురవ్వ. దాంపత్య మధురానుభూతి అన్వేషించిన ఎన్నో పోకడల్లో ఒక పోకడే తప్ప. కృత్రిమ ప్రక్రియ ఏమీ కాదు. అందుకే అది రాణించింది. ఈ దంపతుల మధ్యగల ప్రేమానుబంధ చిత్రీకరణకు వైశిష్ట్యాన్ని కలిగించటానికి సమాంతరంగా చిత్రించిన జంట హేమ - మూర్తి. నవజీవనానికీ, దాంపత్య సుఖాసుఖాలకీ డబ్బు ఎంతమేరకు అవసరమో, కాదో ఈ తారతమ్య చిత్రణ నిరూపిస్తుంది.

హేమ - మూర్తి జంట గీత - రాంపండులను ఎక్స్ప్లాయిట్ చేసినా, డబ్బు చిక్కుల్లో పెట్టినా, చివరకు తీసుకున్న డబ్బు ఎగవేసినా, వాళ్ళు పెద్దగా బావుకున్నదీ లేదు, వీళ్ళు పోగొట్టుకున్నదీ లేదు. కాని అలాంటి సందర్భాల్లో నష్టపోకుండా భవిష్యత్తులో రాంపండు జాగ్రత్తపడే అనుభవం మాత్రం సంపాదించాడు. గీతకు మొదటినుంచీ వాళ్ళ వైనం తెలిసినా, భర్త తనకు తాను తెలుసుకునేదాకా సహనంతో వేచి చూడగలిగింది. జీవితం అలవోకగా సరదాగా సాగిపోతున్నట్లు సాంతం చిత్రించినా గీత వ్యక్తిత్వంలోని బలం, రాంపండు వ్యక్తిత్వంలోని ఆర్ద్రత, ఇద్దరిలోనూ గల లోకాన్ని స్నేహంతో, ఔదార్యంతో ఆహ్వానించే ప్రవృత్తి వాళ్ళని ఆకర్షణీయమైన జంటగా మన ఎదుట నిలుపుతున్నవి. పెళ్ళి తర్వాత ప్రేమే ఉపాదేయమంటున్నదీ నవల.

[ ఆంధ్రప్రభ వారపత్రిక : 8-7-81 ]

# రాబందులూ, రామచిలుకలూ

— వాసిరెడ్డి సీతాదేవి

రాబందులు మగవాళ్ళు. రామచిలుకలు ఆడవాళ్ళు. అన్నిచోట్లా అన్ని సందర్భాల్లో కాకపోవచ్చు। కాని గ్రామసేవికగా పనిచేస్తున్న పట్టభద్రురాలు సునంద, సర్పంచ్‌లందరూ కొలువుదీరిన జనరల్‌బాడీ మీటింగులో ఉద్యోగ నిర్వహణనుగూర్చి డైరీ చదువుతున్న సందర్భంలో అక్కడి సర్పంచ్‌లు రాబందుల్లానే ప్రవర్తించారు. నవలలో 30వ అధ్యాయంలో ఇది పతాక సన్నివేశం. 'ఎక్కడ పడుకున్నావ్, ఎవరితో పడు

కున్నావు' అనే ప్రశ్నలనుంచీ, 'కావాలంటే నెత్తినెక్కించుకోండి' అని ఒకడంటే, 'ఏమిటయ్యా ఎక్కడాలూ, ఎక్కించుకోవడాలూ' అని సమితి ప్రెసిడెంటు అంటే, మిగతావాళ్ళు 'ఘొల్లున నవ్వితే', కౌరవసభలో ద్రౌపదినిగూర్చి రచయిత్రి చెప్పకపూర్వమే పాఠకులకు ఆ సామ్యం స్ఫురిస్తుంది : "కళ్ళ ముందున్న ఇందిరాగాంధీ ఫొటో గిర్రున తిరుగుతూ కృష్ణుని చక్రంలా మారింది....నరహరి దుర్యోధనుడుగా, వీరభద్రయ్య దుశ్శాసనుడుగా కనిపించారు సునందకు." అప్పుడు శేఖర్ అనే యువకుడు "ఆగండి, ఇది కౌరవసభ కాదు !" అంటూ లేచాడు. శేఖర్ పాత్ర సృష్టిద్వారా రచయిత్రి మగవాళ్ళమీద తనకేమీ అక్కసు లేనట్లు నిరూపించుకొన్నారు. "రచయితకు కసి ఉండాల్సిందే....కాని వ్యక్తిగతమైన కసి కాదు....సాంఘిక అన్యాయాలను, అక్రమాలను చూచి రచయితలో కసి ఏర్పడాలి. తన వ్యక్తిగత జీవితానికీ, ఆ కసికీ ఎలాంటి సంబంధమూ ఉండకూడదు. అప్పుడే రచనల్లో విశ్వజనీనత... " (పుట 106) అంటూ తన దృక్పథాన్ని రచయిత్రి స్పష్టం చేశారు. అందుకు తగ్గట్టే ఉంది ఈ నవల. ధర్మయ్య అనే సాధుమూర్తి అయిన దేశసేవకుని కుమార్తె సునంద. తండ్రి సంప్రదాయంలోనే స్వతంత్రభావితంలో గ్రామసేవికగా ఉద్యోగం చేయాలనుకుంటుంది. పరిస్థితులు ఆమె నిజాయితీకి, నిర్భయత్వానికీ అనుకూలంగా లేకపోవడంతో పై పేర్కొన్న కౌరవసభా సన్నివేశంలో ఉద్యోగానికి స్వస్తి చెప్పి శేఖర్‌ను వివాహం చేసుకుంటుంది. కాని శేఖర్‌కు శకునిలాంటి మేనమామ పరమేశం ఉన్నాడు. అతని పాచిక పారడంతో సునందా, శేఖర్‌లు విడిపోతారు. అప్పుడు సునంద ఒక 'పతిత'ల శరణాలయంలో సూపరింటెండెంటుగా ప్రవేశిస్తుంది. 38, 39 అధ్యాయాలు సర్వీసెస్ హోమ్స్ స్థితిగతుల యథార్థచిత్రణ. చివరకు శేఖర్‌కి సునందమీద ఏర్పడిన అపోహ తొలగిపోతుంది. నిజం బయటపడటంతో పరమేశం వేసుకున్న పథకాలు భగ్నమవుతాయి. ఎలక్షన్‌లో

నెగ్గటానికి సర్పంచ్‌లను దాచిన పరమేశం మీదికి దాడిచేస్తుంది ప్రజా వాహిని. పరమేశం పేల్చిన తుపాకిగుండు పరమేశం కుమార్తె రాణిని చంపుతుంది. ఈ ముగింపు సినిమాటిక్‌గా ఉంది. ముగింపే కాదు - సునందకూ, శేఖర్‌కూ మధ్య కలిగిన వైమనస్యం, దాని కారణాలూకూడా అలానే ఉన్నాయి. కాని నవలలో చిత్రింపబడిన ఆడపిల్లల హాస్టళ్ళూ, మహిళా మండలులూ, పంచాయితీ సమితి రాజకీయాలూ, సర్వీస్ హోమ్స్ తీరుతెన్నులూ నేటి వాస్తవపరిస్థితుల్ని గూర్చిన పరిజ్ఞానం కలిగించి సంస్కరణా సంస్కారమూ - వ్యవస్థకూ, వ్యక్తికీ ఎంత అవసరమో చాటి చెబుతున్నాయి. చదవదగిన నవల.

(ఆంధ్రప్రభ వారపత్రిక : 24-12-75) ❋

# శ్రీమంతులు - కలకాదు సుమా!
# ఎదగని మనసులు - సుషుప్తి

(నాలుగు నవలలు)

— శ్రీమతి మాదిరెడ్డి సులోచన

జీవితాన్నీ, వర్తమాన సమాజాన్నీ పరిశీలించి వస్తుగౌరవంతో నవలా రచన చేస్తున్న రచయిత్రి శ్రీమతి మాదిరెడ్డి సులోచన. ఊహా ప్రపంచాన్నికాక, తెలుగుదేశాన్నీ, తెలుగువాళ్ళనీ చిత్రిస్తుంది. సౌందర్యం పేరుతో, సంస్కారంమీద అభినివేశంతో, విప్లవంమీద మోజుతో, రంగుల కలల్నీ, సబ్బునీటి బుడగల్నీ (సోప్ బబుల్స్) లోకం పైకి వదిలే

అలవాటు లేనీమెకు ! నవలలో వాస్తవికతా చిత్రణ పాత్రల అంతరంగ కథనంద్వారానూ జరగవచ్చు, నాటకీయ పద్ధతిద్వారానూ జరగవచ్చు. ఈ రచయిత్రది రెండవ పద్ధతి. సంభాషణలు సహజంగా సజీవంగా ఉంటాయి. అంతకంటె సంభాషణలద్వారా కథను ముందుకు సాగనీయడంలో రచయిత్రి చూపే శిల్పం మెచ్చుకోదగ్గది. చాలామంది నవలా రచయితలకు ఈ మెలకువ తెలీదు అంటే అతిశయోక్తి కాదు. సన్నివేశాల కల్పనలోకూడా ఒకదానినుంచి మరోదానికి కప్పదాటు వెయ్యడం ఎక్కడా ఉండదు ఈమె రచనలో. పోతే జీవితాన్ని కాచి వడబోసిన వివేకం, సహనం, ఇంగిత జ్ఞానం అడుగడుగునా రచయిత్రి చేసే వ్యాఖ్యానంలో స్పష్టంగా, మృదువుగా, హృదయాహ్లాదకరంగా ద్యోతకమవుతూ ఉంటాయి సాటి మానవులపట్ల సానుభూతీ, మంచితనం, ఓర్పూ, నిజాయితీ, కష్టపడి పనిచెయ్యటం.... వీటి దృష్ట్యా సంప్రదాయంమీద, పాత అలవాట్లమీద, కొత్త ధోరణులమీదకూడా యువతరం తిరుగుబాటు చెయ్యాలనే రచయిత్రి సందేశం. ఏ సమస్య తీసు కున్నా చక్కని పథకంతో, విశ్లేషణతో కథ చెప్పుకునిపోవడం కనిపి స్తుంది. శ్రీమతి సులోచన రచనలో మెరుపులూ, ఉరుములూ లేవు. చక్కని వెన్నెల ఉన్నది. అది మానవతాదృక్పథపు వెన్నెల.

'శ్రీమంతులు' నవల నడమంత్రపుసిరి తెచ్చిపెట్టే మన స్తత్వాన్నీ, దాని సహజపరిణామాన్నీ వర్ణిస్తుంది. దీనావస్థలో ఉన్న బాల్యమిత్రుడు సీతాపతిని ఆదుకుంటాడు డాక్టర్ శ్రీనాథ్. ఆర్థికంగా నిలదొక్కుకున్న తరవాత సీతాపతి డబ్బుకే ప్రాధాన్యం ఇచ్చి శ్రీనాథ్ సౌజన్యాన్నీ, దాతృ త్వాన్నీ, మంచితనాన్నీ తెలివితక్కువక్రింద జమకట్టుతాడు. సీతాపతి చిన్నకొడుకు సతీష్ ఒక విచిత్ర పరిస్థితిలో శ్రీనాథ్ కుమార్తె శైలజను పెళ్ళి చేసుకుంటాడు. శ్రీనాథ్ హరిజన యువతిని చేసుకోగా పుట్టిన అమ్మాయి శైలజ. సీతాపతికి ఈ సంబంధం ఇష్టంలేదు కాని శైలజ కోడలుగా ఇంట్లో అడుగు పెట్టే సందర్భానికి సీతాపతిలో ఒక కొత్త పరి

క్షామం వచ్చింది. డబ్బు చాలదు. హోదాకూడా కావాలి, మర్యాద కావాలి. ఎంత డబ్బైనాసరే ఖర్చుపెట్టి ఎమ్. ఎల్. ఎ. కావాలి! ఆ పరిస్థితిలో కోడల్నీ, కొడుకునీ వెళ్ళగొట్టడం మంచిది కాదనుకుంటాడు. పాత్ర పోషణలోనూ, కథలోనూ ఈ మలుపు తిప్పడంలో రచయిత్రి మంచి చాకచక్యం చూపించి పాఠకుల్ని నమ్మించారు. తరవాత సీతాపతి రాజకీయ జీవితంలో శైలజ తన తండ్రి డాక్టరుగా సంపాదించిన పలుకుబడినీ, చేసిన సేవనీ ఉపయోగించి మామగారికి విజయం చేకూర్చుతుంది. ఆర్థికంగా పతనమౌతున్న సంసారాన్ని తన శక్తియుక్తులతో నిలబెట్టుతుంది. అత్త ఆడబిడ్డలతో ఆప్యాయతగా వ్యవహరించి వారి ప్రేమాభిమానాల్ని చూరగొంటుంది. ఇదంతా సహజంగా, వాస్తవికంగా ఎలా సాధ్యమో చూపించడంలో, శైలజ పాత్ర చిత్రణలో రచయిత్రి ప్రతిభ బాగా వ్యక్తమైంది. త్యాగం, సేవ, తిరుగుబాటు అనే పదాలు వాడనవసరం లేకుండానే శైలజ వ్యక్తిత్వాన్ని ఆమె ప్రవర్తనపై విలువలకి ఆదర్శం. ఉదాత్తంగా చిత్రిస్తూ ఆధునిక మహిళ ఎలా ఉండాలో, ఎలా ఉంటే సమాజంలో, కుటుంబంలో మార్పు వస్తుందో సూచించారు. చివరకు శైలజ సీతాపతి అభిమానాన్ని సంపాదించటమే ఆమె పొందిన విజయం అంటారు రచయిత్రి! కాని అందులో ఆమెకు భ్రమ ఏమీలేదు. "చూశావా! మా నాన్నకు నువ్వంటే ఎంత గౌరవమో!" అంటాడు సతీష్. "నేనంటే కాదు, నాతోబాటు వచ్చిన సిరికి....అర్థం అయిందా!" అంటుంది శైలజ. "సీరియస్‌గా ఆలోచిస్తున్నావా, శైలూ?" లేదు. ప్రపంచంలో రకరకాల బలహీనతలను అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నాను .... ప్రాణం ఉన్న మనిషికంటే ప్రాణం లేని సిరికి ఎంత విలువ అన్న బాధే" అంటుంది నవ్వుతూ శైలజ.

'కల కాదుసుమా!' నవలలో స్త్రీజన విమోచనోద్యమ భావాలు దంపతులమధ్య, కుటుంబసభ్యులమధ్య తెచ్చిపెట్టే కలతల్నీ, విపరీత పరి

బాధల్నీ, అశాంతినీ, వివాహ విచ్ఛేదానికీ, మనస్తాపాలకు దారితీసే పరి స్థితుల్నీ చక్కగా విశ్లేషించి వివరించారు రచయిత్రి. ఇందులో విమల తీవ్రవాది. తన సంసారాన్ని చేజేతులా కూలద్రోసుకుని లెనిన్ అనే యువకునితో స్వేచ్ఛగా ఉంటుంది. ఆమెతో చివరకు ఆత్మ విమర్శ తలఎత్తుతుంది. "నెత్తురు పొంగేలా కవితలల్లే జ్వాల కన్సల్టెంట్ డాన్సర్ అయిందట. ఇదేనా తను కోరిన స్వేచ్ఛ! ఇదేనా తను కోరిన ప్రగతి!.... స్వేచ్ఛ అనగానే జ్వాలలాంటి అమ్మాయిలు లైంగికస్వేచ్ఛ అనే అను కుంటారు ... తను స్వేచ్ఛను కోరుతూ మళ్ళీ లెనిన్‌తో ఎందుకుం టూంది!.... లెనిన్ ఆలోచనలు చాలా ప్రోగ్రెసివ్‌గా ఉంటాయి. ఆచర ణలు మాత్రం ఫ్యూడలిస్టిక్‌గా ఉంటాయి. ఆచరణలేని ఆలోచనలే మనిషికి శత్రువేమో అనుకొంది విమల". విమల భావాలవల్ల ప్రభావితు రాలైన శశిరేఖ అనే కొత్తకోడలు అత్తగారిపట్ల చూపే నిరాదరణ నవ లలో రెండవ కథ. కాని శశిరేఖ భర్త రవి ఎంతో అవగాహనతో, ఓర్పుతో, సంస్కారంతో శశిరేఖ పొరపాటు ఆమెకు తెలిసివచ్చేలా కథ నడిపించి గుణపాఠం చెబుతాడు. ఇక్కడ రవి ప్రదర్శించినా, ఉచిత తంగా వ్యవహరించే శశిరేఖపట్ల అతని ధోరణీ రచయిత్రి సాధించిన మానవత్వపు ఆదర్శ చిత్రణ. మగవారిలోకాని, ఆడవారిలోకాని ఉండాల్సిన కనిపించే అవగాహన, సహనమూ, ఓర్పు ఉండాలని రచయిత్రి సూచన. "మార్పులన్నీ అంగీకరించవచ్చు. కొన్ని సున్నితమైన బంధాలున్నాయి. ఉదాహరణకు తల్లీకొడుకుల మధ్య బంధం. దానికి ఏనాడయినా ఒకే విలువ ఉంది. ఆ బంధాన్ని విడగొట్టి కామెన్స్ అమెరికాలో, ఇంగ్లం డులో ఉన్నామనుకుంటే పొరపాటే .... వాళ్ళకు (విదేశీయులకు) చాటు మాటు వ్యవహారాలు చాలా తక్కువ .... మనసు ఒక్కమాట స్వచ్ఛ చ్ఛగా మాట్లాడ్డం రాదు .... మన స్త్రీలు అటు భర్త పర్యంకాన ఉండే, ఆరాధించే పురుషుణ్ని తలపోస్తారు .... ఇంగ్లండులో తమ పని తాము

చేసుకోవటానికి సిగ్గుపడరు. ఇక్కడ మళ్ళీ ఎవరి హోదానుగూర్చి వాళ్ళు అప్రమత్తులయి ఉంటారు." "విమల ఎప్పుడో రామాయణంలో రాముడు సీతకు అన్యాయం చేశాడని, ఈనాడు భర్తమీద కసి తీర్చుకుందామను కుంది. దాన్ని నేను హర్షించను. అది ఏనాటిమాటో! ఆనాటి జీవిత విధానం అది. ఇప్పుడు దాన్ని చర్చించి సీతకు న్యాయం చేకూర్చటం సాధ్యంకాదు. రాముణ్ని నిలదీసి అడగనూలేము." "జీవితం అంటే తీయని కల అనుకుంటారు. కలలోంచి తేరుకుని, వాస్తవం ఆలోచిస్తేనే ముసుగడ సాగుతుంది. కొందరు కలల్లోనే జీవిస్తూ, తమ జీవితం, చుట్టు పక్కలవారి జీవితాలు నాశనం చేస్తారు...." అందుకే నవల శీర్షిక 'కల కాదు సుమా!'

'ఎదగని మనసులు' శీర్షిక సూచిస్తున్నట్లే మానసికంగా ఎదగని యువతరం మనస్తత్వాల్ని చిత్రించే నవల. ముఖ్యంగా ప్రేమ, వివాహం విషయాల్లో గారాబంగా పెరిగిన పిల్లల ప్రవర్తన, ఆలోచనా ధోరణి సమర్థంగా చిత్రించారు రచయిత్రి. ఆడపిల్ల అందాన్నీ, మగపిల్లవాడు డబ్బునీ - అది ఇచ్చే సరదాల్నీ ఆకాంక్షించి వాటికి వశులవుతారు యౌవన ప్రథమావస్థలో. వాళ్ళని సరియైన దారిలో పెట్టడానికి పెద్దలు పెద్దరికం గాని, ఆజ్ఞాపనలుగాని పనికిరావు. ఒక మనస్తత్వవేత్త అయిన డాక్టర్ మిత్రుడి సాహాయ్యంతో తల్లిదండ్రులు ఈ ముడి విప్పుతారు. పెద్దలు పన్నిన వ్యూహం ఇందులో ఆకర్షణీయమైన కథ. ఈ కథ కథగానే తీసుకోవాలేమో అనిపిస్తుంది! కాని టీన్‌ఏజ్ యువతీయువకుల మన స్తత్వ చిత్రణ మాత్రం ఎంతో సహజంగా, కనువిప్పు కలిగించేదిగా ఉంది.

'సుషుప్తి' నవల పమ్మారి గోవిందు కథ. "గోవిందులాంటివాళ్ళు దేశంలో కోకొల్లలు. వారి గాథ విప్ర ఘోషిస్తున్నాయి, సంప్రదాయాల

చాటున, కులవృత్తి అనే ముసుగు కప్పుకుని, సోమరితనమనే నిషాలో ఈ సుషుప్తినుంచి మేలుకొని వారిని వారు తెలుసుకునేవరకు మరనం, అరనం, సరనం ఏమీ చెయ్యలేవు కంఠశోష తప్ప." అని రచయిత్రి ముగింపు. కుమ్మరివాళ్ళ సంభాషణ తెలంగాణా మాండలికంలో, మరీ మడి కట్టుకున్నట్లు యథాతథంగా కాకుండా, అందరికీ అర్థమయ్యేవిధంగా సహజత్వాన్ని పోషిస్తూ చేసిన రచన ఎంతో ఆకర్షణీయంగా ఉంది. మచ్చుకి : "ఏం కూర ! కూడు దొరికిందే నసీబ్ అనుకో. ఆ లచ్చుమ్మ కడుపు సల్లంగుండ. ఇంత సల్ల పోసింది" అంటుంది తల్లి ఎంకమ్మ. "ఇంత తొక్కు అడకరాకపోతివా?" అని గోవిందు అడుగుతాడు. "ఇంతింత రమ్మంటే ఇల్లంత వచ్చిన శాస్త్రముందిరా. పోని పాపం అని సల్ల పోస్తే ఏం ముకంతో తొక్కు అడగాల్రా!" ఎంకమ్మ, బాలమ్మల సంసారం, తీరని ఋణభారం, సాహుకారు తాబేదారు దా[illegible] [illegible]స్యం గోవిందు పగటి కలలు, చుక్కమ్మ నిజాయితీ మారుతున్న కాలంతో కులవృత్తి ఎలా కూడుపెట్టలేక పోతున్నదో వివరించే పరిస్థితుల ఆసరాతో ప్రతిభావంతంగా చిత్రించారు రచయిత్రి. వ్యవస్థ మారాలి అంటే మనుష్యులు మారాలి అని రచయిత్రి విశ్వాసం.

(ఆంధ్రప్రభ వారపత్రిక 13-8-75)

# నెరజాణలు - మగధీరులు

— మాదిరెడ్డి సులోచన

"వేనకు వేలు కట్నం అడిగే అబ్బాయిలూ, ఆకాశవీధులలో విహరించే అమ్మాయిలున్నంత కాలం సరియైన జోడి దొరకదని నా భావన"

అంటూ ఒక పాత్రచేత ఈ నవలలో రచయిత్రి నేటి వివాహ సమస్యను గూర్చి సూత్రీకరింపజేసిన అభిప్రాయమే కథగా రూపు దిద్దుకున్నది. ఇందులో కథాసంవిధానం నాలుగు కుటుంబాలమధ్య అల్లబడింది. చైతన్యకు విజయ, ప్రమీల, లత అని ముగ్గురు కూతుళ్ళు. ఆయనది లెక్చరరు ఉద్యోగం. వెనక ఆస్తీ, డబ్బూ లేనివాడు. ఇంజనీర్ రావుకి సుభాష్, రమ, రాజేష్ సంతానం. రమ ఎమ్.బి.బి.ఎస్., సుభాష్ ఇంజనీరింగ్ చదివారు. మూడవది డాక్టర్ చౌదరి కుటుంబం. ఆయనకు ముగ్గురూ కూతుళ్ళు. ఆయన ధనవంతుడు. నాలుగవది రాజకీయాల్లో ఆస్తి హరింపజేసుకుంటున్న ఘాస్వామి రంగారెడ్డి కుటుంబం. ఆయనకు రాజా, శ్రీనివాస్ ఇద్దరే సంతానం. చైతన్య కట్నం ఇచ్చుకోలేడు. పైగా కాలేజీలో స్టూడెంట్ రౌడీలు కాపీ చేస్తుండగా పట్టుకున్నందుకు వాళ్ళచేత దెబ్బలు తిని మంచం పట్టుతాడు. విజయమీద సంసారభారం పడటంతో ఒక గ్రామంలో పంతులమ్మ ఉద్యోగాన్ని స్వీకరిస్తుంది. అక్కడ రంగారెడ్డి పెద్దకొడుకు రాజా, తండ్రి ధోరణి నచ్చక ఇంటినుంచి వెళ్ళిపోయి స్కూల్లో క్లర్క్‌గా ఉంటాడు. విజయా, రాజాలు ఈ నవలలో ఆదర్శ యువతీయువకులు. వీళ్ళిద్దరికీ నవల చివర మనసులు కలిసిన పెళ్ళవుతుంది. కట్నం, అందం, చదువుల్లో హెచ్చుతగ్గు, కుల విభేదంవంటి సమస్యల్ని వీళ్ళు అధిగమిస్తారు. తండ్రి నెదిరించి వెళ్ళిన రాజాకు భిన్నంగా శ్రీనివాస్ అనాకారి అయిన మేనమామ కూతుర్ని చేసుకున్నా, మేనమామ డబ్బును మాత్రమే అనుభవిస్తూ, జులాయిగా తిరుగుతూ, విజయ చెల్లెలు లతను 'ప్రేమ' పేరిట సర్వనాశనం చేసేందుకు ప్రయత్నించి విఫలుడవుతాడు. పోతే డాక్టర్ చౌదరి చైతన్యద్వారా రావుగారి కుటుంబానికి కట్నం ఆశచూపి తన చదువురాని కూతుర్ని సుభాష్‌కు పెళ్ళి చేసి పంతం నెగ్గించుకుంటాడు. కాని చౌదరి అహంభావానికి తగినట్లు సుభాష్ అతని డబ్బుతో

విదేశాలకు వెళ్ళి పెళ్ళాన్ని విస్మరిస్తాడు. ఆనంద్ అనే ఒక సరికొత్త వరుడు అమెరికానుంచి వచ్చి తనకు కట్నం సుతరామూ అక్కర్లేదనీ, చదువుకున్న అందమైన అమ్మాయిమాత్రం కావలెననీ కబుర్లు చెప్పి, చైతన్య రెండో కూతురు ప్రమీలను ఎన్నుకుని, తీరా వివాహసమయంలో వజ్రపుటుంగరం కావాలనీ, తన బంధుమిత్ర పరివారానికి డ్రింక్స్‌తో సహా మాంసాహారపు డిన్నర్ కావాలని, రిసెప్షన్‌కి ఇది కావాలనీ అది కావాలనీ పేచీలు పెట్టి హంగామా చేస్తుంటే, పెళ్ళికూతురు - "నాకీ పెళ్ళి అక్కర్లే"దనీ గట్టిగా అతని మొహంమీదే చెప్పేస్తుంది. అప్పుడు కళ్ళు తెరిచిన రామారావుగారి మూడో కొడుకు రాజేష్ స్వయంగా ముందుకు వచ్చి ప్రమీలను పెళ్ళాడతాడు. పోతే రావు కూతురు డాక్టర్ రమ మాత్రం అవివాహితగానే ఉండిపోతుంది. కారణం - "రమలాంటి వారు ఆశల వలయంలో బంధించబడి తమ అందానికీ, తాహతుకూ తామే విలువ కట్టుకుని జీవితాలను నిస్సారం చేసుకుంటున్నారు." యువతీయువకుల మనస్తత్వాలూ, పెద్దవాళ్ళ ధోరణులూ, సామాజిక పరిస్థితులూ వివాహాన్ని ఒక క్లిష్ట సమస్యగా ఎలా తయారు చేస్తున్నాయో సహేతుకంగా, స్పష్టంగా చిత్రించిన ఈ నవల మంచి రచన.

(ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక 28-4-78) ❋

## రత్నమందిర్

— మాదిరెడ్డి సులోచన

ఈ రచనను మాదిరెడ్డి చేసిన 'జానపద సాహసం'గా పేర్కొన్నారు ప్రచురణ కర్తలు. సాంఘికేతివృత్తంతో విరివిగా నవలలు వ్రాస్తూ

మానవతాదృక్పథంతో వాస్తవికత హద్దులు దాటకుండా, తనదైన బాణీని ఏర్పరుచుకున్న మంచి రచయిత్రి చెయ్యదగిన సాహసంగా కనిపించలేదు. 'జానపదాల'కు అద్భుతకల్పన రొమాంటిక్ ఆవేశమూ కావాలి అవి లోపించడంతో మళ్ళీ ఒక సాంఘికేతివృత్తమే తయారైంది - పేర్లూ, హోదాలూ మాత్రము భిన్నంగా ఉన్నాయి. నవలలో ఇతివృత్తం - వేశ్య కులంలో పెరిగిన సౌందర్యవతీ, సుగుణరాశీ అయిన కన్యను ఒక రాజ కుటుంబానికి చెందిన యువకుడు (సాక్షాత్తూ యువరాజు, తరవాత రాజు) గాంధర్వ వివాహం చేసుకోవడం అతని తల్లి ఆమెను పట్టమహిషిని చెయ్యడానికి అంగీకరించకపోవడం ఆ యువతి సీతాదేవిలా వనవాసం చేసి ఒక సంగీత నాట్యవిద్వాంసుని ఆశ్రయంలో కవలపిల్లల్ని ప్రసవించి, వాళ్ళకు నాట్యం నేర్పించి - రామాయణంలో లవకుశుల పోలికతో - వాళ్ళ ద్వారా భర్తను చేరుకోవడం, అప్పటికి ఆమె స్వయానా రాజుగారి మేనత్తకూతురేననీ, అనాథ బాలికగా వేశ్యాగృహంలో పెరుగుతూ వచ్చిందనీ తెలిసిరావడంతో సమస్య పరిష్కారమై, కథ సుఖాంతం కావడం, కులాలను గూర్చి, అంతస్తులనుగూర్చి, యువతీయువకుల ప్రేమానుబంధానికి అవి చేకూర్చే అవరోధాన్నిగూర్చి, మనుష్యులయొక్క, ముఖ్యంగా ధనికులరాంధ్రైన స్త్రీలయొక్క కాఠిన్యాన్ని గూర్చి కావలసినంత చిత్రణ ఉన్నది.

ఫ్యూడల్ వ్యవస్థకు చెందని సంగతులు, కాలదోషాలు'గా కొన్ని చోటు చేసుకున్నాయి.

"అనాథ సేవాసదన నిర్మితము (నిర్మాణము కొరకు రత్నమాల నాట్యప్రదర్శన ఇస్తున్నది." తనకున్న ధనధాన్యాదులు దానం ఇవ్వడంకాని నాట్యప్రదర్శనతో రాజుని మెప్పించి ధనవస్తు కనకాదులు పొంది వాటిని సేవాసదనం వంటి పుణ్యకార్యాలకోసం (అసలు సేవాసదనాలే 'వెల్‌ఫేర్ స్టేట్' లక్షణం, ఆధునికం) దాన మివ్వడంకాని సాధ్యం, ప్రజల ఎదుట

టికెట్ పెట్టి రుసుము లేక చందా వసూలుచేసే విధానంలో నాట్యప్రదర్శన ఇవ్వడం అనేది ఫ్యూడల్‌వ్యవస్థ లక్షణంకాదు. పోతే భాష విషయం - చిత్రంగా మామూలు వ్యావహారికం వ్రాయసుండా, గ్రాంథిక పదజాలం ఉపయోగింప ప్రయత్నించి ప్రమాదానికి లోనుకావడం చాలచోట్ల జరిగింది. స్పర్శిస్తూ, దుండగీయులు దయామయ (దయామయి) వంటి అపశబ్దాలే కాకుండా "ఆనందం వెల్లి విరిసే నయనాలతో పతిని వీక్షించాడు హరి. పరిచారికలు ఇక్కడకూడా అరుణోదకం తెచ్చినారు. నాథుని కరము తన మృదువైన హస్తముతో" అదుముకుని, ఆసవము చెంతకు తోడి తెచ్చి నది. వంటి భాష ఎబ్బెట్టుగా ఉన్నది. ఎర్రనీళ్ళు 'అరుణోదకం' ఎట్లా అవుతవి? తెలుగు పదాలకు కేవలం సంస్కృత పర్యాయపదాలు వాడటం వల్ల హుందాతనం కాని, జానపద వాసన కాని రాదు. నవ్వు వస్తుంది. రాణీ లేక రాజునుగూర్చి చెప్పేటప్పుడు రచయిత్రి బహువచనం వాడాలో, ఏకవచనం వాడాలో తబ్బిబ్బుపడి నిర్ణయించుకోలేక, . రెండూ కలిపి వాడారు. "చిన్నరాణిగారు కలవర పడిపోయారు. ఎంతోమంది పెద్దలను, శాస్త్రవేత్తలను దాసి సలహా అడిగింది." (పుట 8) ... అలవాటు లేని అవుపానసం అంటే ఇలాంటిదే!

( ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక : 22-11-78 ) ✽

# సద్యోగం

— మాలతీ చందూర్

ఒక వృత్తిని తీసుకుని సాకల్యంగా అందులోని వ్యక్తులనూ, వారి సాధక బాధకాలనూ నిత్యజీవితాన్నీ వర్ణించే నవలలు తెలుగులో ఇప్పు

డిప్పుడే వస్తున్నాయి. కొంతకాలంకింద వైద్యవృత్తిని, హాస్పిటల్ వ్యవస్థను వస్తువుగా తీసుకున్న నవలని ఎమెస్కోవారే ప్రచురించారు. ఇప్పుడు లాయర్‌వృత్తిని వర్ణిస్తున్న ఈ నవలను ప్రచురించారు. రచయిత్రి చేసిన విషయ సేకరణ, తీర్చిదిద్దిన పాత్రలు, కూర్చిన సంఘటనలు ఆమె అభినివేశాన్నీ, కౌశలాన్నీ ద్యోతకం చేస్తున్నాయి. బెంగాలీలో శంకర్ అనే నవలా రచయిత 'హైకోర్ట్' అనే నవల వ్రాశారు. దానికోసం కొన్ని నెలలపాటు హైకోర్టు చుట్టూ తిరిగి, ఆయా వ్యక్తులతో పరిచయం చేసుకుని, ఎన్నో విషయాల్ని ప్రయత్నించి తెలుసుకుని శంకర్ ఆ నవలని రూపొందించారు. శ్రీమతి మాలతీచందూర్ కూడా ఇంచుమించు అంత ప్రయత్నమూ చేసినట్లే కనిపిస్తుంది ఈ నవల కోసం. నవల ఆద్యంతమూ చక్కని ఉత్కంఠతో, స్ఫూర్తితో నడిచింది.

ఈ నవలలో వెంకట్రామన్ అనే లాయర్ ప్రధాన పాత్ర. ఆయన దగ్గర జూనియర్‌గా చేరిన సుమిత్ర కళ్ళతో పాఠకులకు క్రమంగా వెంకట్రామన్ వ్యక్తిత్వమూ, న్యాయవాద వృత్తి ఉత్కృష్టస్వరూపమూ ఆవిష్కరింపబడ్డాయి. ఇది చక్కని ఎత్తుగడ. సంవిధానము. స్త్రీలు న్యాయవాద వృత్తిలో గుర్తింపు పొందడం ఇటీవలే జరుగుతూంది. వైద్యవృత్తీ ఉపాధ్యాయవృత్తీ కుదిరినట్లు స్త్రీలకు న్యాయవాదవృత్తి కుదరదేమో అన్న సందేహానికి ఆధారం లేదన్న రీతిగా స్త్రీలు హైకోర్టు జడ్జి పదవికూడా అలంకరిస్తున్న పరిస్థితి నేడు ఏర్పడటం ముదావహం. కాని న్యాయవాద వృత్తిలో ప్రవేశించడమంటే నల్లగౌను వేసుకోవడం కాదు. స్త్రీలు పొందవలసిన మానసికమైన శిక్షణ ఎంతో ఉన్నదనే విషయాన్ని ఈ నవలలో చక్కగా రచయిత్రి స్పష్టం చేశారు. క్రమశిక్షణ, పరిశ్రమ, మేధానైశిత్యం వంటివే కావు - లౌక్యం (నక్కజిత్తులుకూడా) సెంటిమెంట్‌నీ ఉద్రేకాన్ని అధిగమించి వస్తునిష్ఠంగా ఆలోచించే శక్తియుక్తులు, మానవ మనస్తత్వ పరిశీలనా విధానాన్ని ఉపయోగించుకునే నేర్పు .... ఇలాంటి న్యాయవాద

వృత్తిలో అనుభవంద్వారా పెంపొందించుకోవలసినవి ఎన్ని ఉన్నాయో అన్నీ సన్నివేశాలద్వారా, సుమిత్ర ఎదుర్కొన్న పరీక్షలద్వారా వివరించి స్పష్టం చేశారు. రచయిత్రి ఈ నవలలో న్యాయవాదికి మేధ ఒక్కటే కాదు; హృదయం, మానవతా దృష్టి అవసరమనీ, నిజాయితీ, ధర్మ ప్రవర్తనా ఈ వృత్తిలో పెట్టనికోటలనీ, కేవలం డబ్బు సంపాదనే లక్ష్యమైతే నీటిబుడగలా పేలిపోతారనీ కొన్నిపాత్రలద్వారా, సంఘటనలద్వారా స్పష్టం చేశారు. అన్నింటినీ మించిన పతాక సన్నివేశం, సుమిత్ర వ్యక్తిగతంగా ఎదుర్కొన్న విషమ పరీక్ష. సుమిత్ర గత జీవితంలో ఆమెను మోసగించి, అవమానించి ఎంతో అపకారం చేసిన దుర్మార్గునిపట్ల వృత్తిరీత్యా ఆమె ఏ దృక్పథంతో, ఏ తీరున ప్రవర్తించాలి? అనే ప్రశ్నకు వెంకట్రామన్ గురువుగా చూపిన మార్గం, రచయిత్రి ఆమోదాన్ని పొందిన మార్గం ఈ నవల ముగింపులో పొందుపరిచారు. ఇక్కడ అభిప్రాయభేదానికి కొంత అవకాశం ఉన్నది. వ్యక్తిగతమైన ఉద్రేకాలు వాస్తవమైన సన్నివేశంలో డాక్టరుగాని, లాయర్‌గాని దాన్ని మరొకరికి వదలి పెయ్యడమే సామాన్య పద్ధతిగా తోస్తుంది. కాని సుమిత్ర విషయంలో వృత్తిరీత్యా అలాంటి నిర్ణయమే సమంజసమైనా, ఆమెకు గతాన్నుంచీ విముక్తి కలిగించి, ఆమెలో ఆత్మవిశ్వాసాన్నీ, జీవితంపట్ల చొరవనీ పెంపొందించే ప్రయత్నం వెంకట్రామన్ చెయ్యదలచి సుమిత్రకు ఆ కేసు అప్పగించినట్లుగా సమర్థన ఉన్నది. గురువు ఆదేశం ప్రకారం 'అపకారికి ఉపకారము నెపమెన్నక' సుమిత్ర చేయడం 'ఉదాత్తచరితం'గానే ఉన్నా ఉపకారం పొందిన ఆ వ్యక్తిలో చిన్నమెత్తైనా హృదయపరివర్తన రాకపోవడం ఆ మనిషి నికృష్టస్వభావం మనకు విభ్రాంతిని కలిగిస్తుంది. ఇక్కడే కాస్త ఆలోచిస్తే విషాదమ కర్మతత్త్వంకూడా అవగతమవుతుంది. ఇలా నవల ముగింపు మనస్సులో రేపే కల్లోలం, తద్వారా ధ్వనించే గంభీరమైన సందేశం రచయిత్రి వివేకానికీ, పరిణత మనస్కతకీ తార్కాణంగానే

ఉన్నాయి. సమాజంలో ఆధునిక స్త్రీని రూపొందించే ప్రయత్నంగా ఈ రచన ప్రథమశ్రేణిలోకి వస్తుంది.

(ఆంధ్రప్రభ వారపత్రిక 29-4-77)

# జయ - లక్ష్మి

— మాలతీ చందూర్

విజిలెన్స్ హోంలోని నిత్యజీవితాన్నీ, అక్కడి పరిస్థితుల్నీ అభివర్ణిస్తూ, సమాజంలో దారి తప్పినవారూ, దిక్కులేనివారూ అయిన స్త్రీల విషయంలో ఆ సంస్థ నిర్వహించగలిగిన బాధ్యత ఎంతవరకు పరిమితమో, కృష్ణవేణివంటి సమర్థురాలైన సూపరెంటెంట్ కూడా బాధ్యతా నిర్వహణలో ఎలాంటి చిక్కుల్ని ఎదుర్కోవలసి వస్తుందో సవివరంగా నిరూపించే ప్రయత్నమే ఈ రచన. స్త్రీ సంక్షేమ సంస్థలలోని అవకతవకల్నీ, దురన్యాయాల్నీ, అవి కొందరు స్వార్థపరుల చేతుల్లో చిక్కి ఎలా వేశ్యాగృహాలుగా మారుతున్నాయో ఆ దుస్థితినీ, కేవలం ఖండనాత్మకమైన విమర్శగా, చిత్రణగా చూపిన రచనలు ఎన్నో వచ్చాయి కాని, నిర్మాణాత్మకంగా ఒక స్త్రీ సంక్షేమ సంస్థ చేస్తున్న, చెయ్యగలిగిన మంచినిగూర్చి తెలియజేస్తూ వాస్తవిక దృష్టితో ఔపదేశికంగా వ్రాయబడిన రచన కావడం ఈ 'నవల' విశిష్టత. సాహిత్యపరంగా ఈ రచనని 'నవల' అనేందుకు వీల్లేదు. తనకు లభించిన సమాచారాన్నీ, 'కేసు'ల వివరాలన్నీ కళాత్మకంగా తీర్చిదిద్దే గట్టిప్రయత్నం చెయ్యలేదు రచయిత్రి. కాని సాధ్యమయినంతలో ఆసక్తి కలిగించే విధంగా కథాకథనం నిర్వహించి, కొన్ని కొనలు

ముడివెయ్యకుండా అలానే వదిలేశారు. అందువల్ల ఇది 'జర్నలిజమ్' క్రింద వచ్చే రచన. తేడా ఏమిటో ఈ నవలలో ప్రసక్తమైన 'జయ' కథా, 'లక్ష్మి' కథా నిర్వహించిన తీరు చూస్తే బోధపడుతుంది.

జయ అనే అనాథ బాలిక అందమూ, అణకువా చూచి మీనాక్షమ్మ అనే వృద్ధురాలు తన సహాయార్థం ఇంటికి తీసుకువెళ్ళి, ఇంచుమించు కొమార్తెలా చూచుకుంటుంది. జయ ఆమెమీద విశ్వాసం పెంచుకుంటుంది. మీనాక్షమ్మ కొడుకు స్టేట్స్‌నుంచీ తిరిగివస్తాడు. చూచిన పెళ్ళిసంబంధాలు నచ్చవు. జయనే చేసుకుంటానని తల్లితో చెబుతాడు. మీనాక్షమ్మకి ఇష్టం లేదు. కొడుకుతో స్టేట్స్‌కి పయనమై వెళ్ళిపోతుంది. జయ విజిలెన్స్ హోమ్‌కి తిరిగి వస్తుంది. సాహిత్యపరమైన రచనలో ఇక్కడ జయ తర్వాత ప్రవర్తనకూ, ఆమె పతనానికి ప్రాధాన్యం వచ్చేది. ఈ రచనలో జయకి రెండుసార్లు వార్నింగ్ ఇచ్చి హాస్టల్‌నుంచీ పంపించివెయ్యడంతో జయ కథ ముగిసింది. జయ వెళ్ళిపోయాక ఆమెకు స్టేట్స్‌నుంచీ ఉత్తరాలు వచ్చాయి. మీనాక్షమ్మ చేతులు కాలాక ఆకులు పట్టుకునే ప్రయత్నం చేసింది. 'ఇది సినిమా కథకాదు జీవితం. వెయ్యి ముక్కలయిన జయ జీవితఖాండం మళ్ళీ అతుక్కుంటుందా?' అంటూ రచయిత్రి ఆ కొస అలా వదిలేశారు. సినిమా రకం ముగింపు అక్కరలేదుగాని, జయ పతనావస్థలో ఆమె హృదయభావాలకూ, వ్యక్తిత్వానికీ (సాహిత్యపరంగా అయితే) ప్రాధాన్యం ఇచ్చి చిత్రించవలసిన అవసరం ఉన్నది. 'విజిలెన్స్ హోమ్' యొక్క బాధ్యత దృష్ట్యా అయితే ఆ అవసరంలేదు. ఇక్కడే రచన 'జర్నలిజమ్' అయిందికాని 'నవల' కాలేదు.

సినిమా వ్యామోహంతో ఇల్లు వదలివచ్చి అథోగతిపాలైన నిర్భాగ్యురాలు లక్ష్మి మళ్ళీ తల్లిదండ్రులని చేరుకోవడంలో విజిలెన్స్ హోమ్ సూపరెన్టెంట్ కృష్ణవేణి చేసిన కృషి ఫలించింది. కాని ఈ లక్ష్మి కథ కంటె ఈ పుస్తకంలో ఎక్కువ ప్రాధాన్యం వహించినది సుశీల కథ.

ఈ కథ ఈ పుస్తకంలో పూర్తి కాలేదు. 'కృష్ణవేణి' అనే తరువాయి రచనలో పూర్తిచేశారు రచయిత్రి. సుశీల కథని ప్రారంభించి, ముగించకుండా ఈ భాగంలోనే తోటమాలి దొంగతనం, వంటపంతుల వ్యాపారంలాంటివి ప్రవర్తం చెయ్యడంవల్ల కూడా ఈ రచనకి ఏకాగ్రత (సాహిత్యపరమైన ఏకాగ్రత) లేకపోయింది. విజిలెన్స్ హోమ్ కేంద్రంగా ఉండటం, కృష్ణవేణి సూపర్నెంట్‌గా ఉండటం రచనలో వివిధ విషయాలకూ, సన్నివేశాలకూ, కథలకూ ఐక్యాన్ని చేకూర్చినప్పటికీ, అది 'జర్నలిస్టిక్' ఏకత్వం తప్ప, రసాత్మకమైన సాహిత్యపరమైన ఏకత్వంకాదు; ఆర్థర్ హైలీని వరవడిగా పెట్టుకున్నప్పుడు విషయ గ్రంథనంలో ఇంతకంటె మెలకువనూ, శిల్పాన్నీ చూసిఉండవలసింది.

(ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక 29-6-77) ❋

# కృష్ణవేణి

— మాలతీ చందూర్

విజిలెన్స్‌హోమ్‌ను కేంద్రంగా తీసుకుని రచయిత్రి వ్రాసిన రెండు నవలల్లో ఇది రెండవది. 'జయ - లక్ష్మి' అనే నవల కిది తరువాయి. అలా ఎక్కడా చెప్పకపోవడం ఒకవిధంగా లోపమే; పోతే రెండు నవలల్లోనూ కృష్ణవేణి హోమ్ సూపర్నెంట్ అయినప్పటికీ రచనలోని రసాత్మకమైన కేంద్రం కృష్ణవేణి కాలేకపోయింది. విషయం విస్తారమూ, వైవిధ్యం కలిగినదీ అయినప్పటికీ, విషయ గ్రంథనంలో రచయిత్రి కృష్ణ

వేణి వ్యక్తిత్వాన్ని కేంద్రంగా తీసుకున్నా బావుండేది. లేక కథలని ఒక దాని వెంబడి జయ, లక్ష్మి, సుశీల, వసంతలక్ష్మి, వెలంటీనా, మంజుల అంటూ వేరువేరుగా చెప్పినా సాహిత్యం అయ్యేది. ఇప్పుడిది 'జర్నలిజం' అయింది. అట్లా చూచినా 'జయలక్ష్మి', కృష్ణవేణి' రెండూ ఒక పుస్తకం గానే వేస్తే బావుండేది।

ఈ 'కృష్ణవేణి' అనే రెండో భాగంలో సుశీల కథకి ముగింపు మాత్రమే ఉన్నది. సుశీల కథలోని కారుణ్యం, మాతృత్వంయొక్క లోతులు ఎంతో హృదయదఘ్నంగా ఉన్నాయి. ఈ కథ రెండు పుస్తకాల్లో అటో భాగం, ఇటో భాగం విడిపోవడమేగాక, మధ్యమధ్య ఇతర కథలు రావడంవల్ల కూడా దాని సహజ తీవ్రతనీ, రసోద్వేగాన్నీ కోల్పోయింది. వసంతలక్ష్మి, వెలంటీనా కథలు విజిలెన్స్ హోమ్‌కి సంబంధించినవికావు. కృష్ణవేణికి వ్యక్తిగతంగా ఏర్పడిన పరిచయాలు. ఈ ఉదంతాలూ ఆసక్తి కరమైనవేకాని, కృష్ణవేణి వ్యక్తిత్వానికి ఏవిధంగానూ పోషకమైనవి కావు. రచయిత్రి తనకు ఆసక్తి కలిగించే విషయాల్ని ఏదోవిధంగా "కవిలెకట్ట'లో చేర్చివేసినట్లు కనిపిస్తున్నాయే తప్ప, ఇవి రచనలో సహేతుకమైన, సమర్థనీయమైన స్థానాన్ని (జర్నలిజమ్ రీత్యాకూడా) పొందలేకపోయాయి. వెలంటీనా విజిలెన్స్ హోమ్‌లోని ఒక పసిపాపని పెంచుకుంటాననే కోర్కె వెలిబుచ్చడం ఒక్కటే సందర్భశుద్ధి కలిగిస్తోంది.

ఈ రచనలో ఎదురయ్యే పాత్రలు ఎన్నో సజీవమైనవీ, ఆసక్తి కలిగించేవీ. వేలాయుధం, షణ్ముఖం, వంటపంతులు, గీత, సీతమ్మ, ఆరోగ్యం - వీళ్ళందరూ కళ్ళకు కట్టేలా చిత్రించబడ్డారు. పాత్ర చిత్రణలో శిల్పం లేకపోతే అది సాధ్యంకాదు కదా। విషయ సేకరణలో సమగ్రతా, పాత్ర చిత్రణలో నేర్పూ, నిశితంగా ఆలోచించే సామర్థ్యమూ, మానవతా దృక్పథమూ అన్నీ ఉండి కూడా విషయ గ్రంథనంలో లోపంవల్ల రచన

ఒక ఆకృతిని పొందలేక సాహిత్య ప్రతిపత్తికి నోచుకోలేకపోయినందుకు విచారించవలసి వస్తోంది. కాని ఇది తప్పక చదువవలసిన రచన - స్త్రీల సమస్యలనుగూర్చి, స్త్రీ మనస్తత్వాన్నిగూర్చి ఎన్ని గ్రంథాలు చదివినా లభించని అవగాహనా, సంస్కారమూ ఈ రచన ప్రసాదించగలదు. ఉదాహరణకు, ఈ రచనలో ఒక డాక్టరు అంటుంది: "ఆడవాళ్ళలో శీలంగురించి ఎంతటి గిల్ట్ కాంప్లెక్స్ ఉంటుందో వాళ్ళకే అర్థంకాదు. చదువు, ధనం, నాగరికత వీటిని మించిపోదు. ఒకానొక పవిత్రభావం ఆడవాళ్ళ జీవితాన్ని పాలిస్తూ ఉంటుంది. ఆ పవిత్రత తల్లక్రిందులయిందా చట్టం, న్యాయం, సమాజం, ఇవి ఎంత కాపాడ ప్రయత్నించినా ప్రయోజనం ఉండదు. ఈ గిల్ట్ కాంప్లెక్స్‌ని జయించిన ఆడవాళ్ళు నాకింకా తటస్థపడలేదు." విజిలెన్స్ హోమ్ ఎదుర్కొనే సమస్యలకు కీలకమైన జీవిత సత్యం ఇది. దానికి విస్తృతరూపమే ఈ రచన.

(ఆంధ్రప్రభ వారపత్రిక 25-5-77)

# సంఘర్షణ

— తురగా జానకీరాణి

నేటి కుటుంబవ్యవస్థలో, సామాజిక పరిస్థితుల్లో స్త్రీ ప్రతిపత్తిని గూర్చి, స్త్రీకి జరుగుతున్న అన్యాయాన్ని గూర్చి విరివిగా వస్తున్న కథలూ, నవలలూ చిత్రిస్తున్న ఇతివృత్తమే ఇదీ అయినా, కథ చెప్పడంలో, పాత్రలను తీర్చిదిద్దడంలో విశిష్టమైన సౌకుమార్యాన్ని, నిజాయితీని, నిగ్రహాన్ని అభివ్యక్తం చేస్తున్న ఈ రచన ఒక ప్రత్యేకంగా ఎన్న

దగిన ప్రయత్నం. కట్నం ఇవ్వలేకపోవడం, రెండో పెళ్ళి వరుణ్ని చేసుకోవడం, స్వతంత్రంగా జీవించేందుకు తగిన చదువూ, ప్రపంచ జ్ఞానం లేకపోవడం - ఈ పరిస్థితులమీదే ఆధారపడలేదు ఇందులోని లలిత విషాద గాథ. లలిత అన్నయ్య కృష్ణమూర్తి స్వార్థం, ఆమె వలచిన బావ మల్లిఖార్జునం మనస్వి అయినా తెంపరి కాకపోవడం, పెళ్ళి చేసుకున్న మాధవరావులో విషయలౌల్యమూ, పిరికితనం తాలూకు క్రూరత్వమూ కలిసి గిడసబారి తయారైన ప్రవృత్తీ, ఆమెతో స్నేహం కలిపిన వసంత రావు నయవంచనా - ఇవన్నీకూడా లలితను 'పతిత'ను చెయ్యడానికి జారుడు మెట్లే అయ్యాయి. అన్నింటినీ మించి కీలకమైనది లలితలో మనోదార్ఢ్యం లేకపోవడం - ఒకసారి దగాపడి స్వతంత్ర ప్రతిపత్తికోసం చదువు సాగి స్తూన్న లలిత, వసంతరావు వలలో పడడం, అది ఆమె బలహీనత తప్ప అనుభవశూన్యంగా, అమాయకత్వంగా దాన్ని అనుకోవడానికి వీల్లేదు మరి! ఇలా అనడం వసంతరావుని క్షమించడం కాదు. వసంతరావు 'పాచిక' అనుభవంలేని ఏ కాలేజీ అమ్మాయిమీదో పని చెయ్యవచ్చునేమో! దెబ్బ తిన్న లలిత, అన్నయ్య ఆశ్రయంలో ఉంటూనే వసంతరావు మాయలో పడటం, అది లలిత స్వయంకృతంగానే మనకు కినిపిస్తుంది. స్త్రీని 'లత'గా కవులు వర్ణించారు. లతకి ఆధారం కావాలి. ఈ రకం సిద్ధాం తాన్ని అంగీకరించని ఆధునిక స్త్రీ, స్వయం ప్రతిపత్తిని కోరుతున్న నేటి స్త్రీ లలితకంటే ఎక్కువ మనోదార్ఢ్యాన్నీ, లక్ష్యశుద్ధినీ పెంపొందించు కోవాల్సిన అవసరం ఎంతైనా ఉన్నదని ఈ నవల ధ్వనిస్తున్నది. లేక పోతే ఆమెకు భవిష్యత్తు లేదు!

నవల అందమంతా సన్నివేశ వర్ణనలో ఉన్నది. వ్యక్తులు వాచ్యంగా ప్రకటించేదానికంటే, వాళ్ళు మౌనంగా ఉండటంలో ధ్వనించే భావాల్ని సున్నితంగా సూచించడంలో రచయిత్రి పోయిన పోకడలు మెచ్చుకోదగి నవిగా ఉన్నాయి. ఇంటి నుంచి పారిపోయి భంగపడి తిరిగివచ్చిన సుందరి

బెరుగ్గా గదిలో నక్కి ఉంటుంది. ఆమెను చూచి లోపలికి వెళ్ళిన తల్లి పార్వతమ్మ ప్రవర్తనలో, ఆమె తడబాటులో రచయిత్రి ధ్వనింపచేసిన మనశ్చిత్రణ మెచ్చుకోదగిన ఉత్తమ స్థాయి రచన. ఇది కేవలం ఒక ఉదాహరణ మాత్రమే. మాదవరావు మనస్తత్వ చిత్రణ పరిశీలిస్తే ఒక ప్రౌఢమైన రచన. మాధవరావు పిరికితనం అతను భార్యపట్ల చూపే అనుమానంలో, క్రూరత్వంలో, పశుత్వంలో కనిపిస్తుంది. పిరికివాడు కాబట్టే మేనల్లుడు రంగారావుని ఏమీ అనలేడు। సుబ్బలక్ష్మి, కృష్ణమూర్తి పాత్రలలోని స్వార్థం ఎంతో సహజంగా ఉంటూ దోషంగా కనిపించనే కనిపించదు. లలితపట్ల బాధ్యత నిర్వర్తించవలసిన రీతిలోనూ, ఏ సమయంలో చెయ్యవలసింది ఆ సమయంలోనూ వాళ్ళు చెయ్యలేదనే తప్ప, అంతకంటే వాళ్ళలోని దోష నిరూపణ చెయ్యడానికి వీల్లేని విధంగా వాళ్ళ ప్రవర్తనని చిత్రించడంలో వాస్తవికత మహా సున్నితమైన కళాభిజ్ఞతగా రూపొందింది. ఇలా పాత్రలని మలచడంలోనేకాదు, మనోభావాన్ని వర్ణించడంలోనూ రచయిత్రి అందమైన పోకడలు పోయారు. లలిత రెండో పెళ్ళివాడైన విషయలోలుడైన మాధవరావుని చేసుకున్నది. ఆమె మనఃస్థితిని వర్ణించిన తీరు: "మల్లెపూవులాంటి సుకుమారికాదు లలిత. కానీ ఆమె వయస్సు ఎలాంటిది - మెల్లగా పందిరిని ప్రాకబోతున్న మాలతి తీవలాంటిది. కోరికలకంటె పులకరింపులు ఎక్కువ. మత్తెక్కించే ఆవేశం ఎరగదు. విద్యుత్తు తాకినట్లు ఝుల్లుమనిపించే అనుభూతులే తెలుసు. మాధవరావు మోటువాడనికాని, సున్నితత్వం తెలియనివాడనికాని అనుకోవడం లేదామె. భర్త అనేవాడు ఇంతే కాబోలు ననుకుంది. అతని కళ్ళలో పొరలుగా మండే కాంక్ష, ఎర్రని కణికలా వెలుగుతూ ఉంటుంది. అంతే కాని రెప్పల కొనలనుంచో, కంటి చివర్లనుంచో గురిచూసి [illegible] ల్లాగా గాయంచేసే వలపుచూపు లేమిటో ఆమె ఎరగదు. తను ఎరగనని కూడా తెలియని స్థితి ఆమెది. దాంపత్యజీవితంలో [illegible]

ధాన్యం, వంట, వార్పు, పెట్టుబడులు - వీటన్నిటికి ప్రధానస్థానముందని తెలుసుకుంది. ఇవి లేనప్పుడు ఒక కొండచిలువలా కాచుకుని ఉన్నట్లు కనపడే మాధవరావు" ఇలాంటిచోట్ల విశ్వనాథవారి 'ఏకవీర' రచన జ్ఞాపకం వస్తుంది. రచయిత్రికిగల జీవితాన్నిగూర్చిన అవగాహన, వ్యక్తులను గూర్చిన పరేంగితజ్ఞానం రచనలో ప్రతిఫలించి, నవలకు విశిష్టతను చేకూర్చాయి. (ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక, 8-9-76) ❋

# ఆశలూ - అనుభవాలూ

— ఉన్నవ విజయలక్ష్మి

ఇది చక్కని కుటుంబగాథ. ఇంటికి పెద్దకొడుకైన ముకుందం సంసారభారం వహించి ఇద్దరు తమ్ముళ్ళని పై చదువులు చదివిస్తాడు. ఇద్దరు చెల్లెళ్ళకు ఘనంగా వివాహాలు జరిపిస్తాడు. ఇదంతా తల్లి మనస్సెరిగి, తోబుట్టువులమీది ఆప్యాయతతో, పోయిన తండ్రి స్థానంలో తనని ఊహించుకుని, బాధ్యతతో, నిండు మనస్సుతో చేసిన స్వార్థత్యాగం. ఏళ్ళతరబడి సొంతంగా సంపాదించేదీ, ఉమ్మడి ఆస్తిమీద వచ్చేదీ అని భేదం లేకుండా వెచ్చించి తోడబుట్టినవారిని పైకి తెస్తాడు ముకుందం. ఈ కథని వివరంగా కన్నులకట్టేలా చిత్రించారు రచయిత్రి. చివర తల్లి మరణంనాటికి ఎవరికి వారైన ముకుందం తమ్ముళ్ళూ, చెల్లెళ్ళూ 'పైతృకమైన ఆస్తి మాకేం మిగిల్చావు, నువ్వు చేసిన నిర్వాకం ఏమిటి?' అన్నట్లుగా మాట్లాడుతారు. అన్న కుటుంబం సంగతీ, తనకేమి మిగుల్చుకో లేదన్న విషయమూ ఆలోచించరు. కొన్నేళ్ళకి ముకుందానికి పక్షవాతం

వస్తుంది. పిల్లలు చేతికి అందిరాలేదు! "నాకు తెలిసినంతవరకు ఏనాడూ నా బాధ్యతలని విస్మరించలేదు, ఎవరికీ ఎలాంటి అన్యాయాలు చెయ్యలేదు.... మరి మన బ్రతుకులు ఇలా ఎందుకయాయంటావు ?" అంటాడు బాధతో. దీనంగా ముకుందం. ఇదీ రచయిత్రి ఒకానొక సంప్రదాయాన్ని గూర్చి ఈ నవలలో వేస్తున్న సూటియైన ప్రశ్న! "నుదుటి వ్రాతలిలా ఉన్నాయనుకుందాం" అంటుంది భార్య. అది సమాధానం అవుతుందా ? ఇక్కడ కృతజ్ఞతకోసం ఎదురుచూడడు ముకుందం. ఆప్యాయత కరవైందనే బాధపడతాడు. ఏమంటే శకుంతల డబ్బుచూచి తన కొడుక్కి సుందరం కూతుర్ని చేసుకుంటానంటుందికాని, ముకుందం కూతుర్ని గూర్చి ఆలోచించదు. మిగతా నలుగురూ ఆర్థికంగా ఒక స్థాయికి చేరుకుని ముకుందం కుటుంబాన్ని వెలివేసినట్లే ప్రవర్తిస్తారు! చివరిదైన 14 వ అధ్యాయం ఈ నవలలో కొలికిపూస. పక్షవాతంలో అశక్తుడైపోయిన ముకుందం సంసారభారాన్ని పెద్దకుమార్తె తన భుజాలమీది కెత్తుకోవడంతో నవల చివర పాతకథ పునరావృత్తమవుతుంది. "భగవంతుడా! మా దురదృష్టమే మా బిడ్డలకు పట్టనివ్వకు" అనుకుంటాడు ముకుందం. తమ్ముళ్ళకోసం, చెల్లెళ్ళకోసం, తనవలె అలవికి మించిన త్యాగం చెయ్యకుండా ఉన్నంతలో వాళ్ళ భవిష్యత్తుని తీర్చిదిద్దిన ధర్మారావుతో తనని పోల్చుకుంటాడు. పాఠకులకు బెర్నార్డ్‌షా వ్యాఖ్యానం: "అతి సాధువుగా ఉండటం ఎంత ప్రమాదకరమో చూశారా" అని గాంధీజీ మరణవార్త విని అన్న మాటలు తప్పక గుర్తు వస్తాయి! మంచి రచన!"

[ ఆంధ్రప్రభ వారపత్రిక : 24-9-75 ] ❋

# దైవమిచ్చిన భర్త

— ఉన్నవ విజయలక్ష్మి

సవతి కూతురు సునీతను, సొంత కూతురు హరిప్రియను సమానంగా చూడలేదు పంకజ. ఎవరికో ఒకరికి కట్టబెట్టి సునీతను వదిలించుకోవాలనుకున్నది. ఆస్తిపాస్తులున్న వికలాంగుణ్ణి తెచ్చింది. సునీత వద్దుపొమ్మంది. పంకజం బలవంతం చెయ్యలేదు. అంతవరకు క్రెడిట్ మార్కు ఇవ్వవలసిందే పంకజానికి. తరవాత ఒక పేద గ్రాడ్యుయేట్ పంతులికి, సునీతకు ఈడు జోడైనవాడికి ఇచ్చివేశారు. హరిప్రియ అందగత్తె కావడంవల్ల పంకజం స్నేహితురాలు తన కుమారునికి కోరి చేసుకున్నది, కట్నం గిట్నం అడక్కుండా. వాళ్ళు ధనవంతులు. కాని ఆ వరుడికి వ్యసనాలున్నాయి. ఫలితం - హరిప్రియకు అనారోగ్యం, గర్భస్రావాలు, సునీతకు చక్కని పుత్రసంతానం. చివరకు సునీత భర్త ఒక మాజీ జమిందారు ప్రాపకం సంపాదించి, ఆయన వ్యాపారంలో భాగస్థుడవుతాడు. హరిప్రియ భర్త అన్నీ పోగొట్టుకుని వాళ్ళ వ్యాపారంలో అకౌంటెంట్‌గా కుదురుతాడు. ఓడలు బళ్ళూ, బళ్ళు ఓడలూ అయినవి. కథలోకాని, నవలలోకాని విశేషం ఏమీలేదు. సవతితల్లి సునీతను సొంతకూతురిలా ఆదరించలేదనీ, అందువల్ల సునీతను అదృష్టం వరించగా హరిప్రియను దురదృష్టం వరించిందనీ రచయిత్రి చెయ్యబూనిన సిద్ధాంతం చాలా సంకుచితమైన దృక్పథాన్ని వ్యక్తం చేస్తోంది. కాని ఇది మధ్యతరగతిలో క్రింది స్థాయివర్గం వారిలో - ముఖ్యంగా స్త్రీ జనంలో సామాన్యంగా ఉన్న దృక్పథమే. తరచు ఆడవాళ్ళ కబుర్లలో వ్యక్తమయ్యే దృక్పథం. ఈ నవలకూడా అలాంటి ఉబుసుపోక కబుర్లస్థాయిలోనే నడిచింది. సునీత భర్త మాజీ జమీందారు వ్యాపారంలో భాగస్థుడు కావడం

అనేది ఒక మధ్యతరగతి కల తప్ప సామాజిక వాస్తవికత కాదు. ఆ కలను పంకజంమీద అక్కసు తీర్చుకోవడానికి సాధనంగా రచయిత్రి ఉపయోగించింది.

పోతే, సునీత సెంటిమెంట్సు ఎలా ఉంటాయంటే 'ఇలాంటప్పుడు ఎక్కడయినా యాభై రూపాయలు అప్పయినా చేసి సాదారకం బట్టలయినా తెస్తారు. మరొకరయితే.... ఎలాగో పెళ్ళి చేసి పంపిన తరువాత ఒకసారయినా రవికల గుడ్డకి నోచుకోలేదు నేను వాళ్ళదగ్గరనుండి. నాకే పెట్టనప్పుడు ఇక అల్లుడికి ఏం పెడతారు.... తొలిచూలు పురుడుపోసి, బారసాల జరిపించాల్సిన విధి వాళ్ళది కదా. అదేదీ లేకపోగా, మా ఖర్చుతో మేం నామకరణం చేసుకుంటూంటే, మాకు బట్టలివ్వటానికికూడా వాళ్ళకి మనస్కరించలేదు. స్నేహితుల ముందర ఆయనికి ఎంత తలవంపులు. ఇరుగుపొరుగుకి అత్తయ్య ఏమని సమాధానం చెబుతుంది!.... మామగార్లను డబ్బుకోసం పీడించనక్కరలేదని మర్యాదగా వూరుకునే వాళ్ళకిదిగో ఇలాగా జరుగుతాయి మర్యాదలు...." సునీత తండ్రికి సునీతతో కలిపి ఎనిమిదిమంది సంతానం. సునీత, హరిప్రియల వివాహాలు ఎలాగో జరిపించాడు. సునీత ఆర్థికస్థితి ఆమె తండ్రి ఆర్థికస్థితికంటే మెరుగ్గానే ఉంది. ఈ పరిస్థితిలో సునీత సెంటిమెంట్స్ సమర్థనీయమేనా? ఈ విషయాన్నిగూర్చి సరియైన అవగాహన పెంచుకుంటేతప్ప చదువుకున్న సునీతవంటి మధ్యతరగతి స్త్రీలలో అభ్యుదయం ఎప్పటికీ రాదు. ఈ సెంటిమెంట్స్ మారాలి. అని చెప్పడంలేదు ఈ నవల. కాని ఆలోచించగలిగినవాళ్ళెవరైనా సరే, ఈ రకం సెంటిమెంట్స్, ఆచారాలు మారాలని లేకపోతే మోక్షం లేదని అనుకోవడానికి అవకాశం కల్పిస్తున్నది.

(ఆంధ్రప్రభ వారపత్రిక 29-8-79) ❋

# కాలచక్రం

— కావలిపాటి విజయలక్ష్మి

అక్క చనిపోయింది. చనిపోతూ నెలల పసికందుని పెంచమని కోరింది. అక్కను హింసించిన బావను చేసుకోవడం ఇష్టంలేదు. తనకు వేరే వివాహం జరిగింది. అక్క బిడ్డని పెంచడం ఎలాగ? ఇదీ సుధ సమస్య. అనాథశిశువుగా ఆమె ఇంటిముందు పారేస్తే పెంచక ఏంజేస్తుంది? పెంచిన తరువాత తనకు ఏదోవిధంగా సంబంధం ఉండకపోతుందా అన్న ధీమా బావ రమాకాంతారావుది. దిక్కులేని శిశువుగా లభించినవాణ్ని సొంత కొడుకుగా ఎలా చూడగలను అంటాడు వసుధ భర్త కృష్ణప్రసాద్ రహస్యాన్ని భర్తకు విడమర్చి చెప్పలేదు వసుధ. చెబితే ఎన్ని అనుమానాలూ అపవాదులూ వస్తాయో! చెప్పకపోవడంవల్ల భర్త ఆ పిల్లవాణ్ని నిర్లక్ష్యం చేసే అవకాశమూ ఉన్నది. ఈ గడ్డు సమస్యను వసుధ ఎలా ఎదుర్కొని క్రమంగా ఎలా పరిష్కరించిందో సహజంగా, సున్నితంగా చిత్రించారు ఈ నవలలో విజయలక్ష్మిగారు. అంతకంటె సంతృప్తిని కలిగించే విషయం - రమాకాంతరావు, అతని తండ్రి వరహాలరావు పాత్ర చిత్రణవారిపట్ల రచయిత్రి చూసిన సహిష్ణుత అవగాహన వసుధను పెళ్ళి చేసుకోవాలన్న రమాకాంతరావు ఆశయం ఫలించకపోగా, తన బిడ్డకు ఆమె పెంపుడుతల్లి కావడంద్వారా ఆమెతో సంబంధం కల్పించుకోవాలన్న ఆశయంకూడా ఫలించకుండా "వసుధ ఆ బిడ్డ చచ్చిపోయాడన్న ఒక కఠోరమైన అబద్ధాన్ని చెబుతుంది. అంతటితో రమాకాంతరావు బలవన్మరణం పాలవుతాడు. "వసుధ మనస్సు ఆరాటపడింది....అతని చివరి క్షణాల్లో మీ బాబు బ్రతికేఉన్నాడని చెప్పి అతన్ని తృప్తిగా ప్రాణాలు వదలనివ్వాలని. కాని తన ఎదర నిల్చున్న కృష్ణప్రసాద్, కుంతీదేవిలా ఈ రహస్యం వద్దనిమిది

సంవత్సరాలు, ఇంతకాలం దాచావు, ఇంకా నువ్వెన్ని రహస్యాలు దాచావ్ అని ప్రశ్నిస్తున్నట్లనిపించి మౌనం వహించింది.... అప్రయత్నంగా కనులు చెమర్చాయి వసుధకు." ఈ అలతి వాక్యాల్లో వసుధ పాత్రని గంభీరంగా ఆవిష్కరించడమే కాదు, కుంతీదేవి కాలంనుంచీ నేటిదాకా మాతృమూర్తిగా, భార్యగా, సమాజంలో మర్యాదస్తురాలిగా స్త్రీ ఎంత భారాన్ని, ఎంత మెలకువతో సహిస్తూ ఉన్నదో తేటతెల్లం చేశారు రచయిత్రి. వ్యవస్థ అనే చక్రవ్యూహాన్ని ఛేదించే సాహసం స్త్రీలో మెచ్చుకోదగిందే కాని, ఆ సాహసంకంటే తనకు కావలసినదేమిటో తెలిసి దాన్ని పరిరక్షించుకోవడానికి సంవత్సరాల తరబడి పోరాడి గెలుపొందిన ఓర్పు, సహనం, మెలకువ, ఇంగితజ్ఞానం వంటివి వసుధలో మనకు ఆశ్చర్యాన్ని కలిగిస్తాయి. వజ్రాదపి కఠినం అంటే ఏమిటో వసుధ ఆడిన అబద్ధంలో కనిపిస్తుంది. కాని వసుధ జాలిగుండెగల స్త్రీ. అలవోకగా రచించినట్లు కనిపించే ఈ నవలలో చక్కని శిల్పం దాగి ఉంది.

( ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక : 6-12-79 ) ❋

# మరుపులో మెరుపులు

— చెరుకూరి రమాదేవి

"వదులు. అమ్మను కొట్టకు.... అమ్మకు నొప్పి' - ఏదో నోటికొచ్చినట్లు అరుస్తూ పక్కగా ఉన్న రోకలిబండను ఎత్తి గట్టిగా అతని తలమీద మోదింది. కుప్పలా కూలిపోయాడు వెంకన్న. రొంటిన ఉన్న డబ్బంతా జారిపడింది. తలనుండి కారుతున్న రక్తం వెల్లువై ప్రవహిం

చింది....పెద్దగా ఉరుముతో వచ్చిన మెరుపు ఇల్లంతా నిండింది. పెంకిలా వచ్చిన వెలుగులో వరదలా పారుతున్న రక్తాన్ని చూస్తుండగానే మాధవి కళ్ళు భయంతో పెద్దవయ్యాయి. ఒక్కసారి కెవ్వున అరిచి కింద పడి పోయింది." ఏడెనిమిదేళ్ళ వయస్సులో జరిగిన ఈ సంఘటన మూలంగా మాధవికి మానసిక రుగ్మత ఏర్పడింది. చదువుకొన్నది, ఉద్యోగం చేస్తు న్నది, అందచందాలతో ఆకర్షణీయంగా ఉంటున్నది మాధవి. కాని డబ్బు కనిపిస్తే దొంగతనం చేస్తుంది, చేశాక పారిపోతుంది. ఉరుములూ మెరు పులూ వస్తే భయంతో వణికిపోతుంది. వయసు వచ్చిన మగవాని స్పర్శ గాని, పొడగాని సహించలేదు. ప్రభాకర్ యువకుడు, వ్యాపారస్థుడు. మాధవి అతనికి సెక్రటరీగా ప్రవేశిస్తుంది. ప్రభాకర్ మాధవి 'న్యూరా సిస్' ని పసికట్టి, ఎలాగైనా ప్రేమతో, ఓపికతో ఆమెను ఆరోగ్యవంతు రాలిని చేయాలనే నిశ్చయానికి వచ్చి వివాహం చేసుకుంటాడు. మాధవి మనస్సులోని పొరల్ని అతను ఎలా విడదీశాడో, 'మనోవైజ్ఞానికంగా' ఆసక్తి కలిగించే సన్నివేశాలతో కథ ఎలా నడిచిందో చూద్దామనుకుంటే మాత్రం ఈ నవల ఆశాభంగమే కలిగిస్తుంది! ప్రభాకర్, మాధవీల మధ్య వచ్చు 'సెంటిమెంటల్' ప్రవర్తనా, ధనికవర్గంవారి తీరికతో, హంగు లతో కూడిన జీవనవిధానం వర్ణనా ఏదురౌతాయి! పోతే 'బొంబాయిలో గొప్ప సైకాలిజిస్టు' (సైకాలిజిస్టా ? సైకియాట్రిస్టా ? రెండింటి మిశ్రమా ?) ఉన్నాడన్న మిత్రుని సలహాకూడా పాటించడు ప్రభాకర్ ? మనోవైజ్ఞానిక నవల కాస్తా చౌకబారు డిటెక్టివ్ నవలలా, గోపాల్ అనే కూలి డిటెక్టివ్ ద్వారా మాధవితల్లి చరిత్రా, పుట్టుపూర్వోత్తరాలూ ప్రభాకర్ వాకబు చేయించి కనుక్కోవడంతో కథ ఒక కొలిక్కి వస్తుంది. మాధవి చిన్న తనంలో జరిగిన సంఘటన ఆమె తల్లి నోట చెప్పించడంతో, మాధవికి మరుగుపడిన స్మృతి జాగృతమై 'న్యూరాసిస్' వదలిపోతుంది. 'న్యూరా సిస్' సూత్రం సరిగ్గానే ఉన్నా, నవలలో భావుకత, సృజన కొరవడడంతో

ఈ ప్రయత్నం వికటించింది. ఆంగ్ల రచయిత విన్‌స్టన్‌గ్రామ్ అనుమతితో ఆయన నవలలోని ముఖ్య విషయాలు ఉపయోగించుకున్నట్లు రచయిత్రి చివరి మనవి. ఆ ముఖ్య విషయాలు 'న్యూరాసిస్'వే కావచ్చు. అయితే ఇందులో రచయిత్రి కృషి ఏమిటో పాఠకులే గ్రహిస్తారు!

'న్యూరాసిస్'ని సాహిత్యపరంగా చిత్రించినప్పుడు, జీవితపు లోతుల్ని తరిచిచూచి జీవితంపట్ల ఒక దృక్పథాన్ని నిర్మించే అవకాశం నవలా రచయితకు లభిస్తుంది. అలాంటి అవకాశాన్ని తెలుగులో రా. వి. శాస్త్రి, బుచ్చిబాబు వంటి రచయితలు సద్వినియోగంచేసి ఉన్నారు. రచయిత్రి మరో ప్రయత్నం చేసేటప్పుడయినా ఈ విషయం గుర్తించుకుంటారని ఆశిద్దాం. (ఆంధ్రప్రభ వారపత్రిక 10-9-75) ❋

# ఒకదీపం వెలిగింది

— నేరెళ్ళ రామలక్ష్మి

నేటి సమాజంలో స్త్రీకి రక్షణలేదు. తల్లిదండ్రులు, వివాహము, ఉద్యోగము, ఆర్థికస్తోమత కల్పించే రక్షణ పరిమితమైనది. కొన్ని పరిస్థితుల్లో, ఇవి ఏవీ రక్షించలేని పరిస్థితుల్లో, స్త్రీని రక్షించేది ఆమె వ్యక్తిత్వమే అన్న సందేశాన్ని ధ్వనింపజేసే ప్రయత్నం ఈ నవలలో కనిపిస్తుంది. ఆధునిక మహిళ నేడు కోరుతున్నది రక్షణకాదు; స్వతంత్ర ప్రతిపత్తి! పరిస్థితులు ఎంత పాడుగా ఉన్నా మనోధైర్యాన్ని వదలక ఎదుర్కోవడమే కర్తవ్యమనే పాఠాన్ని వల్లె వేస్తుంది. ఈ కథలో

పద్మావతి. కట్టుకున్న భర్త మేదకుడు, అమాయకుడు. తల్లిదండ్రులు కే అతనిమీద అభిమానం లేదు. అతని ప్రయోజకత్వంమీద వారికి నమ్మకం లేదు. స్నేహం పేరిట అతణ్ని స్వార్థంకోసం ఉపయోగించుకునే డాక్టర్ మోహన్ పద్మావతికోసం వలపన్నుతాడు. ఈ మోహన్ నుంచి తప్పించు కున్న పద్మావతి భర్తకు దూరమౌతుంది. ఇక్కడినుంచి పద్మావతిని 'ఆధునిక' మహిళగా తీర్చిదిద్దారు రచయిత్రి. పద్మావతి తల్లిదండ్రుల దగ్గరకు పారిపోయి తలదాచుకోలేదు. తన పరిస్థితులను ఆ ముసలివాళ్ళకు తెలియపరచనేలేదు। పద్మావతికి ఈ ఒంటరి పరిస్థితిలో బావ గోపాల రావు తారసిల్లుతాడు. ఒకప్పుడామె అతణ్ని పెళ్ళి చేసుకోవాలని కన్న కలలు, డబ్బు లేకపోవడంవల్ల ఫలించలేదు. అయితేనేం, పద్మావతి మామూలు కథల్లో మల్లే గోపాలరావుపట్ల సెంటిమెంట్‌తోగాని, వైముఖ్యంతోగాని ప్రవర్తించదు। అతనిమీద అధారపడాలనుకోదు, అతడు చేసే సహాయాన్ని విరాకరించదు। తర్వాత ఒక దశలో భర్త, ఇతరుల ప్రేరణతో తనతో తెగతెంపులు చేసుకోవాలని వచ్చినప్పుడు పద్మావతి ఎంతో నిగ్రహంతో ప్రవర్తిస్తుంది. తను భర్తలో ఆశించేది చైతన్యవంతమైన వ్యక్తిత్వాన్నీ, స్వతంత్ర ప్రతిపత్తినీ తప్ప సాంప్రదాయికమైన 'రక్షణ'ని కాదనే విషయాన్ని సున్నితంగా, సూక్ష్మంగా, కార్యరూపేణా బయట చీకట్లో నిలుచున్న ద్రోహి మోహన్‌ని వెదురుబద్దతో కొట్టి అతని పిరికితనాన్ని, కాపట్యాన్ని భర్తకు ఋజువుచేసి స్పష్టం చేస్తుంది. అతనిలో నవచైతన్యాన్ని జాగృతం చేస్తుంది. తనపట్ల సుముఖత్వం చూపకపోయిన ఆడపడుచు ఇందిరని ఆపదలో ఆదుకుని ఆదరిస్తుంది. ఇలా ఎన్నోవిధాల పద్మావతిని 'ఆధునిక' వనితగా రచయిత్రి తీర్చిదిద్దారు. వినాదాలతో, సిద్ధాంతాలతో పురుషుల దుర్వ్యసనాలమీద సాగించే దాడితో, నిరూపించే 'ఆధునిక' ఆధిక్యం కాదది। నేటి సమాజంలో 'కుళ్ళు' శాలూకు బాధ్యత స్త్రీ పురుషులమీద సమానంగానే ఉన్నట్లు మీరజాక్షి, వనజాక్షి, విశాలాక్షి

పాత్రలద్వారా స్పష్టంచేసిన రచయిత్రి యువతరాన్ని ప్రబోధిస్తూ నూతన చైతన్యానికి పద్మావతిని ప్రతినిధిని చేశారు. తొలి ప్రయత్నమైనా కొత్తదనం ఉన్న రచన. చదువతగిన నవల.

[ ఆంధ్రప్రభ వారపత్రిక : 26-11-75 ] ❋

# ఓ నీలిమ కథ

— లత

'ఓ నీలిమ కథ'లో చపలచిత్తురాలైన ఒక యువతి మనస్తత్వాన్ని చిత్రించే ప్రయత్నం కనిపిస్తుంది. నీలిమ అనాథ. కాని దీనత్వం బదులు ధీమాతో తను కోరే కోరికలన్నీ తీర్చుకోవాలని చూస్తుంది. "మా అమ్మ దరిద్రం బాధా, మా నాన్న పెట్టే హింసా భరించలేక ఎవరితోనో లేచిపోయింది. నా మటుకు నేను ఏ మగాడి చేతిలోనూ పడిఉండదలచుకో లేదు" అంటుంది. నీలిమను నరసింహం, ఆదిలక్ష్మమ్మ అనే వృద్ధ దంపతులు పెంచుకుంటామని పిలిచి, ఇంట్లో పెట్టుకుంటారు. నీలిమకు వాళ్ళ ద్వారా సంగీతం శాస్త్రితోనూ, షాహుకారు విఠల్‌రావుతోనూ పరిచయం ఏర్పడుతుంది. శాస్త్రిని ఈవిడా, ఈవిడని శాస్త్రీ 'ప్రేమించారని' ఒకళ్ళ కొకళ్ళు యాథాలాపంగా చెప్పుకోవడం కనిపిస్తుంది మనకు. శాస్త్రికి డబ్బు లేదు కాబట్టి అతణ్ని చేసుకుంటే తన కోరికలు తీరవనుకోవడం, విఠల్‌రావుని చేసుకుంటే కోరికలు తీరతవి కాని స్వేచ్ఛ ఉండదను కోవడం - ఇలా నీలిమ ఊగిసలాడుతూ ఉంటుంది. ఆదిలక్ష్మమ్మ చని పోవడంతో నరసింహం నీలిమను తన ఇంటినుంచీ పంపించివేస్తాడు. నీలిమ గత్యంతరం లేక విఠల్‌రావును పెళ్ళి చేసుకోపడానికి అంగీక

రిస్తుంది. విఠల్‌రావు ఆమెకు వసతి సౌకర్యాలు కల్పించి, తన చికిత్స కోసం బొంబాయి వెళతాడు. నీలిమ పాత స్నేహితుడు శేషగిరి అనే ఒక వివాహితుడితో తిరుగుతూ ఉంటుంది. నీలిమకు ఖరీదైన హోటళ్ళలో, సినిమాలలో ఏదో ఒక మగాడితో కబురు చెబుతూ విలాసంగా తిరగడం సహజ ప్రవృత్తి. నిజానికి ఈ నీలిమ అనే వ్యక్తిలో తిండి, తిరుగుడూ యావ తప్ప, మరో గుణం - చివరకు సెక్స్ ప్రవృత్తికూడా - వ్యక్తి వైశిష్ట్యంగా ఏదీ కనిపించదు. "నువ్వు ఎప్పుడైనా ఎవరినైనా ప్రేమిం చావా?" అంటాడు శేషగిరి. "అది అతని ఆర్థికస్థితినిబట్టి ఉంటుంది" అంటుంది నీలిమ. "అసలు నీకు హృదయం అంటూ ఒకటున్నదా?" అంటాడతను. "ఉంటే నీలాటి వాడితో ఇలా ఎందుకు వస్తాను?" అని ఆమె సవాలు. "నేనంత నీచుడినా?" అని అతడు నిలదీస్తే, "ఆ మాట నేననలేదే" అంటూ ఏదో చెప్పి తప్పించుకో జూస్తుంది. చివరకు శేషగిరి తననను పొందాలని చూస్తున్నాడని తెలిసికూడా అతని ఇంటికి ఒంటరిగా వెళుతుంది. అతణ్ని రెచ్చగొడుతుంది. ఇంతలో శాస్త్రి తలుపుతట్టి వెళ్ళి పోవడం, శేషగిరి పిరికితనం ఆమెను బయట పడేస్తాయి. శేషగిరి భార్యకు భయపడతాడనీ, భార్య కనుమరుగైనప్పుడు నీలిమ వెంటపడతాడనీ ఒక చిత్రణ (128). ఇది వివాహితులైన పురుషుల చాపల్యంమీద ఆ . పణ. సౌందర్యం ఎరచూపి, తిండికోసం, విలాసాలకోసం డబ్బు ఖర్చు పెట్టించి, చివరకు అపేక్షగాని, సెక్స్ కాని ప్రతిఫలంగా ఇవ్వలేకపోయే స్త్రీల తత్వం కూడా అందులోనే వ్యక్తమౌతున్నది. ఇక్కడ నీతిని గూర్చి, వ్యక్తిత్వాన్నిగూర్చి, ఏ రకమైన సంసారపు విలువల్ని గూర్చి మాట్లాడటానికి వీల్లేదు. ఈ రకం 'నాగరిక జీవనం'లో స్త్రీ పురుషులు ఒకే నాణానికి బొమ్మా బొరుసా తప్ప మరేంలేదు. ఈ సత్యం నవలలో బాగా ప్రకటితమయింది.

కాకమ్మ అనే ముసలిది నీలిమకు పెద్దదిక్కు. 'విఠల్‌రావుతో మూడు ముళ్ళూ పడేదాకైనా నీ తిరుగుళ్ళు, విలాసాలు కట్టిపెట్ట'మని నీలిమకు బోధిస్తుంది. కాని నీలిమ వినదు. విఠల్‌రావుకు శేషగిరితో వ్యవహారం తెలిసి వచ్చి నీలిమతో సంబంధం రద్దు చేసుకుంటాడు. ఇక్కడ మళ్ళీ ఆరోపణ - విఠల్‌రావు నీలిమ ప్రవర్తనను అనుమానించాడనీ, అటువంటి అనుమానం మగడితో స్త్రీ - ఆధునిక స్త్రీ సంసారం చెయ్యడం కష్టమనీ, విఠల్‌రావు అంటాడు - "నువ్వు నన్ను ఎప్పుడూ ప్రేమించలేదు. ఆ సంగతి నాకు తెలుసు. అయినా సరే, సంతృప్తి పడ్డాను. నేను నువ్వు మారతావని చాలా ఆశ పడ్డాను.... నేను నా పెళ్ళాం ఇతరులతో తిరుగుతుంటే సహించి ఊరుకునే ఔదార్యం లేనివాడిని.... ఏరకంగా సహాయం చెయ్యమన్నా చేస్తాను. కాని పెళ్ళి మాత్రం చేసుకోను. విఠల్‌రావు ఇస్తున్న డబ్బుకీ, సెక్యూరిటీకి ప్రతిగా అతను కోరేది నీలిమ తన భార్యగా తనకు సంఘంలో అప్రతిష్ఠ తీసుకురాకూడదని, ప్రేమించమని కాదు. కాని ఏ రకం ప్రతిఫలమూ ఇవ్వకుండానే డబ్బూ, ప్రేమా అన్నీ తనకు లభించాలనే గొంతెమ్మ కోరిక కోరుతుంది నీలిమ. స్త్రీత్వం తాలూకు వింత తర్కం నీలిమలో పరాకాష్ఠ చెంది కనిపిస్తుంది.

చివరకు నీలిమ హుసేన్‌సాగర్ వైపు నడిచి ఆత్మహత్యా ప్రయత్నం తలపెట్టబోతూండగా, ఆమె ఆలోచనల్ని చదివే శక్తి ఉన్నట్లుగా వచ్చిన శాస్త్రి ఆమెను వెనక్కి మళ్ళించి, తనని పెళ్ళి చేసుకొమ్మని అడుగుతాడు. 'డబ్బు ఉండదు. తరచుగా పోట్లాటలు' అంటూ నీలిమ మళ్ళీ సందేహిస్తుంది. కాని శేషగిరివంటి వాళ్ళనుంచి తన్ను రక్షించేందుకైనా శాస్త్రి అవసరమేనని అంగీకరిస్తుంది. చివరకు తనకేం కావాలో తనకే తెలీని నీలిమ - "నేను స్వార్థపరురాలనూ, గర్విష్ఠినీ, పనికిరానిదాన్నీ, శాస్త్రీ.... అంటూ ఏడుస్తుంది, శాస్త్రి ఆమెను గుండెలకు హత్తుకుని నరసింహం

గారు ఆ స్తంతా తనకూ, నీలిమకూ వ్రాసినట్లు చెబుతాడు. నీలిమ సమస్యకు ఇది రచయిత్రి చేకూర్చిన పరిష్కారం. స్త్రీ చాపల్యాన్ని చివరంటా సహించేవాడూ, డబ్బు పుష్కలంగా ఖర్చుపెట్టి విలాసాల సమకూర్చ గలవాడూ, ఆదర్శపురుషుడని సారాంశం. స్త్రీ ఏం ఇవ్వగలదు ప్రతిగా అంటే, ఆమెను కనిపెట్టుకుని ఉండటమే అతనికి జీవిత పరమార్థమని సూచన. రచయిత్రి నీలిమలోకి పరకాయ ప్రవేశం చేసిన రీతిగా పాత్ర చిత్రణ సాగింది. (ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక, 8-11-78)

# ఇది తులసివనం

— లత

రచయిత్రి ఈ నవలకు 'ముందు మాట' వ్రాస్తూ గోపీచంద్ ప్రస్తావన తెచ్చారు - ఆయన ఓ అమ్మాయి కథ చెప్పారనీ, పూర్తి చేయకుండానే చనిపోయారనీ, వగైరా. అది చూడగానే అనిపించింది రచయిత్రి గోపీచంద్‌కేదో ఎసరు పెడుతూందని; ఇరవై పేజీలు చదవగానే తెలిసిపోయింది: 'ప్రేమోపహతులు' అనే గోపీచంద్ నవలకి ఇది మరో వెర్షన్ (పాఠాంతరం) అని. బుచ్చిబాబు, శరత్, చలం, ఫ్లాబర్ట్, మొపాసా అయ్యారు. ఇప్పుడు గోపీచంద్; అస్తిత్వవాదం, వ్యక్తి స్వేచ్ఛ - వీటి మీద తర్కిస్తూ, వివాహవ్యవస్థ శవితవ్యాన్నిగూర్చి ఊహాగానం చేస్తూ ప్రయోగాత్మకంగా 'శిథిలాలయం', 'ప్రేమోపహతులు' అనే నవలల్ని వ్రాశారు గోపీచంద్. ఆ రెండిట్లో 'శిథిలాలయం'లో మానవతావాద దృక్పథం ఉన్నది. 'ప్రేమోపహతులు' కామవాంఛా స్వైరవిహారానికి,

వివాహవ్యవస్థనే సాధనంగా, అవకాశంగా ఉపయోగించుకునే వ్యక్తుల్ని గూర్చిన ఊహాకల్పన, భార్యాభర్తలు సహకారపద్ధతిమీద ఒకరికొకరు పైవారిని తార్చడమే ఇతివృత్తం. ఇది అమెరికాలో ప్రయోగాత్మకంగా 'స్వాపింగ్ ఆఫ్ పార్ట్‌నర్స్' అంటూ కొందరు, యువదంపతులు పిక్నిక్ పార్టీల్లో, ఆటవిడుపు సమయాల్లో చేస్తున్నట్లు వినికిడి. కాని లతగారు కల్పించిన సన్నివేశంపై చెప్పిన రకంలో ఏ వర్గానికీ చెందదు. గోపీచంద్ సృష్టించిన సన్నివేశంలో ఉన్న బిగువు, ఒత్తిడి, ఆకర్షణ, సహజత్వమూ లత అనుకరణలో కనిపించవు. అందుకే వినాయకరావు, అహల్య దంపతులమధ్య హైమావతి మనిషిగా కాక, కేవలం కొయ్యబొమ్మగా మనకు కనిపిస్తుంది. హైమావతితోబాటు ఆమె భర్త రామకృష్ణనుకూడా రంగంలో దించిఉంటే కథ మరింత రక్తికట్టే అవకాశం ఉండేదేమో! రామకృష్ణను నేపథ్యంలోనే ఉంచి, ఇదివరకే అహల్యకు లొంగిపోయాడో లేదో విస్పష్టంగా కాకుండా, అనుమానంలో అలా ఉంచెయ్యడం కథకు ఏమీ దోహదం చెయ్యలేదు! పోతే 'మన్నారు' ఒక చచ్చుదద్దమ్మ! రచయిత్రి అరుందతిని వీరభారతనారిగా సృష్టించి, హైమను ఆమె దగ్గరకు చేర్చి, అరుంధతిద్వారా వినాయకరావుని స్టంట్ సినిమాలో లాగా తన్నించి కథను సొంత ఫక్కీలో ముగించారు. బాగుంది. హైమావతి పడిన బాధలకు ఇది కావ్యన్యాయంగా (పొయటిక్ జస్టిస్) ఒక రకం తృప్తికూడా ఇస్తుంది. కాని ఇందులో హైమావతి, వినాయకరావు, మన్నారు జీవంలేని పాత్రలు. అహల్య చరిత్ర, పుట్టు పూర్వోత్తరాలూ కొంత చెప్పడంవల్ల, 'ఇదో అవతారం కాబోలు' అనిపిస్తుంది. కాని అలాంటి అవతారం స్వయంగా ఇంకా పురుషుల్ని ఆకర్షిస్తూంది అంటేనూ నమ్మశక్యంగా ఉండలేదు! భర్తకు ఊడిగం చేస్తూ, హింసపడుతూ, నానాగడ్డీ కరుస్తూంది. అలాంటి హీనస్థితిలో ఉంది అహల్య! ఎలా చూచినా రచయిత్రి ముగింపులో చెప్పదలచుకున్న ఘుక్కి ఒక్కటే

"ఇక్కడ ఆడవాళ్ళు కొందరు అవసరంకొద్దీ చెడిపోవచ్చును, అవసరం కొద్దీ అప్రతిష్ఠపాలవవచ్చును. కాని ఇక్కడి మట్టిలో తులసివనాలు పెరుగుతున్నాయి" అంటే ఆడది మగవాడికి బానిసగా, వాడికి తొత్తుగా 'చెడిపోవడం' కుదరదు: స్త్రీకి ఆత్మాభిమానం, వ్యక్తిత్వం శీలంకంటే కూడా గొప్పవి. (ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక 12-5-76) ❋

# శిథిల సౌధం

— రాధాదేవి

పెరగటం జీవలక్షణం. శరీరంతోబాటు మనస్సుకూడా పెరగాలి. వయసు వచ్చిన తర్వాత ఎదురయ్యే పరిస్థితుల్నీ మార్పుల్నీ అవగాహన చేసుకుని తన వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకునేందుకు బాల్యంనాటి మనో ముగ్ధత్వం మొగ్గవిచ్చుకోక తప్పదు, విచ్చిన తర్వాత పడిలి ఫలంగా రూపొందటానికి సిద్ధపడక తప్పదు. ఇది పరిణామం. జీవ లక్షణం దీన్ని గుర్తించటానికి నిరాకరించి, లోకంమీదా సంఘంమీదా ఏవో ఆరో పణలు చేస్తూ, కన్నీళ్ళు కార్చటం, ఎవరికీ సానుభూతి కలిగించదు. ఈ నవలలో కథానాయిక శశి బాల్యావస్థనుదాటి మానసికంగా పెరగటానికి నిరాకరిస్తుంది. తన స్నేహితులతో - ఆడా మగా, అందులో వేణు ముఖ్యుడు - చిన్ననాటి బంధం యథాతథంగా వుండాలని ఆమె ఆశయం, అంతకంటే యితరమైన విలువల్నికానీ, క్రొత్తపైన అనుబంధాల్ని కానీ ఆమె ఊహించుకోటాన్నికూడా నిరాకరిస్తుంది. వయసు వచ్చినా వేణు పురుషుడనీ తాను స్త్రీనీ కూడా గుర్తించని శశి అనాలోచితంగా తండ్రి ఏర్పాటుచేసిన వివాహానికి ఎదురు చెప్పకుండా అదేదో లాంఛనం అన్నట్లు

వివాహం చేసుకుంటుంది. భర్తను వ్యక్తిగా, జీవితంలో సహచరునిగా, గుర్తించే బాధ్యత ఉన్నట్లు ఆమెకు తోచనే తోచదు. పైగా భర్తకు తన మనస్తత్వం, వేణుతో తనకుగల హృదయానుబంధం అర్థంకాలేదని ఆవేదన, ఆరోపణ! శశి కథలాంటిదే మాదవి కథ. మాధవి శశి స్నేహితురాలు, తను ప్రేమించిన నరేంద్రబాబు వచ్చి పెళ్ళి చేసుకుంటాను రమ్మని పిలిచినా సాహసించలేకపోతుంది. ఆమె జీవిత వైఫల్యానికి ఆమే కారణమౌతుంది! జీవితంలో విస్పష్టమైన విలువలు ఏర్పరచుకున్న వ్యక్తులు వాటినిగూర్చి కన్నీళ్ళు వదలటం, ఆరోపణలు చేయటం, మృత్యువు నాహ్వానించటం కాదు చేయవలసింది. ఆ విలువల్ని ఎలా పొందటమో, నిలబెట్టుకోవటమో ఆలోచించి బాధ్యతతో ప్రవర్తించాలి. ప్రయత్నమూ, సంకల్పమూ చూపని వ్యక్తులు జీవితాన్ని. జీవలక్షణమైన పెరుగుదలనూ నిరాకరిస్తున్నట్లే!

బాల్యస్నేహం మధురాతిమధురమైనదే! వయసువచ్చిన తర్వాత అది నిలవటమంటే, అప్పుడది వ్యక్తమయ్యే తీరు వేరుగా ఉండక తప్పదు! ఒకానొకచోట దానికి వివాహ వ్యవస్థతో సంఘర్షణ కావచ్చు. కాని సంఘర్షణకు కారణభూతులైన వ్యక్తుల మనస్తత్వ వైఖరి కఠినంగా, అన్యాయంగా మూర్ఖంగా వుంటే తప్ప ఆ సంఘర్షణ కథ గారకి కట్టదు. నవలలో వివాహవ్యవస్థకు ప్రతినిధియైన శశిభర్త భానుమూర్తిని కఠినుడని గాని, మూర్ఖుడనిగాని నిర్ణయించటానికి వీల్లేదు. శశి అతనిపట్ల చూపిన నిర్లక్ష్యమే శశిని అతడర్థం చేసుకోలేకపోవటానికి ముఖ్యకారణం! ఏతావాతా, కథలో రూపొందిన శశి మనస్తత్వంకానీ, మాధవి మనస్తత్వం కానీ జీవలక్షణమైన మార్పుకూ, పెరుగుదలకూ విముఖంగా వున్నాయి. అందువల్ల రచయిత్రి నవలలో వ్యక్తం చేసిన సంవేదనము కేవలం హృదయ దౌర్బల్యంగా (Sentimentalism) ఆలోచనారాహిత్యంగా అపహాస్యంపాలయే ప్రమాదం వుంది. (ఆంధ్రపత్రిక 17-1-65)

# నిష్కృతి

— ఆర్. ప్రమీలాకుమారి

పెద్దతరానికీ, చిన్నతరానికీ సంఘర్షణ అనే మాట వింటూనే ఉంటాము. ఇదే సంప్రదాయానికీ, సంస్కరణకూ మధ్య పోరాటంగా కూడా చిత్రించబడుతూ ఉంటుంది. ఒక కుటుంబ జీవితంలో దీని స్వరూపం చాలా విచిత్రంగా ఉంటుంది. సాధారణంగా మమకారంతోబాటు అనుభవం వల్లా, వయఃపరిణతివల్లా పెద్దతరంవారు చిన్నవారిమూలంగా బాధపడుతూ ఉన్నట్లూ, ఛాందసపు శృంఖలాల్ని త్రెంచుకోవడంలో చిన్నవారు చూపే పట్టుదల సమంజసంగానే కనిపించినా, అందులో స్వార్థం ఉన్నట్లూ తరుచు గోచరిస్తూ ఉంటుంది. కాని ఇందుకు భిన్నంగా ఉండటం సాధ్యం అని చూపుతూంది ఈ నవలలో వర్ణించబడిన కుటుంబగాథ. ఇందులో అవధాని తండ్రి ఛాందసుడుగా, సంప్రదాయవాదిగా కనిపిస్తాడు కాని అది స్వార్థమూ, కుత్సితమూ, క్రౌర్యమూ, వేసుకున్న వేషం మాత్రమే! అవధానికి వితంతువై పిల్లలతో ఇల్లు చేరిన మీనాక్షిమీదగాని, కొడుకు గోపాలంమీదగాని ప్రేమకాదుగదా, దయాదాక్షిణ్యాలుకూడా లేవు. అవధానిలోని క్రౌర్యమూ, కుత్సితమూ వ్యక్తమయ్యే తీరులోనే ఉన్నది చమత్కారం. కొడుకుని చిన్నతనంలో దిద్దితీర్చే నెపంతో వానిపై ప్రయోగించిన దెబ్బలూ, తిట్లూ మొదలుకొని, చివర కోడల్ని పరామర్శించే నెపంతో ఆమెమీద అత్యాచారం చేయబోయేదాకా అవిష్కృతమైన అవధాని పాత్ర ఈ నవలలో చెప్పుకోదగ్గ వాస్తవిక చిత్రణ. "ఆర్థిక విషయాల దగ్గర తల్లీ తండ్రీ, తోబుట్టువులూ, కన్నబిడ్డలూ - ఇటువంటి సంబంధాలేం పనిచెయ్యవు" అనే సూత్రంతో అవధానికి మొదటినుంచీ డబ్బే పరమార్థం అనే వ్యాఖ్యానంతో, ఆ పాత్రని తేల్చివెయ్యడంకూడా సాధ్యంకాదు!

మనిషి వ్యక్తిత్వం కొన్ని ఉపాధుల్ని ఆశ్రయిస్తుంది: డబ్బు, స్త్రీ, సంప్రదాయం, పేరు, ప్రతిష్ఠ వంటివి. ఉపాధులని ఒప్పుకోరు. ఆ మనిషిలో మంచితనం (ప్రేమ, కారుణ్యంవంటి 'ఆర్ద్రత') మౌలికంగా ఉన్నదా, లేదా? అనేదాన్నిబట్టి వ్యక్తిత్వం ఉపాధులద్వారానే అయినా భిన్నరూపాల్లో రూపం దిద్దుకుంటుంది. అందుకే మనుష్యుల్లో రాక్షసులూ ఉన్నారు. దేవతలూ ఉన్నారు అనడం - అవధానిది రాక్షసాంశ అనుకోక తప్పదు. కాని ఇది చప్పున పోల్చుకోలేని రాక్షసత్వం. కాలంమీదగాని స్పష్టంగా తెలిసిరాదు. అందులోనూ అవధాని కుటుంబ సభ్యులకు మరీ క్లిష్టమైన సమస్య. చక్కని కథాకథనమూ, మన స్తత్వ అవగాహనా ఉన్నాయి ఈ నవలలో. ఇటువంటి కనువిప్పు కలిగించే కుటుంబగాథలకు సామాజిక ప్రయోజనం దృష్ట్యా సాహిత్యంలో తప్పక విశిష్టస్థానం ఉంటుంది. (ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక 5-11-75) ❋

# తిరిగి దొరికిన జీవితం

— డి. కామేశ్వరి

సరోజ పెళ్ళి చేసుకుందామనుకున్న బావ ఏక్సిడెంట్‌లో మరణించడంతో ప్రారంభమవుతుందీ నవల. ఆ అత్తమామల పోషణభారం సరోజ మీద పడటంవల్ల ఉద్యోగాన్వేషణకై హైదరాబాదుకు ప్రయాణం కట్టుతుంది. రైల్లో జ్వరం, నీరసం వచ్చి నిస్సహాయస్థితిలో ఉండగా, తోడి ప్రయాణీకులు హైదరాబాద్‌లో డాక్టర్ కృష్ణమోహన్ దగ్గరికి తీసుకు వెడతారు. కృష్ణమోహన్ యువకుడూ, అవివాహితుడూ. అంతకంటే

విశేషం అతను మూడు మూర్తులా సరోజ బావ పోలికల్ని పుణికిపుచ్చుకోవడం! ఫలితం - 'బావా!' అంటూ కృష్ణమోహన్ గుండెలమీద వాలిపోయి వెక్కివెక్కి ఏడవటం ప్రారంభిస్తుంది సరోజ. కృష్ణమోహన్‌కి తల్లి తప్ప మరెవ్వరూ లేరు. ముఖ్యంగా మేనరికాలు లేవు. పోతే కృష్ణమోహన్ తల్లికి సరోజలో గతించిన కూతురు సీత పోలికలుకూడా కనిపిస్తాయి! ఇంకేం? సరోజ అదృష్టం రొట్టె విరిగి నేతిలో పడిన సామెతే అయింది!

కాని కృష్ణమోహన్ పెళ్ళి గీత అనే అమ్మాయితో ఇదివరకే నిశ్చయించబడింది. గీతకు అందం ఉంది, ఆకర్షణ ఉంది. డబ్బువల్ల, గారాబంవల్ల వచ్చే అతిశయమూ, అహంభావమూ ఉన్నాయి. డబ్బు ఖర్చుపెట్టడమూ, సరదాగా ఉండడమూ జీవితలక్ష్యం అనుకుంటుంది. సరోజకీ, గీతకీ వ్యక్తిత్వంలో గల భేదాలను విశ్లేషించి వివరించే ప్రయత్నమే ఈ నవలలో జరిగింది. కాని ఎంతమేర ఈ భేదాలను చూపినా, కృష్ణమోహన్ గీతను కాదని సరోజని చేసుకోవడానికి తగిన బలం సన్నివేశంలో చేకూరకపోవడంతో రచయిత్రి ప్రభాకర్ అనే నాలుగో వ్యక్తిని ప్రవేశపెట్టక తప్పలేదు. ఈ ప్రభాకర్ డబ్బులేని సామాన్యుడు. విద్యార్థి దశలో గీతని వలచి, వలపించుకొని భంగపడినవాడు. ఇదికూడా చాలక పోవడంతో గీత ఇదివరకే తల్లి అయిందనీ, ఆ బిడ్డ అనాథశరణాలయంలో పెరుగుతున్నాడనీ ఉట్టంకింపు. ఇదంతా దాచిపెట్టి నంగనాచిలానే కాకుండా దురహంకారంతో ప్రవర్తించిన గీతకేమిటి గతి? పేదపిల్ల సరోజపట్ల సానుభూతితో ఆమె గుణశీలాదుల్ని అభివ్యక్తంచేసి, కృష్ణమోహన్‌చేత తాళి కట్టించే ప్రయత్నంలో వికృతంగా తయారైన విలన్ గీత పాత్రకేమిటి నిష్కృతి? రచయిత్రి గీత ప్రభాకర్‌ని నిరాకరించలేదనీ, ఆ పని గీత తండ్రి గీతకు తెలియకుండా చేశాడనీ, గీత తను మోసపోయినట్లు భ్రమించి ప్రభాకర్‌పట్ల అసహ్యాన్ని పెంచుకున్నదనీ కల్పించి గీత పాత్ర

కొత్త దారి చూపారు. కాని గీతకి రచయిత్రి మొదట పట్టించిన మసి అంత సులువుగా వదిలినట్లు పాఠకులకి తోచదు. గీత తన ఆస్తిపాస్తుల్ని వదులుకుని కట్టుగుడ్డలతో వస్తే స్వీకరిస్తానని ప్రభాకర్ చేత పలికించి, గీతను అందుకు అంగీకరించేలా చెయ్యడం సవ్యమైన పరిష్కారమవుతుందా? కేవలం కలిమిలేముల కొలబద్దతో వ్యక్తిత్వాల్ని తేల్చివెయ్యడం మంచి అవగాహన కాదు. నవలలో కల్పన హద్దుమీరి వాస్తవికతను దిగమింగింది. సామాజిక సమస్యకు (సరోజ నిస్సహాయతకు) ఊహా కల్పన పరిష్కారం కానేరదు. (ఆంధ్రప్రభ వారపత్రిక ౮-12-7౬) ❋

# ఛాయ

— ఆలేటి నాగమణి

'ఛాయ', 'సంగమం' అనే రెండు నవలికల సంపుటి ఈ పుస్తకం.

'ఛాయ' నవలికలోని ప్రేమ సన్నివేశం ఇదివరకు కొన్ని రొమాంటిక్ నవలల్లో చిత్రించబడిన సన్నివేశమే. ముఖ్యంగా జేన్ ఆస్టెన్ 'అహం, అపోహ' నవల ఒక మూలాధారం.

('ప్రైడ్ అండ్ ప్రిజుడిస్' నవల ఒక మూలాధారం. తరువాత శ్రీమతి యుద్దనపూడి సులోచనారాణి 'విజేత' నవలలోని సన్నివేశానికి 'ఛాయ' ఇతివృత్తం అనుకరణ అని చెప్పడానికి సందేహించనక్కరలేదు. ఛాయ తిరస్కారమూ, వాసు ఆరాధనా, ఓర్పుతో ప్రేమించిన స్త్రీ హృదయాన్ని తన వైపుకు తిప్పుకునే ప్రేమికుని పాత్ర, ప్రేమికుల మధ్య

ఒక కుంటి అబ్బాయి (బాలు అనే ఛాయ తమ్ముడు) ఇద్దరినీ దగ్గరికి తెచ్చేందుకు సాధనం కావడం - ఇవన్నీ 'విజేత' నుంచీ పునరుద్ధరణలే! ఎటొచ్చీ మొదట్లో ఛాయ పాత్రపోషణ సహజంగా తోచదు. నవలికలో కొత్తదనం లేదు.

'సంగమం' నవలికలో రెండు కథలు. రాధ, రామారావు వర్ణాంతర వివాహం చేసుకున్న వైనం ఒక కథ. రాధ వైదికుడైన రామనాథశాస్త్రి కుమార్తె. రామారావు పక్కఇంట్లో ఓ గదిలో అద్దెకుండే ట్యూషన్‌మాస్టారు. అమ్మలక్కలు వేసే అపవాదు రాధనీ రామారావునీ జంట కలుపుతుంది. రాధకు రామారావుమీద ప్రేమాలేదు, పెద అభిప్రాయమూ లేదు. రామారావు ఊరువిడిచి వెళ్ళిపోతూ, పెళ్ళి చేసుకొమ్మని అడుగుతాడు. ఆ సన్నివేశంలో రామనాథశాస్త్రి కల్పించుకుని - "శాస్త్రిగారి కూతురు లేచిపోయిందంటారు. అననీ. శాస్త్రిగారు పెళ్ళి చేయలేదు, అమ్మాయి చెడిపోయింది, పెళ్ళి కాలేదు అనే మాటకంటే, లేచిపోయిందనే మాటను భరించగలను!.... సంఘం, నువ్వు రామారావును పెళ్ళి చేసుకుంటే ఏదో అంటుందన్న భయం, బెదురు నాకేం లేవు, వెళ్ళు, రాధా! నేను మనఃస్ఫూర్తిగా ఆశీర్వదిస్తూ ఒప్పుకుంటున్నాను" అంటూ ప్రోత్సహించి, ఇద్దరికీ రహస్యంగా ముడిపెట్టించి, ఊరినుంచి పంపించివేస్తాడు. పరిష్కారం చక్కగా ఉంది. విజయ అనే అమ్మాయి వీరి ఆదర్శజీవితాన్ని చూచి పాఠం నేర్చుకుంటుంది. తను ఎమ్.ఏ. చదివినా తనకంటే తక్కువ చదివిన రాజాని వివాహం చేసుకుంటుంది. సంస్కారానికి చదువు కొలబద్ద కాదు' కులం, మతం, అంతస్తు, హోదా, చదువు, ఏ ఒక్కదాన్లో అధికపడుకాని, చివరకు అందంగా లేనివాణ్ణి ఎలా ప్రేమించావు? అన్న ప్రశ్నకు విజయ జవాబు: "అతను చాలా మంచివాడు. సంస్కారం గల వ్యక్తి...." దేవుడి సృష్టిలో లేని తారతమ్యాలను, భేదాలను సృష్టించిన ఈ ఋూఘవా

సంఘం.... అందరూ ఈ అడ్డుగోడలకు ఇటుకలుగా మారిపోతుంటే, మరోతరంవారి భవిష్యత్తు మరెంత నికృష్టంగా ఉంటుందో ఊహించు ..." అంటూ స్వయం నిర్ణయం చేసుకున్న విజయను తల్లిదండ్రులు కాదనలేక పోతారు. ఎటొచ్చీ రాజు ధైర్యం చేస్తాడా అనే ప్రశ్నే మిగులుతుంది! రాజు విజయ నమ్మకాన్ని బలపరుస్తాడు. "విజయా! ఒకరిమీద ఒకరికి ఉండే ఈ నమ్మకమే చివరి మజిలీవరకు ఉండాలని ఆశిస్తున్నాను" అంటూ రాధ ఈ నవ దంపతుల్ని ఆశీర్వదిస్తుంది. యువతరంలో వివాహాన్ని గూర్చిన అభ్యుదయ దృక్పథం ఈ నవలికలో అభివ్యక్తమైంది.

(ఆంధ్రప్రభ వారపత్రిక 5-F-78) ❀

# అన్నపూర్ణ

— ఆలేటి నాగమణి

వివాహం ఆడపిల్లల ఇష్టానిష్టాలు తెలుసుకుని జరిపిస్తే జీవితాలు సుఖప్రదంగా ఉంటాయన్న ఉద్దేశాన్ని వ్యక్తం చెయ్యడానికి ఇంత నవల అవసరమా? అనిపిస్తుంది ఈ కథ చదివితే. ఇందులో పాపాలభైరవుడు రావు నలుగురు కూతుళ్ళ తండ్రి, ఒక చెల్లెలికి అన్న. రావు భార్య మరణించేటప్పటికి రావు చెల్లెలు అన్నపూర్ణకు పదకొండేళ్ళు. అన్నపూర్ణకు చివరిదైన భాను ఇంచుమించు సొంతకూతురే అయింది. భానుకి ట్యూషన్ చెప్పడానికి కుదిరిన మాస్టారుని ఇరవైరెండేళ్ళ అన్నపూర్ణ ప్రేమించి పెళ్ళి చేసుకున్నది. ఇక్కడ 'ప్రేమ' అంటే కొన్ని

పరిస్థితులవల్ల ఏర్పడిన పరిచయం, చనువూ తప్ప మరేంకాదు ; నవలలో అంతా అంతే ; కులహీనుడు, బికారి అయిన మాస్టార్ని చేసుకోవద్దని రావు అన్నాడు. అన్నపూర్ణ వినలేదు. అన్నతో తెగతెంపులు చేసుకుని వెళ్ళిపోయి, పెళ్ళి చేసుకున్నది. అన్నపూర్ణ ఒక ఆదర్శవ్యక్తి అని రచయిత్రి ఉద్దేశం. అందుకే నవలకు ఆమె పేరు. అన్నపూర్ణ ఆదర్శాన్ని మేనకోడళ్ళు సత్య, రుక్మిణి, రాధ ఆచరణలో పెట్టలేకపోతారు. సత్య రాఘవను చేసుకోవాలనుకుంటుంది. రాఘవకు ఆస్తిపాస్తులున్నాయి, కాని 'కులం' వేరట. రావు అంగీకరించడు. వేరు పెళ్ళి చేస్తాడు. అత్తింట్లో ఆదరణ లేక సత్య బాధపడుతుంది. సత్య పెళ్ళిలో మాట కలిసి రుక్మిణి మురళి అనే ఒక అబ్బాయిని చేసుకోవాలనుకుంటుంది. వాడికి కులం, డబ్బూ లేవు. వట్టి టైపిస్ట్. యథాప్రకారం రావు అంగీకరించడు. రుక్మిణికి గోపాలంతో పెళ్ళవుతుంది. రుక్మిణి గోపాలాన్ని అసహ్యించుకుంటూ అతని బ్రతుకు నరకం చేస్తూ కాలం గడుపుతుంది. రాధను కాలేజీలో సురేష్ అనే అబ్బాయి ప్రేమించి పెళ్ళి చేసుకుంటానంటాడు. రాధ ఈ విషయం తండ్రితో చెప్పడంకూడా అనవసరమనుకుని విషం మింగి చస్తుంది ; ఇన్ని ట్రాజెడీల తరువాత భాను, మొదటినుంచీ మేనత్త ఆదర్శాన్ని వల్లె వేసుకుంటున్న భాను, అక్కయ్య సత్య ప్రోద్బలంతో, అన్నపూర్ణ ఆసరాతో తండ్రిని ఎదిరించటానికి నిశ్చయించుకుంటుంది. చంద్రం అనే క్రైస్తవ యువకుణ్ని పెళ్ళి చేసుకోవడానికి వెళ్ళిపోతుంది. రావు సంగతేమిటి ? కూతుళ్ళందరిలో భానుమీదే అతనికి మమకారం. అతనితో భానుకే చనువుకూడా, ఒంటరివాడైన రావు భాను దగ్గరికి వెళ్ళలేక అన్నపూర్ణ దగ్గరకే వెళ్ళడం నవల ముగింపు. ఈ కథలో రావు కూతుళ్ళందరూ కులం కాని వాళ్ళనే చేసుకోవాలనుకోవడం ఒక అసహజత్వం. తరువాత ప్రతిసారి ఏదో ఆక్సిడెంట్ ద్వారానే యువతీ యువకులకు పరిచయమూ, ప్రేమా కలిగేట్లు చెయ్యడం, ఇక అంతకంటే

కల్పించలేని భావనా దారిద్ర్యాన్ని సూచిస్తుంది. వివాహంలో 'కులం' ఒక్కటే సమస్య కాదు. పోనీ ఆ సమస్యను కేంద్రంగా తీసుకుని వ్రాసిన నవలా ఇది, అంటే అదికాదు ! రావుకీ, అతని కూతుళ్ళకీ మధ్య ఏర్ప డిన తెర కేవలం అది రావు అభిజాత్యము, దురహంకారము అంటే రావు ఒక కొయ్యబొమ్మలా కనిపిస్తాడు. దురదృష్టవంతుడు ! నవలలో విశేష మంటూ చెప్పుకోదగిన గుణం ఏమీ కనిపించదు.

(ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక 30-6-76) ❋

# వీళ్ళా మనుషులేనా !

— కురుమద్దాలి విజయలక్ష్మి

కల్యాణి, మాధురి స్నేహితురాళ్ళు. మేనమామల పెంపకంలో పెరిగారు. చెయ్యగలిగినంతలో మంచి సంబంధాలే చూచి వివాహాలు చేసి భారం వదిలించుకున్నారు మేనమామలు. కల్యాణిని చేసుకున్న ఆనంద రావు చూపులకు అందగాడే కాని బొత్తిగా సంస్కారం, మానవత్వం లేని పశువు. అతని తల్లి అంకమ్మ ఒక దొంగబాబాగారి భక్తురాలు. ఆమె దృష్టిలో కోడలు ఒక బానిస. కల్యాణి అన్నింటికీ తల ఒగ్గుతుంది. కాని ఎందుకు తనని భర్త చేరదీయడం లేదో ఆమెకు అర్థంకాదు. చివరకు మనోరమ అనే పక్కఇంటి యువతిద్వారా ఆనందరావు దుర్వ్యసనాల మూలంగా రోగగ్రస్తుడై ఆపరేషన్‌తో పుంస్త్వహీనుడై, వివాహానికి అనర్హుడై కదుపరి లోకంకోసం, ఇంట్లో పనికత్తెకోసం కల్యాణిని కట్నం లేకుండా వివాహం చేసుకున్నాడన్న విషయం తెలిసివస్తుంది. కల్యాణి

చేసుకున్న వివాహం ఇలా ఒక జూదంలా ఆమెను వంచించడంతో ఆమె నిస్పృహాయురాలై పోయింది. మాధురి జీవితం గడిచినన్నాళ్ళూ సంతోషంగా భర్త ప్రేమానురాగాలకు కొరతలేకుండా సాగింది. ఆమె భర్త చందర్ ఆమెకు నిత్యమూ చీరెలూ, సారెలూ తెచ్చేవాడు. మాధురికి అతని సంపాదన ఏమిటో ఉద్యోగమేమిటో తెలియదు. చివరికి చందర్ స్మగ్లర్ల ఏజెంట్ అని తెలియడం, అతను జైలుకి వెళ్ళడం జరిగింది. మాధురికూడా వివాహం అనే లాటరీలో దగాపడ్డట్టే అయింది. సమాజంలో నేడు వివాహాన్నే నమ్ముకుని ఉన్న కాస్తాకూస్తా అందుకోసం వెచ్చించి, అందులో జీవికకు ఆధారం రక్షగా ఉంటాయనుకున్న యువతులు కొందరు ఇలా దిక్కు లేకుండా పోతున్నారనేది ఒక సమస్య. వాళ్ళకు జీవనోపాధి, రక్షగా కల్పించడం సమాజం బాధ్యత కదా! నవలలో మనోరమ, ఆమె అన్న భార్గవ, కల్యాణిని ఆదుకుంటారు. మాధురికి మహిళామండలివారి శిక్షణ తరగతులు జీవనోపాధికి దారి కల్పించాయి.

స్త్రీల సమస్యను ఒకదాన్ని చిత్రించడమే ఈ రచన ధ్యేయంగా తీసుకుంటే ఆ ధ్యేయం నెరవేరినట్లే. మనస్తత్వ చిత్రణ పాత్రల విశిష్టత వగైరా విషయాల్లో సాదాతనమే తప్ప చెప్పుకోతగ్గ విశేషం ఏమీలేదు.

నవల ముగింపులో కల్యాణికి జరిగిన వివాహాన్ని రద్దు చేయించి, భార్గవతో వివాహం జరిపించే సూచన ఉన్నది. కాని రచయిత్రి ఆ పర్యవసానాన్ని పాఠకుల ఊహకే వదిలిపెట్టారు! చివర భార్గవ కల్యాణికి సాన్నిహిత్యం పెరిగేందుకు వాళ్ళిద్దరూ ఒక ఇంట్లో ఉండటం, కల్యాణికి జ్వరం రావడం, తూలి పడిపోవటం భార్గవ సాయపడటం వగైరా వగైరా కల్పించికూడా వాళ్ళిద్దరికీ ముడిపెట్టడానికి సాహసించకపోవడంలో రచయిత్రి వ్యక్తం చెయ్యదలచుకున్న సున్నితత్వం ఏమిటో బోధపడదు. కల్యాణి ఆనందరావుకు ఏ విధంగానూ సన్నిహితురాలు కాలేదు. కాన

ప్పుడు కల్యాణిలో ఏదో మార్పుకోసం వేచిచూడాలనే సూచన అసంగతం కదా! సామాజిక సమస్య మాట అటుంచి, నవలా ప్రక్రియలో మనస్తత్వాలని గూర్చిన స్పష్టమైన అవగాహన లేకపోతే రచన రాణించదు. సమాజం మారాలి సరే, స్త్రీ మనస్తత్వం మారకపోతే ఎట్లా?

[ఆంధ్రప్రభ వారపత్రిక : 23-2-77]

# అపర్ణ

— విమలా రామం

శ్రీరామచంద్రులు లేని ఈనాటి లోకంలో సీతలూ లేరు. కాని పతివ్రతలు లేకపోయినా పవిత్రలు అనాడూ ఈనాడూ ఉన్నారు.... నిష్కళంక చరితలయిన 'అపర్ణ'లని మగ పశువులు నిశ్చింతగా బ్రతక నియ్యటంలేదు.... అందుకనే రాజశేఖరం గరళమయినా ఆ బాధనంతా తనే భరించాడు.... రాజశేఖరం నిజజీవితంలో ఎక్కడా కనిపించడు అన్న వాళ్ళు ఆగండి, ఒక్క క్షణం ఆలోచించండి - అంటూ నవల ప్రధానోద్దేశాన్ని గూర్చి రచయిత్రి తొలిపలుకులో పాఠకుల్ని ఉద్బోధించారు.

నవలలోని కథావస్తువును గురించి, దాని నీతినిగూర్చి ఎవరికీ పేచీ ఉండనక్కరలేదు. అపర్ణను సుధాకర్ అనే మగ పశువు మోసగించాడు; మత్తుమందిచ్చి ఆమెను చెరిచాడు. తరువాత తీసుకువెళ్ళి వేశ్యాగృహానికి అప్పగించాడు. అపర్ణ పారిపోయి రాజశేఖరం గదిలో దూరింది. తనతో పెళ్ళి తప్పిపోయిన 'హిమబిందు'లా ఉన్నదని రాజశేఖర్ అపర్ణమీద ఆప్యాయత పెంచుకున్నాడు. చివరకు ఆమె చరిత్ర విని ఆమెను చెయ్యి

వదలకుండా పెళ్లి చేసుకున్నాడు. అపర్ణ తల్లిదండ్రులు ధనవంతులు. చివర సీనులో అందరూ కలుసుకున్నారు. ఇదొక మామూలు కథ. కాని నవలగా రూపొందించడంలో ఆయా పాత్రల మనస్తత్వ చిత్రణలో, కథా వస్తువులోని 'నీతి'ని అంటే అపర్ణ పవిత్రతను కాని, రాజశేఖరం ఉదాత్తతను కాని నిరూపించడం రచయిత బాధ్యత. ఊరికే రౌడీపయిపులో చెబితే సరిపోదు. ఆ విధంగా పరిశీలిస్తే ఇందులోని పాత్ర చిత్రణ పూర్తిగా విఫలమైపోయిందనే చెప్పాలి.

అపర్ణ విషయం తీసుకుందాం. మత్తులో చెరచబడిన తరువాత, తనకు జరిగిన అవమానం, అపచారం తెలిసివచ్చాక అపర్ణ తన్ను నాశం చేసిన సుధాకర్‌తో యథాతథంగా మాట్లాడడం వగైరా సాగించిందంటే ఆమెనుగూర్చి, ఆమె పవిత్రతనుగూర్చి ఏమనుకోవాలి? "అతని మాటల్లో బుజ్జగింపు, ప్రాధేయత, పశ్చాత్తాపం.... ఇన్ని కనిపించాయి.... ఆ తరువాత ఏం చేయటానికీ ఆమె ఆలోచించవలసిన అవసరమే రాలేదు. కీలు బొమ్మలా అతడే చెపితే అదల్లా చేసిందామె. కట్టుబట్టలతో అతనితో వెళ్లిపోయింది.... నమ్మకం తప్ప అతనిమీద ఆమెకింకేం భావమూ లేదు!" అపర్ణ ఒక కీలుబొమ్మ అయితే, కీలుబొమ్మకు 'పవిత్రత' అనే ప్రసక్తే లేదుకదా! కీలుబొమ్మ కాకపోతే ఆమె వ్యక్తిత్వం ఏమిటో చిత్రించడం చేతగాక, అపర్ణ పాత్రను నానా భ్రష్టత్వం పట్టించడమే కనిపిస్తూంది నవలలో.

పోతే రాజశేఖర్, హిమబిందు బదులు 'ప్రాక్సీ'గా ఇతడు అపర్ణ మీద ఆప్యాయత పెంచుకున్నట్లు చిత్రిస్తూ వచ్చారు మొదటి వంద పేజీల్లోనూ, చివరిదాకాకూడా. ఏవో 'స్వీట్ నథింగ్స్' చెప్పుకుంటూ ఆ ఇద్దరూ గడపటాన్ని, ఒక కాంతం కథల రొమాన్స్‌లా సాగదీయడం, పేజీలు నింపటం రచన కాదు. ఇది కేవలం పాఠకుల్ని మోసగించడం! 82వ పేజీలో అపర్ణకు వేవిళ్ళు ప్రారంభం. మళ్ళీ 115వ పేజీలో అదే

తంతు. చూచే వాళ్ళందరికీ సంగతేమిటో తెలుస్తున్నా రాజశేఖరానికే తెలియదు. ఇంతవరకు రాజశేఖరం అపర్ణని తాకలేదు. మహాబుద్ధిమంతుడుగా ఉన్నాడు. 99 వ పేజీలో ఆవిడ అతని చేతుల్లో కరిగిపోయిందంటూ రాజశేఖరం విశ్వం అనే మిత్రుడితో చెబుతాడు. అప్పుడు విశ్వం అపర్ణ శ్రీమంతుల బిడ్డ అనే విషయం బయటపెట్టి, దానితోబాటు అపర్ణ వేవిళ్ళ విషయమై రాజశేఖరం కళ్ళు తెరిపిస్తాడు. రాజశేఖరం 108, 109 పేజీల్లో అపర్ణపట్ల తప్పుం 'మగపశువు'లా ప్రవర్తిస్తాడు. "స్ప్రింగులా ఆమెమీదికి లంఘించాడు. ఆమె కంప ఘెళ్ళుమంది. బుగ్గ బూరెలా ఉబ్బిపోయింది." తరువాత ఈ హీరో ఏడుస్తాడు, పెడదెబ్బలు పెడతాడు. ఏడ్చి భారం తగ్గించుకుని, ఆమె కౌగిట్లో చవిచూచిన మాధుర్యాన్ని తలుచుకుని, దక్కిందే దక్కుడు అనే ఫిలాసఫీతో (111 వ పేజీ), 'హిమా' అంటూ ఆమె దగ్గర చేరతాడు! అప్పుడో టెలిగ్రామ్ వస్తుంది రాజశేఖరం తల్లి రైలుకి వస్తున్నట్లు. అపర్ణ అపరకీలుబొమ్మలా అంతకు పూర్వమేమీ జరగనట్లు 'ఏమండీ, హార్లిక్స్ తాగి వెళ్ళండి' అంటుంది. తల్లితో రాజశేఖరం అపర్ణ గర్భంలోని పాపాయి తన ప్రయోజకత్వమేనని చెప్పి, ఆమె పెళ్ళికి వెంటనే ఆమోదించేలా చేస్తాడు. ఇది రాజశేఖరం ఉదాత్తత రాజశేఖరాన్నిగూర్చి 'ఆగండి, ఒక్క క్షణం ఆలోచించండి' అని ప్రత్యేకంగా అభ్యర్థించారు రచయిత్రి ఆలోచించకపోవడమే మంచిదేమో!

(ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక, 29-12-76) ❋

# పసంఘర

— విమలా రామం

మధ్యతరగతి లేమిలో మగ్గుతున్న విద్యావతి స్టెనో ఉద్యోగానికి వెళ్లి, బాస్ హృదయాన్ని దొంగిలించి, బాస్‌నా, బాస్ తమ్ముళుంగారిని పెళ్ళాడటం (తమ్ముళుంగారు ఆమెకు ఉద్యోగం లభించేలా పరోక్షంలో సాయంచేసి, ప్రత్యక్షంలో గొప్ప ఆరాధకుడై, వివాహానికి ఆమెను అంగీకరింపజేశాడుకూడా) అనే 'కఠిన సమస్య'లో పడి, చివరకు బాస్‌నే పెళ్లి చేసుకోవడంద్వారా తన గొప్పతనాన్ని నిరూపించుకున్న కథ - కాదు, తియ్యని కల - ఈ నవలలో 228 పుటల్లో మత్తుగా విస్తరించి ఉన్నది: కథనూ, కథానాయిక ఆలోచనా ధోరణినీ సూక్ష్మంగా పట్టియిచ్చే ఈ పేరా చదివితే చాలు.

"గుణం, రూపం, ప్రేమ, అభిమానం అన్నింటిలోనూ ఒకరి కింకొకరు తీసిపోరు. అలాంటివాళ్ళు దొరకటం అరుదు. చిత్రం, యిద్దరూ నాకు మనసిచ్చారు. నా బాధ్యత మనస్ఫూర్తిగా పంచుకుందామను కున్నారు.... కాని నా అదృష్టమో, దురదృష్టమో, ఇద్దరూ అన్నదమ్ములే అయ్యారు. ఒకరికి తెలియకుండా యింకొకరు. ఇప్పుడు ఆయనకిలా అయింది. (పెద్దవాడికి ఆక్సిడెంట్‌లో కళ్ళకి ప్రమాదం సంభవించి, కళ్ళు వస్తాయో, పోతాయో అన్న స్థితిలో ఉండటం) నన్నూ, వాళ్ళనీ అంటర్నీ సందిగ్ధంలో పెట్టింది. అన్నకోసం తన ప్రేమను త్యాగం చేస్తున్నాడు ప్రసాద్. ఇప్పుడు నాకోసం తన ప్రేమను చంపుకుందామనుకుంటు న్నారు వాళ్ళన్నయ్య. ఇద్దరి మంచివాళ్ళ మధ్య పోటీ - రెండు మంచి మనసులమధ్య పోటీ ఏమైకాని నాకోసం వాళ్లింత చేద్దామనుకుంటు

నాకోసం తన సర్వస్వాన్నీ వదలుకోవడానికి సిద్ధమవుతోంది! వద్దు. ఇంతమంది త్యాగాలు నేను భరించలేను...." అంటూ కథానాయిక వసుంధర తన సమస్యని స్నేహితురాలితో చెబుతుంది...."వేనిటి దై నేమ్ యీజ్ వుమన్!" అనిపించక తప్పదు. ఇలా కన్నెపిల్లల మనస్సుల్లో 'వేనిటీ'ని పెంచి, లేనిపోని ఆశలతో అతిశయంతో వాళ్ళని జీవితసత్యాలకు దూరంచేసే నవలల్నేమనాలి?

(ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక : 13-4-77) ❋

# కిరణ్మయి

— విమలా రామం

శ్రీమతి విమల, శ్రీ రామచంద్రరావు దంపతుల కలం పేరు 'విమలా రామం'. వీరి జంటరచన ఈ నవల. ప్రచురణకర్తలు దీన్ని 'కాల్పనిక నవల' అన్నారు. దీనిలోని పాత్రల ప్రవర్తన వాస్తవికంగా ఉన్నదా లేదా అని సందేహం వచ్చి కాబోలు కాల్పనిక నవల అన్నారు. అంతకంటే 'సెంటిమెంటల్ నవల' అంటే సముచితంగా ఉంటుంది. 'సెంటిమెంట్' మంచిదేకాని అవధులుదాటి వెర్రితలలు వేస్తే 'సెంటిమెంటలిజమ్' అయి అనారోగ్యకరంగా పరిణమిస్తుంది. మతులు పోగొట్టుతుంది. ఏ భావాన్నిగాని (సెంటిమెంట్‌ని) ఆదర్శంగా, ఏకైక లక్ష్యంగా రూపొందించుకోవడంలో 'సెంటిమెంటలిజమ్' ఏర్పడే ప్రమాదం ఉంది. ఆ ప్రమాదాన్ని ఆత్మవిమర్శతో, ధర్మజిజ్ఞాసతో తప్పించుకోవడంలోనే ధర్మస్వరూపం అవగతమౌతుంది. ఉదాహరణకు గాంధీగారు 'అహింస'

అనే భావాన్ని ఎలా రూపొందించారో చూస్తే తెలుస్తుంది. సత్యానికీ అహింసకూ తగాదా రాకూడదు. అహింసకూ పిరికితనానికీ సంబంధం లేదు. నిజమైన అహింసావాది ఒక్కొక్క పరిస్థితిలో (ఆడవాళ్ళని గూండాలు మానభంగం చేసే పరిస్థితిలో) 'హింస'కు కూడా పూనుకోక తప్పదు - అంటూ ఆచరణలో 'అహింసా' తత్వానికి వ్యాఖ్యానాలు చేస్తూ వచ్చారు. ప్రస్తుతం ఈ నవలలో 'త్యాగం' అనే సెంటిమెంట్‌కి పట్టం కట్టారు. దానికి మూలం 'ప్రేమ'ట. "ప్రేమ ఒక పూవు. త్యాగం దానికి తావి." ఈ సూత్రంమీద నవలలోని పాత్రలందర్నీ నడిపించే ప్రయత్నం చేశారు. అందులో 'సత్యం' మొదటి కాజువల్టీ. అబద్ధం ఒకదానిమీద ఒకటి చేర్చుతూ పేకమేడ అల్లిన కుటుంబం, దాన్ని నిలపెట్టడానికి అవతలి వాళ్ళైన ఇద్దరు డాక్టర్లనీ, పద్మజ అనే అమ్మాయినీ ఒప్పించి, అందులో భాగస్థుల్ని చేసుకున్నారు. కాని ప్రసాద్ అనే యువకుడు 'సత్యం'తో ఈ పేకమేడని ఉఫ్ అని ఊదేటప్పటికి, అంత శ్రమా వృథా అయింది. పోనీ గడిచినన్ని రోజులు గడవగా అబద్ధం నిలబెట్టి సాధించినదేమిటి అంటే, కుటుంబంలో ఒకరికోసం ఒకరు త్యాగంచేసే ప్రయత్నంలో మొత్తం అందరూ మనస్సంక్షోభానికి లోనయారు తప్ప మిగిలిందేమీ లేదు.

కిరణ్మయి అనే కన్నెపిల్లకి బ్లడ్‌కేన్సర్, ఆ అమ్మాయికి ఆ సంగతి తెలీకుండా జీవితంమీద ఆసక్తి ఇనుమడించేలా చేస్తే ఆమె బ్రతికే అవకాశం ఉంటుందేమో ప్రయోగాత్మకంగా చూడవచ్చు. ఒక ఛాన్సు తీసుకోవచ్చునన్నాడు డాక్టర్. అమ్మాయికి జబ్బు సంగతి తెలీకుండా ఉంచడం ధర్మాన్ని కాదు. ఆమెకు జీవితంమీద ఉత్సాహాన్ని కలిగించడానికి ఎన్నో మార్గాలున్నాయి. కాని ఆ అమ్మాయి అక్క రాజ్యలక్ష్మి తను ప్రేమించి పెళ్ళి చేసుకోవడానికి సిద్ధంగా ఉన్న బావ రవిచంద్రని వంచి వలపింపచేసుకొమ్మనీ, అది తన ఆరోగ్యస్థితి దృష్ట్యా అవసరమనీ

కథ చెప్పి చెల్లెలిని ఒప్పిస్తుంది. ఇక్కడే పడింది తప్పటడుగు ! కిరణ్మయి కొన్నాళ్ళకి నిజంగా బావని ప్రేమించేస్తుంది ! కానీ అక్కకోసం తనప్రేమని త్యాగం చెయ్యాలి కదా ! ఇప్పుడు అక్క చెల్లెలికోసం చేసిన త్యాగానికి చెల్లెలి బదులు త్యాగం సిద్ధమయింది ! బావ రవీంద్రకూడా 'త్యాగాని'కే సిద్ధపడి మరదలితో నాటకమాడాడు. కాని కొంతదూరం వెళ్ళాక తన నాటకానికి స్వస్తి చెప్పక తప్పదని ఊరుకున్నాడు. ఈ పరిస్థితిలో ప్రసాద్ అనే యువకుడు తటస్థపడతాడు. ప్రసాద్ కిరణ్మయిని ఆరాధిస్తున్నానంటాడు. పెళ్ళాడతానంటాడు. డబ్బున్నవాడు, యోగ్యుడు. ఇంతకంటె పరిష్కారం ఎం కావాలి ? కాని 'త్యాగం' అనే సెంటిమెంట్‌ని సాగదీయడానికి కంకణం కట్టుకున్న రచయితలు 'ప్రసాద్'ని ఒక 'న్యూసెన్స్'గా చిత్రించి, ఆ సన్నివేశంలో రవీంద్రచేత 'నేనే కిరణ్‌ని పెళ్ళాడతాను, నువ్వెవడివి ?' అనిపిస్తారు. రవీంద్ర మాటలకీ, ప్రవర్తనకీ అర్థంపర్థం లేదు ! పోతే, ప్రసాద్‌నుంచి వస్తున్న ప్రమాదాన్ని తప్పించడానికి పెళ్లి పత్రికలుకూడా ముద్రింపించి, రాజ్యలక్ష్మిచేత రవీంద్ర కిరణ్‌కి ముడిపెట్టించే 'త్యాగం' చేయించడానికికూడా రచయితలు సిద్ధపడ్డారు ! కాని, విచిత్రమేమిటంటే, కథ ముగింపులో ప్రసాద్ నిజాన్ని కిరణ్మయితో చెప్పేస్తాడు. పేకమేడ కూలిపోతుంది. కిరణ్మయికి నిస్సత్తువ తప్ప జబ్బు ప్రమాదం గడిచిపోయిందని డాక్టర్ చెప్పినా కిరణ్మయి ఆ మాటని నిజం అని నమ్మలేదు ! అదీ జరిగిన అబద్ధాల నాటక ఫలితం ! ఇప్పుడు కిరణ్మయి నిజంగానే మృత్యువు నాహ్వానిస్తుంది ! (డాక్టర్ కాదన్నా) కారణం 'ప్రేమ' అనే సెంటిమెంట్ "పునర్జన్మ అనేది ఉంటే. బావా ! నేనెక్కడున్నానో నువ్వు వెతుక్కుంటూ వస్తావా ?" అంటుంది రవీంద్రతో చివరి మాటగా !

రవీంద్ర తప్పుకుని ప్రసాద్‌ను తన స్థానంలో నిలిపి, కిరణ్మయి మనస్సుని మళ్ళించే అవకాశం వచ్చినప్పుడు రవీంద్రచేత అసంబద్ధంగా ప్రవర్తింపచెయ్యటంతో రచయితల 'సెంటిమెంటలిజమ్' యొక్క మితి

లేనితనం పరాకాష్ఠ నందుకున్నది. కాని ప్రసాద్ పాత్రను మళ్ళీ ప్రవేశ పెట్టి 'సత్యమేవ జయతి' అనే విధంగా నవలను ముగించడంలో ఇంగిత జ్ఞానం పొందిన అంతిమవిజయంకూడా కనిపిస్తుంది। అందుకు రచయిత్రిని అభినందించాలి। (ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక 13-8-75) ❋

# ఆశల వల

— గోవిందరాజు సీతాదేవి

ఇరుకు జీవితం. ఇరుకు ఇల్లు. ఇరుకు మనసులు. ఇరుకు మనుష్యులు" అని గొణుక్కుంటుంది పద్మప్రియ. గుమాస్తా కాంతారావు ముగ్గురు కూతుళ్ళలో పద్మప్రియ రెండోది. వయసొచ్చిన కూతుళ్ళ పెళ్ళి సమస్యతో కాంతారావు దంపతులు పడే అవస్థ ఈ నవలలో ఇతివృత్తం. రచయిత్రి చిత్రణలో పద్మప్రియ ఒక వార్నింగ్. పెద్ద పిల్ల పరిమళలో అణకువ, విధేయత, నిర్లిప్తభావం ఒకవైపూ, చిన్నపిల్ల ఇందిరలో ప్రయోజకత్వం వైపూ, షార్టుహాండూ నేర్చుకుని సంపాయించి తండ్రికి చేదోడు వాదోడు కావడం వగైరా కలాపాలు మరోవైపూ ఆదర్శప్రాయమైన చిత్రణ. ఇలా పాత్ర చిత్రణా, కథాక్రమమూ వగైరా అన్నీ ఒక వర్గము - అంటే మధ్యతరగతి క్రిందివర్గపు అల్పాదాయ కుటుంబాలవారికీ, ముఖ్యంగా ఆ కుటుంబాల్లో చదువుకుంటూ, నవలలు, సినిమాలు చూస్తూ, ఒకానొక వూహాలోకంలో స్వప్న విహారాలు చేసే ఆడపిల్లలకూ ఉపదేశంగా ఉద్దేశించబడినవి. కాంతారావు ఇరుగుపొరుగు దంపతుల్లో నగలు చేయించుకోవాలనే దృష్టితో పిల్లలకు పాలూ తిండీ వగైరా విషయాల్లో పొదుపు చేసే తల్లీ, ఉన్నదానికంటే పెద్దవాటాకు మారడమే ధ్యేయంగా ఎదురు

చూచే ఇల్లాలూ, స్కూటర్‌మీద భర్తతో తిరగాలనే సరదాతో మెడలోని గొలుసైనా అమ్మడానికి సిద్ధపడే నవలామణి కనిపిస్తారు. జీవితం 'ఆశల వల'. ఇందులో చిక్కుపడి వీళ్ళంతా సతమతమవుతున్నారు అంటూ ముగింపు. వాస్తవికతను ఆధారం చేసుకుని నడవడం ఈ నవల మంచి లక్షణం. ఉపదేశం 'కాంతా సమ్మితం' గానే ఉంది.

## జానకి విముక్తి

— రంగనాయకమ్మ

"భార్య కదలడం, మెదలడం, కూర్చోడం, నించోడం అంతా తనకోసమే. తన ఇష్టంకోసమే. కిటికీ దగ్గర నుంచుంటే అక్కడెందుకు నించున్నావంటాడు. కుర్చీలో కూర్చుంటే అలా ఎందుకు కూర్చున్నా వంటాడు. ఆలోచిస్తున్నట్లు కనబడితే ఎందుకు ఆలోచిస్తున్నావంటాడు. పుస్తకం చేతిలోకి తీసుకుంటే అస్తమానూ పుస్తకాలేమిటంటాడు. తోడేలు జింకని ఇలాగే వేటాడుతుంది. దాన్ని నించోనివ్వదు. కూర్చో నివ్వదు. గడ్డి ముట్టనివ్వదు. నీళ్ళు తాగనివ్వదు. దాని వెంటబడి పరుగెత్తించి, పరుగెత్తించి, పరుగెత్తించి అలవగొట్టి, నీరసపెట్టి, స్పృహ తప్పించి మీదకురికి, పీకి, కొరికి చంపేస్తుంది. వెంకట్రావు తోడేలంత నైపుణ్యంతో వేటాడుతున్నాడు జానకిని. ప్రేమ వినోదం అనుభవించే సంస్కారం లేని అతను భార్యతో వేట వినోదం అనుభవిస్తున్నాడు ప్రతి నిముషం." జానకీ వెంకట్రావుల ఈ రకం దాంపత్యాన్ని సుదీర్ఘంగా వర్ణించే నవలలో రచయిత్రి ధ్యేయం జానకి విముక్తి విశేషంగా సొవ్య

మవుతుంది అనే ప్రశ్నను సమాజపరంగా, వ్యక్తిపరంగా, మార్క్సిస్టు సిద్ధాంతపరంగా పరిశీలించి, దాని పరిష్కారం ఒక పరిణామరూపంగా ప్రదర్శించడమే 'ప్రస్తుత వ్యవస్థతో వివాహం' అంటే దోపిడీ. ఆ విధంగా మగవాళ్ళూ, ఆడవాళ్ళూ వర్గశత్రువులు. ఈ వైరుద్ధ్యం నశించి సమానత్వం ఏర్పడేందుకు దీర్ఘకాలికమైన పరిష్కారం కమ్యూనిజం రావటమే. ఆ చారిత్రక పరిణామం సిద్ధించే లోపల ఒక్కొక్క సంసారంతో ఒక్కొక్క సంఘర్షణ, ఒక్కొక్క పరిణామం, దానికి తగిన పర్యవసానం ఏర్పడుతూనే ఉంటాయి. అందులో భర్త భార్యకు శత్రువా? మిత్రుడా? అనే మౌలికమైన వ్యక్తిగత సంబంధాన్ననుసరించే ఒడిదుడుకులెన్ని సంభవించినా, ఆడది చచ్చిపోవడమో, బ్రతికి బయటపడటమో చివరకు తేలుతుందని రచయిత్రి అభిప్రాయం. శత్రువై వేటాడే భర్త చేతిలో పడి చచ్చిపోయాడనుకుంటే ఆ భర్తని వదిలిపెట్టడమే విముక్తి మార్గం. జానకీవెంకట్రావుల దాంపత్యం మూషికమార్జాల న్యాయాన్ని అనుసరిస్తున్నా, జానకి ఆ సంగతి తానుగా గ్రహించేంత స్థాయికి ఆమె చైతన్యం వికాసించేదాకా ఆమెకు విముక్తిమార్గం ఏర్పడటానికి వీల్లేదని రచయిత్రి నవల మొదటి భాగంలో విపులంగా చర్చించారు. జానకి అన్నగారైన సత్యం జానకి ఎప్పటికీ వెంకట్రావు దగ్గర 'మనిషి' గా బతకలేదన్న సత్యాన్ని వెంటనే గ్రహించి, జానకి విముక్తికోసం తాపత్రయ పడతాడు. కాని జానకి అనుభవంద్వారా ఆ పరిస్థితి అవగతమయ్యేదాకా పరిష్కారం సాధ్యంకాదని మూర్తి అనే మార్క్సిస్టు సత్యానికి పాఠాలు చెబుతాడు. ఈ సిద్ధాంతపరమైన మొదటిభాగంలో 20 పేజీలు సాగింది. (105 - 128)

జానకికి విముక్తి కలిగించాలని ఆమెను భర్తదగ్గరనుంచి సత్యం పుట్టింటికి తీసుకువచ్చినా, శత్రువు స్వభావం గుర్తించని జానకి వెంకట్రావుతో మళ్ళీ కాపురానికి వెడుతుంది. ఇక్కడ మొదటి భాగం ముగిసి నవల రెండోభాగం ప్రారంభం అవుతుంది. 208 పేజీలు సాగిన రెండో

భాగం అనవసరంగా దీర్ఘీకరించబడినట్లు అనిపిస్తుంది. వెంకట్రావు నిజ స్వరూపాన్ని గ్రహించడంలో జానకి ఒక్క అంగుళం ముందుకు వెళ్ళినట్లు తోచదు. మొదటి 320 పేజీల్లోనూ. అక్కడినుంచి జానకికి నెల తప్పినట్లు తెలియడమూ, వెంకట్రావు ఆఫీసులో అమ్మాయితో తిరుగుతున్నాడని తెలియడమూ జానకిలో పూర్తిగా మార్పు తెస్తాయి. జానకికి వెంకట్రావు స్వార్థగాము, అతని నీచత్వం కూడా దుర్భరమనిపించి, సంసారాన్ని త్యజించి తనదారి చూసుకోవడమే తనకు కర్తవ్యమనేంత మార్పు ఆమెలో వస్తుంది. నవల రెండో భాగం జానకి ఆ ఇల్లు వదలి బయటికి నడవడంతో ముగుస్తుంది. తరువాతి కథ మూడో భాగంగా వస్తుందట!

జానకిని వెంకట్రావు తల్లి సహాయంతో వేటాడిన కథ రెండో భాగంలో 400 పేజీలకు పైగా గుడుగుడు గుంచంగా సాగినా, రచయిత్రి పాత్రపోషణలో, మనస్తత్వ చిత్రణలో సాధించిన విజయాలు కొన్ని ఉన్నాయి. అందులో ప్రధానమైంది, రచయిత్రి ప్రతిభను గీటురాయిగా పట్టిఇచ్చేది జానకి మనస్తత్వ చిత్రణ. తల్లి తీర్థయాత్రలకు వెళ్ళిందని భర్త చెప్పడంతో, అత్త లేని సమయంలో భర్తతో తాను కోరే సామరస్యాన్ని సాధించవచ్చునని అనే ఆశతో జానకి భర్త పిలవగానే పుట్టింటి నుంచి తిరిగివస్తుంది. గడపలో అడుగుపెట్టగానే అత్త సాక్షాత్కరిస్తుంది. ఇక్కడ జానకికి తగిలిన 'షాక్'ని నిర్దేశించి చెప్పడంలో, జానకి స్వభావ విశిష్టతను హృదయగతంగా పాఠకులకు అందివ్వడంలో రచయిత్రి సాధించిన విజయం గొప్పది. జానకి చిన్నతనంలో స్కూలునుంచి వస్తూ, రైలు పట్టాలు దాటబోతూ, కాలిచెప్పు పట్టాల్లో ఇరుక్కోగా వంగి తీసుకుంటూండగా, తటాలున రైలింజను పెద్దమోతతో మీదికి రావడం గుర్తు వస్తుంది ఆమెకు అత్తను చూడగానే, రైలింజన్ను చూచి [illegible] తెలీక స్తబ్ధతలో, భయంతో స్థాణువై పోయిన జానకిని మరెవ్వరో పక్కకు

తోసి రక్షించారు. అప్పటిక్కాని ఆమె చైతన్యం మేల్కొలేదు! తెలివి వచ్చి వెంటనే భోరున ఏడ్చేసింది.

వెంకట్రావు దుష్టపాత్ర అయినా తల్లికీ, భార్యకీ మధ్య అబద్ధాలతో, బుకాయింపులతో నీచంగా, చౌకబారుగా ప్రవర్తించేందుకు కారణమైన అతని ఇన్ఫీరియారిటీ, సంస్కార విహీనతా చక్కగా చిత్రింపబడ్డాయి. మనకు విసుగు కలిగేంతగా విస్తరింపబడ్డాయికూడా. ఎటొచ్చీ జానకీ వెంకట్రావుల సంఘర్షణ భిన్నసంస్కారాల మధ్య సంఘర్షణగానే తోస్తుంది. చిన్నతనంనుంచీ ప్రేమించే సాత్వికులైన తల్లిదండ్రుల దగ్గర నిమ్మళంగా పెరిగిన జానకికీ, చుప్పనాతితనమూ, పేరాసలతో నోరు పెట్టుకొని గడుసుగా బ్రతికిన తల్లి బెదిరింపుల్లో, ఆ మూసలో తయారైన వెంకట్రావుకీ ఉత్తర, దక్షిణాలమధ్య ఉన్నంతదూరం ఉన్నది ప్రతి చిన్న విషయంలోనూ! ఈ సత్యాన్ని ఆవిష్కరించడంలో నవలకు కృతకృత్యత ఉన్నది. మిగతా సిద్ధాంత విషయాలంటారా - సిద్ధాంతాలు ఎవరి అభిమ లకు తగినవి వారికి ఉంటాయి. సిద్ధాంతాలతో జీవితాలు తెల్లారవనీ, చైతన్యవికాసం అనుభవంద్వారా క్రమంగానే సాధ్యమనీ, ఎవరికీ ఎవరూ విముక్తి కలిగించలేరనీ, ఆ ప్రేరణ వ్యక్తిలోనుంచే రావాలనీ రచయిత్రి అంగీకరించారు. (ఆంధ్రప్రభ వారపత్రిక 2-12-81)

# ఇంద్రధనుస్సు

— రేపనూరి శమంత

"జీవితంలో ఎన్నో రంగాలు. ఒక్కొక్క రంగంలో ఒక్కొక్క పాత్రకు ఒక్కొక్క అనుభవం.... ఇంద్రధనుస్సులోని రంగులవలె జీవి

తంలో ఎన్నో సంఘటనలు. ఒకటి వెనుక ఒకటి సంభవించి, ఎన్నో మార్పులు కలుగుతూ, ఒకదాని కొకటి సంబంధం లేకుండా తగ్గుతూ, హెచ్చుతూ చివరికి ఇంద్రధనుస్సు స్వరూపమే లేకుండా అదృశ్యమైనట్లే జీవితమంతా మిథ్యా, మాయా అనిపిస్తుంది." నవలకు ముగింపు వాక్యాలివి. రచయిత్రి తన దృక్పథాన్నిలా వాచ్యంచేసి, నవలను ఎలా అర్థం చేసుకోవాలో చెప్పారు. నవలా ప్రక్రియలో సన్నివేశాలకూ, పాత్రలకూ ప్రాధాన్యం. సుమారు ఏభై, అరవై ఏళ్ళ కాలం నడిగిన కథను నవలా ప్రక్రియ ధోరణిలోకాక, కాశీ రామేశ్వర మజిలీ కథల ధోరణిలో రచయిత్రి నడిపించారు. చిత్తూరు, మదనపల్లి, గుంటూరు, రాజమంద్రి అంటూ స్థలనిర్దేశం చేసినప్పుడు కొంతైనా ఆ ఊళ్ళతో పరిచయమో, అక్కడ ఇటీవలి చరిత్రతో పరిచయమో ఉండాలి. ఉదాహరణకు - చిత్తూరులో 1961 దాకా కళాశాల అంటూ లేదు. స్వాతంత్ర్యం రాక పూర్వమే అక్కడ కళాశాల ఉన్నట్లు (19వ పుట) చిత్రణ ఇలాంటివి చాలా ఉన్నాయి. ఇవి నవలకు పనికిరావు. 1932 నాటికి చిత్తూరు కాలేజీలో చదువు మానివేసి, స్వరాజ్యోద్యమంలో పాల్గొని జైలుకు వెళ్ళిన గోపీ, భారతి అనే పదహారేళ్ళ విద్యార్థినిని జైల్లోనే కలుసుకుంటారు. ప్రేమిస్తాడు. 1947లో వీళ్ళకు వివాహమౌతుంది. 1932కి పూర్వమెప్పుడో గోపీ తండ్రి చనిపోతాడు. అతని మృత్యువుకు కారణమెవరో గోపీ అన్వేషించి 1947 తరువాత తెలుసుకుంటాడు. ఈ అహింసావాది చేతిలో బాకు తాల్చి హంతకుని ఇంటి తలుపు తట్టి, అతను తన మామగారేనని తెలిసి, బాకు జారవిడిచి, 'అహింసా పరమో ధర్మః' అని కబుర్లు చెబుతాడు.

ఇంతకూ ఈ నవలలో కృష్ణ, మురళి అనే యువకుల జీవితాలు కొంత విస్తృతంగా చిత్రించబడ్డాయి. కృష్ణ గోపీ తమ్ముడు సైంటిస్టు కలకత్తాలో ఉద్యోగం. రాధ అనే బెంగాలీ అమ్మాయిని ప్రేమించి పెళ్ళి

చేసుకుంటాడు. ఆమె డాక్టరు. కొడుకు పుట్టిన తరువాత ఆమె మరో డాక్టరుతో అక్రమ సంబంధం పెట్టుకుంటుంది. అమెరికా వెళుతుంది. తిరిగివచ్చి ఆత్మహత్య చేసుకుంటుంది. ఇలాగే మురళి ఒక మిల్లు మేనేజర్‌గా భోపాల్ వెళ్ళి, అక్కడ సితారా అనే అమ్మాయిని ప్రేమించి, మోసపోతాడు. ఆంధ్రదేశానికి తిరిగివచ్చి, బంధువుల అమ్మాయి వాణిని పెళ్ళి చేసుకుంటాడు. కృష్ణ కొడుకు రఘు పెద్దవాడై మురళి కూతురు మైథిలిని పెళ్ళి చేసుకుంటాడు (కృష్ణకు మేనమామ కొడుకే మురళి). రఘుని ప్రేమించిన క్రైస్తవ కన్య మేరీ సన్యాసం పుచ్చుకుంటుంది. ఇదీ మూడో తరంలో కథ ముగింపు.

‘ఇంద్రధనుస్సు’ మాట దేవుడెరుంగు; కృష్ణ - మురళి వివాహాలను గూర్చిన ఉదంతాల్లో తేలిన నీతి ఏమిటి? తెలుగువాళ్ళు తెలుగువాళ్ళనే, ముఖ్యంగా తమ కులంలో, బంధువుల్లో వివాహాలు చేసుకోవడం మంచిది అని! అందుకే బెంగాలీ యువతిని కట్టుకుని దెబ్బతిన్న కృష్ణ, హిందూస్థానీ గాయని సితారాను ప్రేమించి మోసపోయిన మురళి, చివరకు వియ్యంకులై పిల్లలు రఘు, మైథిలీలకు వివాహం చేసి వాళ్ళను రక్షించారని ముగింపు! ప్రియుడితో అమెరికా వెళ్లిన రాధ అక్కడ తన ప్రియుణ్ని ఒక యూదుల అమ్మాయికి అప్పగించి, వెర్రిమొహం వేసుకుని తిరిగి రావడం మరో నీతి! అంటే ఇల్లు (ఆంధ్రదేశం) వదిలితే పరాయి ఆడవాళ్ళు (ఇతర భాషల భారతీయులైనా, విదేశీయులైనా) ఆంధ్ర వనితలకు మల్లే శీలవతులు కాకపోవడంతో ముప్పు తప్పదని ఉద్దేశమా? మొదటి తరం వారైన రఘురామయ్య (వేశ్యాలోలుడు సన్యాసి కావడం), వరద రాజు (దొంగ పశ్చాత్తాపంతో సంసారి కావడం) ఉదంతాలుకాని, రెండో తరంవారైన కృష్ణ, మురళీల జీవితకథలు కాని, మూడో తరంలో రఘు, వాణీల వివాహాంతాని, చిత్తూరు, కలకత్తా, భోపాల్, న్యూయార్క్‌ల మధ

ఏల ఏధయుగానే రూపొందాయి. ఇతర భాషాసంస్కృతులపట్ల ఈ నవల కలిగించే అవగాహ, బంధువులలోనే పెళ్ళిళ్ళు జరగాలనే సూచన అసంతృప్తి కలిగిస్తున్నాయి. (ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక 11-8-76) ❋

# రొయ్యలు

— తగళి శివశంకర పిళ్ళై

అధునిక సాహిత్యంలో నవలకున్న ప్రాముఖ్యం మరే ప్రక్రియకూ లేదు. పాశ్చాత్యభాషల్లోనూ, భారతీయ భాషల్లోనూ నేడిదే పరిస్థితి. నోబెల్ బహుమతి పొందిన ఇటీవలి సాహిత్యపరులు హెమింగ్‌స్వే, పాస్టర్‌నాక్, కేమస్, ఫాక్నర్, సాత్రే అందరూ నవలా రచయితలే టి.ఎస్.ఎలియట్ తప్ప. చెమ్మీన్ (రొయ్యలు) అనే ఈ నవల కేంద్ర సాహిత్య అకాడెమీ బహుమానం పొందింది. బహుమానం పొందటానికి తగిన అర్హత సాహిత్యపరంగా ఈ నవలకు ఉన్నది అనటంలో సందేహం లేదు.

ఇది పీడిత ప్రజల, సామాన్యప్రజల యుగం. సాహిత్యంకూడా వారికి ప్రాధాన్యమివ్వటంలో ఆశ్చర్యమేమీలేదు. పడమటితీరపు బెస్తవారి జీవితాన్ని చిత్రించే ఈ నవలలో వాస్తవికత పూర్తిగా ఉంది. ఆ బెస్త వారిదొక ప్రత్యేక సాంఘిక వ్యవస్థ. ఆ వ్యవస్థకూ, వారి నిత్య జీవితానికీ మూలాధారమైన విశ్వాసం సముద్రానికి సంబంధించినది. బెస్తవారు కడలి తల్లిబిడ్డలు. ఆమె వారిని పోషిస్తుంది, శిక్షిస్తుంది. పురుషుల్లో శారీరక, నైతిక, శక్తి సాహసాలు ప్రధాన విధులు. స్త్రీలలో పవిత్రత, పాతి

వ్రత్యం అలాగే ప్రధానం. తీరాన ఉండే స్త్రీల పాతివ్రత్యమే కడలిమీద విహరించే పురుషులకు రక్ష అనేది ముఖ్య విశ్వాసం. వ్యవస్థకు అధికారి ఒక్కొక్క గ్రామంలో ఒక కులపెద్ద. ఈ కులపెద్ద అనుమతి లేనిదే పెళ్ళిళ్ళు జరగటానికి వీల్లేదు. బెస్తవాడు పడవ, వలలూ కొని పెట్టుబడిదారు కావటానికి వీల్లేదు. అనుమతి పొందే సమయాల్లో విధిగా 'నజరు' పెట్టవలసి ఉంటుంది. ఇక్కడ డబ్బు ప్రభావం ప్రవేశిస్తుంది. కులపెద్ద వ్యక్తిత్వాన్నిబట్టి వ్యవస్థలో అతడు నిర్ణయించే మంచిచెడ్డలూ ఉంటాయి. అతని వ్యక్తిత్వం, ధనాకర్షణకు లోబడటం అరుదైన సంగతేమీ కాదు. పోతే బెస్తవారిలోనూ వ్యక్తిగత భేదాలనుబట్టి వారికి వ్యవస్థతోనూ మూల విశ్వాసంతోనూ సామరస్యం లేక సంఘర్షణ ఏర్పడుతూ ఉంటుంది. సంఘర్షణ ప్రయత్నపూర్వకంగా తెలిసి తెచ్చిపెట్టుకున్నదీ కావచ్చు. యాదృచ్ఛికంగా కలిగిందీ కావచ్చు. జీవితంలో సుఖదుఃఖాలకూ, చివరి మృత్యువుకూ ఆ సంఘర్షణే కారణం అవుతుంది. ఇటు సామరస్యమూ అటు సంఘర్షణా లేక ఒక తరహా జీవితం గడిపే వాళ్ళుంటారు. వారిలో ప్రత్యేకత ఏమీ ఉండదు. ప్రత్యేకత దేన్నో విశేషంగా ఆశించి, గాఢంగా అనుభవించి, తద్వారా వ్యవస్థతో లేక మూలవిశ్వాసంతో ఘర్షణ పడేవారి సొమ్ము. అందువల్ల సామాన్యులైన బెస్తల సుఖదుఃఖాల్ని, జీవిత ధోరణినీ చిత్రించే సాహిత్యంలోనూ సామాన్యుల్లో ప్రత్యేకత కలిగిన అసామాన్యుల్ని చిత్రిస్తూ వారి ప్రత్యేకత ఎటువంటిదో స్ఫురించే విధంగా రచన సాగక తప్పదు.

పైన వివరించిన బెస్తల సమాజంలో చెంబన్‌కుంజులోని ప్రత్యేకత పురుషార్థాల్లో 'అర్థం'మీదా, 'కామం'మీదా అతనికి గల విశేషాసక్తి. డబ్బు చేర్చాలి. పడవలూ, వలలూ కొని మోతుబరి కావాలి. విషయ సుఖం అనుభవించాలి. అది వాడి జీవితలక్ష్యం. పళ్ళికున్నం గ్రామవాసి కండకోరన్ అనే బెస్తవాని ధనికత్వమూ, అతని అందమైన భార్యా,

వాడి కళ్ళల్లో అందుకోదగిన ఆదర్శాలు. ఈ లక్ష్యసాధనలో వాడు ధర్మాన్ని లెక్కచెయ్యడు. స్నేహం, కృతజ్ఞత, కొమార్తెపట్ల తన బాధ్యత, ఇవేవీ వాడి మనసుకు రావు. డబ్బుతో కులపెద్ద వాడివశం అవుతాడు. ఇక సంఘంలో ఎదురులేదు. 'కడలితల్లి ఋతుమతి అయిన' కాలంలోకూడా సముద్రంమీద బెస్తలు పోగూడదనే పరంపరాగతమైన విశ్వాసాన్నికాదని, సముద్రంమీద వెళ్ళి లాభంతో తిరిగివస్తాడు చెంబన్ కుంజు. ధనసంపాదనమీద దృష్టి ఉండటంవల్లె ఎవరూ దిక్కులేని సముద్ధదైన బెస్తయువకునికి కొమార్తెనిచ్చి వివాహంచేసి, వాణ్ని యిల్లరికం పెట్టుకోవాలని ఆశిస్తాడు. కాని ఆ యువకుడు భార్యను తీసుకుని తన గ్రామానికి వెళ్ళిపోయి స్వతంత్రంగా జీవిస్తాడు। కొమార్తె వియోగంతో చెంబన్‌కుంజు భార్య మంచంపట్టి మరణిస్తుంది. అదొక అవకాశంగా గ్రహించి, కండకోరన్ చనిపోగా నిరాశ్రయురాలైన అతని భార్యను ఉంపుడుకత్తెగా తెచ్చుకుంటాడు చెంబన్‌కుంజు. వానిలక్ష్యం అలా నెరవేరింది. కాని వాడు పొందగల్గిన 'విషయసుఖం' వాడు ఊహించి ఉవ్విళ్ళూరింది కాదు. వ్యవస్థనూ, మూఢవిశ్వాసాల్నీ గెలవగలిగాడు కాని చివరకు చెంబన్‌కుంజు అంతఃకరణ అతని కొమార్తెకు జరిగిన అన్యాయాన్నిగూర్చి అతణ్ని నిలదీస్తుంది. కొమార్తె కరుత్తమ్మకూ ఒక ముస్లిం యువకునికీ గల బాల్యస్నేహమూ నిర్మలప్రేమా అవకాశంగా ఉపయోగించుకుని ఆ యువకునివద్ద డబ్బు తీసుకుని ఎన్నాళ్ళయినా తిరిగి యివ్వలేదు. తండ్రి వాడి డబ్బు తిరిగి యివ్వకపోవటం అది తన శీలం మీద తొలగని ఛాయగా, హృదయంలో భారంగా, భావిస్తూ కుమిలిపోతుంది కరుత్తమ్మ. కొమార్తెకు నైతికంగా తను చేసిన అన్యాయిం చివరకు తెలిసినప్పుడు చెంబన్‌కుంజు మానసిక వైకల్యం పొంది ఆ డబ్బు పరికుట్టికి (ఆ ముస్లిం యువకుడు) తిరిగియిచ్చి, విష్కృతి పొందుతాడు. కాని చెంబన్‌కుంజుకు మిగిలిందేమిటి? పశ్చాత్తాపం।

కరుత్తమ్మ మనసు పాలవంటిది. ఆమె హృదయం పరిక్కుట్టికి సహజంగా అంకితమైంది. కాని ఆ సత్యాన్ని ఆమె మనసా ఎప్పుడూ అంగీకరించదు. కాబోయే భర్తకోసం శరీరమే కాదు, మనస్సుకూడా పవిత్రంగా, పరిశుద్ధంగా ఉంచుకోవాలి అనే లక్ష్యం ఆమెది. తండ్రి పరిక్కుట్టిదగ్గర డబ్బు పుచ్చుకొని ఆమెను అనుకోకుండా పరిక్కుట్టితో బంధించివేశాడు. కరుత్తమ్మలోని అవ్యక్తప్రేమ యిలా నైతికమైన బాధ్యతాస్వరూపంలో ఆమె మనస్సుని మధురమైన ఆవేదనలో ముంచివేస్తూనే ఉంటుంది. రాత్రి ప్రశాంతతను భగ్నంచేస్తూ వచ్చే పరిక్కుట్టి పాట ఆమె మనస్సును నాగపాశంలా మోహముగ్ధంగా బంధిస్తుంది. పరిక్కుట్టి ప్రేమ ప్రతిఫలాన్ని కోరదు. కరుత్తమ్మ వివాహానంతరం ఆమె తల్లి మరణవార్త ఆమెకు తెలియజేసేందుకు ఒక్కసారిమాత్రమే అతను కరుత్తమ్మ ఉన్న గ్రామానికి వెడతాడు. కాని ఆ ఉదంతమే ఒక పెద్ద నీడగా లోకం దృష్టిలో కరుత్తమ్మ జీవితాన్ని ఆచ్ఛాదిస్తుంది. ఆమె భర్త అనుమానాన్ని రేపుతుంది. కరుత్తమ్మ భర్త పళని కడలిపుత్రుడు. కడలి మీద అతను చూపే సాహసం అసమానమైనది. అది అతనిలోని ప్రత్యేకత. చివరకు తండ్రి చెంబన్‌కుంజు మనోవైకల్యంతో ఆలనాపాలనా లేనివాడైనాడని అక్కతో చెప్పటానికి కరుత్తమ్మ చెల్లెలు పంచమి కరుత్తమ్మ ఉన్న గ్రామానికి వస్తుంది. వచ్చి పరిక్కుట్టి విషయాన్ని చెబుతుంది. అప్పటికిగాని పరిక్కుట్టి జీవితం తనమూలంగా ఎలా శిథిలించి నాశనమై పోయిందో పూర్తిగా అవగాహన కాలేదు కరుత్తమ్మకు. అది అవగతం కాగానే అంతవరకు కృత్రిమమైన సంకల్పబలంతో అణచివున్న ప్రేమ గట్లు తెగి ఉప్పెనలా ఆమెను ముంచివేస్తుంది. ఆ రాత్రే పరిక్కుట్టి అక్కడకు వస్తాడు. ఆరాత్రే పళని, భార్య పాతివ్రత్యంమీద నమ్మకంతో, ఒంటరిగా, నిర్భయంగా సముద్రంమీద వెళ్తాడు. కరుత్తమ్మ సముద్ర తీరాన పరిక్కుట్టి కౌగిలిలో లీనమైంది. పళని సముద్రంలో తుఫానులో

చిక్కుపడి గాలం మింగిన సొరచేపతో ఘర్షణ పడుతూ, సముద్రంలో లీనమౌతాడు. "రెండు రోజుల తర్వాత గట్టిగా కౌగలించుకున్న స్త్రీ, పురుషుల శవాలు రెండు సముద్రతీరానికి కొట్టుకొనివచ్చాయి. చెరియళిక్కల్‌పాళెం తీరానికి గాలం మింగిన సొరచేపొకటి కొట్టుకొనివచ్చింది." ఇది నవల ముగింపు. పళని గాలం మ్రింగిన సొరచేప ; అతను మ్రింగిన గాలం కరుత్తమ్మ ; నవలలో ఈ చివరి అధ్యాయం చాల శక్తివంతంగా, పొంగివస్తున్న సముద్రంలాగే పాఠకుణ్ని ముంచెత్తుతుంది.

కరుత్తమ్మ నైతిక విశ్వాసంతో, చెంబన్‌కుంజు వ్యవస్థతో, ఘర్షణపడి చివరకు గెలిచినా భగ్నజీవులయారు. వారు ఋజువు చేసుకున్న ప్రత్యేకతే వారి విజయం ; అలాగే పరీక్కుట్టి, పళని ప్రేమించిన స్త్రీకోసమే, ఆమెమీద విశ్వాసానికే, జీవితాల్ని అంకితం చేశారు. ఈ కథ విషాదాంతమే ; అయితేనేం ? విషాదమూ, మరణమూ ప్రతి జీవికీ ఏదో విధంగా తప్పవు. కాని అవి ఒక్కొక్క వ్యక్తి జీవితానికి యిచ్చే విశేషార్థాన్నిబట్టేకదా ఆ వ్యక్తిలో ఉండే ప్రత్యేకతా, విలువా గోచరమౌతాయి. ఆ అర్థాన్ని విస్పష్టం చెయ్యటమే సాహిత్యం సాధించే ప్రయోజనం ; ఈ నవల గొప్పదనం వ్యక్తుల మనస్తత్వాల్ని వాళ్ళ ప్రత్యేకతల్నీ మాత్రమే విశదీకరించటం కాదు, వ్యక్తులు అజ్ఞాతమైన సాంఘిక, నైతిక, పారమార్థిక శక్తులతో ఎలా ప్రభావితులో ఆ విషయాన్ని మాత్రప్రాయంగా నిర్దుష్టంగా, స్ఫురింపజేయటం. ఆర్థిక వ్యవస్థ, ఉత్పత్తి సాధనాలు సమాజంలో వ్యక్తుల జీవితాల్ని నిర్ణయిస్తాయనే వాదంకానీ, మానసికమైన విజ్ఞానాభివృద్ధితో జీవితసమస్యలు చక్కబడతాయనే అభ్యూహకానీ, సమగ్రమైన దృష్టికి తార్కాణం కాదని ఈ నవల నిరూపిస్తున్నది.

వాస్తవికత దృష్ట్యా పతమటీవిపు ప్రతివారి జీవితాన్ని నిసర్గసుందరంగా చిత్రించేది, కాల్పనికవాదం దృష్ట్యా ప్రతిఫలమాకాంక్షింపని ప్రేమ

అనే మధుర సంవేదనను అతి సహజంగా, విశిష్టంగా వర్ణించేది, తాత్త్వికంగా గంభీరమైన అర్థస్ఫూర్తినీ, సత్యాన్ని ఆలోచనామృతంగా పాఠకులకు అందించేది - ఈ నవల అంగసౌష్ఠవం కలిగిన ఒక శిల్పం. ఆ పాత్ర మధురమైన ఒక విషాదగీతి. అర్థంకాని జీవితానికి ఒక సమగ్ర వ్యాఖ్యానం! శ్రీ శివశంకరపిళ్ళై అభినందనీయుడు! అనువాదం అక్కడక్కడ నట్టుతూ ఉన్నా, అనువాదం చెడగొట్టలేని చేవ ఈ గ్రంథంలో ఉంది. ఈ నవలకు డా. నారాయణమీనన్ చేసిన ఇంగ్లీషు అనువాదం అంత చక్కగా ఉన్నదే. ఆ స్థాయిని తెలుగు అనువాదం అందుకొనే దెప్పుడు? ఒక వచన గ్రంథాన్ని ఒక భారతీయ భాషనుంచీ మరొక భారతీయ భాషకు తర్జుమా చెయ్యటం, ఇంగ్లీషులోకి తర్జుమా చెయ్యటంకంటె కష్టతరమైన కార్యమా? ఇది అనువాదకుల లేక పర్యవేక్షకుల దృష్టి లోపమనే అనుకోవాలి.

ఏ వ్యావహారికంగా వ్రాసినా సహజంగా శ్రుతిపేయంగా లేని తెలుగు తెలుగుకాదు. "తీర్మానించుండింది, బాగుందునసుంది, తోచుండవచ్చు, తీర్మానించుకునుంది, అది ప్రేమింపబడింద్దై యుంది"...."దాని జీవితంలో ఒక ప్రత్యేకత సంభవించకుండా ఉంటే చాలు. సామాన్యమైన ఒక బెస్త స్త్రీలాగా తన జీవితాన్ని అవసానింపజేయాలి" ఇది తెలుగా? "అది మరొక్క పురుషుడిని ప్రేమించిందైనా, పురుషస్పర్శ మొక్కా, పురుషుడికి విధేయఅగుట మొక్కా, ఆ పూపిరాడకపోవుట మొక్కా అనుభూతి మరొక పురుషుడినుండి దానికి లభిస్తుంది. ఇంక అది ఆ పురుషుడి దయింది ... అది వాడికోసమని దాన్ని పరిశుద్ధంగా ఉంచుండింది...." ఇందులో మొదటి 'మరొక్క పురుషుడు' ప్రేమించినవాడు. రెండవ 'మరొక పురుషుడు' భర్త అని అన్వయం. ఇలాంటి వాక్యాలు సంస్కరించకపోవటానికి కారణం కేవలం అశ్రద్ధకాక మరేమిటి? ఈ నవలలోని భాషను పునర్ముద్రణలోనైనా సంస్కరిస్తారని ఆశిద్దాము. (భారతి) ❋

# విశ్వనాథవారి చిన్నకథలు

విశ్వనాథవారి తొలి రచనల్లో కనిపించే భావ సౌకుమార్యము, స్వేచ్ఛా ప్రియత్వము, వ్యక్తి వైశిష్ట్య నిరూపణము, సౌందర్యారాధన, తర్వాతి రచనల్లో భావ ప్రౌఢిమగా, సంప్రదాయ ప్రియత్వంగా, వ్యవస్థా నిరూపణముగా, భగవద్భక్తిగా పరిణామం చెందడంవల్ల, చాలమంది పాఠకులకు, ముఖ్యంగా యువకులకు, ఆయన తొలిరచనలు నచ్చినంతగా చివరి రచనలు నచ్చవు. తొలి రచనల్లో కిన్నెరసాని పాటలు, ఏకవీర ప్రసిద్ధమైనవి. ఆ కోవలోకే వస్తాయి ఆయన వ్రాసిన చిన్నకథలుకూడ.

విశ్వనాథవారిది అంతర్దృష్టి. మనస్సు అంతరాంతరాల్లో ఎన్నో లోకాలు. ఇద్దరి మనస్సుల కలయిక, రెండు వ్యక్తిత్వాల సమన్వయమూ, కేవలం బాహ్యపరిస్థితులమీదే దృష్టి నిలిపి నిర్ణయాలు చేసేవారి అవగాహనకు రావు. వీరేశలింగంగారి వితంతు వివాహసంస్కరణము విశ్వనాథ వ్యతిరేకి కాదు. అయితే పునర్వివాహము సుఖప్రదము కావడానికి స్త్రీ పురుషుల్లో కలుగవలసిన మనఃపరిణామ మెటువంటిదో విశ్వనాథ సున్నితంగా చిత్రించిన కథ 'తిరోధానం'. అందంగా, గొప్ప శిల్పంతో తయారైన కథ యిది మహాశ్వేత అనే అమ్మాయి పదహారో ఏట భర్త నీలలోచనుడు మరణించాడు. ఇప్పుడు ఆమెకు పద్దెనిమిదో ఏడు జరుగుతున్నది. కాని భర్త వ్యక్తిత్వపు ముద్ర ఆమె మనస్సును వదలలేదు. మొదటినుంచీ శ్వేతకూ ఆమె భర్తకూ, వ్యక్తిత్వాల మధ్య వైరుధ్యమే తప్ప సమన్వయం ఏర్పడనేలేదు. "ఈమెకు మల్లెపూవనిన యిష్టము. అతనికి మందారపుష్పముమీద నభిమానము. ద్విధాప్రవృత్తంబులగు వారి జీవన వాహినులు పాపము, కలియనేరవు." అంటూ ప్రారంభించి విశ్వనాథ, శ్వేత మనస్సులో తెలుపుకీ ఎరుపుకీ జరిగే సంఘర్షణని అతి సుకుమారంగా

చిత్రించారు. (ఏకవీర మనస్సులో ప్రేమకూ ధర్మానికీ జరిగే సంఘర్షణని చిత్రించిన తీరు గుర్తువస్తుంది.) చివరకు శ్వేతతోటలో పెరుగుతున్న మందారమొక్కని ఆమె పెంపుడు లేడిపిల్ల చిగుళ్ళు మేసి ఎదగనీకుండా చంపివేస్తుంది! ఆ తరుణంలో శ్వేత జీవితంలో ప్రవేశించిన రాధారాముడు తెల్లగులాబీలతో ఆమెను పలుకరిస్తాడు. తెల్లగులాబీలతో ప్రారంభమైన వారి స్నేహం, ఏడాది తర్వాత ప్రేమగా వివాహంగా పరిణమిస్తుంది! ఈ కథనంలో సంభాషణలు లేవు. మనస్సు కదలికలు మాత్రమే ఉన్నాయి. "శిశిరము వెనుక బట్టినది. మందారము పూయుట మానినది. మల్లి తీవ విరబూచినది. ఆ పూదోటలో శ్వేత యొక యుత్తరము చదువుకొనుచు నడచుచున్నది ... జరీ పోగులుగల తెల్లని పట్టుచీర ఆమె యొడలిపై శరత్కాల మేఘశకలమువలె వాయువూత నూగుచున్నది." నీలలోచనుని ముబ్బు విడిచిన శ్వేతను రాధారాముడు "ఆమె చుబుకమునెత్తి ఎర్రని పెదవులపై నొక చుంబనము చేసినాడు. అప్పటి ఆనంద పారవశ్యమున అప్రయత్నముగా శ్వేత కన్నులు మూతపడినవి. శ్వేతకు చప్పున తెలివి వచ్చినది. నీలలోచనుడు కనబడలేదు.... అది మొదలు జీవితాంతమువరకు మరల నామెకు నీలలోచనుని రూపము కనిపించలేదు." శ్వేత పునర్వివాహాన్ని విశ్వనాథ మనసా ఆమోదించారు.

స్త్రీ పురుషుల మధ్య ప్రణయానికి అంటే వారి వ్యక్తిత్వాల సమన్వయానికి సౌందర్యం, అంగసౌష్ఠవం ఎంతవరకు ముఖ్యం? అనే ప్రశ్నకు సమాధానం 'పరిపూర్తి' అనే కథలో విశ్వనాథ అన్వేషించారు. రాధ నలుపు. ఆమెకు వంటిచూపుకూడా లేదు. చంద్రశేఖరుడామెను వివాహమాడినాడు. రాధకు మనస్సులో కొరత, తాను భర్తకు తగినదానిని కానని ఆమెకు పుత్రోదయం అయింది. "అబ్బాయి కళ్ళు, అచ్చముగా మీ కళ్ళ వలె ఉన్నవటగా" అన్నది రాధ. "అబ్బాయి, నీ కళ్ళు వచ్చినట్టున్నాడు." అని చంద్రశేఖరం అనడంతో రాధ ఆనందం 'పరిపూర్తి'కి వచ్చింది.

చిన్నపిల్లలమీద మమకారం పిల్లలు లేనివారికి మరీ ఎక్కువ. మీనాక్షీ సూర్యనారాయణ దంపతులు పొరుగువారైన అనసూయా వేంకటేశ్వరులతో స్నేహం నెరపుతూ వారి సంతానం కృష్ణమూర్తిని మచ్చిక చేస్తారు. వేసవి సెలవుల్లో వాణ్ని తమ స్వగ్రామం తీసుకువెళతారు. అక్కడ అకస్మాత్తుగా జబ్బుచేసి ఆ పిల్లవాడు మరణిస్తాడు. టెలిగ్రామ్ యిచ్చినా, అనసూయా వేంకటేశ్వర్లు వేళకు అందుకోలేకపోతారు. అంత్యక్రియల తర్వాత వస్తారు. వేంకటేశ్వర్లు నిష్ఠూరంగా మాటాడతాడు. ఇది జరిగిన మూడేళ్ళ తర్వాత అంతదాక సంతానంలేని మీనాక్షికి కొడుకు పుడతాడు. కృష్ణమూర్తి అని పేరు పెడతారు. కాని ఆ పిల్లవానిమీద మీనాక్షికి అశ్రద్ధ. వాణ్ని అనసూయా వేంకటేశ్వర్లు శ్రద్ధగా చూస్తారు. వాడుకూడా జబ్బుచేసి చనిపోతాడు. వాడి అంత్యక్రియల్ని వేంకటేశ్వర్లనే చేయమంటాడు సూర్యనారాయణ. "నీ ఋణం తీర్చుకున్నానురా" అంటాడు. అదే కథాశీర్షిక. కాని విశ్వనాథ కథను అంతటితో ముగించ లేదు: అటుతర్వాత మీనాక్షికి పోయిన అందం, ఆరోగ్యం మళ్ళీ వచ్చినట్లూ, ఆమె భర్తమాత్రం నలభై అయిదేళ్ళకే మరణించినట్లూ ముగింపు వాక్యాలున్నాయి. ఈ ముగింపుకి స్ఫూర్తీ అన్వయం కథలో లభించదు: హఠాత్తుగా మరణించిన మరో పసివాని కథ - పుణ్యప్రేమము - ముగింపులో విశ్వనాథ వెలిబుచ్చిన ఒక అభిప్రాయంతో పై కథను అన్వయించుకోవచ్చునేమో అని తోస్తుంది. 'పుణ్యప్రేమము' కథలో దంపతులు సుభద్ర కృష్ణరాయలు. వీరి ప్రణయాన్ని వచనకవితగా వ్రాశారు విశ్వనాథ. ప్రకృతితో బాటు అందాన్నీ, ఆనందాన్నీ సంతరించుకున్నవారి ప్రణయం సంతానప్రాప్తిలో పర్యవసిస్తుంది. కాని ఆ బిడ్డ హఠాత్తుగా మరణిస్తాడు: ఆ నిర్వేదంలో భార్యాభర్తలు ఎవరికి వారు తమలో ఏదో తెలియని కళంకం ఉన్నట్లు ఊహించుకుంటారు. సుభద్ర పుట్టింటికి వెళ్ళి రోగగ్రస్తమై మరణిస్తుంది. కృష్ణరాయలు సన్యాసియై కాశీ చేరతాడు.

అక్కడ ఒక మృతశిశువుని పాతిపెడుతున్న దంపతుల్ని చూచి వారితో అంటాడు: "శిశువులు దీర్ఘాయుషులగుటకు తల్లిదండ్రుల ప్రేమ నిష్కల్మషమై ఉండవలెను. ఆ నిష్కల్మషత ఎట్లు పాటించవలెనో మనకు తెలియదు." చిన్నపిల్లల మరణాన్ని గూర్చిన యీ తీర్పు విశ్వనాథే యిస్తున్నట్లు తోస్తుంది. అందులో రచయిత గాఢమైన స్వానుభవం ఏదో నిక్షిప్తమైనట్లూ అనిపిస్తుంది!

'ఏమి సంబంధం!' అనే కథలో, చిన్నతనంలో, యౌవనంలో, తర్వాత అంత్యదశ అయిన మరణావస్థలో ఒక యువతి తనకు తారసిల్లగా, లౌకికంగా ఏ సంబంధమూ లేని ఆ యాదృచ్ఛిక సన్నివేశాలద్వారా తనలో కలిగిన అనుభూతిని ఒక యువకుడు వర్ణిస్తాడు. ఆమెకు శవవాహకుడుగా ఉండి తిరిగివచ్చిన ఆ యువకునికి ఆ రాత్రి ఒక కల వస్తుంది. అందులో మళ్ళీ చిన్ననాటి సన్నివేశం: పదేళ్ళ కొంటెపిల్లగా సీమమిరపకాయ అతనిచేత తినిపించి, అతను కారంతో నోరు మండి బాధపడగా ఆమె నవ్విన సన్నివేశమే పునరావృత్తమైంది. నిద్రమేల్కొని చూస్తే అగ్నిమండలపు పురుగు అతని నాలుకనూ పెదవినీ కుట్టింది! కథలో కేవలం ధ్వనిమాత్రంగా నిలిచిపోయిన ప్రణయభావమూ, ప్రణయానికి పర్యవసాయిగా పెదవిని కరచి పుండు చేసిన అనుబంధపు ముద్రతో కథ ముగింపూ, ఆలోచించే కొద్దీ మనస్సును కదిలిస్తాయి. మనస్సులు ఏ దూరతీరాల్లో కలుసుకుంటాయో, వ్యక్తిగత సంబంధాలకు సరిహద్దులెక్కడో ఎవరు చెప్పగలరు?

విశ్వనాథవారి కథల్లో జాతీయతను నిర్వచించే ప్రయత్నం చేసిన విశిష్టరచనలు రెండున్నాయి: 'యాగ్నిషీపెయ్' నీగ్రోకవి కథ. ఫ్రెంచివారాక్రమించిన కాంగోలో 'కిన్నాలిరా' ఒక సన్నని పిట్ట. 'కిపు' ఒక సరస్సు. ఆ పిట్ట ఆ సరస్సుమీద ఎగురుతుంది. పాడుతుంది. మరోచోట

కనిపించదు. 'ఇటురీ' నదీజలాల లోయలో [illegible] ధ్వని. కిసొలికా కంఠధ్వనివలె ఉంటుంది :

"కివుపై కిసొలికా, కివుపై కిసొలికా
ఇటురి అడవులపైన ఎగిరెడు కిసొలికా
ఫ్రాంసుల తుపాకికై ప్రాణముల వదలెదవో
కివు వీట నీ శవము కువకువలు సేయునో
కివుమీద కిసొలికా, కివుపైని కిసొలికా
నీవు కివు కలిసెదవు, నేను కివు కలిసెదను
మన తియ్యనగుపాట మాయమైపోవునా?
నీనా మధురగీతి నిలిచియుండును లెమ్ము
కివుమీది కిసొలికా, కివుపైని కిసొలికా...."

హిషిఫెయ్ ఈ పాట వ్రాసిన కవి. అతని పాటలు [illegible] లో ప్రాచుర్యము పొందెను. విదేశీ ప్రభుత్వము అతణ్ని కారాగారములో పెట్టింది. అతణ్ని తగులబెట్టినచోట కాంగో దేశస్థులకు [illegible]. అతని ఆత్మ కాంగోనదిలో ఐక్యమైపోయెనని వారు నమ్ముతారు. [illegible] అంటే సంస్కృతికీ మతానికీ భిన్నమైనది కాదు. సంస్కృతి అంటే, మతమంటే, ఆ దేశపు నదులలో, పక్షులలో, మనుష్యులలో, వారి జీవితానుభూతిలో జీవనసరళిలో అంతర్లీనమైన సంస్కార విశేషము. దానిని బంధీ చేయుట అంటే అది తాత్కాలికం మాత్రమే. ఈ భావాన్ని [illegible] - నీటిగుర్రాన్ని ఉచ్చులు పన్ని మనుష్యులు తెలివిగా బంధించిన దృశ్యం ద్వారా ధ్వనిస్తూ కథ ముగించారు విశ్వనాథ [illegible] 'జీవుడి యిష్టము'. ఒక సైనిక నియంత తాను పెత్తనం వహిస్తున్న దేశంలో స్త్రీని చెరపట్టి, ఆమె భర్తను, కొడుకును, పసిపిల్లలను చంపి, ఆమెను వశపరచుకోవాలని ప్రయత్నిస్తాడు. ఆమెను బలవంతంగా అనుభవిస్తాడు. కాని ఆమె మనస్సుని మాత్రం జయించలేకపోతాడు. విసిగి ఆమెను చంపుతాడు.

మురిపిస్తూ ఆమె అడుగుతుంది : "నేను చనిపోయిన తర్వాత ఏమి చేస్తావు?" "ఇంకొక స్త్రీని సంపాదిస్తాను" అంటాడతను. "నీకు తగినమాట. నీ జాతికి జీవుని ఋణము తెలియదు" అంటుంది. తుపాకులెరగని ఆ ద్వీప వాసులు నాగరక ప్రపంచానికి చెందిన నియంతకంటె ఎలా ఉన్నతులో 'స్వేచ్ఛ' స్వరూపమేమిటో ఈ కథలో చెప్పబడింది. ఆమె ఒకచోట అంటుంది : "మా జాతిలో తెలివికి, ధైర్యానికి ఎక్కువ భేదంలేదు. మా న్యాయమే తెలివి. తెలివే ధైర్యం." న్యాయానికీ తెలివికీ సంబంధం లేకుండాపోయిననాడు మానవుని బాహ్యనాగరికత ఎంత అభివృద్ధి చెందినా పతనం తప్పదు. సామ్రాజ్యాలను విస్తరింపజేసుకున్న పాశ్చాత్యుల 'పలన' నాగరకతనుగూర్చి నిశితవిమర్శ ఉన్నది ఈ కథల్లో.

'ఆద్యంతములు' అనే కథ విశ్వనాథ మేధాశక్తికి గీటురాయి. గహనమైన తత్త్వవిచారమే కాకుండా, అంగిరస్సులి మహర్షికి శిష్యుని మీద గల ప్రేమా, సిద్ధాంతాభిమానమూ ఎలా మృత్యుహేతువులయ్యాయో చూపుతూ, నాస్తిక - ఆస్తిక దృక్పథాల సంబంధాన్నీ, విభేదాన్నీ ఒక చిన్నకథలో యిమడ్చటం గొప్ప విజయం. 'సప్తాశ్వము' అనే కథలో ఒరిటీమణుతున్న ఏడుగురు విప్రవటువుల మనోజ్ఞ వాక్యాలద్వారా విశ్వనాథ విశ్వస్వరూపాన్ని వివరించడం ఆలోచన పురికొల్పుతుంది. నేటికీ సజీవమైన రచన యిది. 'మూర్లీ దుర్గంలో కుక్క' ఆధునిక నాగరకతమీద నిశిత విమర్శ. మనిషి మాటలకూ చేతలకూ సంబంధం లేక పోవడం దగ్గర్నుంచీ, దాక్షిణ్య రాహిత్యమూ, హింసా, నాగరక మానవ ప్రవృత్తిలో చోటుచేసుకొని మానవజ్ఞానాన్నే కలుషితం చేశాయనీ, మనకు సర్వత్ర కనిపించే ఈ కాలుష్యం భరింపరానిదై, మనుష్యునితో కలిసి మనుగడ సాగించే కుక్కజాతికూడా మానవుణ్ణి వదలి అడవికి తిరిగి వెళ్ళిపోయే పరిస్థితి ఏర్పడుతున్నదనీ వ్యంగ్యంగా విమర్శించారు. అలాగే

‘ముగ్గురు బిచ్చగాళ్ళు’ కథలో ప్రజాస్వామ్య వ్యవస్థ నడిచే తీరును బిచ్చగాళ్ళ రాజ్యంగా చిత్రించారు “మానవజాతి రెండే రకాలు. ఒక రకం సంసారులు. రెండవరకం బిచ్చగాళ్ళు. తానేదో న్యాయంగా సంపాదించుకుంటాడు, తింటాడు, లోకాన్ని ఉద్ధరిస్తానని బయలుదేరడు ఇట్లాంటివాడు సంసారి. అధికారులనండి, మతగురువులనండి, రాజనీతివేత్తలనండి, కవులనండి, గాయకులనండి, వీళ్ళంతా బిచ్చగాళ్ళు. సంసారుల మీదే బ్రతికేవాళ్ళు బిచ్చగాళ్ళు!” అని సూత్రీకరిస్తాడు బిచ్చగాళ్ళ వ్యవస్థకు నాయకుడు. ఆలోచనకు పదునుపెట్టే విశిష్టమైన వ్యంగ్యరచన యిది.

తొలినాటి విశ్వనాథకవి ఛాయపడే రాము, తత్త్వశాస్త్రాల్లో ఆలోచించగల మేధావి అనికూడా ఈ చిన్నకథలు ఋజువు చేస్తున్నాయి.

( భారతి : మార్చి 1983 )

# చాసో కథలు

“ప్రభాతాన్నుద్దేశించి కోడి కూస్తుంది. కాకులరుస్తాయి. వసంతాగమనాన్ని సూచిస్తూ కోయిల పాడుతుంది. రేపు ఐదుగంటల ముప్పయ్యారు నిమిషాలకి కోడి కూయకపోయినా, కాకులరవకపోయినా సూర్యోదయమౌతుంది. నిబిడ నీరదాలంటూ వస్తే కోయిల పాడకుండానే వర్షిస్తుంది. విప్లవబీజాలంటూ మనుషుల్లో ఉండే కవులు పిచ్చిగొంతులు పాడాలా, వెర్రి కేకలెయ్యాలా? కోళ్ళూ, కోయిలలూ, కవులూ, కాకులూ లేకపోతే ప్రపంచం ఆగిపోదు.” (‘చిన్నాజీ’ కథ)

ఈ వాక్యాలలో సాహిత్య ప్రయోజనాన్నిగూర్చి చాసోగారి అభిప్రాయం ఏమిటో స్పష్టంగా తెలుస్తున్నది. కళాసృష్టి, కావ్యసృష్టి అనం

దాన్ని యిచ్చినా అంతకంటే అచ్ఛంగా జీవించడంలోనే, క్షణక్షణం మారే అస్తిత్వంలోనే ఆనందం ఉన్నదని ఆయన 'చిన్నాజీ' అనే కథలో తేట తెల్లం చేశారు.

"రెండు రోజులు గడిస్తే చిన్నాజీ అమృతప్రాయంలో మధుర క్షణాలు మళ్ళా లభిస్తాయా? రాకరాక చిన్నాజీ వొచ్చింది. కథా వొద్దు కావ్యం వొద్దు. చిన్నాజీతో ఐదు నిమిషాలు షేక్స్పియరు కామెడీలో రస వంతమైన ఐదంకాలపాటి చెయ్యవూ?"

చాసో రాసిన కథల్లో చిన్న వయస్సులో పొందిన అనుభవాల ఆనందాన్ని గూర్చినవి ప్రముఖంగా ఉన్నాయి. అవి 1. బబ్బుబ్బా 2. ఉమ్మెలగొండి 3. బొమ్మల పెళ్ళి 4. రథయాత్ర 5. చిన్నాజీ. ఈ కథల్లో అభ్యుదయానికి సంబంధించిన సిద్ధాంతపు గొడవలూ, ఆర్థిక సూత్రాలూ కనిపించవు. "ఎందుకు పారేస్తాను నాన్నా?" అనే కథలో పిల్లవాడికి చదువుమీద ఉన్న ఆకాంక్ష తండ్రి దారిద్ర్య పరిస్థితిని అధిగమించినట్లూ, చిట్టచివర జీవితమే ఆర్థికసూత్రాలమీద విజయం సాధిస్తుందనీ తీర్పుయిస్తూ ముగించారు. ఇటీవలి అభ్యుదయవాదులు (విప్లవ వాదులు) ఆర్థికసూత్రాలకు పూర్తిగా దాసోహం అనేస్తున్నారు.

పైకథలో నిర్వేదంతో ఆ తండ్రి పిల్లవాణ్ని చంపి మూటకట్టినట్టు కూడా చిత్రించడానికి పూనుకుని అటువంటి ముగింపే "విప్లవానికి" దోహదం చేస్తుంది అనే ధోరణిలో సమర్థించుకుంటారు నేటి విప్లవ వాదులు. చాసో కథల్లో ఎటుచూచినా 'జీవితా'నికే ప్రాధాన్యం. జీవిత వాస్తవికతలో ఎంతవరకూ ఆర్థికశక్తులకు స్థానం ఉన్నదో అంతవరకూ మాత్రమే వాటికి ప్రవేశం లభిస్తుంది.

సంప్రదాయం, సంస్కృతి జీవితంలో అవసరమైన భాగాలు. అలంకరణా, దుస్తులూ వగైరా మనిషికి అవసరం అయినట్లే సంస్కృతి పరిమైన ఆచారవ్యవహారాలు సామాజిక జీవితానికి అందాన్నీ, అలంకరణవీ

సమకూరుస్తాయి. మరోవిధంగా చెప్పాలంటే హేతుబద్ధమైన లక్ష్యానికి అందని ఆచారాలు ఎందువలన నశింపులేకుండా పరంపరగా వస్తూనే ఉన్నాయి? అనే ప్రశ్నకి సమాధానం: ప్రజల మూఢవిశ్వాసం, అజ్ఞానం మాత్రమే అనుకోవడం అది జీవితాన్ని గూర్చిన సమగ్ర భావన లేకపోవడమే: 'బొమ్మల పెళ్ళి' కథలో ముత్తవ్వ తన చిన్నతనంలో పెళ్ళి అనే తంతుకి చిన్నతనంనుంచీ ఆటలో ప్రారంభించి ఎలా రిహార్సలు జరిగేదో వివరిస్తుంది. ఇటువంటి 'రిట్యువల్' కోవకి సంబంధించినవే రథోత్సవం, తిరుణాలవంటి సామూహిక సంరంభాలు. అవి లేకపోతే ప్రజల జీవితం లేదు. ఆనందంలేదు. నాస్తికవాదం పేరిట, మత వ్యతిరేకత పేరిట ఇవన్నీలేకుండా చెయ్యాలనుకోవడం, మనుష్యుల్ని కేవలం ఆర్థికసూత్రాల మీదా, రాజకీయాలమీదా, వాణిజ్యం పరిశ్రమలు వగైరా అభివృద్ధిమీదా ఆధారపడిన ప్రగతిపథంలోనే నడిపించాలనుకోవడం, చీమల సమాజాన్ని రూపొందించాలనుకోవడం, ఈ యుగానికి చెందిన రాజకీయ విశ్వాసాలు. చాసోగారు అటువంటి విశ్వాసాలకు లోబడిన సూచన ఆయన రచనల్లో ఎక్కడా కనపడదు. బూర్జువా వ్యవస్థలో లేక ఫ్యూడల్ వ్యవస్థలో 'దోపిడి' (ఎక్స్‌ప్లాయిటేషన్) అంటే ఒకరి శ్రమను మరొకరు అనుభవించడం, ఒక వర్గాన్ని మరొకరు అణిచిపెట్టడం లేదనికానీ, అటువంటి సిద్ధాంతం రాజకీయంగా సామాజికంగా అసందర్భం అనిగానీ, అనుచితం అనిగానీ ఎవరూ అనరు. చాసోగారుకూడా సమాజంలో 'దోపిడీ'ని గురించి చక్కని కథలు వ్రాశారు. 'కుంకుడాకు', 'పరబ్రహ్మం', 'కుక్కుటేశ్వరం', 'కొండగెడ్డ' వంటి కథలు. కాని ఆ కథల్లో కూడా పాత్రలకూ, సన్నివేశాలకూ, జీవనలీలకూ ఆయన యిచ్చిన ప్రాధాన్యం, కళాత్మకమైన విలువ, కేవలం వాటి రాజకీయ ప్రయోజనంకంటె ఎంతో ఎక్కువగా ఉన్నది. మానవ నిర్మిత సమాజంలో 'దోపిడీ'ని గుర్తించడంకంటె, ప్రకృతిలోనే అటువంటి సూత్రం యిమిడిఉన్నట్లు చాసో జీవిత దృక్పథంలో

కీలకమైన నిగమనం (అబ్సర్వేషన్) గా భావించడానికి అవకాశమూ ఉన్నది. ఆయన వ్రాసిన 'మాతృధర్మం' గొప్ప కథ. ప్రకృతిలో దోపిడీ, హింస గొలుసుకట్టుగా ఎలా ఉన్నాయో చిత్రిస్తూనే ఏ జీవికా జీవి జీవితం లోని ఆనందాన్ని అనుభవించడంలోకూడా ఆ కథలో చూపించారు. ఇక్కడ మృత్యువు ప్రకృతి క్రమంలో ఒక అవస్థ మాత్రమే. కత్తెర గాయకుడు అనే పక్షి ముంగిసచేత చంపబడ్డాడు. ఆడకత్తెర పెట్టిన గుడ్లలో రెండు గుడ్లు శత్రువులకి ఆహారం అయినా చివరిదైన మూడో గుడ్డు నుంచి మళ్ళీ జీవం బైటపడి, కొత్త కత్తెర పిల్లపుట్టి, కాలం తిరగబడి, ఋతుధర్మంగా ఇంకో కత్తెర గాయకుడు ప్రకృతిలో విహరిస్తాడు. ఈ ఋతుక్రమానికి మూలాధారం ఆడకత్తెర నిర్వర్తించిన మాతృధర్మం. తిరిగి ఆ ధర్మాన్ని నిర్వర్తించడానికి ఈ కత్తెర గాయకునితో ఆడ కత్తెర విహారం మొదలవుతుంది. దోపిడీ, హింస, మృత్యువు - ఇందులో ఆనందించే ప్రాణి ఒకటైతే హింసను అనుభవించే ప్రాణి మరొ కటిగా, ఒకస్థితిలో కనిపించినా, భిన్నపరిస్థితుల్లో, భిన్నసమయాల్లో హింసించేవాడే హింసింపబడేవాడూ అవుతున్నాడు. గొలుసుకట్టుగా 'దోపిడీ' సాగే ఈ ప్రకృతిలీలలో, మాతృధర్మం ఆధారభూతమై మానవ హృదయాన్ని ఆకట్టుకుంటున్నది. జీవితంపట్ల విశ్వాసానికి అదే ఆధారం అవుతున్నది. చాసోగారి జీవితదృక్పథం మూలముట్టుగా ఈ ప్రకృతి కథలో కళాస్వరూపాన్ని దిద్దుకుంది. అన్నివిధాలా ఈ కథ చలంగారి 'ఓ పూవు పూసింది' కథతో సాటివచ్చేలా కనిపిస్తుంది. చలంగారి కథలో సెక్సు ప్రవృత్తి, మాతృత్వం, మృత్యువు ఈ మూడూ ప్రధమస్థానాన్ని వహించాయి. జీవితాన్నీ మృత్యువునీ భిన్నంగాకాక వాటిని నిరంతర ప్రకృతి పరిణామంలో మజిలీలుగా ఆయన ఆ కథలో చిత్రించారు. చాసోగారి

కథ కూడా తాత్వికమైన పరిపుష్టి కలిగి, ఆయన విశిష్టదృష్టికి తార్కాణంగా నిలుస్తున్నది.

కథ నవలవంటి ప్రక్రియల్లో నిర్మాణం (స్ట్రక్చర్), 'అల్లిక' లేక 'నేత' (టెక్శ్చర్) - ఈ రెండూ ముఖ్యంగా రచనకి విశిష్టతను చేకూరుస్తాయి. ఈ రెండూ కేవలం సాదాగా ఉండే రచన పాఠకుల మనస్సుమీద ఏ విధమైన ముద్రా వెయ్యలేదు చాసోగారి కథల్లో ఒక్కొక్క రచనా ఈ నిశిత పరీక్షకు నిలుస్తుంది. కాబట్టే అవి అన్నీ మనస్సుకి హత్తుకుపోయేలా ఉన్నాయి. 'బొమ్మలపెళ్ళి' కథ, నిర్మాణందృష్ట్యా చాలా గొప్ప శిల్పం. "ది గ్రేట్‌నెస్ ఆఫ్ ఆర్ట్ లైస్ టు కన్సీల్ ఆర్ట్".

ఈ కథలో వంద ఏళ్ళనాటి జీవితవిధానాన్ని సాక్షాత్కరింపచెయ్యడమే కాదు; బాల్యస్మృతుల మధురానుభూతి మేళవింపు, పెళ్ళివంటి తంతు పరంపరంగా కుటుంబాల్లో ముఖ్యంగా ఆడపిల్లలద్వారా తరంనుంచి తరానికి ఎలా అందివచ్చేదో ఆ రహస్యాన్ని వ్యక్తంచెయ్యడమూ ఉన్నది; అంతకంటే బాల్యవివాహం ఆచారంకావడంవల్ల బాలవితంతువు అయిన ముత్తవ్వ తన వైధవ్యాన్ని ఏ దృష్టితో అనుభవించి జీవించిందో దాన్ని చెప్పడంలోనూ మన తరానికీ ఆ తరానికీ గల దృష్టి భేదాన్ని ఎంతో గొప్పగా అభివ్యక్తం చెయ్యడమూ జరిగింది. "ఆడదానికి అయిదోతనం లేకపోవడంచేత ఆడదాని బతుకంత హీనం మరొకటిలేదు" అని ముత్తవ్వ చెప్పినా, ఆవిడ డెబ్భైఅయిదోఏట పిల్లలకి కబుర్లు చెప్పడంలో కథలు చెప్పడంలో ఆమెకు జీవితంపట్ల ఎంతటి విశ్వాసం ఎంతటి అపేక్ష ఉంటూ వచ్చాయో మనకి ఆశ్చర్యాన్నే కలిగిస్తుంది. ఇందులో కథ చెప్పమని అడిగే పిల్లల ఉత్కంఠ, ఒకటి చెప్పబోయి శాఖా చంక్రమణంగా ఏవేవో కబుర్లలోపడి మళ్ళీ కథలోకి వచ్చే ముత్తవ్వ ధోరణి చాలా సహజంగా అలవోకగా సాగే కథా కథనంవలె కనిపించినా పైచెప్పిన బహుళమైన

యితివృత్త విశేషాలవల్ల, దాని నిర్మాణశిల్పంయొక్క గొప్పతనం మనం ఊహించుకోవలసిందే!

'అల్లిక' లేక 'నేత' విషయం తీసుకుంటే చాసోగారి శైలిలో ఒక్కొక్క వాక్యం ఒక ఆణిముత్యంలా ఉంటుంది. 'కొండగెడ్డ' కథలో చివర "ఒళ్ళు తెలియక ఊరకుక్కలాగ మొరిగి, రేచుకుక్కలాగపడి, జరిమానా చెల్లించుకున్నాను" అన్న ఒక్కవాక్యంలో జరిగిన కథంతా ఇమిడిఉంది. కాని అదే కథకు ముగింపుకాదు! చివరి వాక్యం కథలో ఆ జరిమానా చెల్లించుకున్న వ్యక్తి విజయాన్నే నిరూపిస్తుంది. "అయితేనేం? ఇప్పుడు జరుగుతున్నాది పబ్లిక్ ఎంక్వైరీ...." అని ముగిస్తాడు.

చాసో వ్రాసే వాక్యాల్లో సహజకవిత్వం మెరుపులా మెరుస్తూ మనల్ని చకితుల్ని చేస్తూ ఉంటుంది.

"రథయాత్ర ఫెళ్ళున విరిగిపడి సముద్రంలా పొంగిపోతోంది జనం తిరగబడి కెరటాల్లా ముందుకి కొట్టుకొస్తూ వెనక్కి వెనక్కి వెళుతున్నారు" (రథయాత్ర)

కేవలం 'జనం సముద్రంలా ఉన్నారు' అంటే పై వాక్యాల్లోని శైశిత్యం, స్ఫూర్తి ఎలా వస్తుంది?

"బొంగరం ముర్కి అంచులమీంచి కర్రవి తిరిగి తికమకగా కొట్టుకుంటూ ఆగిపోయింది." (రథయాత్ర)

బొంగరం తిరగడంలో వేగం తగ్గి చిట్టచివర ముర్కి అంచుల మీదా, కర్రమీదా కొన్ని చుట్లు తిరిగి పడిపోవడం అలా వర్ణించడంలో ఆ దృశ్యం సూక్ష్మాతిసూక్ష్మంగా చెక్కడం చేసి చూపెట్టడమేకాక, ఆ అబ్బాయికి బొంగరంమీదగల మమకారం, అతని మనస్తత్వం - యివి కూడా పాఠకుల మనస్సుకి సన్నిహితమవుతున్నవి. "మాతృక్షేత్రం" కథ

మొదటి వాక్యాలు - "కత్తెర గాయకుడు పెద పొలాలకి వెళ్లాడు. నువ్వు చేలు వెన్నెల్లా పూసి పెంకిగంటలు మోగుతున్నాయి. ఆ పుష్పాల మీది సీతాకోకను వెంటాడాడు గాయకుడు. శ్రీ దంచల నేత్రాలలో దృష్టులు సీతాకోక ఎగురులు; కాని కత్తెర గాయకుని ఎగురులు ఆ మనస్సులో ఊహాంచలాలు" చివరి రెండు వాక్యాలూ చాసో స్వతంత్ర శైలికి ఉదాహరణ.

'కొండ గెద్ద' కథా ప్రారంభం - "కనబడ్డాడా ఇంజనీరు. నాలుగు రోడ్లమధ్య నలుగురితో పంట సర్వనాశనం అయి మతి తగులబడి ఉన్నాను -" కథానాయకుడి ఆవేశం అంతా పొట్టివాక్యాల ఆ ప్రారంభం లోనే ఉన్నది. ఇంతకూ ఆ ఇంజనీరు కథానాయకుని చిన్ననాటి స్నేహితుడే! అందుకే ఆ ఆవేశం. ఇది తర్వాత తెలుస్తుంది. ఇలాగే ఏ కథ ప్రారంభవాక్యాలుగాని, మధ్యలో సన్నివేశాల వర్ణనగాని, చివరి వాక్యాలుగాని, ఎక్కడ చూసినా అల్లసానివాని 'అల్లిక జిగిబిగి'లాగ చాసోగారి శైలి అనల్ప శిల్పంతో దర్శనం యిస్తూఉంటుంది.

చాసో కథలు తెలుగు సాహిత్యానికి గొప్పకానుక.

(భారతి : ఏప్రిలు 1980)

# వదిలే బొమ్మలు

— అంగర వేంకట కృష్ణారావు

వస్తువులో, శిల్పంలో వైవిధ్యమున్న కథలు మొత్తం పన్నెండు. ఆరు చిన్నవేమో. ఆరు కొంత పెద్దవి. 'నాగరికత', 'ఎల్లి పతనం',

'బాదంచెట్టు - తంబురా పెట్టె', 'ముక్తధార,' 'సత్తురూపాయి', 'జవాబు చెప్పలేదు' అనేవి చిన్నకథలు. 'నాగరికత' కథలో నిశితమైన వ్యంగ్య విమర్శ ఉన్నది. గోపీచంద్ కథలబాణీ జ్ఞాపకం వస్తుంది. 'బల్లిపతనం'లో చమత్కారం, కొనమెరుపూ ఉన్నాయి. చాలాకాలం క్రితం మంచి ప్రచారంలో ఉండిన 'సీలకంఠం కథల' కోవకు చెందిన కథ ఇది. పరాయి స్త్రీతో శృంగారానికి రంగం సిద్ధమౌతుంది. కాని చివరక్షణంలో ఫలం చేతికందకుండా పోతూంటుంది. కథనం మంచి హుషారుగా సాగుతుంది ఈ కథలో. 'బాదంచెట్టు - తంబురా పెట్టె' గొప్ప కథ. ఛెకోవ్, రవీంద్రనాథ ఠాకూరు స్ఫురిస్తారు. 'ముక్తధార'లో ఎంతో మనస్తత్వ పరిశీలన ఇమిడిఉన్నది. గంభీరమైన అభివ్యక్తి. ఈ నాలుగు చిన్నకథలూ చాలు కీర్తిశేషులైన అంగర వేంకట కృష్ణారావుకి తెలుగుకథకుల్లో ఉన్న స్థానాన్ని నిరూపించేందుకు. ఇలాంటి కథలు ఈ మధ్య బొత్తిగా అరుదైపోవడం గమనిస్తే, వీటి విలువ మరీ తెలిసివస్తుంది. మిగిలిన రెండు చిన్నకథలూ సాదా కథలు. 'సత్తురూపాయి' ఒక ఫార్ములా కథ.

పెద్దకథలు ఆరింటిలో ఎన్నదగినవి 'కలతపడ్డ గంగ', 'కదిలే బొమ్మలు'. 'గంగ' బెస్తవాళ్ళ జీవితాన్ని వర్ణించే కథ. మలయాళంలో శివశంకరపిళ్ళె వ్రాసిన ప్రసిద్ధనవల 'ఛెమ్మీన్' (రొయ్యలు) కథకూ దీనికీ చాలా సామ్యం ఉంది. కాని పర్యవసానం దుఃఖాంతం కాకుండా, దాన్ని స్వప్నంగా మార్చి, సుఖాంతం చేశాడీ కథను రచయిత. 'కదిలే బొమ్మలు' ఆస్పత్రిలో ప్రసూతి విభాగాన్ని వర్ణించే యథార్థచిత్రణ ఇందులోని నర్సు ముత్యాలమ్మ డబ్బుమనిషిగా పరమ కర్కోటకురాలిగా కనిపించినా, కథ కొనమెరుపులో ఆమెలోని మానవత్వాన్ని అభివ్యక్తంచేసి, ఆమెను మనిషిని చేశాడు రచయిత. 'గుర్రం' కథలో గుర్రం ప్రతీక. రౌతుకొద్దీ గుర్రం అని సామెత. రామనాథం శక్తియుక్తులకు మించిన వ్యక్తిత్వం

అతని భార్యది. పర్యవసానం ఆమె అంతర్జాతీయ సంస్థల స్థాయికి ఎదిగి, దూరంగా వెళ్ళిపోతుంది. ఈ కథలో గుర్రానికీ, వ్యక్తిత్వమూ ప్రతిభా గల స్త్రీకి తెచ్చిన పోలిక ఎబ్బెట్టుగా ఉంది. అంతర్జాతీయ మహిళా సంవత్సరంలో అనుకోదగ్గ ఊహ కాదు. గుర్రం బొమ్మ రామనాథం మనస్తత్వంమీద చూపే ప్రభావాన్ని రచయిత కథలో ముడిపెట్టిన తీరుకూడా నమ్మకం కలిగించేదిగా లేదు. 'హోమగుండం' కథలో శిల్పపై చిత్రి ఉన్నది. కాని డిటెక్టివ్ కథల్లో జరిగే హత్యల్లాగానే మిస్సి మరణం పాఠకుల్ని వదిలించకపోవడంతో కథ లక్ష్యశుద్ధిని కోల్పోయింది. 'పెద్ద మనిషి' కథ రాచకొండ విశ్వనాథశాస్త్రి కథల్ని జ్ఞాపకం తెస్తుంది. 'ఎందుకు?' కథకాదు కథపని మేనిఫెస్టో. జీవిత పరిశీలన, వస్తుశిల్పపై చిత్రిపట్ల అభినివేశం ఎలా రచయితలో ఒక నిర్దిష్టమైన సామాజిక దృష్టిగా పరిణామంచెందిందో తెలిపే రచన 'ఎందుకు?' అంటే, కథకుడు వ్రాస్తున్నది ఎందుకు? అని ప్రశ్న. ఈ ప్రశ్న వేసుకోక పూర్వంకూడా వేంకట కృష్ణారావు ఆణిముత్యాలలాంటి కథలు వ్రాశాడనేందుకు ఈ సంపుటిలోని మంచి కథలే సాక్ష్యం.

(ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక 1-10-75) ❋

# ఆకులు రాలే కాలం

— ఇచ్ఛాపురపు జగన్నాథరావు

చేయి తిరిగిన కథా రచయిత శ్రీ ఇచ్ఛాపురపు జగన్నాథరావు పద్దెనిమిది కథల సంకలనం ఇది. అరవైనాలుగు పుటల విడివిగల

'ఆకులు రాలేకాలం' అనే పెద్ద కథనుంచీ ఎనిమిది పుటల్లో ఇమిడిన 'చీకట్లో పారిజాతం' అనే చిన్నకథవరకూ రచయితదైన విశిష్ట కథా శిల్పమూ, ఏకైక ఇతివృత్తమూ (స్త్రీ) ప్రతి కథలోనూ దర్శనమిస్తు న్నాయి. ప్రస్తుతాన్నీ, గతాన్నీ పడుగుపేకలుగా నేస్తూ, తన నేతలో ఒక అందమైన డిజైన్‌ని రూపొందించి, తద్వారా జీవనవైచిత్రికి కళా స్వరూపాన్ని (కథాస్వరూపాన్ని) సృష్టించి హృదయైకవేద్యంగా రసాను భూతి కలిగిస్తాడు జగన్నాధరావు. ఈ కథలన్నీ 'స్త్రీ' అనే వీణమీద మీటిన రాగాలే। అన్నిట్లోనూ యువతీయువకుల, భార్యాభర్తల భావాను బంధమే। ఎక్కడా విషయలాలస, తమకమూ కనిపించవు. శరీరం శరీ రాన్ని కోరడంకాదు, మనసు మనసుని అన్వేషించడమే కనిపిస్తుంది. స్త్రీని ఇతివృత్తంగా తీసుకొన్న ప్రసిద్ధ కథా రచయితలు చలం, బుచ్చి బాబులకూ, జగన్నాధరావుకూ చాలా భేదం ఉన్నది. ఒకవిధంగా వారి కంటే ఆధునికుడు జగన్నాధరావు. చలం రొమాంటిసిజమ్‌గాని, బుచ్చి బాబు ఫ్రాయిడియన్ సైకాలజీగాని జగన్నాధరావు కథలని స్పృశించదు. చలం, బుచ్చిబాబుల రచనల్లో 'స్త్రీ' జీవితంకంటె పెద్దది। జగన్నాధరావు రచనల్లో 'స్త్రీ' జీవితంలో ఒక పాత్ర, ఒక వైచిత్రి, ఒక వెలుగు, ఒక బాధ। అందువల్ల ఇక్కడ 'స్త్రీ'ని గూర్చిన ప్రత్యేకమైన దృక్పథమంటూ సూత్రీకరణ మేమీలేదు। క్షేత్రయ్య పదాలలో మువ్వగోపాలుడు ప్రతి ఫలించినట్లే, జగన్నాధరావు కథలలో స్త్రీ ప్రతిఫలిస్తూ ఉంటుంది. ఎక్కడి కక్కడే ఒక రసానుభూతి. రసోవైసః

కథలను చదివిన తరువాత వ్యాఖ్యానం తప్పదు. ఈ కథల్లో వాచ్యంగా చెప్పబడిన దానికంటె ధ్వనిగా స్ఫురింపజెయ్యబడిన అర్థమే ఎక్కువ ప్రధానం. ఆ స్ఫురణ పఠితయొక్క ప్రతిభా వ్యుత్పత్తుల్ని పరీక్షించేదిగాకూడా ఉంటుంది. పైగా వ్యాఖ్యానానికి సంపూర్ణత్వం ఎలాగూ అసాధ్యం. 'ఆకులు రాలే కాలం' అనే సుదీర్ఘమైన కథ సవలగా వ్రాయ

బడితే, అందులో పాత్రల వైశిష్ట్యం ప్రాధాన్యం వహించేది. కాని జగన్నాథరావు 'కథ'గా వ్రాయడంవల్ల జీవన వైచిత్రికే ప్రాధాన్యం వచ్చింది. ఈ కథలో పాయింట్ 'రజ్జు సర్ప భ్రాంతి'. మొపాసా 'నెక్లెస్' కథలో నకిలీ నెక్లెస్ని అసలైన నెక్లెస్గా భావించడంద్వారా జీవితాన్ని వ్యయపరచుకొన్న దంపతుల్లాగే శివరామ్ తన తొలినాటి తొందరపాటుని - ప్రేమించిన శాంతని ఆమె ఇష్టానికి విరుద్ధంగా అనుభవించి, మరునటి రోజు ఆమె నూతిలో పడ్డదని విని పలాయనం చిత్తగించడం - భారంగా మోస్తూ జీవితాన్ని వ్యర్థం చేసుకుంటాడు. ఆ భారాన్ని మోస్తూ ఉన్న అతని వ్యక్తిత్వానికి 'ఆశ' అనే అమ్మాయి ఆటవస్తువు. ఆ ఆటవస్తువు ఎదుర్కు తిరిగితే, వసంత' అతని రహస్యాన్ని ఆకళింపుకొనే ప్రయత్నంతో దగ్గరగా వచ్చిన దీపపు పురుగు. చివరకు శివరామ్ తన వూరు వెళ్ళి, శాంత మరణించలేదనీ, శాంత ఆనాటి అనుభవాన్ని మరిచేపోయిందనీ తెలుసుకొని తిరిగివస్తాడు. వచ్చి వసంతతో ఆ విషయం చెబుతాడు. అంతటితో వసంతకు అతనిపట్ల ఆకర్షణ పోతుంది. అతను మళ్ళీ 'ఆశ'కు కబురు పెడతాడు. జగత్తు భ్రాంతిమూలకమనే సత్యానికి అందమైన ఉదా స్వరూపం ఈ కథ. ఇందులో వసంతకూ, శివరామ్కూ మధ్యగల ఆకర్షణకు ఎక్కువస్థానం కల్పించి, వారిద్దరిమధ్య గల అనుబంధాన్ని చీకట్లో చిందులాటగా సాగదీయటంతో పఠితను ఆకట్టుకుంటాడు రచయిత. చీకటి పోయి వెలుగురాగానే, ఏముందీ, పాము అనుకున్నది కాస్తా త్రాడు; భ్రాంతితోపాటు రసవంతమైన నాటకమూ ముగిసింది.

విషాదాంతంగా ముగియవలసిన, తొందరపాటుతో చేసిన సాహసం కాస్తా సుఖాంతంగా, కలలు ఫలించేంత సంతోషదాయకంగా పరిణామం చెందే జీవిత వైచిత్రిని సూచిస్తుంది 'జ్ఞానోదయం'. నాణేనికి బొమ్మా బొరుసూలాగే మనిషిలో మానవత్వమూ, పశుత్వమూ ఉన్నాయి. ఇతరుల్లో

పశుత్వాన్ని చూచిన రాజ్యానికి శర్మ మానవత్వంపరంగా కనిపించింది. కాని శర్మకి తన పశుత్వమూ, అది తెచ్చిన భంగపాటూ ఆమెకు తెలియ వని తృప్తి. ఒకరి కళ్ళకొకరు మూర్తీభవించిన 'అదృష్టం'గా కనిపిస్తారు ఆ పేరు కథలో! ఒక నొకరు 'డామినేట్' చేస్తారేమోననే భయంతో యువతీయువకులు దూరమైపోయి, ప్రేమగా పరిణామం చెందవలసిన స్నేహాన్ని జ్ఞాపకంగా మిగుల్చుకున్న కథ 'రేపు రాని కలలు'.

దాంపత్యంలో ఒకరినొకరు 'డామినేట్' చెయ్యడంమీద కొన్ని నిర్దిష్టమైన కథలున్నాయి ఇందులో! 'డామినేట్' చెయ్యబడుతున్న భర్త మరో వన్నెలాడితో పరిచయంకోసమో, మరో మాతృమూర్తిలాంటి స్త్రీ వాత్సల్యంకోసమో ఎగబడటం సహజమట. కాని అలా చేసిన తప్పుని భార్యదగ్గర ఒప్పుకోవడంగాని, సులువుగా దొరికిపోవడంగాని జరిగితే, భార్యకు అతను మరీ లోకువైపోతాడు అని బోధించే కథ 'ఈ పొరపాటు చెయ్యకు'. ఇందులో మాతృమూర్తి స్థానం వహించి ఒక కాపురాన్ని సరిదిద్దబోయిన సుజాత, తన భర్తకే ఆ నీతిని బోధించడం, వార్నింగ్ ఇవ్వడం మరీ సారస్యంగా ఉంది. 'మనిషి - మమత' అనే కథలోనూ సుజాత భర్తచేత సిగరెట్ మాన్పించాలనే ప్రయత్నంచేసి, అది విఫల మయ్యాక, అమిత అనే స్నేహితురాలు పరస్త్రీగా ఆ పని చేస్తే సహించ లేక, మళ్ళీ భర్తచేత సిగరెట్ కాల్పించి, భర్త 'తనవాడు' అని తృప్తి చెందుతుంది. 'శ్రీమతి సుజాత' కథలోని సుజాత "ఏవస్తువైనా (మగవాడైనా, భర్తఅయినా) మరొకళ్ళకి కావలిస్తేనే అందం, ఆకర్షణా" అంటూ జీవనమాధుర్యం తాలూకు 'రహస్యాన్ని' చెబుతుంది. ఇలా చాలా కథల్లో కనిపించే 'సుజాత' మునిమాణిక్యం కథల్లోని 'కాంతం'లాగ ఒకే వ్యక్తి, ఒకే పాత్రకాదు. కాని జగన్నాథరావు నిగ్గుతేల్చే దాంపత్య సూత్రాలుగా చెప్పదల్చుకున్న సత్యాన్ని, నీతుల్ని సుజాత పేరుమీదనే

వ్యక్తం చెయ్యడం గమనించదగిన సంగతి. సుశారత రచయిత కీ పైన పేరు.

'రెండో ప్రాణం' కథలో జ్యోతి సంబంధిత ఘన స్వత్వాన్ని సూచిస్తూ, చివరకు ఆమెతో పెళ్ళి కాకపోవడమే కథానాయకునికి ముక్తి అన్న విషయాన్ని ధ్వనిపూర్వకంగా పతితకు వదలిపెట్టడం ఎంతో బాగుంది. ఈ కథలో జ్యోతి నీతికి ప్రాధాన్యమిచ్చే 'పిస్సిరేటివ్'లా కనిపిస్తుంది. కాని ఆమెకు మనుష్యులమీదా, స్నేహంమీదా నమ్మకం లేదనే సత్యాన్ని చాలా సున్నితంగా వ్యక్తంచేశాడు రచయిత. ఔదార్యం, నీతి అంటే ఏమిటో రమేశ్వర్‌ద్వారా, ఆయన భార్య రూప, ప్రేయసి ప్రియంవదలద్వారా వ్యక్తంచేశాడు. ఇక్కడ వైచిత్రి: అందమైన స్త్రీ భార్యా, అందంలేని స్త్రీ ప్రియురాలూ కావడం. ప్రతి కథలో ఎక్కడో తాళంచెవిలాంటి వాక్యం ఒకటి దాచిఉంచుతాడు రచయిత. ఈ కథలో అలాంటి వాక్యం – "అన్ని సౌందర్యాలకన్నా ఆత్మసౌందర్యం గొప్పది" అని కథానాయకుడు జ్యోతితో కథ మొదట్లో రమేశ్వర్‌ను గురించి అనడం. దాని విస్తరణే కథాస్వరూపం.

'చీకట్లో పారిజాతం' (అన్నింటికన్నా చిన్న కథ)లో కథకుదిచ్చిన తాళంచెవి, కథ చివర ఉన్నదాన్ని పట్టుకోకపోతే కథ అర్థమే కాదు. దంపతులు భార్య పుట్టినరోజు సెలిబ్రేట్ చెయ్యడానికి చీరల, నగల షాపు లన్నీ తిరిగి చివరికొక సాదా వాయిల్‌చీర కొని ఇంటికి వస్తారు. కథ మొదటినుంచీ వాళ్ళు చాల ధనవంతులనే వాళ్ళ మాటలద్వారా తెలు స్తుంది (మళ్ళీ చదివితే రెండర్థాలు చాలచోట్ల కనిపిస్తాయి). తిరిగి వచ్చాక భార్య 'అలసిపోయారా?' అంటుంది. భర్త "కాదు, రాదా, మన నాటకం తలుచుకొని బాధపడుతున్నాను, నవ్వుకుంటున్నాను" అంటాడు. వాళ్ళు బ్రతికిచెడ్డవాళ్ళనీ, వాళ్ళు చెప్పుకొన్నమాటలన్నీ ధనవంతుల్లా

వూహించుకొని నాటకమాడటమేననీ బోధపడుతుంది। భార్య అంటుంది సమాధానంగా : "ఆఁ మళ్ళీ నిజంలోకి వచ్చాం. అయినా అంత సిరి సంపదలు మనకెందుకండీ।" 'ఇంత', అనలేదు. 'అంత' అంటూ గతాన్ని సూచిస్తూంది స్పష్టంగా. ఈ తాళంచెవి దొరక్క, పుస్తకానికి పీఠిక వ్రాసిన పురాణంవారు ఈ దంపతుల్నిగూర్చి "వాళ్ళెంత దగ్గరగా ఉన్నా, వాళ్ళ మధ్యఉన్న సున్నితమైన దూరాన్ని సజెస్టివ్‌గా - పండిత రాయలంత సొగసుగా చెప్పారు రచయిత" అని వ్యాఖ్యానించారు. ఆవిడ ఖరీదైన చీరలూ, నగలూ కొనకుండా సాదాచీర తీసుకోవడం అది ఆమెహా, భర్తహాగల 'దూరం'గా వారు భావించారు। కీలకం డబ్బు పోగొట్టుకొన్న బాధని భార్యాభర్తలు ఎంత చక్కగా పంచుకొంటున్నా రనేది। "మల్లెపూలు ఆమెనిండా పోసి కౌగిలించుకొని, మనకీ సంపదలు చాలు, రాధా" అంటాడు భర్త చివర. జగన్నాధరావు కథలు చాలా జాగ్రత్తగా చదవదగినవి - ఆలోచించదగినవి.

'రూపాయిటా - అణాటా', 'పరమిచ్చిన వేలుపు'. మనసులు కలవని దాంపత్యాన్ని గూర్చి. స్థలాభావంచేత మిగతా కథల్ని వ్యాఖ్యానించ లేదు. ఇటువంటి కథాసాహిత్యానికి తగిన స్థాయికి తెలుగు విమర్శ ఎదగ వలసిన అవసరం ఎంతైనా ఉన్నది.

(ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక, 25-10-78) ❋

# లైఫ్ ఇన్ ఎ కాలేజ్

— నవీన్

కాలేజీ విద్యార్థి మనస్తత్వాన్ని సమర్థవంతంగా చిత్రించిన 'అంప శయ్య' నవల రచయిత నవీన్, తదుపరి పత్రికల్లో ప్రకటించిన పద

మూడు కథల సంకలనం ఈ పుస్తకం. ఇందులో నాలుగు కథలు అధోలోకం, టెక్నికలర్, లైఫ్ ఇన్ ఎ కాలేజ్, ట్యూషన్ మేష్టారు అనే 'అంపశయ్య'కు అనుబంధంలాంటివే. 'లైఫ్ ఇన్ ఎ కాలేజ్'ని కథ అనడానికంటె నవలిక అనడమే సబబు. 'టెక్నికలర్' కూడా ఇంచుమించు అంతే నిడివిఉన్నా, దాన్ని సాగదీసిన కథ అనాలేకాని నవలిక అనడానికి వీల్లేదు. 'లైఫ్ ఇన్ ఎ కాలేజ్'ని విస్తృతపరచడానికి ఎలా అవకాశం ఉన్నదో, 'టెక్నికలర్'ని కుదించడానికీ అలానే అవకాశం ఉన్నది। ప్రక్రియను గూర్చి కొంత ఆలోచించి ఇలా విషయగ్రంథనం మెలకువతో చేసుకోగలిగితే ఈ రచయిత అగ్రశ్రేణి రచయిత కాగలడనేందుకు సందేహం లేదు. రచయిత ప్రతిభ అటువంటిది. ఈయనకు మంచి భావనాశక్తి, మనస్తత్వ పరిశీలన, వ్యుత్పత్తి ఉన్నట్లు ఈ కథలు ఋజువు చేస్తున్నవి.

తీరిన కోరిక, వేట, కపి, రెండో పెళ్ళి, హత్య అనే కథలు రచయిత మనస్తత్వ పరిశీలనను అభివ్యక్తం చేస్తాయి. మనస్సును పట్టి బాధించే ఒక వేధ - భార్యమీదనో, తండ్రిమీదనో, అధికారిమీదనో ఒక అనుమానం, ఒక ఏవగింపు, ఒక తిరుగుబాటు, అంతరాంతరాలను తొలిచి వేసే మనస్థితి - దాని స్వరూపమూ, విన్యాసమూ, పరిణామమూ చక్కగా చిత్రించిన కథలు పైవి అయినా. 'రెండో పెళ్ళి' ఒక సుఖాంతం.

నిప్పురవ్వలు, పేదవాడి పెళ్ళాం అనే కథల్లో నేటి సామాజిక వ్యవస్థలో సెక్స్ విషయంలో జరిగే 'దోపిడీ' తాలూకు విశిష్ట పరిస్థితుల వాస్తవిక చిత్రణ ఉన్నది. 'నిప్పురవ్వలు'లో సరోజ పాత్రయొక్క మనస్తత్వ చిత్రణకు రచయితను అభినందించాలి. వ్యక్తి నైజం పోయే వింత పోకడలు ఈ కథలో ప్రత్యేక ఆకర్షణ.

పోతే క్లబ్బు, ఎంచ అనే కథలు అభ్యుదయ ధోరణిలో చేసిన ప్రయత్నాలుగానే కనిపిస్తాయిగాని, రచయితయొక్క సహజ సృజనాత్మక

శక్తికి వాటిలో అభివ్యక్తి లేదు. 'ట్రబ్బు' కథలో కొంత అసంబద్ధత కూడా చోటుచేసుకున్నది. అందులోని కలెక్టరు, ఎస్. పి. ల పాత్రల్లో సహజత్వం లోపించింది.

'చైతన్య స్రవంతి' పద్ధతిలో కథనం రూపొందిన కథ 'అధోలోకం' ఒక్కటే. 'తీరిన కోరిక', 'టెక్నికల' కథల్లో ఆ పద్ధతిని మామూలు పద్ధతిలో మిశ్రమంచేసి ఉపయోగించిన తీరు బాగా ఉన్నది. చైతన్య స్రవంతి పద్ధతిని ఒక వ్రతంగాకాక, దాన్ని శిల్పంలో సందర్భోచితంగా ఉపయోగించుకోవడంతో నవీన్ చేస్తున్న ప్రయోగాలు బాగున్నాయి.

(ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక : 25-2-76)

# రంగుటద్దాలు

— శీలా వీర్రాజు

రంగుటద్దాలు, మృత్యువు నవ్వుతోంది. ఉరితీయబడ్డ నిజం, చీకటి మడతలు - ఈ సంపుటి నాలుగు కథల్లోనూ ఇతివృత్తం స్త్రీ మనస్తత్వ పరిశీలన. ఈ కథకుడిమీద బుచ్చిబాబు ప్రభావం బాగా కనిపిస్తోంది. కాని శైలిలోనూ, అనుభూతిలోనూ కథకుని వ్యక్తిత్వం, ప్రత్యేకత సుస్పష్టం. స్త్రీవిగూర్చిన మధుర సంవేదనలోనూ, కథాసంవిధానాన్ని మలచటంలోనూ బుచ్చిబాబు ఛాయలు గోచరిస్తాయి.

"ఈ సంపుటికి బుచ్చిబాబు "కథకుని వ్యక్తిత్వం" అను శీర్షికతో పరిచయం వ్రాశారు - "తనతో తాను సమాధానం కుదుర్చుకొన్న రచయిత

పీర్రాజు....సమాధానం కుదుర్చుకోవటంలో ఎంతటి సంఘర్షణ, బాధ, మానసిక వ్యథ ఉన్నాయో అతనెరుగును....రచయిత తన అంతరంగంలో మునిగిపోయి, వూహలో తపస్సులాంటిది చేసి, అనుభూతిని సాక్షాత్కా రింపజేసుకోవాలన్న తపనతో పూనుకొన్న రచనలు...."

కథలు చదివితే ఈ వాక్యాలు న్యాయంగానే ఉన్నాయని తోస్తుంది. 'రంగుటద్దాలు' కథలో పురుషులతో చెలగాటమాడే వసంత వ్యక్తిత్వాన్ని ముగ్గురు పురుషుల విభిన్న దృక్కోణాలనుంచి చిత్రిస్తూ అందులోని ఏక త్వాన్నీ, మంచినీ, నిరూపిస్తూ ఆమె జీవితంలోని విషాదాన్ని చివర నిగ్గు తేల్చి చూపటం ఎంతో చక్కగా ఉంది. 'మృత్యువు నవ్వుతోంది' అనే కథకు ఆలంబనమైన భావం - "తాత్కాలికమైన ఆనందానికి ఒక వ్యక్తి జీవితాన్ని నాశనం చేసిందని కోపం వచ్చినా, తన జీవితానికికూడా నాశ నాన్ని కొనితెచ్చుకొన్నంత తెలివితక్కువది అయిపోయినందుకు ఆమెపైన జాలి వేసింది." .... "జీవితాలు చాలా విలువైనవి. అవి చెలగాటం ఆడ్డంకొరకు నియమించబడలేదు. ఆడడానికే అని ప్రవర్తిస్తే అది తెలివి తక్కువతనమే అవుతుంది!" అనే నీతిపాఠాన్ని ఉటంకిస్తూనే, 'జీవితాన్ని గూర్చిన సత్యంకాని అనుభూతియొక్క పరమార్థం కాని యిమిడింది నీతి పాఠంలో లేదు, మరోసారి ఆలోచించి చూడండి!' అని చెప్పదలుస్తున్న ట్లుగా కథ ముగిసింది. ఈ చివరి వాక్యంతో - "వెళ్ళిపోతున్న మాకు వీడ్కోలు యిస్తున్నట్లుగా జాలిగా మృత్యువు నవ్వుతోంది!" ఎవరిని గూర్చి ఎవరు జాలిపడుతున్నట్లు? మృత్యువే నీతిపాఠాలతో బ్రతికే మనుష్యుల్ని చూచి జాలిపడి నవ్వుతోందట! తాత్కాలికమైన ఆనం దమూ, జీవితమూ అంటూ త్రాసులో పెట్టి తూచడం సాధ్యమా? అవి

సవాలు చేస్తోంది ఈ కథ. 'ఉరితీయబడ్డ నిజం' అనే కథలో మంజరి చరిత్ర స్త్రీ మనస్తత్వంలోని ఒకానొక గుణానికి చక్కని రూపకల్పన - అది స్వాభిమానం. చాపల్యంవల్ల జరిగిన ఒక్క పొరపాటు ఫలితంగా ఏర్పడిన పరిస్థితుల్లో ఆ స్వాభిమానం నిలవద్రొక్కుకునేందుకు చేసే ప్రయత్నమే నిజాన్ని ఉరితీయటం. 'చీకటి మడతలు' కథ కొంత కృత్రిమంగా ఉంది. ఇందులో రహస్యంగా ప్రేమించి, ప్రేమను వ్యక్తం చేసే ధైర్యం లేకపోయిన యిద్దరి స్త్రీలలో ఒకరు జీవితంలో రాజీ పడటమూ, మరొకరు పడలేకపోవటమూ కథావస్తువు. కాని అంతకంటే కథకుడు చివరి పొందే తృప్తి - నాకు చెప్పలేనంత ఆనందమైంది. ఇరువురిచేత ప్రేమించబడ్డాను. అదోరకమైన గర్వం' అనే వాక్యాలే కథకు ముఖ్యంగా కనిపిస్తున్నాయి. కొండను త్రవ్వి ఎలుకను పట్టినంత హంగామా జరిగినా అలా కొండను త్రవ్వటమూ ఒక రకం మనస్తత్వమే అని చూపించటం జరిగింది.

జీవితం అంటే ఊహకూ, తర్కానికీ, నీతికీ అందని లోతులు, మెలికలూ, అనుభవాలూ సంకీర్ణం చెందిన గంభీరమైన, గహనమైన విషయంగా ఈ కథల్లో నిరూపించటం జరిగింది. ఈ కథల్లోని స్త్రీ పాత్రలు పొందిన పోటుకు ఒకవిధంగా వారివారి మనస్తత్వాలకు సంబంధించిందే అయినా, అందులో అదృష్టం నిర్వహించిన పాత్రకూడా లేకపోలేదు. దానితోబాటు పురుషలోకానికి స్త్రీనిగూర్చి ఉండే వూహాపోహాలుకూడా స్త్రీల జీవితాలమీద ఎటువంటి ప్రభావం చూపిస్తాయో వ్యక్తమవుతోంది ఈ కథల్లో. స్త్రీ హృదయాన్ని గూర్చిన రచయిత జిజ్ఞాస, తీవ్ర మననశీలత, ఈ కథల్లో ప్రత్యేకమైన లక్షణం. ( ఆంధ్రపత్రిక : 9-5-65 ) ❋

# ఊరు వీడ్కోలు చెప్పింది

— శీలా వీర్రాజు

స్పందన సాహితీ సమాఖ్యవారి 16వ ప్రచురణగా వెలువడిన ఈ కథా సంపుటిలో ఆరు కథలున్నాయి. గుర్తించని త్యాగానికి గుడ్ బై, ఊరు వీడ్కోలు చెప్పింది, ఓడిపోయాక, పీడ, చావద్దు, చాపకింద నీరు. అన్ని కథల్లోనూ ఒక పద్ధతి కథాశిల్పం పరిణతి చెందిన స్థాయిలో కనిపిస్తోంది. ప్రతి కథకూ కొస మెరుపు ప్రాణంగా ఉంటోంది. ఉత్కంఠతని పోషించడంలో, ముగింపుముందే తెలియకుండా జాగ్రత్తపడడంలో, పాత్రలని ఔచిత్యమెరిగి తీర్చిదిద్దడంలో నిర్దుష్టంగా ఉన్నాయి కథలు. ఉద్విగ్నత కనిపించనీయకుండా, వాస్తవికత ఆధారంగా, చెప్పదలచుకున్న దాన్ని చివర స్పష్టంగా స్ఫురింపజెయ్యడంలో రచయిత పొందిన కృతకృత్యత ఈ కథలలో ఎన్నదగిన గుణం.

మొదటి కథలో ఉద్యోగం చేస్తున్న ఆడపిల్ల కుటుంబాన్ని పోషిస్తూ ఆదుకుంటూ ఉన్నా, ఆమెకి తల్లిదండ్రులనుంచీ, తోడబుట్టినవారినుంచీ ఎటువంటి ఆదరణా లేకపోగా, ఆమె కుటుంబాన్ని అప్రతిష్ఠపాలు చేస్తుందేమోనన్న అనుమానంతో చిత్రహింస ప్రారంభం కావడంతో, సెంటిమెంట్లను అవతలికి నెట్టి ఆమె తనదారి తను చూసుకోవడాన్ని సమర్థిస్తూ, యువతులకు స్వధర్మాన్ని ప్రబోధించారు రచయిత. రెండవ కథ - ఊరు వీడ్కోలు చెప్పడంలో కనిపించిన ఆదరాభిమానాలకూ, పొగడ్తలకూ కృతజ్ఞతా భారంతో తలక్రిందులైన ఉపాధ్యాయ దంపతులకు, తమ వెర్రి పిల్లను ఆ ఊళ్ళో ఎవరో 'అన్యాయం' చేసి గర్భవతిని చేశారన్న విషయం నింపాదిగా తెలియవస్తుంది. మూకఉమ్మడిమీద అభిమానం అనేదీ, ఊరు మంచి అనేది ఎటువంటి నీటిబుడగో, మేడిపండో సూటిగా చెప్పిన కథ ఇది. 'ఓడిపోయాక' అనే కథలో మగవాణ్ని నమ్మి మోసపోయాక ఆడ

దానికి దారి ఆత్మహత్యకాదు. తల్లిదండ్రుల నాశ్రయించడం కాదు. జీవితాన్ని ఎదుర్కోవడమే ననే ప్రబోధం ఉన్నది. 'నీడ' కథలో భార్యల వ్యక్తిత్వాలు భర్తల వ్యక్తిత్వాలకు నీడగా తయారవుతూంటాయనే సూత్రీకరణ చేశారు రచయిత. ఇది సర్వత్ర నిజమని ఒప్పుకునేందుకు వీలుకాని సూత్రీకరణ. కథలన్నింటిలో కొంత అసంతృప్తి కలిగించే కథ ఇదొక్కటే. ఇందులో కథానాయకుడు చేసిన విమర్శ - వెంకటేశ్వర్రావుని గూర్చి, ఆయన తన చిన్ననాటి చెలిమికత్తె చందన భర్త కావడంవల్ల తనలోని అజ్ఞాతమైన అసూయవల్ల ప్రేరితమైందేమో అనుకోవడానికీ ఆస్కారం ఉన్నది. పోతే చందన తను మారిపోవడాన్నిగూర్చి ప్రత్యేకంగా కథానాయకుడికి ఉత్తరం వ్రాయడంలోనూ సహజత్వం కొరవడింది. 'చావద్దు' అనే కథ అన్నింటిలోకీ ఉత్తమంగా ఉన్నది. సున్నితమైన కథావస్తువుని మెలకువతో చిత్రించారు. ఇక్కడ పాత్రల మౌనం, గాంభీర్యం వాళ్ళ మాటలకంటె ఎక్కువగా వాళ్ళ హృదయంలోని ఆవేదనని వ్యక్తం చేస్తాయి. ఇది చదివి తెలుసుకోవాల్సిన కథ. 'చాపకింద నీరు' మంచితనాన్ని నటిస్తూ "జీవితాలు జీవితాల్నే తన్నుకుపోయే గద్ద" లాంటి వ్యక్తిని కొనమెరుపుగా ఆవిష్కరించిన కథ. అన్నీ చక్కని కథలు.

(ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక 12-1-77)

# బ్రెయిన్ డ్రెయిన్

— కె. వి. ఎన్. శర్మ

రచయిత పూర్తిపేరు కందుల వరాహ నరసింహ శర్మ. తెలుగులో క. వ. న. శర్మ, ఇంగ్లీషులో కె. వి. ఎన్. శర్మ అనీ వ్యవహారం.

కాశీ రామేశ్వర మజిలీల ఒరవడిని హాస్యధోరణిలో, ప్రయోజనాత్మకంగా వ్రాయబడిన అమెరికా మజిలీ కథలు విశ్వవిద్యాలయాల్లో, పరిశోధనా సంస్థల్లో నేటి శాస్త్ర పరిశోధనా వ్యవస్థ తీరు తెన్నులను చక్కగా ఆవిష్కరిస్తున్నాయి. ఈ సంపుటిలోనే రెండవభాగం 'వస్తుందే మనవాళ్ళ కథలు'. ఉద్యోగ నియామకాల్లో జరిగే కుంభకోణాల్ని ఏకరువు పెడుతున్నాయి. స్త్రీ పురుష సంబంధాలూ, కుటుంబ వ్యవస్థ, సామాజికన్యాయం సాహిత్యవస్తువుగా ఉంటూంది కాని ప్రత్యేకమైన రంగాల్లో ఎదురయ్యే సమస్యలూ, జరిగే అన్యాయాలూ, అక్కడి వ్యక్తుల ప్రవర్తన, సాహిత్య పరంగా సామాన్య జనానికి తెలిసే అవకాశం ఉండడంలేదు. ఆర్థర్ హెయిలీ వ్రాసిన 'సర్ పోర్ట్', 'హోటల్' అన్న నవలలూ, తెలుగులో కొమ్మూరి వేణుగోపాలరావు వ్రాసిన 'హౌస్ సర్జన్' నవలవంటివి ఇలా ప్రత్యేకమైనవి. ముళ్ళపూడి వారి 'రాజకీయ భేతాళ పంచవింశతి' హాస్య ధోరణిలో వ్రాసిన ప్రత్యేకమైన రచన. రాజకీయాల్లో వ్యక్తుల ప్రవర్తన, అందులోని ఎత్తులూ - పైఎత్తులూ వాటి యథార్థ చిత్రణే ప్రధానం. హాస్యం హాస్యంకోసం కాదు, ప్రయోజనంకోసం అన్నమాట. అలాంటి రచనే ఈ 'బ్రెయిన్ డ్రెయిన్' కథలు కూడా. ఇవి సామాన్య పాఠకులకి నచ్చుతాయా, లేదా? అని ఒక సంపాదకుడు లేవదీసిన సందేహానికి ఆస్కారమే లేదు! శ్రీ శర్మగారి రచనలో క్లిష్టమైన విషయాన్ని సుగమం చెయ్యడమే కాకుండా, దాన్ని ఆకర్షణీయం చేసే ప్రతిభకూడా వ్యక్తమవుతున్నది. మచ్చుకి: "సాలిడు మెకానిక్కుల్లో .... సాలిడు మెకానిక్సు కాదు! సాలిడ్ అంటే ఘనపదార్థాలతో తిప్పలుపడ్డం అన్న మాట. రెండోది ఫ్లూయిడ్ మెకానిక్స్ అంటే ప్రవహించే పదార్థాలశాస్త్రం అన్నమాట.... ఇంతకూ ఈ రెండు మెకానిక్కులు డాక్టర్ షల్లయ్య విషయంలో పూర్వం మిథిలలో నాగేటిచాలులో దొరికిన మణులు 'నీవంటే నీ' వని రైతులు పోట్లాడుకుని జనకుడి దగ్గర కెళ్ళినంత ధర్మంగానూ,

అతగాడు - 'మీవాదంటే మీ వాద'ని ఘోరంగా పోట్లాడుకుని ఆ డిపార్టు మెంటు తలకాయ దగ్గరకెళ్ళి మా బిల్డింగ్‌లో చోటు లేదంటే మా బిల్డింగ్‌లో చోటు లేదని గోడు వెళ్ళబోసుకున్నారు. తలకాయకి తలనొప్పి వచ్చింది. ఇలాంటి విషయాల్లో తలకాయకి నొప్పి రాకపోతే కిరీటం వస్తుందా?" ఇలా ఆద్యంతమూ ఆకర్షణీయంగా సాగిన రచన ఎవరికి గాని నచ్చకపోవడమంటూ ఉండదు।

శర్మగారి హాస్యదృష్టికి కీలకం ద్వేషంకాదు; ఏహ్యాభావంకాదు; ఎగతాళికూడా కాదు; సానుభూతి। ఈ హాస్యం మనసుల్లో సంచలనాన్ని కలిగిస్తుంది; ఆనందాన్నీ ఇస్తుంది. 'వడ్డించే మనవాళ్ళను గూర్చి 'ఉపోద్ఘాతం'లో శర్మగారు ఏమన్నారో చూడండి: "వడ్డించేవాడు మన వాడైతే మనకి చాలా బాగుంటుంది. కాని వాడికే పాపం ఏమంత బాగుండదు. ఇతర్లకేమాత్రం అనుమానం రాకుండా వాడు తనవాళ్ళకి వడ్డించగలగడం ఒక పెద్ద గండం గడిచి గట్టెక్కడం. ఉపేంద్రుడు దానవాధముల కనుమానం కలుగకుండా తన వాళ్ళైన ఇంద్రాదులకు మాత్రమే అమృతం వడ్డించటానికిగాను నడుముకి చీర కట్టుకున్నాడు. దానితో నానా పాట్లు పడి భరతనాట్యం చేశాడు. అయితే దేవతలకి చీమ కుట్టినట్టుగాకూడా లేదు.... తినేవాడికే బాధా లేదు. వడ్డించే వాడిదే తలకాయ నొప్పంతాను." తన రచనకి ఒరవడి పెట్టిన ముళ్ళపూడి, పార్కిన్‌సన్‌లను రచయిత 'ఉపోద్ఘాతం' లో మరిచిపోలేదు. ఈ కథలకు అనుబంధంగా ఈ మధ్య 'కాన్ఫరెన్స్‌లనే తిరునాళ్ళ కథల్ని' వ్రాసినట్లున్నారు శర్మగారు. అందులోనూ సిద్ధయ్య మావ;, గోపన్నల చుట్టూ కథ నడుస్తుంది. శర్మగారిలాంటి వెన్ని కథలు వ్రాసినా, పాఠకులు ఇంకా రావాలనే అంటారు. సందేహం లేదు. (ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక: 23-7-75) ❋

# దిక్కుమాలిన కాలేజీ

— కె. ఎన్. వై. పతంజలి

తొమ్మిది కథల సంపుటి. ఒక మోస్తరుగా మంచివనిపించుకునేవి నాలుగు – 'మోటుమనిషి', 'సిగ్గులేదు', 'మరణమృదంగం', 'గాండేరం' అనేవి. తోటి మనిషిపట్ల అసహ్యం, ఏవగింపుకాదు నాగరకత, నాజూకుతనం అంటే; "మోటుచేతులే" అయినా "జాలిపడి ఆప్యాయంగా పట్టుకుని, దుమ్ముపట్టిన, తెగమాసిన ఒడిలోనే పడుకోబెట్టుకుని" అస్వస్థుడైన యువకుణ్ని అంతదాకా నాజూకులు పోతూ ఏవగించుకున్నవాణ్నే, సమయానికి ఆదుకున్నాయి ఆ 'మోటుమనిషి' చేతులు. 'మోటుమనిషి' కథ ఎత్తుగడ, ముగింపు బాగున్నాయి. 'సిగ్గులేదు' కథలో ఒక మధ్యతరగతి పేద యువకుడు చాకలిని (శ్రామికుణ్ని) సిగ్గులేకుండా వంచిస్తాడు. 'మరణమృదంగం' కథలో కాన్సరేమోనని భయపడి భార్యని డాక్టరు దగ్గరకు తీసుకువెళ్ళి కూడా అవసరమైన టెస్టు చేయించని విశ్వనాథాన్ని ఈసడించుకుని కొడుకు మూర్తి ఆ టెస్టు చేయించి, అది కాన్సర్ కాదని తేలుస్తాడు. ఈ రెండు కథల్లోనూ తండ్రీ, కొడుకుల మధ్య రచయిత చిత్రించిన ఈసడింపు, తిరస్కారం, తిట్లు ("దొంగలంజ కొడుకు, ఎవరేమైపోయినా అక్కర్లేదు, గొర్రిలాగ తలొంచుకు పడిపోవటం...." అంటూ తండ్రిని కొడుకు మనసులో తిట్టుకోవటం) కథా సన్నివేశాల ఔచిత్యాన్ని మీరి ఆవేశపూరితంగా ఉండటం ఎబ్బెట్టుగా ఉంది. సాహిత్య శిల్పానికి ఇముడని ఆవేశమేదో రచయితలో ఉన్నట్లు ఈ కథలు వ్యక్తం చేస్తున్నాయి. 'గాండేరం' కథ కలరానుగూర్చి సైన్సుకీ, మూఢ విశ్వాసాలకీ ఒక గ్రామీణ ప్రజలలో చెలరేగిన సంఘర్షణ. మాండలికంలో వ్రాయబడిన ఈ కథ మంచి రచన.

మిగిలిన అయిదు కథల్లో కాలేజీలలోని అవకతవకలనుగూర్చి అవహేళనగా వ్రాసిన కార్టూన్లులాంటి స్కెచెస్ - 'దిక్కుమాలిన కాలేజి', 'స్తంభాలు' అనేవి. ఒకటి మానేజిమెంట్‌వారి అధికార దుర్వినియోగాన్ని గూర్చి, రెండవది లెక్చరర్లు పాఠాలు చెప్పకుండా ట్యూషన్లు చెబుతారనీను. ఇలాంటి విమర్శకు కార్టూను రచన పనికిరాదు; వాస్తవికత ప్రధానమైన చిత్రణ కావాలి. 'వెళ్ళొస్తాను, భానూ', 'పది పైసలు' అనే కథలు డబ్బునుగూర్చి డబ్బులేని మధ్యతరగతివాళ్ళు పడే బాధల్ని అతిగా సెంటిమెంటలైజ్ చేసే రచనలు. "మనం మన బీదరికాన్ని అసహ్యించుకోలేక డబ్బుని అసహ్యించుకుంటాం" (పుట 54) అని ఒక పాత్రచేత చెప్పిస్తారు రచయిత. కాని ఈ రెండు కథల్లో డబ్బుని గూర్చి అసహ్యంకంటే 'ఏడుపు' ఎక్కువగా ఉంది. 'అడల్ట్ స్టోరీ' సంతాన నిరోధక సాధనాలు శృంగారాన్ని చంపే సాధనాలనీ, చాలీ చాలని బ్రతుకులు బ్రతికే మధ్యతరగతి పేదవారికే ఈ దురవస్థ అనీ చెబుతున్న కథ. సెక్స్ అంటే "ఒట్టి కోరిక మాత్రమే కాదు, సెలిబ్రేషన్ ఆఫ్ సోల్స్ - ఆత్మల పండుగ. మానవుడికంటె ప్రాచీనమైన ప్రేమ (24). "నేను బీదవాడిని, పిల్లల్ని పోషించుకోలేమోనన్న భయంతో ఉన్న పిరికి మొగుణ్ని.... సుందరతా, సున్నితమయీ పట్టపు నాకు ... భయాలే తప్ప సెంటిమెంట్లు లేవు. కళ్ళు ర్కీ, నీచత్వమూ, తగొంచుకున్నాను కనక చరించగలను, సిగ్గుపడను" (27). దీన్ని సెంటిమెంటలిజమ్ క్రింద బొత్తిగా తీసివెయ్యడానికి వీల్లేదు. రచయిత కొంత భావుకుడు అనడానికి అక్కడక్కడ వచనం వదలి కవిత్వం వ్రాస్తూండటం కనిపిస్తుంది. "చీకటి మీద పడి మనసుని పిసుకుతూంది", "తెల్లవారి నిద్రలేచేసరికి - వెల్తురు కత్తిలాగ ప్రవాహంగా కంటిలోకి దిగిబడింది." (41) "సంతోషానికి - సంపదకీ సంబంధం ఉన్నట్లే విసుగులూ - నిశ్శబ్దానికీ చుట్టరికం ఉంది. భయం

23)

శబ్దాన్ని విరిచి చంపుతోంది. చప్పుడు చెయ్యని కెరటాల్లాగా తిరుగుతున్నారు ఇంట్లో అందరూ" (47). "ఆమె వెక్కులు తీగలాగ సాగుతున్న లిపి మలరావు ఆలోచనలపై గొళ్ళాలు" (27). భావుకుడు కాబట్టే సెంటి మెంట్ నుంచి సెంటిమెంటలిజమ్‌లోకి జారి చతికిలబడటమూ కనిపిస్తుంది. సంయమనం కుదిరితే చక్కని రచన చెయ్యగల లక్షణాలున్నాయి రచయితలో.



# అత్తగారి కథలు

— భానుమతీ రామకృష్ణ

సినీతార భానుమతికి తెలుగు సాహిత్యంలో ఒక స్థానం ఏర్పాటు చేయించింది ఆమె 'అత్తగారు'. లక్ష్యశుద్ధి, సంయమం లేకపోవడంవల్ల కథారచన, హాస్యము ఎలా దెబ్బతిన్నాయో వివరింపబడింది. 'అత్తగారి పట్ల భయభక్తులు కారణం కాబోలు, 'అత్తగారి కథల్లో' చక్కని సంయమం కనిపిస్తోంది! ఈ కథల్లో కథకురాలైన కోడలు మహా సున్నితంగా, రాచకీయవేత్తలను తలదన్నే నేర్పుతో, చాకచక్యంగా, తప్పించుకొని తిరగ్గల సమర్థురాలు. ఆమె అత్తగారిని గూర్చి కథ చెప్పటంలో 'అత్తగారి'పట్ల తనకున్న భక్తి గౌరవాలకు ఎక్కడా వాచ్యంగా లోపం కలుగనివ్వదు. పోతే అంతా వ్యంగ్యమే! పెదవి కదపకుండా, పళ్ళు కనిపించకుండా నవ్వటమే! 'అత్తగారి' పాత్రయొక్క వాస్తవికతకంటె, కోడలి కథాకథనంయొక్క వ్యంగ్యవైభవం, సున్నితమైన హాస్యం, ఈ కథల్లో సాహిత్యపరంగా ప్రధానమైన విలువ.

"అత్తగారు హాస్యపాత్ర అని వేరే చెప్పనక్కర్లేదు. మనస్థితికీ, వాతావరణానికీ మధ్య అసాంగత్యం (Incongruity) ఉండి, దాని ఫలితంగా ఘర్షణ సాగినప్పుడే హాస్యం ఉత్పత్తి అవుతుంది. అత్తగారి మనస్తత్వానికీ, బాహ్యప్రపంచానికీ ఎక్కడా పొంతనలేదు. అందుకే ఆవిడ హాస్యం పుట్టిస్తుంది." అని సూత్రీకరించారు. శ్రీ కుటుంబరావుగారు. ఆయన యీ సంపుటికి వ్రాసిన పరిచయం, అత్తగారి పాత్ర కలం చిత్రం (Pen Picture) చక్కని సాహిత్య విమర్శ. పుస్తక పరిచయం అంటే ఎలా ఉండాలో అలా వుంది - యోగ్యతాపత్రం (Testimonial) లా లేదు. అసంబద్ధంగా సత్యదూరంగా లేదు ఇది ఈ పుస్తకానికి పట్టిన ఒక అదృష్టం, సాహిత్య అకాడెమీ బహుమతితోబాటు :

కాలగతిలో వడివడిగా అదృశ్యమైపోతున్న పాత్ర భానుమతి 'అత్తగారు'. మునిమాణిక్యంగారి 'కాంతం' ఈ పాటికే పాతబడిపోయింది. మారుతున్న సమాజంలో, క్రొత్తవన్నెలు దిద్దుకుంటున్న నాగరకతలో, పరివ్యాప్తమైన చదువు, పరిశ్రమలు, పట్టణవాసం, విదేశాలలో యినుమడించిన రాకపోకలు, వగైరా విషయాల ప్రభావంతో క్రొత్తదైన జీవన విధానంలో 'అత్తగారు' పూర్వాచారపరాయణురాలైన ఒక బ్రాహ్మణ వితంతువు, సామాన్యమైన స్థితితో పుట్టి పెరిగిన మనిషి పట్టణవాసంలో ఆర్జనపరుడై ధనికుడైన కొడుకు యింటిలో చదువుకున్న కోడలిముందు, తన అత్తగారి మర్యాదను, ఆధిక్యాన్ని నిలుపుకునేందుకు పడే తాపత్రయం ఈ కథల్లో కనిపిస్తుంది. అత్తగారి తాపత్రయం ప్రవాహానికి ఎదురీత. ఓటమిని, తంగపాటుని, అజ్ఞానాన్ని, అసమర్థతనీ కప్పిపుచ్చుకోవడానికి ఆమె చేసే ప్రయత్నం మరికొంత పరిహాసానికి కారణమవుతూ వుంటుంది.

'బారిష్టరు పార్వతీశం'లో హాస్యానికి ఆలంబనము నన్నివేశము. 'అత్తగారి కథల్లో హాస్యానికి ఆలంబనము పాత్రపోషణము. ఆంగ్లంలో

పి.జి.ఓడ్ హౌస్ సృష్టించిన బెర్టీవూస్టర్, జీవ్స్ వంటి హాస్యపాత్రల కోవకు చెందుతుంది భానుమతి 'అత్తగారు'. నేటి బ్రిటన్‌లో జీవ్స్‌వంటి బట్లరు కనిపించడు। ఇంకో పదేళ్ళ తర్వాత మనదేశంలో భానుమతి 'అత్తగారూ' కనిపిస్తుందనే నమ్మకంలేదు। (శాంతి) ❋

# నాకు చచ్చిపోవాలని వుంది....

— ముప్పాళ రంగనాయకమ్మ

ఇందులో తొమ్మిది కథలున్నాయి. 'నాకు చచ్చిపోవాలని వుంది ...' అనేది ప్రధానమైన కథ. 56 పేజీలు సాగింది. 'పట్టమై మూపొచ్చి', 'సంబంధాలు', 'కమల', 'ఓ రోజు వస్తుంది', 'తల్లి మనసు' అనే కథల్లో చాలించాలని సంసారాలూ, సంకుచిత మనస్తత్వాలూ వర్ణిస్తూ, ఈనాడు తెలుగుదేశంలో సామాన్యంగా ఆడవాళ్ళ చిత్తసంస్కారం ఏ స్థాయిలో వున్నదో తెలుసుకునేందుకు చక్కని అవకాశం కలిగించారు రచయిత్రి. 'తృప్తి' అనే కథ రచయిత్రి సంఘసంస్కరణపట్ల చూపుతున్న ఉబలాటాన్ని వ్యక్తంచేస్తుంది. రచయిత్రిలోని తీవ్రమైన అసంతృప్తి సంఘసంస్కరణాభిలాషగా రూపొందుతూ వుండటం మెచ్చుకోతగ్గ విషయమే కాని అది ఒక్కొక్కసారి స్వోత్కర్షగా మారినప్పుడు ఎబ్బెట్టుగా వుంటోంది. 'నా కోరిక' అనే రచన (దీన్ని కథ అనటానికి వీల్లేదు) ఇందుకు ఉదాహరణ. రచయిత్రి సాహిత్యం అంటే తనకున్న అభిప్రాయాలను వివరించటం తప్పుకాదు; ఆ అభిప్రాయాలను రామచంద్రం అనే ఒకానొక చేతగాని రచయితను 'దమ్మీగా' ఎదుటపెట్టుకుని వెలువరించిన ధోరణి ఏమి అందంగా లేదు। (Not in good Taste) రామచంద్రం

వ్రాసిన వాక్యాలనుగూర్చి రచయిత్రి చేసిన ఆక్షేపణే ఆమె ప్రవచించిన వాక్యాలకూ అన్వయించే పరిస్థితి వుంది. 'సాహిత్యానికో పవిత్రమైన స్థానం, అపారమైన విలువా వున్నాయన్న సంగతి మర్చిపోకు' అనటంలో 'పవిత్రమైన స్థానం' 'అపారమైన విలువా' ఊకదంపుడు మాటలుకావా? అవేమిటో నిర్దేశించే ప్రయత్నం ఈ రచనలో జరిగిందా? లోతు తెలీని నీళ్ళలో దిగటం ప్రమాదకరం.

'నాకు చచ్చిపోవాలని వుంది....' 'నవ్వింది జాబిల్లి' అనే రెండు కథలూ ఒక సమస్యనే ఇతివృత్తంగా తీసుకున్నాయి. ఇది నైతిక సమస్య. వివాహితమైన స్త్రీకి పరపురుషుడిమీద మనస్సు పోవటం. మొదటికథలోని వరలక్ష్మి, రెండవ కథలోని హేమ, సంస్కారంలో, పరిస్థితుల్లో పొందు తున్న భర్తృసౌఖ్యంలో భిన్నత్వం కలవారు. వరలక్ష్మి భర్తకు 'సెక్స్' తెలీదు. అతనికి పుంస్త్వం ఉన్నదో లేదో స్పష్టంగా కథలో చెప్పకపోవడం లోపం. మగవాళ్ళలో ఇంత అమాయకులు వుంటారా? అది అమాయ కత్వం అని మాత్రం ఎలా అనుకోవటం? బి. ఏ. చదివిన వ్యక్తికి కనీసపు లోకజ్ఞానంకూడా లేకపోవటం ఏమిటి నా ఖర్మ గాకపోతే' అనే వరలక్ష్మి వాక్యాలనుబట్టి, "ఏడెనిమిదేళ్ళ దాంపత్య జీవితంలో వరలక్ష్మి అనుభూతులన్నీ నిస్సారమైనవే' అనే రచయిత్రి వాక్యాన్నిబట్టి వరలక్ష్మి భర్త నపుంసకుడని తెల్సుకోవాలి. వరలక్ష్మి శర్మ అనే పక్కింటి పురుషుణ్ని సూచనగా ఆహ్వానిస్తుంది. తీరా శర్మ వరలక్ష్మికోసం వచ్చినప్పుడు జరిగిన సంభాషణ పట్టాలుతప్పి, చివరకు వరలక్ష్మి తనకే కోరికా లేదనీ, తనకు 'చచ్చిపోవాలని వుందనీ' చెప్పడంతో కథ ముగుస్తుంది. శర్మకూ వర లక్ష్మికీ మధ్య జరిగిన సంభాషణని రెండు మూడు విధాలుగా అర్థం చేసు కునే అవకాశం కల్పించింది రచయిత్రి. 'నీలాంటి దౌర్భాగ్యురాలంటే నిజంగా నాకెంతో జాలి' అని శర్మ అనటం మూలాన్నే వరలక్ష్మి కోరిక నీరుగారిపోయిందనుకునే అవకాశం ఒకటి. 'ఇప్పుడంతా భ్రమగానే

తోస్తుంది. నీతినియమాల సంఘం ఎన్నటికీ నన్ను సహించదు. మీరు కూడా విలువపోగొట్టుకొన్న నన్ను లక్ష్యపెట్టరు' అని వరలక్ష్మి అనటం వల్ల, వరలక్ష్మిలో సంఘాన్నిగూర్చిన భయం ఆమె కోరికను జయించింది అని అన్వయించుకునే అవకాశం రెండు. సంఘాన్నిగూర్చిన భయంకంటె వరలక్ష్మిలో సహజమైన ఆత్మాభిమానం జయించింది. శర్మచూపే పట్టి 'జాలి'ని ఆమె అంగీకరించలేకపోయింది అనే అన్వయానికిగల అవకాశం మూడు. పోతే చివర రచయిత్రి సూచించిన పరిష్కారం 'ఆత్మహత్య'-హాస్యాస్పదంగా, అర్థంలేకుండావుంది. సంఘసంస్కర్తలు విడాకుల్ని ఆమోదిస్తారు. చలంవంటి రచయిత స్త్రీ కర్తవ్యం స్పష్టంగా తెల్పి చెబు తాడు. రచయిత్రి ఈ రచనలో కేవలం సమస్యను చిత్రించడమే ధ్యేయంగా పెట్టుకున్నదేమో అంటే చివర ఆమె చేసిన ఆత్మహత్యాసాధన, వ్యక్త పరచిన నిస్పృహా, అందుకు భిన్నంగా వున్నాయి. మొదటి ఈ కథ, రచయిత్రి ఆలోచనా వైఫల్యాన్నీ, ఆమెలో సంకోచాన్నీ వ్యక్తంచేస్తూ ఆగిపోయింది. అయినప్పుడు సాధించిన సాహిత్యప్రయోజనం ఏముం టుందీ ?

రెండవకథలో హేమకు కలిగిన మనశ్చాంచల్యానికి ప్రతిగా ఆమె భర్త ఉదాత్త నైతికప్రవర్తనను గూర్చిన సంఘటన సృష్టించింది. ఒకా నొక దరిద్రురాలు, పతిత, అతణ్ని తన అవసరంకోసం, డబ్బుకోసం ఆహ్వానిస్తుంది. ఆమె అందగత్తె. కాని హేమ భర్త ఆమె అందానికి చలించడు; ఆమె దీనస్థితిని గ్రహించి, ఉపదేశించి, డబ్బు యిచ్చి, తను చేసిన మంచిపనిని భార్యకు నివేదిస్తాడు ? తత్కారణంగా హేమలో ప్రబోధం కలిగి, ఆమె మనస్సు శాంతం పొందుతుంది. ఈ కథలో రచ యిత్రి చెప్పదలచుకున్నది :- పురుషుడు మంచివాడైతే స్త్రీకూడా మంచి దవుతుందని ? ఇదికూడా రచయిత్రి తీసుకున్న సమస్యకు పరిష్కారంగా తోచదు ? ఏమంటే, పురుషుడు నియమబద్ధుడు కానప్పుడు, స్త్రీ కర్తవ్య

మేమిటో సూటిగా చెప్పడానికి నిరాకరించడం, మళ్ళీ రచయిత్రిలోని ఆలోచనా స్తబ్దత్వాన్ని సంకోచాన్ని వ్యక్తం చేస్తోంది. ఇలాంటి సమస్యలు 'ఇచ్చిపుచ్చుకునే' 'బేరసారాల' నీతిమీద పరిష్కారంకావు: ఇవి ఆధ్యాత్మికమైన సమస్యలు: వ్యక్తి ఆత్మజ్ఞానంతో, సంస్కారంతో ముడిపడినవి. 'మనస్సు' చలించినంతమాత్రాన మన వివేకం ఏమౌతుంది? నీ సుఖదుఃఖాలు అంచనా వేసుకోలేని హీనస్థితిలో నువ్వున్నావని అనుకోను'.... సుఖదుఃఖాల్నీ ఫలితాల్నీ అంచనా వేసుకుని భయపడి; మనస్సుని నిగ్రహించుకోవడం ఎంతవరకు? మనస్సు చలించడమంటే అది 'ఎటువంటి' చాంచల్యమో ఎవరు నిర్ణయించగలరు? మధ్యతరగతివారి నీతినీ, మర్యాదనూ, చలం, డి హెచ్. లారెన్స్‌వంటి రచయితలు విమర్శించటంలో గల అంతరార్థమిదే: ఏ చాంచల్యమైనా అది ఆత్మవిమర్శకూ, వివేచనకూ శ్రీకారంచుట్టి, అక్కడినుంచీ వ్యక్తి తన మనోవాక్కాయకర్మలలో నిజాయితీకి ప్రాధాన్యం యివ్వకలిగినప్పుడే, వ్యక్తిలో పెరుగుదల వుంటుంది. సూత్రప్రాయమైన ఒకానొక సాంఘిక మర్యాదను, నియమాన్ని ఉల్లంఘించటమా, మానటమా? అనేది అపసవ్యమైన, ఆత్మజ్ఞానశూన్యమైన ప్రశ్న. ఒకానొక సాంఘిక నియమానికీ, వ్యక్తిధర్మానికీ సంఘర్షణ అసలు ఉన్నదా లేదా ఉంటే దాని స్వరూపమేమిటి? అని విచారించటమే ప్రయోజనకారియైన ప్రశ్న. రచయిత్రి వ్రాసిన పైరెండు కథల్లో. మొదటి కథలోని వరలక్ష్మి స్వధర్మమేమిటో నిశ్చయించుకోలేని అశక్తతతో 'ఆత్మహత్య' చేసుకుంటానని ఏడుస్తుంది. బెదిరిస్తుంది: రెండవ కథలో హేమ తన ధర్మాన్ని, భర్తప్రవర్తనను చూసి సరిదిద్దుకున్నది: కాని ఈ రెండు కథల్లోనూ రచయిత్రి సమస్యను రూపొందించిన తీరు సంపవరింగానూ, కేవలం సాంఘికమైన స్త్రీ పురుష ధర్మాల్లో భిన్నత్వాన్ని విమర్శించేదిగానూ వుండి వైఫల్యానికి దారితీసింది. రచయిత్రి ఆశ్న

పరంగా ఆలోచించడం ప్రారంభించినప్పుడే సాహిత్యంలో అది [illegible] ఫలిస్తుంది. (రాంతి) ❋

# మంచివాడు

— వాసిరెడ్డి సీతాదేవి

వైవిధ్యం ఉన్న పది కథల సంకలనం. హాస్యం, విమర్శతో అవహేళనతో కూడిన నిశితమైన వ్యంగ్యం ఇందులో ప్రధానంగా కనిపిస్తుంది. కాని మానవత్వపు విలువలు ఈ హాస్యదృష్టికి బలియవకుండా ఉండటం హర్షించదగిన విషయం. 'మిసెస్ కైలాసం' వంటి వ్యక్తిని రెండు కథల్లో దుయ్యబట్టినందుకు కారణం ఆమెలో మానవత్వం మరుగునపడి ఒక కుసంస్కారం తాలూకు వికృత స్వరూపం తయారుకావటమే. 'మంచివాడు', 'వాత్సల్యం' అన్న కథలు ఆణిముత్యాలు ఈ సంపుటిలో. 'మంచివాడు' కథలో చక్కని మనస్తత్వ పరిశీలనతోబాటు సామాజిక స్పృహకూడా ఉన్నది. ఈ సామాజిక స్పృహ రాజకీయవాదుల ద్వేష వర్గ కలహ సంబంధమైన 'స్పృహ' కాదు. వ్యక్తి సామాజికుడుగా బతకటంలో అతనికి తోటిమానవులపట్ల గల విశ్వాసానికీ, అవిశ్వాసానికీ గల తేడానూ, దాని ఫలితాన్ని విస్పష్టం చేసే స్పృహ ఇందులో రామారావు ఆత్మవంచన ఎలా పరవంచనగా దారితీసిందో ఆ పరిణామాన్ని చిత్రించటంలో రచయిత్రి మంచి విజయం సాధించారు. 'వాత్సల్యం' కథలో సంతానం చేసిన మనుష్యుల అంతరాంతరాల్లో దాగివున్న మానవత్వాన్ని విపులాకారంగా వాస్తవికంగా, హృదయంగమ్యంగా ఆవిష్కరించటం జరిగింది. కేవలం ఒక పసిపాప - పాలబుగ్గలు లేని, బోసినవ్వులు లేని అనాకారి పసిపాప నిస్సహాయత్వం ఆధారంగా ఎంతో చక్కని కథ.

జీవితంమీద ఆర్థికపరిస్థితుల ప్రభావాన్ని చూపే కథల్లో రెండు దొంగతనం చేసే స్త్రీల వంచనా శిల్పాన్ని వివరించేవి. 'రాబంధులు' కథలో బస్సులో తారసపడి ఘరానాగా కనిపించే స్త్రీ ఒకర్తె, పేదరాలైన యువతిని సానుభూతి ప్రదర్శించి వంచించి ఆమె పర్సు కాజేస్తుంది. 'ప్రేమకథ'లో ఒక పోలీసు ఆఫీసర్ని అందమైన యువతి ఆకర్షించి వంచించి అతని సూట్‌కేస్ కాజేస్తుంది. నేటి నాగరక జీవనపు పోకడల్లో ఇలాంటివెన్నో, తస్మాత్ జాగ్రత్త అని చెబుతున్నవీ రెండు కథలూ. 'జ్ఞానోదయం' కథలో మా దొంగతనమే ప్రధానాంశమైనా, ఈ దొంగపట్ల పాఠకులకు సానుభూతి కలుగుతుంది. ఈ కథల్లో ఉత్తమమైంది 'పాత కథే'. సమాజంలో ఆర్థికమైన వర్గవిభేదాలు ఎంత గహనమైనవో, ప్రేమ తాలూకు రొమాంటిక్ స్వప్నాలతో వాటిని అధిగమించడం ఎలా వీలు కాదో సూటిగా, చమత్కారంగా ఆధునిక కన్యకామణులకు వివరిస్తుందీ కథ. 'ఇది ప్రేమకథో, కాదో మీరే చెప్పాలి' అని వాళ్ళకు సవాలు విసిరి, గడుసుగా ముగించడంలో తియ్యని కలలు కంటూన్న వాళ్ళని కుదిపి మేల్కొల్పే ప్రయత్నం చేశారు రచయిత్రి.

'గ్రహబలం', 'పరిచయం' కథలు రెండూ కామెడీ ఆఫ్ ఎరర్స్ కథలు. నవ్వుకోవడానికి తప్ప సీరియస్‌గా తీసుకోవడానికి వీల్లేనివి. ఎందుకంటే వీటిల్లోని వాస్తవికత విశిత పరిశీలనకు నిలిచేదికాదు.

(ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక 26-1-77) ❋

# మాకీ భర్త వద్దు

— డా. ఆలూరి విజయలక్ష్మి

ఇందులో ఎనిమిది కథలున్నాయి. ప్రతి కథలోనూ రచయిత్రి వైద్యవిజ్ఞానం వృత్తితాలూకు అనుభవం ఎంతో కొంత తొంగిచూస్తూనే ఉన్నది. ఈ కథల ప్రధానలక్షణం: సమస్యల్లాంటి సామాజిక సత్యాల్ని ప్రతిపాదించడం, పరిష్కారం చదువరికే వదలిపెట్టడం. మొదటి కథ 'గాజులు' కన్నెపిల్ల గంగ శివరాత్రి తీర్థంలో గాజులమ్మేందుకు కొట్టు పెట్టుకున్నది. ఆ స్థలం కారు నిలపడానికి కేటాయించినట్లు వెంటనే కొట్టు తీసెయ్యమన్నారు అధికారులు. విప్లవభావాల ప్రభావం సోకిన బంధువు సత్తెమ్మ, గంగ తరపున వాళ్ళతో పేచీపెట్టుకుని ఎదురు తిరిగింది. గాజులకొట్టు ధ్వంసమైంది. నష్టపోయింది సత్తెమ్మ, గంగకాదు. ఇందులో అధికారుల దౌష్ట్యాన్ని నిరసించడం ఉన్నా, అసలు సమస్య: గంగవంటి అమాయకులు రాజకీయాల్లో బలిపశువులు అవుతూ ఉండటం. దీనికి సమాధానం చదువరే ఆలోచించుకోవాలి. 'సూడోసయిసిస్' రెండో కథ. డాక్టరు దృష్టిలో శకుంతలకు వచ్చిన 'అబద్ధపు గర్భిణి' శాస్త్రీయమైన దృక్పథం లేకపోవడంవల్ల వచ్చిన హంగామాగానూ, అది హాస్యాస్పదంగానూ కనిపించవచ్చు. కాని పిల్లలకోసం పరితపించే సెంటిమెంట్ గాఢమై సృష్టించే శారీరక లక్షణాల విషయం ఎంతో సునిశితమైన జీవితసమస్య. ఆ అవగాహన చదువరికే వదిలిపెట్టబడిన విషయమైంది ... 'వలయంలో వనిత' చక్కని రచన. "స్వేచ్ఛకీ విశృంఖలత్వానికీ తేడా ఏమిటో, అవ దానికి పరంగా ఉన్న మాతృత్వమే ఆడపిల్ల స్వేచ్ఛకీ మగవాడి స్వేచ్ఛకీ ఎలా తేడాను సృష్టిస్తోందో, ఉజ్వల అనుభవించిన నరకం చూశాక బాగానే అర్థమైంది. మమ్మీ" అంటుంది డాక్టరైన తల్లితో ఒక అమ్మాయి "కాని మాతృత్వపు భయంతోకాక పవిత్రతమీద నమ్మకంతో ఏ స్వేచ్ఛను హద్దు

లేర్పరుచుకోవాలి" అని ఆ తల్లి ప్రబోధిస్తుంది. డాక్టరుగారి సలహా బాగున్నదికాని నేటి సమాజంలో దేవుడిమీదా తలిదండ్రులమీదా భక్తి అవసరమంటున్నప్పుడు పవిత్రతమీద మాత్రం నమ్మకం ఎలావస్తుంది? ఆ ప్రశ్నకు సమాధానం చదువరే ఆలోచించుకోవాలి. 'ధిక్కారం' అనే కథలో పూజా పునస్కారాలనీ ఆచారాలనీ చాదస్తమని కొట్టిపారేసే శ్యామలకు కలిగిన పాప 'సెరిబల్ పాల్సీ'తో నలిగిపోతూఉండగా, శ్యామల అంతస్సంఘర్షణకు లోనై, చివరకు ఆ సెంటిమెంట్స్ తాలూకు బలహీనతని అధిగమించి ఆత్మస్థైర్యంతో, శాస్త్రీయదృక్పథంతో సత్యాన్ని అంగీకరించే నిర్ణయానికి వస్తుంది. ఆత్మస్థైర్యం ఎక్కణ్నుంచి వస్తుందో చదువరే ఊహించుకోవాలి. అది కేవలం శాస్త్ర విజ్ఞానంవల్ల వచ్చేదికాదని చెప్పడమే కథలో సమస్య. 'సంస్కారం' చిన్న కథ అయినా చాలా చక్కని కథ. "ఆడామగా స్నేహంతాలూకు గాఢానుభూతులు శరీరసంబంధాలకు అతీతంగా ఉండగలవని నమ్మేంతవరకూ సమాజం ఎదగలేదు సరే, ఉన్నతుడిగా కనిపిస్తూ ఎన్నాళ్ళుగానో తెలిసిన వ్యక్తికికూడా ఆ సంస్కారం లేదా?" అని ఆశ్చర్యపోతుంది భారతి. అతనికి భారతి ఇచ్చిన డాక్టరు సలహాని అతడు ఎలా అర్థం చిసుకున్నాడో, తరువాత ఎలా ప్రవర్తించాడో అదీ చదువరే ఊహించుకోవాలి. 'ఒట్టు నేను త్రాగను' కథలో పెళ్ళికాని యువకునిచేత తాగుడు మానిపించడానికి పెళ్ళనుంచి ఔషధం అని డాక్టరు సలహా. ఈ ఔషధం పనిచేసిందో లేదో తరవాయి కథ మనకు తెలీదు. 'చీకటిలోపలి వెలుగు' టెస్ట్‌ట్యూబ్ బేబీనిగురించి. టైటిల్ స్టోరీ 'మాకీ భర్త వద్దు' ఇద్దరు భార్యలని ఒకరికి తెలీకుండా మరొకర్ని చేసుకున్న హీరోతో ఆ భార్యల ముఖాముఖి సన్నివేశంకథ. ఈ సన్నివేశం చక్కగా రక్తికట్టిన రచన. ఒకరు రెండవ వారికోసం ఆ భర్తను వదలిపెట్టుతున్నట్టుగా ఇద్దరుభార్యలూ తమ భంగపాటునీ, కోపాన్నీ, తుది

నిశ్చయాన్నీ ప్రకటిస్తారు. ఆ యిల్లు రెండవ ఆమె ఇల్లు కావడంతో మొదటి ఆవిడ తాను బయటికి వెళ్ళిపోతుంది. కథ ఇంతటితో ఆగింది: అమ్రితకూడా (అంటే ఆ రెండో ఆవిడ) ప్రదీప్‌ని తన ఫ్లాట్ నుంచి వెళ్ళగొట్టి శాశ్వతంగా అతని జీవితాన్నుంచీ తప్పుకుంటుందని మొదటి ఆవిడ ఊహించలేదుట. ఆమె వెళ్ళగొట్టిందా? మొదటి ఆవిడకు ఇద్దరు పిల్లలున్నారు. రెండో ఆవిడ గర్భవతి. అమ్రిత ప్రదీప్‌ని వెళ్ళగొట్టేంత అమాయకురాలే అయితే, ప్రదీప్ తప్పక మొదటి ఆవిడ దగ్గరకు వెళ్ళే అవకాశం ఉన్నది. అది ఊహించగలిగిన అమ్రిత అయితే ఆమె అతణ్ణి వదిలిపెట్టే అవకాశమే లేదు. నిజానికి ఈ సన్నివేశంలో సపత్నులిద్దరూ సమానులైన అందగత్తెలే. సభ్యత కారణంగా కలహించుకోవడానికి బదులు సానుభూతితో ఒకరికొకరు త్యాగం చేస్తున్నట్లు ప్రకటించుచున్నారు. అంటే పర్యవసానంలో హీరోకి ఎవరు కావాలో నిశ్చయించుకొమ్మని 'నోటీస్' ఇచ్చారు తప్ప, అతను ఇద్దరికీ అక్కరలేదని వాళ్ళు చెప్పలేదు. టైటిల్ ప్రకారం 'మాకీ భర్తవద్దు' అనేట్లయితే, వారిద్దరూ ఒకటై మొదట ఆ భర్తని ఇంట్లోనుంచీ గెంటివెయ్యడం జరిగేది. సన్నివేశంలో అలా జరగలేదు. అందువల్ల ఈ కథకు ముగింపు ఆ హీరో ఎవరిని ఎన్నుకుంటాడు? అనేది చదువరి వూహించుకోవలసిన ముగింపుగానే మిగిలిపోయింది. మొదటి కథ 'గాజులు తప్పితే మిగతా అన్నింటిలోనూ కీలకమైన పాత్రలు డాక్టర్లే కావడం ఒక విశేషం. ప్రతి కథలోనూ ఒక 'డాక్టరు సలహా' నిక్షిప్తమై కనిపిస్తుంది. వాస్తవికతకూ డాక్టరు సలహాకుగల అన్వయం, అది ఆలోచనామృతం.

(ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక, 6-2-80)

# డబ్బు ! డబ్బు !! డబ్బు !!!

— బీనాదేవి

పదకొండు కథల్లోనూ మూడు 'డబ్బు' శీర్షిక గలవి. ఈ మూడింటి లోనూ కథకుడు ఒక లారీ డ్రైవర్. తన యాసలో, మంచి చమత్కారంతో డబ్బుగలవాళ్ళనిగూర్చి తన చుట్టూ కూర్చున్న కుర్రకారుకి చెప్పినవి మూడు కథలూ. ఈ సంకలనంలో ఈ కథలు మూడూ విశిష్టమైనవని చెప్పడానికి సందేహంలేదు. హాస్యంలో, చమత్కారంలో, మాటకుమాట అంటించటంలో ఈ మూడు కథల్లోని కారెక్టర్ - వెంకటేశు - మరువరాని సృష్టి. మళ్ళీ మళ్ళీ చదవాలనిపించే హుషారు ఉంది. మాటల్లో, చెణుకుల్లో సజీవమైన తెలుగుభాష ఈ కథలకు ప్రాణం. కథావస్తువులో కొత్తదనం ఏమీలేదు. ఒక కథ బ్లాక్‌మనీకీ, రాజకీయాలకీ, ప్రభుత్వ యంత్రాంగానికీ ఉన్న లంకెల్ని వివరిస్తుంది. మరో కథ డబ్బు దాహంకల డాక్టరు ఆపదలో ఉన్న తన ఏకైక పుత్రుణ్నే ఆదుకోక, పోగొట్టుకోవడం. ముగింపు బాగుంది. "బిడ్డ సచ్చిన సాకు (షాక్) నిలబడినాడుగాని, దీపోడు సూపిన సత్తేనికి నిలబడ్నేపోనాడు. ఆ సాకు సచ్చిపోయి ఆసుపత్రిగొరండాలో దిక్కుమాల్ని సెవంలా పడిపోనాడు డాక్టరు. మూడో కథ వారసుడికోసం ఒక పెద్దనాయుడూ, అతని భార్యలూ పడ్డపాట్లు వస్తువు కన్న శిల్పంలో ఎన్నదగిన కథలు. ఈ కథల్లోని హాస్యం మగవాళ్ళ హాస్యం.

'జలుబు చేసిందా ?' 'ది స్మోకింగ్ డాగ్' కథలు ఒకటి జలుబూ - దాని నివారణోపాయాల్ని గురించీ, రెండోది పెంపుడుకుక్క సిగరెట్ వాసనకు అలవాటుపడిన వైనం గూర్చి.... అతిశయోక్తులు గుప్పిస్తూ నవ్వించే కథలు. 'అతి సర్వత్ర వర్జయేత్' ఆరోగ్యనియమాలూ, ఆహార

నియమాలూ పాటించేవాళ్ళని గూర్చి చక్కని హాస్యరచన. ఈ మూడు కథల్లోని హాస్యం ఆడవాళ్ళ హాస్యం.

'పెన్సిలిన్ అయిపోయింది' అనే కథ కేవలం ఆస్పత్రిలో మందుల మాయమయ్యే వ్యవహారాన్ని గూర్చి చెబుతుంది. ఉద్దేశం మంచిదే. 'మిసెస్ అండ్ మిస్టర్ సక్సేనా!', 'వెయ్యని ప్రశ్న - ఇవ్వని జవాబు', 'ది ఎటర్నల్ ట్రయాంగిల్' ఆలోచింపజేసే కథలు. వీటిలో పాత్రచిత్రణలోగాని, చమత్కారంలోగాని రచయిత్రి విశిష్టత యథావిధిగా వ్యక్తం అవుతూనే ఉంది. 'మున్నా' అనే కథ బాంగ్లాదేశ్ విప్లవాన్ని గూర్చి ఒక పసివాని దృక్పథంతో వ్రాయబడింది. పేలవంగా ఉన్న కథ ఇదొక్కటే!

"సేతావాతాగాని మొగుడు మంచంనిండా ఉన్నాడని చెంపకి సరిపడా ఒక్కడివే కూకున్నావ్".... "నాలాటిదే ఓ పాలి చెముడి పిసినారి పిలిస్తే యీ పొద్దు బుధవారం బుద్దిగుండాలన్నాట్ట".... "ఇదేటి బాబూ కాఫీనా, టీనా? కాఫీ అయితే టీ పట్టుకురా, టీ అయితే కాఫీ పట్టుకురా, రెండూ కాకపోతే ఏదైనా వట్రా." "పీకెప్పుడూ పరాసికాలే." "సుప్తు ఆడదానిపైనా అంటాలని ఉండదు. పీతో పరాసకాలేటి నాకు." "ఏ పెళ్ళామా? దెయ్యమై నీ మొదటి తద్దినానికెళ్ళి చూడు ఎవడితో ఉంటాడో!" - ఇది మగ హాస్యం. "ఆయనలా తుమ్ముతారు - ఒంటి నిండా పటాసూ, గంధకం అంటించినట్టు." "మా కుక్కకి అంత ఆత్మ గౌరవం ఉందని మాకు అంతవరకు తెలీదు. బూటు దెబ్బ పడగానే తక్కున మా వెంట వచ్చేసింది." "ఉట్టిపాలంటే పోనీ ఉట్టిపోయిన ఆవులు యిస్తాయనుకున్నా. ఉట్టి మిరియాలెక్కడి చెట్లకి కాస్తాయి?" "మా వారు మైనస్ రొంప - మహర్షిలాంటివారు." ఇది ఆడ హాస్యం. రచయిత్రి సవ్యసాచి అనుకోవాలి.

(ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక : 14-7-76)

# ఆంధ్ర యువకుడా దారి ఇటు

— యద్దనపూడి సులోచనారాణి

ఇందులో నాలుగు కథలు ఉన్నాయి. మొదటి రెండూ - 'షేమ్' 'అసమర్థుడు' మామూలు కథలు. ఇదివరకే మాసపత్రికల్లో ముద్రణ పొందాయి. మిగిలిన రెండూ ప్రచురణకర్తల భాషలో 'సినిమా కథల తొలి రూపాలు'.

'షేమ్' అనే కథ ఫార్ములా కథ. తండ్రి వ్యభిచార గృహానికి వెళ్ళి ఇరవై ఏళ్ళ నవోఢకోసం ఎదురుచూస్తూ ఉంటే, తలుపు తీసుకుని అతని ముద్దులకూతురు, కాలేజీ హాస్టల్లో ఉంటున్న అమ్మాయి, ప్రవేశిస్తుంది ; ఇద్దరూ 'షాక్' అవుతారు. అమ్మాయి పారిపోయి ఆత్మహత్య చేసుకుంటుంది. ఈ ఫార్ములా ప్రకారం ఇదివరకు చాలా కథలు వచ్చాయి. ఈ కథలోని విశేషం, తండ్రీకూతుళ్ళు ఆ వ్యభిచారగృహంలో తారసిల్లడానికి దోహదం చేసిన పరిస్థితుల్నిగూర్చి రచయిత్రి చేసిన అన్వేషణ. రచయిత్రి ఈ సన్నివేశానికి బాధ్యత అంతా ఆ పెద్దమనిషి భార్యామణి, ఆ అమ్మాయి తల్లి అయిన 'సుజీ' (సుజాత కాబోలు) మీదికి నెట్టేశారు. ఆవిడ 'కెరీర్ లేడీ' కావడంతో భర్తనూ, కుమార్తెనూ అశ్రద్ధ చేయడమే కారణమట ; ఈ కథలో సున్నితమైన పాయింట్ చనిపోతూ ఆ అమ్మాయి తను వ్యభిచారానికి ఎందుకు వెళ్ళవలసివచ్చిందో స్నేహితురాలికి వివరిస్తూ ఉత్తరం వ్రాస్తుంది. అక్కడ తండ్రి ఎవరైన రహస్యాన్ని మాత్రం దాచిపెట్టి తండ్రిబదులు ఎవరో 'తెలిసిన వ్యక్తి' అంటూ వ్రాయడం. ఆ ఉత్తరం చదువుకున్న తండ్రి మనఃస్థితి ; 3½ పేజీలు సాగిన ఈ కథలో శిల్పం పూజ్యం. రెండో కథ 'అసమర్థుడు'లో గోపాలం నిరుద్యోగి. పెళ్ళాన్నీ, పిల్లల్నీ పోషించే స్తోమత లేనివాడు.

మామగారు అతణ్ని అసమర్థుడని ఈసడించుకుంటారేమోనని, సాయం చేసే ప్రయత్నం చెయ్యడు. దురదృష్టవంతుడైన గోపాలం నిస్పృహకు గురై తుతో చివరకు తను చెయ్యని నేరానికి జైలుపాలవుతాడు. భార్యా, పిల్లలూ పుట్టిల్లు చేరుకుంటారు. కథలో అర్థంకాని విషయం - గోపాలానికి తన వైపు బంధువులుకాని, మిత్రులుకాని ఎవరూ లేకపోవడం, ఆస్తిపాస్తులు చిల్లిగవ్వైనా లేకపోవడం. చెప్పుకోదగ్గ ఆర్థికస్తోమత ఉన్న తండ్రి తన పెద్దకూతుర్ని ఇలాంటి దరిద్రుడికి తెలిసి ఎలా కట్టబెట్టాడన్నది ఒక సందేహం. తెలిసి కట్టబెడితే ఉద్యోగమో, బతుకుతెరువో చూపించే బదులు ఎందుకలా ఈసడించుకుంటాడనేది మరో సందేహం. రచయిత్రి వ్యక్తం చెయ్యదలచుకున్న భావం - గోపాలం భార్య పతివ్రతాశిరోమణి, గొప్ప సహనశీలి, సార్థకనామధేయురాలైన శాంతమ్మ - స్త్రీకుల ఆదర్శప్రాయురాలని! ఈ కట్టుకథంతా శాంతమ్మకోసమే మలచబడ్డది. అంతే కథలో పసలేదు!

సినిమా కథలుగా మిగిలిన రెండు కథలూ పనికొస్తాయో లేదో సినిమావాళ్ళే నిర్ణయించడానికి అర్హులు. పాఠకునికి పాతచింతకాయ పచ్చడిగా, మహ 'బోర్'గా ఉన్నాయి రెండు కథలూ. సాహిత్యపరమైన విలువ వీటికి సున్న. రచయిత్రికి నవలారచనలో ఉన్నదనే ప్రతిభ కథ రచనలో, అంటే ఈ కథల్లో ఎక్కడా కనిపించడంలేదు.

(ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక 16-6-79) ❁

# మిథ్యాబింబాలు

— డా. కె. వి. కృష్ణకుమారి

ఇందులో పది కథలున్నాయి. మూడు కథలు తప్ప మిగతావన్నీ ప్రేమకథలే. ఆ మూడు కథల్లోనూ మంచిరచన 'కర్మయోగి'. ఇది అను

భూతిపరమైన, నిజాయితీ కలిగిన రచన. రచయిత్రి తను తాతయ్యపట్ల పెంచుకున్న మమతానుబంధాన్ని అభివ్యక్తం చేస్తూ, ఆయన వ్యక్తిత్వాన్ని ఉదాత్తంగా, మనోజ్ఞంగా చిత్రించారు. జాతస్య మరణం ధ్రువమ్ అన్న సత్యాన్ని అంగీకరిస్తున్న ప్రశాంత మనస్కతను కథ చివర ధ్వనింప చేయడం, రచనలో వ్యక్తమైన ఆవేశానికీ, దుఃఖానికీ స్వస్తివాక్యం పలకడం ఈ కథకు వన్నె తెచ్చాయి. 'నువ్వు పాసయ్యావు, రవీ' ఒక మెడికల్ స్టూడెంటు పరీక్షలో ఫెయిలయ్యానన్న అపోహతో, నిస్పృహతో ఆత్మహత్య చేసుకున్న కథ. 'తనదాకా వస్తేకాని' అనే కథలో డబ్బు కోసం అనవసరమైన ఆపరేషన్ చేసి కుర్రవాడి ప్రాణాలు బలిగొన్న డాక్టరుకి పడ్డ శిక్ష - తన సొంతకొడుక్కి అవసరమైన ఆపరేషన్ చేయలేక, చేసేందుకు సమయానికి ఏ డాక్టరూ దొరక్క వాడు మరణిస్తూ ఉంటే నిస్సహాయంగా చూస్తూ ఉండిపోవడం. రచయిత్రి వ్రాసిన ప్రతి కథలోనూ 'మరణించడం' - అది సహజమో, అసహజమో, ఆక్సిడెంటో, ఆత్మహత్యో.... విధిగా మాత్రం ఉంటుంది.

ప్రేమ కథలు ఏడింటిలోనూ వైవిధ్యం తక్కువ. ప్రేమలో నిరాశనూ, నిస్పృహనూ, త్యాగాన్నీ, వంచననీ వ్యక్తంచేస్తాయి ఈ కథలు. ఊహాపోహలూ, సెంటిమెంటూ, పులుముడూ ఎక్కువ. జీవితాన్ని పరిశీలించి వ్రాసినవి కావు. ఈ కథల్లో స్త్రీలు వ్యక్తులను ప్రేమించడంకంటే 'ప్రేమ'ను ప్రేమించడం కనిపిస్తుంది. ప్రేమను ప్రేమించే ప్రవృత్తికి జీవితంలో సాఫల్యం లభించదు. అందుకే ఈ కథల్లో మృత్యువే పరిష్కారం, పర్యవసానం, పరితృప్తి అవుతున్నది. వీటిని కథలు అనడానికంటే తనలో తనుగా (సెల్ఫ్ ఎక్స్‌ప్రెషను అండ్ సెల్ఫ్ రికార్డింగ్) ఏవో ఊహల్లో, భయాల్లో తేలిపోయే కన్నెపిల్ల మధురోహల విషాదాంత స్వప్నాలు అనడం సబబు. మనస్సు ఒకరికీ మనువు ఒకరికీ అయిన స్త్రీల

పాట్లు ఈ కథల్లో సామాన్య వస్తువు. 'శాంతిప్రియ' కథలోని హీరోయిని శాంతి ఆత్మహత్యకానీ, శాంతి వదిలిపెట్టిపోయిన మగణ్ణి మళ్ళీ కట్టు కున్న పూర్వప్రేయసీ నర్మద వ్యక్తిత్వంగాని చిత్రించటానికీ భిన్నంగా, ప్రతీ కంగా ఉన్నాయి. అలాగే కథలన్నింటిలోకీ 'అర్పణ'లోని సెంటిమెంట్ హాస్యాస్పదంగా తేలిపోతూ, చాలా ఎబ్బెట్టుగా తయారైంది. ఈ కథలో ఏభై ఏళ్ళ పైవయస్సులో కలుసుకొన్న భగ్నప్రేమికులు (మగవాడు వివా హితుడు, స్త్రీ అవివాహితగానే నిలిచిపోయింది) ఇలా మాట్లాడుకుంటారు. "శ్యామా. ఏభై ఏళ్ళ శ్యామలగా కనిపించటంలేదు నాకు. ఎంతో పెరిగావు కానీ....ఎర్రని నీ బుగ్గల్లో పూర్వపు నునుపింకా చెదరిపోలేదు. వలచటి నీ పెదాలు చలిస్తూంటే...." అని అతనంటే, "పాతిక సంవత్సరాల క్రితం వినాలని కలలు కన్నమాటలు ఇప్పుడు ఈ విధంగా!" అంటుందావిడ. శరీరాలు కలిసే ప్రమాదం ఉందని అతను ట్రాన్స్ఫర్ చేయించుకుని వెళతానంటాడు!.... ఈ కథలన్నింటిలో కొంత మంచి కథ 'మిథ్యా బింబాలు'. కవియైన డాక్టరు ప్రేమించిన స్త్రీకి 'బ్రెస్ట్ కాన్సర్'కి ఆపరేషన్ చేస్తాడు. అతనిలోని కవికీ, డాక్టరుకీ సంఘర్షణ బాగుంది.

( ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక 14-4-78 ) ❁

# కొత్తనిజం

— రాకీప

స్త్రీ ఎదుర్కొంటున్న సమస్యల్ని గురించి, పురుషులు చేస్తున్న దుండగాల్ని గురించి ఎన్నో కథలు వస్తున్నాయి. స్త్రీలూ, పురుషులూ వ్రాస్తున్నారు - స్త్రీకి న్యాయం జరగాలి అంటూ. చలంగారు వ్రాశారు,

సెక్స్‌ని ప్రధాన సమస్యగా రూపొందించి. కాని స్త్రీయొక్క 'వ్యక్తిత్వపు' (సామాజికం కాదు) ప్రత్యేక దృక్పథంనుంచీ వచ్చిన నవలలూ, కథలూ చాలా తక్కువ. అటువంటి ప్రత్యేక దృక్పథంతో 'కొత్తనిజం' చెప్పడానికి పూనుకొన్న కథలీ సంపుటిలో ఉన్నాయి. 'అంతా ఇంతే' అనే మొదటి కథలో రాణి అనే నర్సు, మాధవ్ అనే ఒక విలాసపురుషుడికి భోగవస్తువై, ఆత్మహత్య చేసుకుంటుంది. మామూలు కథే. కాని రచయిత్రి వేసే ప్రశ్నలు కొత్తవి. "అనుభవించిన మాధవ్ రాణిని కేవలం భోగవస్తువుగా కాక స్త్రీగా సానుభూతి చూపినా ఆమె జీవించేదేమో!" ఇక్కడ పెళ్ళి వగైరా సమస్యకాదు; స్త్రీయొక్క వ్యక్తిత్వమూ, దాని గుర్తింపూ సమస్య. రాణి మాధవ్ వలలో పడటానికి కారణం - రాణిలో ఉన్న వ్యక్తిత్వం - స్వేచ్ఛ, స్వాతంత్ర్యం కావాలనే ఆశ. "అది లేకుండా, తన విధి పరిధుల్లో చైతన్యం లేకుండా ఉంటే, ఈ చితి జరిగేది కాదేమో!" అంటుంది రచయిత్రి. పోనీ జరిగింది జరిగిపోయింది. "కుక్క కతికిన ప్రసాదం మనిషి ముట్టవచ్చా!" అంటూ రాణి ప్రశ్నిస్తే, ఆమె బావ సమాధానం "రేపు చెబుతాను" అని ఆమెను నిరాశపరుస్తాడు. అతను అప్పుడే "నేను తింటాను" అంటే రాణి బ్రతికేదేమో అంటుంది రచయిత్రి. పోనీ బావ పెళ్ళి చేసుకోవడానికి సిద్ధపడకపోయినా, రాణి మాధవ్‌కి లొంగిపోయిందన్న వార్త విన్న మాధవ్ స్నేహితులు రాణిని ఒక్కొక్కరూ తమ భోగవస్తువుగా చేసుకోవాలనే కోరిక వ్యక్తం చెయ్యకరన్న "భరోసా ఉన్నా ఆమె బ్రతికేదేమో" అని కూడా అంటుంది రచయిత్రి. వ్యక్తిత్వం తాలూకు వికాసం కోరే ప్రతి స్త్రీ కాలుజారే ప్రమాదం ఉంది. కాని ఒక్కసారి కాలుజారిన స్త్రీకి సంఘంలో మార్గాంతరంకాని, రక్షణకాని, సానుభూతికాని, గౌరవంకాని ఏమీ లేదే! ఈ విషయంలో పురుషునికీ, స్త్రీకీ మధ్య ఎంత అసమానత్వం! అనే

భావాన్ని ఆవేదనతో రకరకాలుగా ఈ సంపుటి కథలన్నింటిలోనూ రాజీవ వ్యక్తంచేశారు. ఇక్కడ రచయిత్రి కోరుతున్నది వ్యవస్థలో సంస్కరణ కాదు, హక్కులు కావు. స్త్రీ శీలంపట్ల, వ్యక్తిత్వంపట్ల పురుషుల దృక్ప థంలో రావలసిన మార్పు, నైతికవ్యవస్థలో రావలసిన మౌలికమైన భావ విప్లవం. ఈ కథల్లోని విప్లవాత్మకత మౌలికమైనదీ, ఆలోచింపజేసేదీ।

'కొత్తనిజం' అనే చివరి కథలో వివాహవ్యవస్థని పురుషుడు స్వార్థానికోసం ఉపయోగించుకోవటమే కాకుండా, అడుగడుగునా స్త్రీని వేటాడటానికూడా ఎలా ఆయుధంగా ప్రయోగిస్తాడో చిత్రింపబడింది. కాని రచయిత్రి చూపిన పరిష్కారం ఏమిటి? మోహన్ అనే యువ కుడు, స్వాప్నిక రాజకుమారుడు, చక్రం అడ్డంవేసి ఆదిగాపడిన స్త్రీని చేపట్టడం। ఆత్మహత్య ఎలా పరిష్కారంకాదో, కలా - కల్పనా కూడా స్త్రీ సమస్యకు పరిష్కారం కాదుకదా। రచయిత్రి 'వ్యక్తిత్వం' అంటూ స్త్రీలో ఏ ప్రవృత్తిని వర్ణిస్తున్నదో, ఆ ప్రవృత్తితో సృజనాత్మ కంగా యథార్థ ప్రపంచాన్ని ఎదుర్కొనే దారుఢ్యం అలవర్చుకోవడమే స్త్రీకి పరిష్కారం అవుతుంది. వ్యక్తిత్వమూ, స్వాతంత్ర్యమూ ఒకరు ఇచ్చేవీ, మరొకరు పుచ్చుకొనేవీ కావు।

ఈ కథల్లో స్త్రీ వ్యక్తిత్వాన్నిగూర్చి, సహజప్రవృత్తినిగూర్చి, రచయిత్రి ముసుగులేకుండా నిర్భయంగా చెప్పిన మనస్తత్వ విషయాలే ఈ కథలకు కొత్తదనాన్ని చేకూర్చాయి. 'అంతా ఇంతే' కథలో రాణి మనస్తత్వం చూడండి. "డ్యూటీ చెయ్యడం, పుస్తకాలు చదవడం విసుగ్గా ఉంది. కోయిలమ్మలా రెక్కలు చాచి, దిగంతాల కెగిరి, ఎలుగెత్తి ప్రకృతిలో పాడుకోవాలని ఉంది. కనీసం సీతమ్మలా ఏ రావణాసురుడో వచ్చి ఎత్తుకుపోయి ఏ అరణ్యంలోనో వదిలేస్తే బాగుండు." ఆమెకు అలానే జరుగుతుంది. 'రాగమయి' కథలో తన వ్యక్తిత్వం వికసించకుండా

చేసి అవరోధమైన వాతావరణాన్ని సానుభూతితో హాస్టల్ వార్డెన్ అయిన సూసీ సడలించి, రాగమయి అనే సంగీతజ్ఞానం ఉన్న అనాధను పైకి తేవాలనుకుంటుంది. కాని ఆమె ఇచ్చిన స్వేచ్ఛతో "విశృంఖలంగా, విచ్చలవిడిగా పతనమైపోయింది రాగ రగుల్చుతున్న వ్యక్తిత్వం." 'ఆకలి' కథ ఒక టీచరమ్మ స్వగతం: "తనకి అందముంది. ఆకలితో అరకాగిన అందం. ఆకలి కప్పేసిన అందం. తనకూ ఆశ వుంది. ఆకలి దోచేసింది ముప్ఫయ్యేండ్లకే". ఆమెకు కావలసింది "ఎవరూ? ఎవరో, ఒకడు మగాడు." ఉద్యోగం వల్ల ఒక ఆకలి తీరినామరో 'ఆకలి' తీరదు! ఏమిటి పరిష్కారం? చైతన్య స్రవంతి పద్ధతిలో వ్రాయబడిన ఈ చిన్న కథ శక్తివంతమైన రచన. చలం కథలా ఉంది. 'ఎవరు గొప్ప' అనే కథలో "మంచివాళ్ళ మనిపించుకోవడం కోసం ప్రేమను, కోర్కెను వ్యక్తం చేసుకోలేని బలహీనులం, జీవితం అనుభవించే ధైర్యంలేని చవటదద్దమ్మలం" అంటుంది. అందరూ 'మంచి'పిల్ల అనుకునే రమ, నలుగుర్ని మార్చిన విమల ప్రవర్తనని సమర్థిస్తూ. 'మార్పు వస్తోంది' అనే కథలో పెళ్ళయిన సూర్యం, మంజుల అనే వేశ్యతో స్నేహంచేసి, ఇష్టపడి ఆమెను తనదాన్ని చేసుకోవాలనుకున్న నిర్ణయాన్ని పెళ్ళాం మోహినితో చెప్పగా, ఆమె ఆమోదించడమేకాకుండా "నాకు భలే గర్వంగా ఉందండీ!" అంటుంది. అందుకు కారణం ఆమె భర్త నిజాయితీని హర్షించడమట. అంతేకాదు, ఒకరికి కట్టుబడనివాడు, తప్పకుండా ఇద్దరిమధ్య అయితే కట్టుబడతాడనే భరోసాకూడా ఆమెకు ఉందట! స్త్రీ దృక్పథంలోకూడా ఇలాంటి విప్లవాత్మకమైన మార్పు రావాలనే రచయిత్రి ఊహ కాబోలు! సాధ్యమా? 'రెండూ రెండే' అనే కథలో పెళ్ళికాని యువతీ, రెండేళ్ళలో వితంతువైన యువతీ ఇద్దరూకూడా సెక్సులేని మోడువారిన జీవితాలు గడుపుతున్నారన్న ఈసడింపు వ్యక్తం చేసింది రచయిత్రి. ఏతావాతా స్త్రీ వ్యక్తిత్వాన్నిగూర్చి, ఇంచుమించు చలంతో ఏకీభవిస్తూ, తన ప్రత్యేకమైన రచనావిధానాన్ని, ఎబ్బెట్టుగా

లేకుండానే శక్తివంతంగా చెప్పగల శక్తినీ అభివ్యక్తం చేస్తున్న ఈ రచయిత్రి విస్పష్టమైన సామాజిక స్పృహతో యథార్థ ప్రపంచాన్ని గమనించి ఆలోచనా ధోరణిని నిర్మాణాత్మకంగా రూపొందించుకోవలసిన అవసరం కనిపిస్తోంది. (ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక 10-'-76) ❋

# దర్పణం

— ఆంధ్ర సారస్వత సమితి

ఈ కథా సంకలనానికి 'దర్పణం' అని పేరు పెట్టారు. ఆ పేరు గల కథ ఏదీ ఇందులోని ఎనిమిది కథల్లో లేదు. 'దర్పణం' అనడంతో బహూశా ఈ కథలు జీవితాన్ని ప్రతిబింబిస్తాయనే అర్థాన్ని ప్రచురణకర్తలు ఉద్దేశించి ఉంటారు. ఆదివిష్ణు వ్రాసిన 'తల్లి' అనే కథ ఒకటి తప్ప మిగతావారి రచనలు ఏవీ జీవితాన్ని అనుసరించిగానీ, విమర్శిస్తూగానీ, కనీసం ఏదో ఒక విషయం సీరియస్‌గా ఆలోచించిగానీ వ్రాసినవి కావు; సెంటిమెంటలిజమ్, లేకపోతే కృత్రిమ సంఘటనల్ని కల్పించటం మాత్రమే ఎక్కువగ కనిపిస్తున్నది. జీవితాన్నిగూర్చి సీరియస్‌గా పరామర్శించడం, లేకపోతే సున్నితంగా స్పందించడం, ఏదో ఒకటి లేకుండా రచనా వ్యాసంగం సాగించడంలో ప్రయోజనమేమైనా ఉన్నదా? అనిపిస్తుంది ఈ సంపుటిలోని కథలు చదివితే.

వయసువచ్చిన ఆడపిల్లలకు పెళ్ళి చేయలేక సతమతమవుతూన్న మధ్యవయస్కురాలు అనాలోచితంగా మళ్ళీ గర్భవతి కావడం, కడుపు ఫలించని కోడల్ని నర్సింగ్‌హోమ్‌లో కలుసుకోవడం, తన స్థితికి తను సిగ్గుపడడం చాలా సున్నితంగా చిత్రించారు 'తల్లి' కథలో ఆదివిష్ణు. ఇది

ఒక్కటే ఆలోచింపచేసే కథ. మిగతా కథలీ ఒరవడిలో ఉంటే ఎంత బాగుణ్ను!

కుమార్తె అంతస్తు తక్కువవాణ్ని పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నదని ఒక పెద్దమనిషి ఆ యువకుడికి కాఫీలో విషం పెట్టడం, అనాథ శరణాలయంలో పెరుగుతున్న ఒక బాలిక ఆ యువకుడి సంతానమేనా అనే మిస్టరీ, చివరికి ఆ బాలిక ఈ ప్రేమించిన యువతి అన్నగారి (అమెరికా వెళ్ళాడు) అక్రమ సంతానమే కావడం, ఆ సంతానాన్ని కని చచ్చిపోయిన యువతి కథానాయకురాలి తండ్రికి స్నేహితుడూ, విలనూ అయిన డాక్టర్‌గారి కూతురే కావడం - ఇదేమిటి కథా, తెలుగు సినిమానా అనిపిస్తుంది 'తళతళలన్నీ మోసం' అనే రచన చూస్తే.

'వయసు' ఇతివృత్తం - బాలరాజుకూ, ప్రౌఢ అయిన రాధకూ ఏర్పడిన అనుబంధం - అందులో అసహజత్వం ఏమీ లేదుగాని, ట్రీట్‌మెంట్‌లో అపక్రతి ఉన్నది. ముగింపు చూస్తే - రాధ ఉత్తరం వ్రాసి పాఠం చెప్పడం, ముఖాముఖి సున్నితంగా చెప్పలేకపోవడం - రచయిత ఇతివృత్తాన్ని అవగాహన చేసుకోలేకపోయాడనే చెబుతూంది.

సీతవంటిదే ఉషారాణి అని శేఖరం సీతను ప్రేమించి, ఆమె బదులు ఉషారాణిని చేసుకోవడం, సీత తనకెప్పుడో వ్రాసిన ప్రేమలేఖలు ఉషారాణిచేతే సీత వ్రాయించిందనీ, తర్వాత సీత పెళ్ళయి వైధవ్యం పొంది ఆత్మహత్యకూడా చేసుకున్నదనీ ఇలా ఒక అరేబియన్ నైట్స్ కథ శేఖరం దంపతులు చెప్పుకొని, అంతటితో ఆగితే బాగుండేది. 'ఇది నిద్ర పట్టని రాత్రి' అంటూ ఒకరి కౌగిట్లో ఒకరు దాన్ని - సీత మరణాన్ని - సెలిబ్రేట్ చెయ్యడం చాల అసభ్యమైన ముగింపు, 'నిద్ర పట్టని రాత్రి' కథకు!

రాణి వంటిదే రజని అంటూ రాణి ప్రేమలో పడి నిరాశతో పిచ్చివాడైన సందీప్, రజనితో సరిపెట్టుకోజూడగా, రజని మొదట నిరాకరించి తర్వాత ఒప్పుకుని, అటుపైన ఆ రాణి హాస్టలులో తన రూమ్

మేట్‌గా ఉన్నట్లు గ్రహించి, ఆమె డైరీలు చదివి, రాణి ఆత్మహత్య చేసుకుంటూ సంజీవ్‌ని తన కప్పగించగా భోరున ఏడ్చిన రజని కథ 'ఒక పువ్వు రాలింది'.

"ఈశ్వర్, నన్ను నీ జీవితభాగస్వామిగా స్వీకరించగలవా?" అంటుంది రచయిత్రి అయిన సరోజ ఈశ్వర్‌తో. 'జీవిత భాగస్వామిని' అనాలని ఆ రచయిత్రికి తెలీకపోవడమటుంచి, ఆడతనం ఉన్న ఏ ఆడదైనా ఇలా వాచ్యంగా, సూటిగా అభ్యర్థిస్తుందా అన్న సందేహం కూడా కలుగుతుంది. పోతే సరోజను కాదని వెళ్ళిన ఈశ్వర్, కాళ్ళులేని అవిటి సుజాతను చేసుకుంటాననగా, సుజాత నమ్మలేక వక్కపొడి భరిణ అందుకోబోయి ముందుకు తూలబోయి వెనక్కిపడి, వరండాలో ప్రక్కనే ఉన్న మెట్లవైపు దొర్లిపోయి మెట్లనుంచీ పడి, 'రక్తపు మడుగులో చిరునవ్వుతో' లోకాన్ని వదిలేస్తుంది. అటు నిరాకరింపబడిన సరోజ నిద్ర మాత్రలు మ్రింగి, తను వ్రాసిన నవల ఈశ్వర్‌కి అర్పిస్తూ గుడ్‌బై చెబుతుంది. రెంటికీ చెడిన రేవడి కథ 'వో కన్నీటి కథ!'

'గిఫ్టి' అనే కథలో ఎవరు గిఫ్టియో, అసలా గిఫ్ట్ ఏమిటో స్పష్టం చెయ్యలేక సతమతమై రచయిత చివరకు తనే గిఫ్టిగా పిలువుతున్నట్లు చెప్పి ముగించాడు.

వర్ధనమ్మకి పెళ్ళి చేసి పంపిస్తే, ఊరు నచ్చలేదనీ, భర్త జీవిత విధానం నచ్చలేదనీ, తనకు పిచ్చెత్తినట్లు నటించి, కాలుజారిపడి మరణించినట్లు నమ్మించి, ఆ గ్రామంలో అదృశ్యమై బిలాస్‌పూర్‌లో క్లాస్‌మేట్ ఇంట అవతరించి, చదువుకొని గ్రాడ్యుయేట్ అయి, ఉద్యోగస్థుణ్ణి పెళ్ళి చేసుకొని హైదరాబాద్‌లో పూర్వపరిచితుడైన రాఘవని పిలిచి పెట్టడం 'సుమిత్ర' అద్భుతకథ!

ప్రేమించడాలూ, ఆత్మహత్యలూ వర్జిస్తే తప్ప కథలు బాగుపడవు! పోతే ఇంత వివరంగా ఈ నచ్చని కథల్ని పరామర్శించడంలో ఉద్దేశం

కొత్త రచయితలు - వీళ్ళందరూ ఔత్సాహిక రచయితలే! అభిరుచుల్లో ఆలోచనల్లో, సెంటిమెంట్స్ విషయంలో పెంపొందించుకోవలసిన సంస్కారం, ఆత్మవిమర్శ, నైశిత్యం ఎలాంటివో సూచించి, వాళ్ళని ప్రోత్సహించేందుకే! ( ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రిక 3-8-77 ) ❋



# ఆ క ర్ష ణ

— ఆంధ్ర సారస్వత సమితి

ఇందులో ఏడు కథలున్నాయి. 'ఆకర్షణ' (సింగరాజు రామచంద్ర మూర్తి) లో ఆర్థికంగా పైమెట్టున ఉన్న వ్యక్తి అంటే ఏర్పడే ఆకర్షణ తనకంటే క్రింద మెట్టున ఉన్న వ్యక్తి అంటే ఉంతదనీ, ఆ ఇద్దరు వ్యక్తులూ స్నేహంరీత్యా సమానులే అయినా 'ఆకర్షణ' రీత్యా సమానులు కారనీ ఒక సూత్రీకరణకోసం ప్రయత్నించారు రచయిత. 'అరుంధతి' (విశ్వభరత్) కదలో కేవలం విధితప్ప మరేమి కారణం సూచించకుండా అరుంధతిని కుజదోషం ఎలా దైవోపహతురాల్ని చేసిందో రచయిత చిత్రించారు. చివర మోహనరావు ఆమెను ఆత్మహత్యనుంచీ తప్పించి నట్లు కథ ముగిస్తే అరుంధతి గెలిచింది. విధి వోడిపోయింది. అనే ముగింపు వాక్యానికీ సార్థక్యం ఉండేది. కాని అరుంధతి మృతివల్ల ఆ వాక్యం అర్థరహితం అవుతూంది. 'మూగో మనిషి' (గుడిసేవ సుందర రామయ్య) చక్కని కథాకథన శిల్పం కలిగిన రచన. ముగింపు మానవత్వపు విలువల్ని ఉద్ఘాటించేలా హృదయంగమంగా ఉన్నది. 'మోటపు కొంపలు' (ఉమా దేవి) అమెరికా వెళ్ళిపోయేందుకు ఉత్సాహిస్తున్న

ప్రతిభావంతులైన యువతీయువకులకు ప్రబోధాత్మకమైన కథ. ఆలోచింప జేసే కథ. తెలివితేటలకు సార్థక్యం అంటే ఏమిటి? 'పరిస్థితులకు అనుగుణంగా ప్రవర్తించి తన జీవితాన్ని, తనచుట్టూ ఉన్నవారి జీవితాలనీ సుఖమయం చేసుకోవడమేగా'.... 'సుఖశాంతులన్నవి మన మనస్సుల్లోనే ఉన్నాయి. రంగు ఫొటోలు తీసిపంపితే ప్రతిదీ అందంగా కనిపిస్తుంది. మనదేశంలో ఎక్కడ అందం లేదు?' 'ఇలాంటి వివేకం మన రచనల్లో తరచు కనిపిస్తే ఎంత బాగుండును! 'అగ్ని వర్షించిన మేఘం' (కొట్టి రామారావు) కథలో సుబ్బులు పాత్రపోషణ, ముగింపు సన్నివేశంతో అనుసంధానింపబడిన శిల్పం విధానం బాగుంది. సుబ్బులుకి ఇష్టమంటే పట్టుచీర కట్టుకోవడం. తరువాత పట్టుచీర కట్టుకున్నట్టు కల. సుబ్బులు పొందిన దారుణమైన మరణం ఆమె పేదపిల్ల కావడంవల్లే అంటూ సంఘంలోని కుళ్ళునీ, హింసాకాండనీ చాల శక్తివంతంగా చివరి సన్నివేశంలో వ్యక్తంచేశారు రచయిత. ఇది ఎన్నదగిన కథ. శిల్పాన్ని ఆశ్రయించిన సామాజిక స్పృహ వేరుగాలేదు సాహిత్యంలో అని నిరూపించే కథ ఇది. 'గురిగింజలు' (చిట్టా రామకృష్ణారావు ఆత్మస్తుతీ, పరనిందా చేసేవారి బ్రతుకుల్ని) గురించిన కథ. 'దొరకని బొమికెముక్క' (ఆర్. ఎస్. కె మూర్తి) లో తీసుకున్న ఇతివృత్తం (మనస్తత్వ పరిశీలన) బాగున్నది. కాని బొమికె ముక్కని గురించి దాని అర్థాన్ని అంత వాచ్యంగా వివరించడం శిల్పంకాదు. వివరణలేకుండా కథ చెప్పి, శీర్షిక అలా ఉంచినా రచయిత ఉద్దేశించిన స్ఫూర్తి ఎలాగూ వస్తుంది. సంపుటిలోని కథలన్నీ చదువదగినవే.

(ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక : 21-7-71) ✱

# శృంగారవనం

— పగడాల హరిప్రసాదరావు

ఇందులో తారిణి (తారాశంకర్ బెనర్జీ), జటిలత (సుమథనాథ్ ఘోష్), దయ (కామాక్షి ప్రసాద్ చటర్జీ), స్వభావం (బుద్ధదేవబోస్), జల్సాఘర్ అనే అయిదు బెంగాలీ కథలు తెలుగులోకి అనువదింపబడ్డాయి. చివరి కథకు రచయిత ఎవరో తెలియజేయలేదు. 'శృంగారవనం' అనే శీరికలో అర్థస్ఫూర్తి శూన్యం. ఏమంటే, మొదటి నాలుగు కథల్లో 'శృంగారం' లేదు - చివరి కథలోని 'శృంగారం' గతించిన జమీందారీ వ్యవస్థపట్ల పాఠకుల్లో సానుభూతి కలిగేంచేందుకు మాత్రమే నేర్పుగా ప్రయోగించబడింది. కథల నెన్నుకోవటంలో అనువాదకుడు చూపిన ప్రత్యేకత, అభిరుచీ ఏమీలేదు. అనువాదం తృప్తికరంగానే ఉన్నది అనాలి.

శిల్పం దృష్ట్యా యీ కథల్లో 'తారిణి', 'దయ', అనేవి రెండూ ఎన్నదగినవిగా ఉన్నాయి. వీటిలో కథావస్తువు గ్రామీణ జీవితానికి సంబంధించినదీ, వాస్తవికత కలిగిఉన్నదీని. తారిణి ఒక పడవవాడు. మయూరారాక్షినది ఒడిలో పుట్టి పెరిగినవాడు. ఆ నదిమీద అచంచలమైన విశ్వాసం కలిగినవాడు. నదిమీద పడవ నడపటం ద్వారానే కాకుండా, నదిలో ప్రమాదవశాత్తు పడిపోయే ప్రయాణికులను సాహసంతో రక్షించటంద్వారా కూడా అదనంగా సంపాయిస్తూ ఉంటాడు. అతని ప్రేమంతా అతని భార్యమీద. బహుమతిగా సంపాదించిన ముక్కుపుడక మొదలుకొని సంపాధన అంతా ఆమెకే. ఒకసారి క్షామం వస్తుంది. మృత్యువుసు గూర్చి భయపడి తారిణి నదిని వదిలి వెళ్ళిపోవాలనుకుంటాడు. కాని ఇంతలో వర్షం రావటంతో తిరిగివస్తాడు. నదికి వరదలు వస్తాయి. తారిణి భార్యతో సుడిగుండంలో పడతాడు. చివరకు తన కంఠానికి చుట్టుకున్న

భార్యను వదలించుకుంటాడు. "తనేం చేస్తున్నాడో తెలుసుకోలేని స్థితికి జారిపోయాడు. అరచేతులతో సఖి గొంతు బిగించివేశాడు.... తనపైనున్న బరువుని వదిలించుకుంటేగాని తను బ్రతకలేడు. శ్వాసను బరువుగా పీల్చాడు. తన బాధనుండి విముక్తుడయ్యాడు. వెలుగును చూడాలని, భూమిని తాకాలని ఆతురత జెందాడు. తన భారాన్ని తొలగించుకున్న తారిణి చనిపోలేదు." కథ అర్థస్ఫూర్తి అంతా ఆ చివరి వాక్యంలో ఉంది. నది తల్లి తారిణికి భార్యమీద గల అపేక్షనుచూచి అసూయపడి ఆమెను బలిగా కోరిందా? తారిణిలో స్వార్థగుణం ఒక్క భార్యమీద గల అపేక్షలోనే వ్యక్తమవుతోంది. భార్య అనే భారం వదలిన తారిణి లోకోపకారం చేస్తూ ప్రతిఫలం అపేక్షించని స్థితికి పెరగగల అవకాశాన్ని నది తల్లి కల్పించిందా? లేక మృత్యువు ఆసన్నమైన పరిస్థితిలో బ్రతుకుమీద ఆశ భార్య మీద ప్రేమకంటె బలవత్తరమై, అతని భారాన్ని వదిలించిందా? ఈ మూడింటిలో ఏ ఒక్కటో లేక అన్నీనో ఆ ముగింపుకు అర్థంకావచ్చు. పాఠకుణ్నిబట్టి అర్థస్ఫూర్తి కావచ్చు. అర్థస్ఫూర్తి లేదనటానికి మాత్రం వీల్లేదు! ఇది ఒకవిధమైన కథాశిల్పం. ముగింపువాక్యంలోని 'మెలిక' యిందులో కీలకం.

రెండ కథ: 'దయ' ముగింపులో ఇంతకంటే అసందిగ్ధమైన అర్థస్ఫూర్తి ఉంది. ఒక పల్లెదగ్గర ఏటేటా జరిగే ఉత్సవంలో తోలుబొమ్మలాట, నాటకం, ఫొటోలు తీయటం వగైరా వేడుకలతోపాటు సర్వరోగాలకు చౌకమందులు అమ్మే డాక్టరు దేరా, 'నడుంపైనుంచి పదహారేళ్ళు, నడుంక్రిందనుంచి మూడేండ్లపిల్లలా ఉన్న అమ్మాయిని చూపించే దేరా ప్రక్క ప్రక్కనే ఉంటాయి. పగలంతా డాక్టరు తన మందులు అమ్ముతాడు. "దయ! నా దగ్గర లేదు.... నా వ్యాపారం మందు లివ్వడమే!" అంటూ తను చెప్పిన ధరలో తగ్గింపు ఏ మాత్రము లేకుండా డబ్బు నిష్కర్షగా పుచ్చుకుంటాడు. ప్రక్క దేరాలోని ఆ వింత అమ్మా

యిని రెండణాలిచ్చి మామూలుగానూ నాలుగణాలిచ్చి నగ్నంగానూ, అర్ధ రూపాయ యిచ్చి తాకుతూనూ చూడటానికి జనం విరగబడతారు. ఆ రాత్రి జనం నాటకం చూడటానికి వెళ్ళాక డాక్టరుకు ప్రక్క డేరాలోనుంచి మూల్గు వినబడుతుంది. వెళ్ళిచూస్తాడు. ఆ అమ్మాయి శైశవంనుంచీ తండ్రి ధనసంపాదనకోసం తనను ఎలా అవిటిదాన్ని చేసిందీ వివరిస్తుంది. తన్ను బాగుచేయమనీ, రక్షించమనీ కోరుతుంది. "నా మీద ఎవరూ దయ చూపలేదు. నీమీద మాత్రం నేనెందుకు దయ చూపాలి?" అని ప్రశ్నించే ఆ డాక్టరు, చివరకు ఆ అమ్మాయికి "ఇదుగో మందు .... ఈ రోజుతో నీ బాధలన్నీ పోతాయి" అంటూ విషం యిచ్చి తన దారిన తాను పోతాడు! ఆ పరిస్థితిలో డాక్టరు విషమిచ్చి ఆమె చిత్రవధకు స్వస్తి పలకటం దయ చూపటం కాదా? "నాలో దయలేదు" అని ప్రకటించుకునే డాక్టరు జీవనోపాధికోసం కన్నకూతుర్ని క్రూరంగా ఉపయోగించుకొనే మనిషితో పోల్చితే ఎంత దయామయుడు! మానవుని క్రూరత్వానికి దాని వింతపోకడలకు అవధులు లేనప్పుడు చంపటంకూడా దయ చూపటమే అవుతుంది కదా! మానవ స్వభావ పరిశీలనలో కంటికి అందని నిజాల్ని, చేదునిజాల్ని, వెదకిచూపుతున్న ఈ కథా వాస్తవికత మనల్ని చకితుల్ని చేస్తోంది.

మిగతా కథలు సామాన్యంగా ఉన్నాయి. పుస్తకానికి పెట్టిన పేరూ, కథలతో సంబంధములేని ముఖచిత్రమూ, వంద పేజీలకు రెండు రూపాయల ధరా, ప్రకాశకుల వ్యాపారదృష్టికి నిదర్శనాలుగా ఉన్నాయి. ❋

# కట్టమంచి రామలింగారెడ్డి పద్యరచనలు

ఈ సంపుటిలో కట్టమంచి రామలింగారెడ్డిగారి పద్యరచనలన్నిటిని ఒకచో చేర్చిన వారి మనమ సంతానము. "మా తాతగారి రచనలకు పరిచయము అక్కరలేదు" అని సగర్వంగా (ఇంగ్లీషులో) అంటూ, చక్కగా ముద్రించి ఈ గ్రంథాన్ని ఆంధ్రపాఠకలోకానికి నివేదించారు. 'ముసలమ్మ మరణము', 'నవయామిని' కావ్యాలతో బాటు 'ప్రాస్తావిక పద్యావళి' వగైరా రచనలుకూడ యిందులో ఉన్నాయి. 'ముసలమ్మ మరణము'ను గూర్చి "కొత్తపాతల మేలుకలయికతో రచింపబడిన ఈ కావ్యమే ఆధునిక ఖండకావ్యములలో మొట్టమొదటిది. దీని మొదటి కూర్పు 1900 సంవత్సరము మార్చి నెలలో ప్రచురింపబడినది" అంటున్నారు. ఈ సంపుటి చివర 'పరిచయ వాక్యములు' వ్రాసిన శ్రీమతి వేముల జనకాదేవి జనార్దనం. పింగళి లక్ష్మీకాంతంగారు 1948 లో ఈ కావ్యానికి వ్రాసిన ఉపోద్ఘాతంలో 'ఆధునిక లక్షణాలు' ఏవో పేర్కొన్నారు. సాంఘికేతివృత్తము, స్త్రీ పాత్రకు ప్రాధాన్యము, పాత్రచిత్రణము, 'స్త్రీ పాత్ర గౌరవ సంరక్షణము', విషాదాంతం, వారు ఎత్తిచూపిన లక్షణాలు. శైలి విషయంలో రెడ్డిగారు తిక్కన ప్రథమశిష్యులని వారే అంగీకరించారు. అందువల్ల శైలి, భావుకత విషయాలు ప్రస్తావిస్తే 'ముసలమ్మ మరణము' ఆధునిక కావ్యంగా లెక్కకురాదు।

'అహీనతరంగ భుజాగ్రదర్ప దుర్దాంతత', 'ఉదుదంత [illegible] పీడమాన సాక్రాంత మహోగ్రకోపశిఖ' వంటి సమాస [illegible], 'వనరుహాక్షి', 'వనజగంధి' వంటి వ్యక్తమైన స్త్రీ [illegible] శైలియొక్క పూర్వవాసనలనే వ్యక్తం చేస్తున్నాయి। కథలో రెడ్డిగారు 'ఆకాశవాణి'ని ప్రవేశపెట్టి, ముసలమ్మను బలి యీయవలసినదిగా పోలేరమ్మ కోరినట్లు, ఆకాశవాణి చెప్పినట్లు కల్పించినారు. అటువంటి సంద

ర్భాల్లో ఉండే సన్నివేశం - కోడినో, పొట్టేలునో తెగవేసి తద్వారా దేవి అభిమతాన్ని సంజ్ఞారూపంగా తెలుసుకోవడం, లేక దేవి ఎవరినో ఆవహించి వారి నోటిద్వారా చెప్పడం. రెడ్డిగారు యీ వాస్తవికతను విస్మరించి 'పురాణకల్పన'నే ఈ సాంఘికేతి వృత్తంలో ఆశ్రయించారు. కాగా, మునలమ్మ అత్తమామలదగ్గర, భర్తదగ్గర, అనుమతి పొందేవేళ రెడ్డిగారి రచనలో ఆధునికతగాని, విశిష్టతగాని కనిపించదు: భర్తతో ఆమె అంటుంది: "అనఘచరిత్ర! భూమి, జలమందును, నగ్నిని, గాలిలోన, నాకసమున మీరు గోచరము కానివిలే, నయినన్ మదీయ మానసమును నేన చెప్పగ వినంగడు వేడుక పుట్టెనొక్కొ మీకు?" పురాణకథల్లో త్రికాలజ్ఞుడైన ఋషితో ఋషిపత్ని చెప్పినట్లు ఉందిగాని, రైతుతో రైతు భార్య మాట్లాడినట్లు లేదు: ఈ రకం విమర్శలు కట్టమంచివారే తర్వాత తర్వాత చేశారూ, చెయ్యడం నేర్పించారూ తెలుగువారికి: 18, 19 ఏళ్ళ వయస్సులో వారు ఈ కావ్యం వ్రాయడమే విశేషం. అయితే యివ్వేళ ఈ విమర్శ ఎందుకంటే, వారి జీవితకాలంలో యిటువంటి విమర్శ వచ్చే అవకాశం లేకపోయింది; అది కారణంగా మనం నేటికీ 'మునలమ్మ మరణము' ఆధునిక కావ్యాలలో ఒజ్జబంతిగా భావించడం సబబుకాదు; అని మనవి. అందుకే యింతదూరం వ్రాయవలసి వస్తోంది. కాని కవిగా రెడ్డిగారి ప్రతిభను పట్టియిచ్చే పద్యాలు కావ్యంచివర 100 - 104 సంఖ్యగలవి: "ఉరుహారిద్రపుజీర సాంధ్యరుచిగా సౌప్పార, నానంద విస్ఫురితంబైన మొగంబు రక్తమయమై సూర్యప్రభంబోల, శోక రసాధీన జనాళి పుల్గుల క్రియం గాంచన్ మొఱల్ పెట్టఁ, దా నరసీరాజ మహోద్ధికై చవియె విస్ఫారీ భవన్మూర్తియై." ఇందులో ఆధునికతకాదు, ఏకాలంలోనైనా శిరోధార్యమైన గొప్ప కవిత్వంగా గుర్తింపబడే భావనాపటిమ కనిపిస్తుంది: అంతే కాదు. మునలమ్మ మనస్థితి చివరిక్షణాల్లో ఎలా ఉందో ఆ స్థాయిని అందు

కోవడంలోనూ పద్దెనిమిదేళ్ళ యువకవి ఒక మహాకవి లక్షణాన్ని వ్యక్తం చేశాడు: 'అంతరంగ ధ్యానాధిక్యంబునం జేసి' ముసలమ్మ ఆట - "సన దేహంబును, భూమియున్ దినము, మూర్తాండుండు, సాకాచయంబును వగైరా....తనకుం దోపవు; యెందు జూచిన సుచాక్తంబైన తద్భక్తి కారణమై యొప్పగదోచు శంకర జలప్రాయాంగ సాంద్రద్యుతుల్" అని వరించి, "దరహాసమలర, మంద మందగతిబోయి, చొచ్చె నమ్మగుప నీట" అని ముగించాడు. చివరి ఈ అయిదు పద్యాలూ 'ముసలమ్మ మరణాన్ని' మరణంలేని కావ్యంగా నిలబెట్టుతవి!

'నవయామిని' రచనయొక్క 'సంభవ ప్రకారా'న్ని గూర్చి రెడ్డిగారే చెప్పుతున్నారు. "విషయము మంచిదికాదు .... ప్రాయోభావము లోపించి నది" అన్నారు. ఎన్ని కథల్లో కావ్యాల్లో ఆ లోపంలేదు? ఎందుకో రెడ్డి గారికి యామినీ బిల్హణుల కథను చక్కజేయవలెనన్న పట్టుదల? బహుశ ఆయన విద్యావేత్త, విద్యాధికారి, గురుశిష్య సంబంధముయొక్క పవిత్రత నెరిగినవాడు అగుటయే దానికి సమాధానమా! తప్పుదారిన పట్టిన బిల్హణునిచేత యామినికి 'అపాలజీ' యిప్పించిగాని తృప్తిపడలేదు వైస్ఛాన్స లర్ రెడ్డిగారు! ఆయన వ్యక్తిత్వమటువంటిది!

ఈ గ్రంథం 14, 15 పుటల్లో రెడ్డిగారి డైరీనుండి 8-2-1900 తేదీన వ్రాసిన ఆంతరంగిక పరామర్శ నొకదానిని ఉద్ధరించి ముద్రించారు: "Thus my heart positively hates human beauty. But it loves moral beauty. My creation of Musalamma was from the moral point of view." స్త్రీ సౌందర్యంపట్ల రెడ్డిగారి వైఖరికిది కీలకంగా తోస్తుంది. శారీరక సౌందర్యంపట్ల విముఖత, వ్యక్తిత్వంపట్ల ఆకర్షణ, రెడ్డిగారి తత్వం కాబోలు! ఆ తరుణంలోనే పట్టపరీక్షకు చదువుతూ 1900 లో వ్రాసికొన్న పద్యాలలో రెడ్డిగారి జీవిత

రహస్యం ఒకటి తొంగిచూస్తున్నది: పట్టపరీక్ష....దయ్యమెట్టయెదుట నిల్చి పుస్తకమెక్కడైనా పూర్తిచెయ్యలేకపోయాడట; కారణం 'మనమున నున్న తరుణి!' ఆమెను తలచి తలచి, కన్నీళ్ళపర్యంతం కావడం!! ఆమెతో మాట్లాడే ధైర్యంలేక, పార్కులోకి రమ్మని చెప్పబోయి చెప్ప లేక, పార్కుకి వెళ్ళి కూర్చుని ఆమెను గూర్చిన ఊహల్లో తేలిపోయా డట! ఇది 1900 నాటి సంగతి! కాని 1911 లో 'అర్థశాస్త్రము' గ్రంథాన్ని "మధురమూ, పవిత్రమూ అయిన 'ఎస్. జి.' స్మృతికి" అంటూ 'ఆత్మ గతం'గా కొన్ని పద్యాలు వ్రాశారు. 'అస్మత్ప్రియసఖి' అని సంబోధిస్తూ "నిండు హృదయంబుతో మహోద్దండవృత్తిఁగాంక్ష సేసినయది పండు గాకపోయె, కాలమాశనుద్రుంచె...." నని నిర్వేదాన్ని వ్యక్తంచేశారు. "కనులు మూయునంత కలలును, కలలలో భవదుదారమూర్తి వచ్చి నిలుచు, కనులు దీర్ఘనిద్ర కప్పంగబడిన, నిన్ననవరతము జూడసౌనె చెపుమ" అంటూ విలపించారు. చివర సర్వభూతములలో ఆమె మూర్తి గోచరిస్తూ "అనుచితము సేయ గోపింతు వగ్నినుండి, సకలభూతమయాకార సార మహిమ నీవు లేకయు నాకు నున్నావెపుడును!" అంటూ ముగించారు. ఆ ఉదారమూర్తి 1900 నాటి సహాధ్యాయినియేనా? ఆమెకు మనసా కట్టు పడిఉండటంచేతనే, రెడ్డిగారు అవివాహితులుగా నిలిచిపోయారా? ఏమో! 44-46 పుటలలోని పద్యాల్లో రెడ్డిగారు, కృష్ణశాస్త్రి, నాయనివంటి కవుల సరసన నిలబడి దర్శనమిస్తారు. 'సాత్వికమైన విషాదచ్ఛాయయే వీరి కవితా ప్రవృత్తికి చోదకమ' న్న లక్ష్మీకాంతంగారి తీర్పు సరియైనదే!

( భారతి ) ❋

# కృష్ణశాస్త్రి సాహిత్యం

కృష్ణశాస్త్రిగారి అముద్రిత రచనల్ని 17 సంపుటాలుగా వెలువరించే పథకంలో మొదటిదశ ఈ ఆరు సంపుటాల ప్రచురణ. నాలుగు వ్యాస సంపుటాలుగా, రెండు గేయ సంపుటాలుగా శ్రీ బాలాంత్రపు నళినీ కాంత రావు, శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యుల సంపాదకత్వం క్రింద శ్రీశ్రీ 'తొలిపలుకు'తో అందంగా తయారైన ఈ పుస్తకాలు కృష్ణశాస్త్రి కుమారుడు 'బుజ్జాయి' సాహితీలోకానికి అందజేస్తున్న చక్కని కానుక.

కృష్ణశాస్త్రిగారి సాహిత్యవ్యాసాల్లో ఈ సమీక్షకుణ్ని ప్రధానంగా ఆకర్షించినవి రెండో సంపుటిలోని "మా ప్రణయలేఖల కథ" "ఊర్వశి" "నా గొప్పరచనా?" అనేవి. "కృష్ణపక్షం - ప్రవాసం - ఊర్వశి" కావ్య రచనా కాలానికి సంబంధించిన కృష్ణశాస్త్రి జీవితానుభూతిని వివరించే వ్యాసాలివి. తన 27వ ఏట శాస్త్రిగారు వ్రాసిన ప్రథమవ్యాసంలో తన సౌందర్యాన్వేషణా, తను పొందిన నిర్వేదమూ, కార్చిన కన్నీళ్ళూ చేరిన గమ్యమూ ఆత్మకథగా వివరించారు. నవంబరు 1982 'భారతి'లో 'కృష్ణ శాస్త్రి నిర్వేదం' అని వ్రాస్తూ కృష్ణపక్షంనుంచీ ఊర్వశిదాకా ఆయన మనస్సు పొందిన పరిణామాన్ని కవిత్వంనుంచీ వ్యాఖ్యానించిన నాకు ఈ వ్యాసాల సంగతే తెలీదు! చూస్తే ఇప్పుడీ వ్యాసాల్లో నా వ్యాఖ్యానానికి పూర్తి సమర్థన లభిస్తోంది! కృష్ణశాస్త్రి అంటాడు: "నేను విధాత అంత వాణ్ని. అతడు సరస్వతిని సృష్టించుకున్నాడు, ప్రేమించాడు, ప్రేమింపబడ్డాడు. నేనూ అంతే!" (పుట 54 సం. 2) ఆమే ఊర్వశి. ఊర్వశిని కవి ఒక్కడే ఎరుగును, అందరూ ఎరుగరు.... రంభలు లోకంలో చాల మంది ఉన్నారు. ఒక్క ఊర్వశే వుంది. అస్థిమాంసాదులతో రంభను చేశారు. యుగయుగాల ఆవేగంతో, ఆనందంతో, ఆశతో, ఆశయాలతో,

వేదనతో, వివిధానుభవాలతో పూర్వశిని చేశారు. లోకం రంభను కోరు తుంది. కవి పూర్వశిని ఆరాధిస్తాడు.... ఒక చక్కని స్త్రీ ఎలావుందో దాన్ని లోకం రంభ అంటుంది. స్త్రీ ఎలా వుండాలో దాన్ని కవి పూర్వశి అంటాడు. (పు॥ 7, 5 సం. 2) ఒక ఆంధ్రకవి కృష్ణపక్షంలో ప్రవాసియై తిరిగితిరిగి, కంటపడిన ప్రతి లావణ్యాన్నీ కదిపి కదిపీ.... ముచ్చిచ్చులో వేగివేగి, నాకు గాదులు లేవు, నా కుషస్సులు లేవు అన్న నరకం లోకి వచ్చాక, తపస్సు పూర్తిఅయాక, శాంతచిత్తుడై తానే ప్రేయసిని సృష్టించుకున్నాడట. ఎలాగ? పూర్వశి కవిలో ఉంది! కవి హృదయం లాంటి హృదయమూ కవి భావనవంటి భావనా సంపాదించు! నీకూ దర్శనమవుతుంది!.... సీతమ్మ లోకైకమాత అయితే పూర్వశి విశ్వ ప్రేయసి. పూర్వశీ! పూర్వశీ! అది నీ చరణతాణిమా? పారాణా? నా హృదయరక్తమా? పూర్వశీ! నా కావ్యానివి నీవు. నువ్వు పక్కనుండు నేనీ లోకాన్ని వైకుంఠం చేస్తాను. (పుటలు 51, 63 సం. 2) కృష్ణశాస్త్రి గారి మహాకావ్యం. కృష్ణపక్షం - ప్రవాసం - పూర్వశి అధ్యయనం చేసే వారు ఈ మూడు వ్యాసాలూ ప్రక్కన ఉంచుకొని అధ్యయనం చేయాలి. ఈ వ్యాసాలు యిన్నాళ్ళూ మరుగున ఉండిపోవడంవల్ల ఆ మహాకావ్యం అంతరార్థం, విన్యాసం నిరూపణ కాలేదు.

కాని శాస్త్రిగారికి తెలుసు ఈ మూడు కావ్యాలూ ఒకటే కావ్యమని, అదే తన గొప్ప రచన అనీ, అందులో తన ప్రస్థానం, తన తపస్సు, తన ఆత్మ నిక్షిప్తమయ్యాయనీ, ప్రేమ ఎంత గొప్పది! ఒకర్ని ఎప్పుడైనా ప్రేమించినవాడు అందరినీ ఎప్పుడైనా ప్రేమించగలడు. ఊర్వశిలో దివాంధంలేదు. కృష్ణపక్షంలోనూ, "ప్రవాసం"లోనూ దివాంధం వుంది. "విడని వాసన పదములు విరులౌ అయ్యో, అననమ్మున అశ్రులే అరవయ్యే, విలిచినాడ నేటికి గూడ తొలి వసంతకాలపు ప్రభాత తరుణవృక్షమ్ము కరణి"

ఇది నా గొప్ప రచన. అన్నిటికన్నా ఊర్వశిలో దిది (పుటలు 60, 71 సం. 2)

కృష్ణశాస్త్రి పొందిన ఆ హృదయపరిణతి ఆయన జీవితాంతందాకా రచించిన ప్రతిపద్యంలో గేయంలో, వ్యాసంలో ఎక్కడ చూచినా అమృత సేదనంలాగ మనకి అనుభూతమవుతూనే వుంటుంది. గేయ సంహిత రెండు సంపుటాలు - 'అమృతవీణ' 'మంగళ 'కాహళి' అమృత వీణలో ఎన్నో గొప్ప రచనలున్నాయి. "సిగలో అవి విరులో, అగరు పొగలో, అత్తరులో మగువ సిగ్గుదొంతరలో? మనలే వలపు తొలకరులో?" అంటూ అలతి అచ్చ తెలుగుపద్యాలు కూర్చినా, 'అషాఢమోషామణి కేశపాశాన అల్లుకొన్నది తటిద్వల్లియో!" అని సంస్కృతాన్ని అందుకున్నా భాషాసౌందర్య సాక్ష్యాధారం ఈ శతాబ్దికవితలో కృష్ణశాస్త్రి రచనలో ఉన్నంత మరెక్కడా కనిపించదని తోస్తుంది. "తెలి రెల్లు బయలులో కొలకులో? తెలికొలుకు అలలలో అంచలో? తెలి అంచ గరులలో వెన్నెలలో?" అంటూ అల్లుకుపోయే విన్యాసాలు ఎన్నో. "ఇక సముద్రం ఎక్కడుందో నాకు తెలియదు. కాని ఆ పాత మధురమయిన కృష్ణశాస్త్రి సాహిత్యం సమస్తమూ ఇక్షురసార్ణవమే" అన్న శ్రీశ్రీ పలుకులు ప్రత్యక్ష రత్యాలు.

నన్నయ్య, తిక్కన, శ్రీనాథుడు, పెద్దన, వేమన, తిరుపతి వేంకట కవులు, వేంకట పార్వతీశ్వరులు, రవీంద్రుడు, ఎడ్గార్ ఎలన్ పో వీరిని గూర్చి చేసిన ప్రసంగాలు చిన్నవే అయినా కృష్ణశాస్త్రి సంప్రదాయతకు, అభిరుచికీ విమర్శాపాటవానికీ వికసోపలాలుగా ఉన్నాయి. పోతన మహాకవి భాగవతంలో మానవాత్మ అందరాని పరమాత్మకోసం అర్రులు చాచినట్లుంటుంది. శ్రీనాథమహాకవి కావ్యాల్లో పరమశివుడు ప్రమథగణాలతో సహామన మధ్య విహరిస్తున్నట్లుంటుంది. (పుట 17 సం. 1) వేమన మాట నుసికట్టని నొప్పుకధెం తగలగానే చుర్రుమంటుంది. వేమన మాట

రెక్క ముడవని భరతపక్షి. కాలాలు దాటి యింకా ఎగిరివస్తూనే ఉంటుంది. (పుట 34 సం. 1) ప్రసిద్ధవ్యక్తుల్నిగూర్చి వ్రాసిన 'పద చిత్రాల' వంటి రచనల్లోనూ యిలాంటి వజ్రపు తునకలే మనం ఏరుకో వచ్చు. ప్రకాశంపంతుల్నిగూర్చి : "ప్రత్యేకవ్యక్తిలాగకాక ప్రజకులాగే తనకు కులంలేదు, మతంలేదు, వయస్సులేదు, డెబ్బయ్యాయిదేళ్ళవాడై తాత అయిపోలేదు." (పుట 77 సం. 3) ఆమాట కృష్ణశాస్త్రికీ వర్తిస్తుంది. ఆయన నిత్య యవ్వనుడు. (ఆంధ్రపత్రిక 6-9-1983)

# నా దేశం - నా ప్రజలు

— శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ

నడుస్తున్న చరిత్రని ఆధునిక మానవేతిహాసంగా రూపొందిస్తూ వచన కవితామార్గంలో శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ చేసిన సరిక్రాంత్త ప్రయోగం 'నా దేశం - నా ప్రజలు'. ఎన్నోవిధాల విలక్షణమైన కావ్యం యిది.

ఈ యుగంలో నాయకుడు శ్రమజీవి - కార్మికుడు, కర్షకుడు అయిన మానవుడు. మనిషిలోని సృజనాత్మకశక్తి, కార్మికునిలో అయినా, కర్షకునిలో అయినా, కవిలో అయినా, వేదాంతిలో అయినా, శాస్త్రపరిశోధ కునిలో అయినా, రాజ్యపరిపాలకునిలో అయినా, మౌలికంగా ఒకటే ; దీన్ని మనం సాధారణంగా అంగీకరించం. సామ్యవాది అయినవాడూ లేక సమదర్శి అయినవాడూ తప్పక అంగీకరిస్తాడు. మానవుణ్నిగూర్చిన యీ అద్వైత సమన్వయదృష్టి "నా దేశం - నా ప్రజలు" కావ్యానికి ఆధారం.

ఆధునిక కావ్యాల్లో 'మానవత'కు యిచ్చే నిర్వచనంకాని, వివరణ కాని ఏవో ఒక రాజకీయ లేక సాంఘిక లేదా మనోవైజ్ఞానిక దర్శనంమీద ఆధారపడి వుంటోంది. శర్మగారు ఈ కావ్యంలో 'మానవత'కు ఔపనిషదిక మైన, అద్వైత వేదాంతపరమైన నిర్వచనం యిచ్చారు. దానికీ, ఏవిధ మైన 'విప్లవ' భావాలకూ వైరుధ్యం వైషమ్యం లేదనే సత్యాన్నికూడా ఈ కావ్యంద్వారా వ్యక్తంచేశారు. వేదాంతాన్ని సాంప్రదాయికమైన వైయ క్తికపు ఏకాంతశిఖరాలనుంచీ వర్తమాన సామాజిక మానవజీవన భూము లకు, భగీరథునిలాగ తరలింపజేశారు. అందువల్ల 'గంగ'కు వచ్చిన లోటేమీ లేదు.

* "నేను ధాన్యంలోనుంచీ పుట్టాను, ధాన్యంకోసమే బ్రతుకుతాను, మరణించి ధాన్యంలోకే వెళ్ళిపోతాను" (ఒకటో సర్గ) కర్షకుడిదైన [illegible] వాక్యంలా తోపింపజేస్తూనే, సృష్టిగా రూపొందుతున్న తత్వాన్నిగూర్చి చెప్పే ఉపనిషద్వాలని ధ్వనిస్తూ, రెండింటికి అభేదాన్ని ప్రతిపాదించే దృష్టితో, చమత్కారమైన శిల్పంతో ఈ కావ్యం ప్రారంభం అవుతుంది. శర్మగారు మొదట వ్రాసిన 'మండే సూర్యుడు' పద్యాలలోనే సూర్యుడు, మానవుని సృజనాత్మకశక్తికి ప్రతీక అయినాడు. ఆ ప్రతీక ఈ కావ్యం లోనూ, అలాగే స్వీకరింపబడింది. విలియమ్ బ్లేక్ వ్రాసిన 'ప్రవచన కవిత్వం' (P ophetic Poems) లో మానవుని సృజనాత్మకశక్తిని 'కవి మనీష' (Poetic genius) అని వ్యవహరించాడు. అంటే కేవలం కవిత్వ రచనాశక్తి కాదు. సృష్టిలో సర్వత్ర గోచరమయ్యే సృజనాత్మకశక్తి యొక్క అంశగా కవితాశక్తిని సృష్టిశక్తికి ప్రతీక చేశాడు బ్లేక్, శర్మ గారూ అలాగే చేశారు. సూర్యుడు, సూర్యకిరణాలు ఆ సృష్టిశక్తికి ప్రతీక. ఉపనిషత్తుల్లో గాయత్రికిగల ప్రాముఖ్యాన్ని గుర్తుకు తెచ్చు కుంటే దీని స్వారస్యం విదితమవుతుంది. కావ్యంలో 'నేను', 'సూర్యుడు

---

* A Symphony of Voices

ఒక్కటే. అయినా రెండుగా కనిపించి, ఒక్కటై, మళ్ళీ వేరవుతూ వుంటారు. ఒకటో సర్గ - "లేస్తోంది ఉషఃకాంతుల్లోనించి ఒక హస్తం!.... నేను కళ్ళు తెరిచి, ఆవులిస్తూ లేస్తా" అని ప్రారంభం. తర్వాత "ఈ చేత్తో నేను ఏ అందాన్ని సృష్టించలేదు! ఏది ఈ భూమిమీద చేతికి లొంగలేదు! కాని ఈ చెయ్యి ఖాళీగానే వుండిపోయింది శాశ్వతంగా" అనడంలో 'నేను' 'సూర్యుడు' తాదాత్మ్యంచెంది సృష్టికర్తకూడా ధ్వనిస్తున్నాడు. ఇక్కడ సృష్టికర్తయై, సృష్టిలో అంతర్లీనమైకూడా సృష్టికి అతీతంగా వుండే తత్వాన్ని ప్రతిపాదించడమే కాకుండా, కార్మిక కర్షకుల శ్రమఫలితం వారికి దక్కకుండా పోతున్న నేటి సమాజవ్యవస్థ తీరుకూడా ప్రసక్తమైంది. కావ్యమంతా యిదే పద్ధతి.

కావ్యంలో శ్రామికుడు; మానవుడు, సూర్యుడు సృష్టికర్త ఒకరిలో ఒకరై, ఒక్కొక్కరూ వేరై, విభిన్న కంఠస్వరాలు పలుకుతూ వుంటాయి. * నడుస్తున్న చరిత్రను, మానవేతిహాసాన్ని కథనం చేసేందుకు కవి అవలంబించిన విలక్షణమైన శిల్పం యిది. కవి - తాత్వికదృష్టి, భావన, శిల్పము ఇతివృత్తము ఒకదానితో ఒకటి కలిసి, వేరై, ఒకటి మరొకటిగా, చిత్రవిచిత్రమైన స్ఫురణలతో ప్రతి వాక్యానికి విశిష్ట కవితా గుణాన్ని బహుళ వ్యంజకత్వాన్ని సమకూర్చుతున్నాయి. వీటిని విశ్లేషించుకోవడం, వాక్యాల్ని మామూలు ఆలోచనా పద్ధతిలోకి తర్జుమా చేసుకోవడం పాఠకుని కృషి. ఒకవేళ అలా చేసుకోకపోయినా యిబ్బందిలేదు. కావ్యం యొక్క ఆస్వాదనలో లభించే అనుభూతి మేధాస్పృష్టం కాకుండానే నేరుగా హృదయంగమం అయ్యే లక్షణం ఈ కావ్యంలో పుష్కలంగా ఉన్నది. హృదయంగమం అయినదాన్ని అవసరమనుకుంటే వివేచించి విడమర్చి

* తైత్తిరీయం : అన్నాద్ భూతాని జాయన్తే, జాతాని అన్నేన వర్ధన్తే....

కోవచ్చు. అటువంటి వివేచనకు నిలిచే నిర్మాణ సౌష్ఠవం, తాత్వి[illegible]ం కూడా ఈ కావ్యానికి ఉన్నది.

ఉదాహరణకు ఒకటో సర్గను విశ్లేషించి చూద్దాం ఇందులోని ఇతి వృత్త విన్యాసం యిలా వుంది - (1) సృజనాత్మక శక్తి, దాని పరివ్యాప్త మైన స్వరూప వివరణ - మానవుడు, కర్షకుడు, కార్మికుడు, నేతపనివాడు, రస్తాకూలీ, సైనికుడు, కవి, వ్యక్తి, నావికుడు, శిల్పి వగైరా - కాని సృష్టికర్త (శ్రామికుని) చెయ్యి ఖాళీగానే ఉండిపోతున్నది. ఇక్కడ వేదాంతపరమైన సత్యమూ, నేటి వ్యవస్థాలక్షణ నిర్దేశమూ కవి శిల్ప చమత్కారంవల్ల ఏకీభవిస్తున్నవి. (2) 'గడచిన చరిత్రలో నాకు తావులేదు. ఇప్పుడు నడిచే చరిత్రకు నీతిలేదు' అనే గొంతుక శ్రామికునిది. అంతలోనే 'నా బ్రతుకొక సున్న, కానీ నడుస్తున్నా' అనే గొంతుక ఆత్మపరాత్మ ప్రత్యాఖ్యానంతో దారికోసం వెదికే నాగరకునిది. (Self-alienated modern man) ముగింపులో 'నేను మాత్రం నడుస్తున్నా.... రగిలే నా ఎర్ర కోరికే ఒక జెండగా!' అనే గొంతులో పై యిద్దరూ సృష్టికర్తతో (సృష్టికి నాంది సంకల్పం) సమసించడం జరుగుతుంది. (3) 'క్షణాలు కేవలం కాలాన్ని అనుసరించే పరివారంకాదు, కొన్ని క్షణాలుంటాయి. యావత్తు మానవచరిత్రనూ మార్చగల మహత్తు ఉన్నవి' అనే కవి ప్రవచనంలో భవిష్యద్వాణీ, క్షణానికీ అనంతానికీ జరిగే సంయోగమూ ధ్వనిస్తుంది. విప్లవానికి నాందీవాక్యమూ అదే అవుతుంది. నడుస్తున్న చరిత్రలో మార్పు ఎలా వస్తుంది? 'సూర్యుడు తేజస్వి అవుతున్నాడు. సుత్తులు కొడవళ్ళలాంటి కిరణాలు ములియస్లు ప్రదానం చేస్తున్నాడు' విప్లవం సృజనాత్మకశక్తియొక్క కాలానుగుణమైన స్వరూపం. 'విప్లవం ఎందుకు?' అంటే విప్లవం తప్పదు అనే సమాధానం. (ఘుండుూమారుతాన్ని అడుగు నీ కెందుకింత ఆవేశం అని) విప్లవం ఎలా వస్తుంది? కవీ (కాలాన్ని కాగితచేసుకుంటూ), శ్రామికుడూ (శిల్పంగా చెక్క భూమి

మీద నిలబెడతా), మేధావీ (కోరిక గొంతెత్తి అరుస్తుంది, కొత్త శకాన్ని లోకంమీదికి విసిరేస్తుంది) నడుం కట్టుతారు, ఒకటౌతారు, చివరకు సృష్టి లీలా విలాసంతో (చతుర్భుజ పద్యాలతో) సృష్టికర్తే కవిగా కొత్త కావ్యాన్ని రచిస్తాడు. (4) ప్రకృతికి వసంతం వస్తుంది. సమాజం మారుతుంది. వ్యక్తిజీవితంలో అందం, ఆనందం ప్రవేశిస్తాయి. ఇది కల, ఇది ఆశ, ఇదే మానవుడు సృష్టించుకునే భవిష్యత్తు. ఇదే కావ్యం. కవిలో నిర్వేదం పోయి సంతోషం వెల్లివిరుస్తుంది. ('కన్నీరు కార్చిన చెట్టు నా కలమీద పూలవాన కురిసింది' అంటాడు)

ఈ విశ్లేషణద్వారా కావ్యనిర్మాణాన్నీ, కావ్యతత్వాన్నీ స్థూలంగా గ్రహించవచ్చు. నిజానికి ఒకటోసర్గలోని పథకమే రకరకాలుగా పునరావృత్తమై, విస్తృతమౌతుంది మిగతా సర్గల్లో. ఇది కావ్యంలో లయ, వర్తులాలుగా సర్గలు సాగిపోతాయి. నీటిలో చిన్నరాయి విసరినప్పుడు విస్తృతమయ్యే తరంగవలయాలులాగ యితివృత్తం సర్గనుంచీ సర్గకి విస్తరిస్తుంది. రెండో సర్గలో ఆదిమానవుని దగ్గరనుంచీ జరిగిన చరిత్ర తాలూకు స్మృతి ధ్వనిస్తుంది. మూడో సర్గలో వర్తమానం, నగర జీవితం, దానినుంచీ పారిపోయే మానవుడు, వీడికి జరామరణాలే పరిష్కార మార్గాలా? అన్న ప్రశ్న చరిత్ర తత్వాన్ని గూర్చిన జిజ్ఞాస ఉన్నాయి. నాలుగో సర్గలో విప్లవభావాలకు అంకురార్పణ జరుగుతుంది. కవి మనిషి ఆవేదనని, హృదయానుభూతిగా అవగాహన చేసుకుంటాడు. భూమి సూర్యుణ్ని పునరుజ్జీవనంకోసం అర్థిస్తుంది. అయిదో సర్గలో విప్లవానికి దారితీసే దుర్భరపరిస్థితుల చిత్రణా, విప్లవానికి సన్నాహం ఉన్నాయి. ఆరో సర్గలో కవి ప్రజల్ని ఉద్బోధిస్తాడు, పరిస్థితుల్ని విమర్శిస్తాడు. మానవత్వంతో చెల్లాడేవాళ్ళని దూషిస్తాడు, "నా మెదడులో భావాల అరణ్యాలకు నిప్పంటుకుంది" అంటూ వర్తమాన వ్యవస్థకే నిప్పంటిస్తాడు. ఈ ఆరో సర్గ టి. ఎస్. ఎలియట్ 'వేస్ట్‌లాండ్'తో సరితూగే కవిత్వం.

ఏదో సర్గలో ప్రకృతి జయిస్తుందన్న విశ్వాసం కవికి కలుగుతుంది. ఎని మిదో సర్గలో ప్రకృతివిజయం, ప్రేమవిజయంగా, మానవతావిజయంగా కవి దర్శించడంతో కావ్యం ముగుస్తుంది.

ఈ కావ్యం ఏ కోవకు చెందుతుంది? ఆధ్యాత్మికవాదులకూ మార్మిక, భావకవులకూ, చరిత్రతో, విప్లవంతో, శ్రామికునితో అవసరం లేదు; వీటితో అవసరం ఉన్న అభ్యుదయకవులకూ, విప్లవకవులకూ వేదాంతంతో బొత్తిగా పడదు; ఈ రెండు రకాలవారిది సంకుచితదృష్టి తప్ప సమగ్రదృష్టి కాదని ఈ కావ్యం ప్రతిపాదిస్తున్నది. భారతీయ దర్శనమైన వేదాంతానికి కేవలం భారతీయ చారిత్రక, సాంప్రదాయిక పరిధుల్ని నిర్దేశించి దాన్ని అలా బంధించడానికి వీల్లేదంటున్నది ఈ కావ్యం. వేదాంతానికి ఉన్న సమగ్ర మానవతాదృష్టినీ, దాని విప్లవాత్మకశక్తిని గూర్చి ప్రతిభతో చాటిచెప్పిన ఆధునికుడు వివేకానందస్వామి. అయినప్పటికీ వేదాంత దృక్పథాన్ని గూర్చిన అపోహా, తక్కువచూపూ, పాశ్చాత్యులు మనకు ఏళ్ళ తరబడి సంక్రమింపజేసి వెళ్ళిన వారసత్వం. దాన్ని వదులుకో లేకపోతున్నాం. పాశ్చాత్య దర్శనాలతో పబ్బం గడుపుకోవాలని చూచే మనవాళ్ళ మనస్తత్వంలో కేవలం అనుకరణ ప్రవృత్తీ, సృజనాత్మకశక్తి లోపించడమే కనిపిస్తుంది. అంటే నేడు రాజకీయ, సాంఘిక విప్లవాన్ని ప్రతిపాదించే సిద్ధాంతాలలో పథకాలలో శాస్త్రదృష్టి, ప్రయోజనాత్మకత శూన్యమని చెప్పడంలేదు; ఈ యుగంలో ఏ సిద్ధాంతమైనా శాస్త్రమైనా మౌలికంగా మానవతాదృష్టిమీదే ఆధారపడి ఉంటోంది. అటువంటి దృష్టి తోటే మార్క్సు దర్శనం రూపొందింది. ప్రపంచవ్యాప్తమైంది. కాని ఆ మానవతాదృష్టి, సామాజికదృష్టి వేదాంతానికి లేదనుకోవడం పెద్ద పొరపాటు. వివేకానందస్వామి ఒకచోట ఆధునికయుగాన్నిగూర్చి రాబోయే యుగం కార్మిక కర్షకయుగంగా, నాలుగవ వర్ణమైన శూద్రులయుగంగా వివరించి చెప్పారు. సామాజిక పరిణామంలో బ్రాహ్మణులమంచీ, క్షత్రి

యులనుంచీ, వైశ్యుల * నుంచీ విప్లవం ఏ విధంగా చరిత్రలో సామాజిక ఆధిపత్యాన్ని ఒకవర్గంనుంచీ మరోవర్గానికి చెందేలా చేస్తూ వచ్చిందో వివరిస్తూ ఇరవయ్యో శతాబ్దంలో శ్రామిక విప్లవాన్నీ, శ్రామికవర్గం ఆధిపత్యాన్నీ సూచించారు. మార్క్సిజమ్ రాకపూర్వమే వివేకానందుడూహించిన విప్లవం యిది. వోతే కవిత్వానికి కావలసింది శాస్త్రదృష్టికాదు. రాజకీయ పథకాలు కావు. వాటికి మూలమైన ఆధునిక యుగధర్మాన్ని ఆకళింపుకొన్న మానవతాదర్శనం వేదాంత దృక్పథంతో ఆధునిక మానవుని వైయక్తిక, సామాజిక వైక్లబ్యాన్ని ఆవిష్కరిస్తూ, శాస్త్రీయ రాజకీయ సమన్వయంతో విప్లవాన్ని ఆవాహన చేస్తూ ఈ కావ్యాన్ని నిర్మించిన శేషేంద్ర శర్మను ఆధునికుల్లో ఆధునికుడుగా అచ్చమైన భారతీయుడుగా అభినందించాలి.

ఇరవయో శతాబ్దపు మానవుణ్ని ప్రకృతినుంచీ, భగవంతుడినుంచీ ప్రత్యాఖ్యానం (Alienated) చెందిన మానవుడిగా ఆధునిక సాహిత్యం చిత్రిస్తోంది, వేదాంతదృష్టిలో 'ప్రత్యాఖ్యానం' ఒక అభాస (Appearance) మాత్రమే। పాశ్చాత్యుల భావన వేరు. వాళ్ళకు క్రైస్తవమతం తాలూకు పురిటివాసనలున్నాయి. భగవంతుడి ఆజ్ఞ నతిక్రమించి ఈడెన్‌నుంచీ బహిష్కృతుడైన తొలిమానవుని సంప్రదాయాన్నే వాళ్ళు అన్వయించుకుంటారు, మానవుణ్ని తిరుగబడిన కొంటెపిల్లవాడిగా, దారి తప్పినవాడిగా చిత్రిస్తారు. కాని వేదాంతదృష్టితో చూస్తే మానవునికీ ప్రకృతికీ వైరుధ్యంలేదు: మానవుడి అజ్ఞానమే, అహంకారమే అతణ్ని భగవంతుడినుంచీ దూరం చేస్తున్నది. పాశ్చాత్యుల దృష్టిలో విధ్వంసం, ప్రళయం,

* ఈ వర్గవిభేదం సమాజంలో ఆయా వర్గాల గుణ కర్మ విభేదాలనూ, ఆర్థిక ప్రతిపత్తినీబట్టి అది అర్థంచేసుకోవాలి. క్షత్రియులనుంచి వైశ్యులకు అంటే ఫ్యూడలిజమ్‌నుంచి కేపిటలిజమ్ అని అర్థం.

విప్లవం అనేవి భగవంతుని కోపాలే మనిషికి శిక్ష లేకపోతే చరిత్రప్రోసెస (Process) వేదాంతదృష్టిలో అవి సృజనాత్మకశక్తియొక్క నిత్య నూతన మైన విన్యాసం మాత్రమే. వేదాంతదృష్టిలో చరిత్ర ఋతువులకు మల్లే పునరావృత్తమౌతుంది. (పాశ్చాత్యులకు చరిత్ర క్రమపరిణాముంచెంది అంతమౌతుంది. మార్క్సుకూడా చరిత్ర అంతాన్నే ఊహిస్తాడు.)

"కొత్తపిల్లలు ఉదయిస్తారు. కొత్త గర్భాలనూ కొత్త విత్తనాలనూ కొత్త కాంతివలయాలు విసిరే ముఖాలతో" కొత్త నాగరికతలల్లుతారు, చరిత్ర పేజీల కందిస్తారు, పేజీలు పెరుగుతుంటాయి. వాటిమీద విర్దాక్షి ణ్యంగా కాలపు గండ్రగొడ్డలి పడేవరకూ" (మూడో సర్గ) ఇది వేదాంత దృష్టి.

చరిత్ర పునరావృత్తమౌతుందని వర్తమానంలో సమస్యల్ని ఉపే క్షించడం వేదాంతదృష్టికాదు. ఇది వివేకానందుడే నొక్కిచెప్పాడు నేటి సమస్యల్ని చిత్రించడంలో శర్మగారి కవిత్వం ఎన్నో కొత్తపోకడలు పోయింది. ఉక్తివైచిత్రిని సాధించింది.

"నీటి గాయాలు చెట్లగాయాలు పైర్ల గాయాలు మీకు కనిపించవు. పొలాలూ నదులూ అరణ్యాలు వీరమరణం పొందిన ఆత్మలు" (ఆరో సర్గ) ఇది వాతావరణ కాలుష్యాన్ని (Pollution) గూర్చి సూపర్ ఎరువు లతో పండించిన పంటల్ని గూర్చి.

"మీరు పలకా పుస్తకాలూ పట్టుకొనిపోతూంటే బాబూ! మీరు శిలువలు మోసుకుపోతున్న బాలక్రైస్తుల్లా కనిపిస్తారు నా కళ్ళకు" (ఆరో సర్గ) ఇది చదువునుగూర్చి.

"మనుషులు తపస్సుచేసి ఒక పామును పుట్టించారు. విరివిగా ఓట్లనే ధాన్యపుగింజలు వేసి పెంచారు. ఆ పాము చట్టాలనే గుడ్లు సక్రమంగా పెడుతుంది" - ఇది రాజకీయవ్యవస్థనుగూర్చి.

ఏడో సర్గలో ప్రకృతి ఆధునిక మానవుని ఆర్భాటాన్ని ఒకకంట కనిపెడుతోంది అంటాడు కవి :

"గాలిలో విమానంతో పోటీపడుతున్న ఆ పక్షి వట్టిపక్షి అను కోకు, అది నీలి ఎత్తులమీద కూర్చుని లేస్తూ పడుతూ నడిచే మానవ నాగరకతల్ని పరికిస్తున్న ప్రాచీనపక్షి...." (ఏడో సర్గ) * ఇక్కడ ఉపనిషత్తులోని రెండు పక్షులూ స్ఫురిస్తాయి. ఒకటి అహంత. రెండోది ఆత్మ. సమిష్టి మానవుని అహంత విన్యాసమే ఈ నాగరకత. దీన్ని పరి కిస్తున్న సాక్షి ప్రకృతి. ప్రకృతి అంటే మానవుని అంతర ప్రకృతికూడా. నాగరకత చెడినా ఆత్మవినాశంలేదు మనిషికి అనే విశ్వాసమే ఈ కావ్యం చివర వ్యక్తమైంది.

ఎనిమిదో సర్గలో ప్రసక్తమైన ప్రేమ - కవీ అతని గీతికా మనిషీ ప్రకృతీ, సూర్యుడూ భూమీ, ప్రియుడూ ప్రేయసీ, సృష్టికర్తా సృష్టి - వీళ్ళమధ్య ఉండే సంబంధమే ప్రేమ.

"నా దేశం నా ప్రజలు అనుభవిస్తున్న బాధల గాధలు ... నా శరీ రాన్ని వ్యధాస్వరఝరీ వేగంతో ప్రతిధ్వనింపజేస్తున్నాయి. కానీ నీ రక్త నాళాలు ఒరసిపారే గంభీరశాంతరసమే, వాక్రోధోన్మత్త ఉత్తమాశ్వాలకు కళ్ళెం వెయ్యగలిగింది" అంటారు సూర్యునితో భూమి, సృష్టికర్తతో సృష్టి, కవితో అతని హృదయం.

అందుకే ప్రేమ నశించినంతకాలం, మానవత్వమూ నశించదు. రెండూ సమానార్థకాలు. అదే కావ్యంచివర ప్రవచనం -

---

* ముండక శ్వేతాశ్వతర : ద్వాసుపర్ణాసయుజా సఖాయా సమానం వృక్షంపరిషస్వజాతే తయోరన్యఃపిప్పలం స్వాద్వత్తి అనశ్నన్నన్యోఽభి చాకశీతి

"ప్రేమ అగాధపు లోతుల్లో మానవ పదవీ గౌరవాన్ని పొందను" అంటాడు. ఎవరు? కవి, విప్లవకారుడు, భగవంతుడు. అన్నీ ఒకటైన మానవుడు.

'నా దేశం - నా ప్రజలు' వచన కవిత్వంకాదు. ప్రవచన కవిత్వం. ఎత్తుగడలో, శిల్పంలో, దృక్పథంలో, ఇతివృత్తంలో, నిర్మాణసౌష్ఠవంలో విలక్షణమైన నూత్నసృష్టి. ఈ కావ్యంతో తెలుగు కవిత్వం ఒక మలుపు తిరిగిందని చెప్పడం తొందరపాటు కాదనుకుంటాను. 'కృష్ణపక్షం' భావకవితకూ, 'మహాప్రస్థానం' అభ్యుదయ కవితకూ వేగుజుక్కలైనట్లే 'నా దేశం - నా ప్రజలు' తెలుగు కవిత్వాన్ని కొత్తదారుల్లో నడిపిస్తుందని నాకు తోస్తుంది.

( భారతి : ఫిబ్రవరి 1976 )

# తేజస్సు నా తపస్సు

— డా. సి. నారాయణరెడ్డి

శ్రీ నారాయణరెడ్డిగారు 1976లో వ్రాసిన కవితల సంకలనం ఈ గ్రంథం. "కవిగా నాదీ ఒక తపస్సే. కానీ దాని ఆకృతిపేరు, ఆత్మ వేరు. మొదటి కవిత చదవండి తెలుస్తుంది." అన్నాడు తొలిపలుకులో కవి స్వయంగా. మొదటి కవిత శీర్షికే 'తేజస్సు నా తపస్సు'. ఈ తపస్సు లక్ష్యం స్వీయశ్రేయంకాదు - జగదీయ ప్రేయం.... "వర్తమానమూర్తుల శిరస్సుల్లో వర్తులంగా పరిభ్రమిస్తున్న ఆర్తిని ఊర్ధ్వముఖంగా నిలబెట్టే ఉత్తాల తపస్సు"....కాని, ఈ తపస్సు ప్రకృతి గమనానికీ, పరిణామానికీ విరుద్ధమైన ప్రయత్నం కాదు. "కెంజిగుళ్ళ బంగరు ముంగిళ్ళలో కిశోర

కుసుమోదయం తపస్సు : ప్రసూనాలు రాలిపోతూ ఫలాల పాపలను అందించడం తపస్సు" అని సృష్టిక్రియగా దాన్ని వివరిస్తూ, చివరకు కవి అంటారు : "ఈ తపస్సు కొనసాగనీ ధనస్వామ్యం విరిగేదాకా, పణవి పణిలాంటి లోకంలో ప్రగతిమూల్యం ఎదిగేదాకా...." ఇలా తనని అభ్యుదయకవిగా వర్ణించుకుంటూనే, అభ్యుదయాన్ని గూర్చిన తనదైన అవగాహననీ, ధ్యేయాన్నీ చక్కగా అభివ్యక్తం చేశారు.

సంపుటిలోని కవితలన్నింటిలోనూ అంతస్సూత్రం కనిపించే కవి దృక్పథం, ఉద్బోధ - "గతంమ్మృతం, భవిష్యత్తు అమృతం, రేపటి ధ్యాస ఈ తరం పీల్చే శ్వాస" ('అందుకే వెళుతున్నా' అనే శీర్షిక) ఇదే భావమే 'క్షణాలు రెండు' అనే ఖండికలోనూ ఉంది, 'ఈ క్షణం విస్మృతి, మృతి.... మరుక్షణం జాగృతి, ప్రగతి'. ప్రకృతి, ప్రగతి, దీప్తచైతన్యం, క్రాంతి హాసం, ఈ రాత్రి, ఇది మథనం : అది ఉదయం - మొదలైన ఖండికల్లో భావమే పునరావృత్తమైంది. కాని విసుగనిపించదు. భాషా సౌందర్యం ఈ కవితకు జీవగర్ర.

"అవిగో నీ చూపులు. అగ్నిలో ఈదే ఆవిరులు. పంచేంద్రియాలను ఒకే సంపుటిలో ప్రసంచించే ఊపిరులు" - ఇది కవి భావుకతకొక ఉదాహరణ. కేవలం అభ్యుదయ దృక్పథంతో సంబంధంలేని కవితాగుణమిది. ఒకవిధంగా చూస్తే భాషలో, సౌందర్యాన్వేషణలో, భావుకతలో నారాయణరెడ్డికి ఆంగ్లకవి టెన్నిసన్‌కీ ఎక్కువ పోలికలు కనిపిస్తాయి. టెన్నిసన్‌కూడా ప్రగతిని (ప్రోగ్రేస్) ఆరాధించినవాడే. (ది ఓల్ ఆర్డర్ ఛేంజెత్. ఈల్డింగ్ ప్లేస్ టు న్యూ).

కవిలోని నిత్యనూతనత్వాన్ని చూచి అసూయచెందే వాళ్ళమీద వ్రాసిన ఖండిక ఈ సంపుటిలో ఆసక్తి కలిగిస్తోంది. 'ప్రశ్నిస్తున్నాను' అని శీర్షిక. "ఎందుకో అసూయ నీపై ఎండిపోయిన చెట్లకు ?.... పసివాడిలా, అసివాడిలా పల్లవిస్తూ ఉంటావు, పరాక్రమిస్తూ ఉంటావు.

ఇంతకుమించి నీవు ఏ నేరం చేయకున్నా, ఎందుకో అసూయ నీపై ఎండిపోయిన చెట్లకు ?" ఇది సాటి కవులకొక సవాలు కాబోలు!

(ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక : 24-11-76) ❀

# మూడు యాభైలు

— శ్రీశ్రీ

ఇందులో 50 కందపద్యాలు ('సిరి సిరిమువ్వా' మకుటంతో) 50 ప్రాసక్రీడలు, 50 లిమరిక్కులు - వెరశి 'మూడు యాభయిలు' ఉన్నాయి. ఇవన్నీ వార, మాసపత్రికాముఖంగా పాఠకులకు చిరపరిచితాలే. శ్రీశ్రీ స్వయంగా చెప్పుకున్నట్లు యిది 'కార్టూను' కవిత :

పత్రికలో కార్టూనులు పడటం చూాలెదూ ?
పద్యంలో ఆ మాదిరి పద్ధతి వీల్లేదూ ?

వీలుందనే చూపించారు. లోకంపోకడమీద - అంటే రాజకీయ, సాంఘిక, సాహిత్యరీతులమీద చెణుకులున్నాయి. ఉదాహరణకు :

కోట్లకొలది ప్రజలను చీకట్లోపల వదలి నేటి కాంగ్రెస్ రాజ్యం
కొట్లాటల పోట్లాటల చీట్లాటగ మారిపోయె సిరిసిరిమువ్వా !

'చీట్లాటగ మారటం' అనే ప్రయోగంలో లాటరీ అనీ, జూదం అనీ, చివరకు లెజిస్లేచరు పార్టీనాయకుణ్ని ఎన్నుకోవటంలో ఏకగ్రీవంగా ఎన్నుకోవటానికై ప్రవేశపెట్టిన సరికొత్తదైన 'చీట్ల' పద్ధతి అనీ, పలు విధాల స్వారస్యం సాధింపబడింది. అలానే ఒక సాంఘికాచారంమీద వ్రాస్తూ :

భోషాణప్పెట్టెల్లో ఘోషాస్త్రీలను బిగించి గొళ్ళెంవేస్తూ
'బేష బలే బీగా' లని శ్లేషించెను సాయిబొకడు సిరిసిరిమువ్వా !

అనటంలో 'శ్లేషించెను'లో కూడ శ్లేషఉంది కాబోలు ! ఏ కవిత్వం వ్రాసినా భాషమీద శ్రీశ్రీకి ఉన్న సర్వాధికారం కొట్టవచ్చినట్లు కనిపిస్తూనే ఉంటుంది. లోకాన్ని దుయ్యబట్టడం శ్రీశ్రీకి స్వభావసిద్ధమైన గుణంకాదు. అందుకే తనను తనే అపహాస్యం చేసుకోగలిగాడు :

కుర్చీలు విరిగిపోతే కూర్చోడం మాననట్లు గొప్పరచనల్
కూర్చేశక్తి నశిస్తే చేర్చదగు నొకింత చెత్త సిరిసిరి మువ్వా !

అయితే యిది కేవలం 'చెత్తా' కాదు : శ్రీశ్రీకి గొప్ప రచనల్ కూర్చే శక్తి నశించనూలేదు. ఏదో వేళా విశేషం అలా అనిపించింది కాబోలు ! ఈ కార్టూను కవిత్వంలో శ్రీశ్రీ ముఖ్యంగా చమత్కారానికీ, హాస్యానికీ అవకాశం కల్పించారు. ఆలోచనల్నీ ఆవేశాల్నీ అవతలపెట్టి. 'ప్రాసక్రీడల్లో' రెండు మూడు గీతల్తో ఒక విశిష్ట మానవాకృతిని కల్పించినట్టు రెండు మూడు అలతిపదాల్తో ఒక విషయాన్ని పూర్తిగా చెప్పగలిగే సామర్థ్యం చూపించారు శ్రీశ్రీ. "కొంతమంది కుర్రవాళ్ళు పుట్టుకతో వృద్ధులు పేర్లకీ పకీర్లకీ నిబద్ధులు" అనటంలో యువజనుల ప్రవృత్తిమీద నిశితమైనదేకాదు, సమగ్రమైన వ్యాఖ్యానంకూడా ఉంది. 'పేర్లంటే' రాజకీయ నాయకులనుంచీ సినిమాతారలదాకా, నోట్సు రైటర్సు నుంచీ నవలారచయితలదాకా 'పేరు'నుబట్టి కుర్రవాళ్ళు ఎలా వ్యామోహితులౌతూ ఉంటారో చెప్పనక్కరలేదు. 'పకీర్లం'టే యోగం, జ్యోతిషం, ఇంద్రజాలం, [illegible]పతువాల్లే కాదు, బీదా బిక్కీ అనాధ ప్రజలూకూడా - వీళ్ళంటే కుర్రకారుకి గొప్ప సెంటిమెంట్. ఇక 'పుకార్ల' సంగతి : సెన్సేషనల్ జర్నలిజంనుంచీ చెవులు కొరుక్కునే రంకు పురాణాలదాకా వాళ్ళకు మహాయిష్టం. ఇంతకంటే కుర్రకారు మనస్తత్వంమీద రిపోర్టు, మూడు

ముక్కలు మరెవ్వరూ ఇవ్వలేరు. అలానే 'లిమబుకుక్కల్లో' కొన్ని 'చేదు' నిజాలు సాహిత్యపరంగా నవ్వుతూ చెప్పేశారు :

"లక్ష్మీనరసింహారావు పానుగంటి
సాక్షి వ్యాసాలు చదవడం మాననంటి
ఎంచేతంటే వాటిలో పేనులాంటి
భావాని కాయన ఏనుగంటి."
రూపాన్నియ్యడం నేనుగంటి ॥

చమత్కారానికీ, హాస్యానికీ అవకాశం కల్పించటంలో సత్యం ఎక్కడా దెబ్బతినలేదు. ఈ మూడు యాభయిల్లో. శ్రీ శ్రీ చిత్తశుద్ధి అన్నింటికంటే మెచ్చుకోదగింది. (ఆంధ్రపత్రిక 19-7-64)

# ఆనంద భిక్షువు

— వాసిలి వేంకట లక్ష్మీనరసింహారావు

ఈ పద్యకావ్యంలోని కథకు మూలం రవీంద్రుడు వ్రాసిన 'చండాలిక' నాటిక. ఆవేదన, ఆనందము, ఆకాంక్ష, అనుతాపము, అనునయము, ఆకర్షణము, ఆదేశము అను శీర్షికలక్రింద ఏడ్వాశ్వాసాలుగా కావ్యం విభజింపబడింది.

చండాలకన్య 'ప్రకృతి' బౌద్ధ భిక్షువు 'ఆనందుని' సర్వమానవ సమతా సిద్ధాంతాన్ని ఆలకించి అతనికి అమాయకంగా హృదయం అర్పిస్తుంది. ఆమె తల్లి మాంత్రికురాలు. కొమార్తె కోరిక నెరవేరడం అసంభవమని తెలిసికూడా మమకారంవల్లా, అహంకారంవల్లా, మంత్రప్రయోగంచేసి ఆనందుణ్ని ఆకర్షిస్తుంది. పర్యవసానం విఫలమైన మంత్ర

శక్తి మాంత్రికురాలి ప్రాణాల్ని హరిస్తుంది. ఇందులో ఆత్మశక్తికీ, మంత్రశక్తికీ జరిగే యుద్ధం స్థూలంలా కనిపించే వస్తువు. ఈ కాలంలో మంత్రాలలో విశ్వాసం లేనివాళ్ళకు మంత్రాలకు శక్తిఉన్నదని నిరూపించటంకానీ, ఆశక్తికంటే ఆత్మశక్తి అధికమైనదని ప్రబోధించటంకానీ ఈ కావ్యంయొక్క ముఖ్యప్రయోజనంగా 'కావ్యతత్వాన్ని'గూర్చి వ్యాఖ్యానించటం సంకుచితమైన దృష్టి, ఛాందసమైన దృష్టి అవుతుంది. ఇక్కడ కావ్యప్రయోజనం అది కాదని మనవి.

'ప్రకృతి' ముగ్ధబాలిక. 'వాం'ఛకూ, 'ప్రేమ'కూ భేదం తెలీని మనస్థితి ఆమెది. ఇక్కడ సమస్య 'ప్రేమ'ను 'వాంఛ'తో సాధించటం వీలౌతుందా? కాదా? అని.... దానికి 'కాదు - అవును' అని జవాబు. ఈ వింతజవాబులోనే జీవితంలో మౌలికమైన ఒక సమస్యకు గంభీరమైన వ్యాఖ్యానం ఉన్నది. 'ప్రకృతి' తల్లి మంత్రశక్తితో ఆనందుణ్ని బలవంతంగా ఆకర్షిస్తుంది. ఫలితం - ఆనందుని దేహం "ప్రణయశూన్యమ్ము, శవసన్నిభమ్మునైన వికారపు తనువు" చెంగటవచ్చి పడుతుంది. వెంటనే ప్రకృతి "చాలు చాలమ్మ నీ మంత్రజాలమింక" అంటూ ఫలితాన్ని నిరాకరిస్తుంది. అలా నిరాకరించగానే ప్రకృతి తల్లి మరణిస్తుంది. ఇది కీలకమైన సంఘటన. అప్పటి ఆ బాలిక మనస్థితి నిర్వికారము, నిర్లిప్తము.

ప్రకృతి హృది నొక్క ప్రబల విరక్తభావ
కీల యుదయించె చిత్తవైకృతమడంగ
నసువులెడలిన యమ్మకై యార్తిగనదు
చెదరిపడిన సంయమిగూర్చి చింత పడదు
"కనులు వీనులు ఘ్రాణమ్ము తనువు జిహ్వ
అన్నియుండియు లేనట్టులయ్యె ప్రకృతి;
ఇంద్రియస్థితి సందిగ్ధమైన యపుడు
ఇంద్రియ వికారమను మాట యేల తడప?"

"నిస్తరంగకమైన మున్నీరు, స్పంద
శూన్యమైన హ్రదమ్మును శుద్ధమైన
స్ఫటిక ఖండమ్ము నా నొప్పు ప్రకృతి వెలిగె
కదగు నిర్వాతమగు దీపకళికవోలె"

ఈ మూడు పద్యాల్లో కవి కావ్యానికి మౌలికమైన ప్రయోజనాన్ని స్పృశించినట్లు తోస్తోంది. 'వాంఛకు' పర్యవసానం హృదయాఘతమైన దుఃఖం. ఆ అనుభూతిలోనే ఉదయిస్తుంది. నిర్లిప్తతా. ఇంద్రియవికారం దగ్ధం కావటంతో దానికి అతీతమైన జ్ఞానమూ – "విరిసె నెల్లెడ దొలిసంజ వెలుగు వెల్లి" ఆ జ్ఞానోదయంతో 'ప్రకృతి'లో 'ప్రేమ తత్త్వము' భాసిస్తుంది. ఇక్కడ 'ప్రకృతి' బాలికేకాదు, సర్వమానవ ప్రవృత్తికూడా !.... కావ్యం ఆనందుని ఆత్మశక్తిని కాదు నిరూపిస్తూ ఉంటటం, 'ప్రకృతి' తన ముగ్ధవాంఛద్వారా పొందిన ప్రేమ సాక్షాత్కారాన్నే ! ...ఇందులో విషాదం ఉంది. ఉందనీ, ఉండకతప్పదనీ వ్యాఖ్యానించటమే కావ్యం. ప్రయోజనం !...." జన్మచే నామెనంతా సాయిని యని లోకులాడిన నాడిరిగాక ! నేడు సకలబంధ విముక్త సత్ప్రకృతియైన ఆమె యంతావసాయిని యగుట యెట్లు ?" అని కవి వ్యాఖ్యానము.

ఆనందునికీ, ప్రకృతికీ మధ్య భాసించిన ప్రేమ "క్రొత్త ప్రణయ ధర్మము" "నెయ్యము", ఆ 'ధర్మము' అని వాడటంలో చక్కని స్వారస్యం ఉంది. ఈ నూతన ధర్మదృష్టి మహాకరుణ; ఈ దృష్టికి కామార్తికోసం ఆనందుణ్ని హత్య చెయ్యటానికి పూనుకొని, అసువులు బాసిన మాంత్రికురాలుకూడా కరుణింపదగ్గదే, క్షమింపదగ్గదే ! ఏమంటే ఆ మాంత్రికురాలి 'వాత్సల్యం' ఆ ధర్మంలో భాగమే ! అందుకే ఆమె "ఎమ్మెల ప్రోవుపైన నొరగి కంట దడివెట్టు నాదూడ కానిపించె" ఆవు దూడను (వత్సము) మొదటినుంచీ 'ప్రకృతి, ముగ్ధాత్వానికి ప్రతీకగా

చూపిన కవి, ఇప్పుడు ఇక్కడ దాన్ని ప్రవేశపెట్టడంలో ఎంతో ఔచిత్యం సాధించాడు.... ఇటువంటి ఔచిత్య ప్రదర్శనలో ఈ కవి సిద్ధహస్తుడు. కావ్యంలో ఏ పట్టున చూచినా ధ్వనికీ, ఔచిత్యానికీ చక్కని పోషణ కనిపిస్తోంది.

ప్రతిభా వ్యుత్పత్తులు రెండూ సమపాళంగా మేళనంచెంది రూపొందిన ఈ కావ్యం ఉత్తమకావ్యమనటంలో సందేహంలేదు. ఒకవిధంగా అల్లసాని వాని 'అల్లిక జిగిబిగి' 'మనుచరిత్ర' కావ్యంలోని తత్వనిరూపణమూ, మళ్ళీ ఈ కావ్యంలో సాక్షాత్కరించాయని చెప్పాలి.

# అగ్నిధార

— దాశరథి

శ్రీ దాశరథి కృష్ణమాచార్య కవిగా తెలుగులోకంలో పరిచితుడు కావటానికి ప్రాతిపదిక ఈ పుస్తకమే. ఇది చక్కని రెండవముద్రణ ఇందలి ఖండికల్లో కొన్ని అందరికీ బాగా తెలిసినవే; "నా తెలంగాణా, కోటి రత్నాలవీణ" అంటూ ఎలుగెత్తి చాటిన దాశరథి దేశభక్తీ, విప్లవ వాక్కూ, ఉద్వేగ ప్రవృత్తీ స్వచ్ఛంగా, స్వచ్ఛందంగా ఈ రచనల్లో అంకితమై ఉన్నాయి. "పురాస్మృతులు" అంటూ కడచిన 14 సంవత్సరాల సాహిత్యజీవితాన్ని పర్యాలోకిస్తూ దాశరథి వ్రాసిన పీఠిక ముచ్చటగా ఉంది. దాశరథి గళంనుంచీ కాదు. కలంనుంచీ, ఖండికలు కాదు - కావ్యాలు, తర్జుమాలు కాదు - తన సొంతం, ఇంకా రావలసి ఉన్నాయి;

# నవత

— పత్రిక

అభ్యుదయ కవితకూ, ఆధునిక ప్రక్రియలకూ అంకితంచేస్తూ 'నక్షత్రసప్తకం' అనే పేరుతో సంపాదకమండలిగా ఏర్పడి శ్రీశ్రీ అజంతా, ఆరుద్ర, గోపాలచక్రవర్తి, కుందుర్తి, కేశవరావ్, బోయి భీమన్నగారలు ప్రచురింపబూనుకొన్న త్రైమాసపత్రిక ప్రథమ సంచిక యిది. కొత్తదనం ఉట్టిపడే ముఖపత్రంతో మామూలు పుస్తకం సైజులో గట్టి అట్టతో ఆకర్షణీయంగా ఉన్నది. ఇందులో శ్రీశ్రీ "నా తొలి రచన" ఆరుద్ర "అంత్యప్రాస చరిత్ర" అనే రెండు చిన్నవ్యాసాలు మినహాయిస్తే మిగిలిందంతా ముక్త ఛందస్సులో వ్రాయబడిన ఆధునిక కవిత్వం.

"భావకవిత్వాన్ని, అభ్యుదయ చిత్రకళతో సమన్వయపరచి వాటికి ఒక క్రొంగొత్త వన్నె కల్పించడానికి చేసిన తొలి ప్రయత్నమే ఈ "నవత" అని చెప్పుకున్నారు సంపాదకవర్గం. ప్రాత క్రొత్తల కలయికతో సంకీర్ణమైన విలువల్నీ, సమకాలీన నాగరక జీవనవిధానంలో సందిగ్ధాలనూ, క్రమంగా ఏర్పడుతున్న నూతన దృక్పథాన్నీ ప్రతిబింబిస్తున్న ఈ రచనల్లో బాలగంగాధర్ తిలక్ "పీడలు", వరవరరావు "హిమ యవనిక" ఎన్నదగినవిగా ఉన్నాయి. మిగతా రచనల్లో జీవితాన్నిగూర్చి ఏదో ఒక అభిప్రాయం వెలిబుచ్చితీరాలనే పట్టుదల, తాపత్రయం ఒకే ధోరణిలో సాగి వైవిధ్యం లోపించినట్లుగా అనిపిస్తోంది. "ఇది జీవితం, ఇది పతనం" ఇది రెండువైపులా వెలుగుతున్న కొవ్వొత్తికథ" (గోపాల చక్రవర్తి).... "సంఘటనల అతుకులబొంతే జీవితం అయి ఊరుకున్నప్పుడు ప్రతి క్షణం కేవలం సమయం గడిచిపోవటానికి ఒక సంకేతం !" (మురళీధర్) ... "గెలుస్తూ చచ్చినవాడికంటె ఓడిపోయి బతికినవాడు ఘనుడు, అన్నిటికన్న బతకటం ముఖ్యం" (అరిపిరాల విశ్వం).... "ఇది సామాన్యుడి జీవితం ....

స్వప్న జాగ్రదావస్థల గండ సంధి" (కైవల్య)....ఇలా జీవితాన్నిగూర్చి తక్షణం ఒక నిర్ణయానికి వచ్చి, అనుభూతిని పుక్కిలించి ఉమ్మెయ్యాలనే ధోరణి మారితే బాగుంటుందేమో! ( భారతి )

# దిగంబరకవులు

ఇందులో ఆరుగురు కవుల రచనలున్నాయి. నగ్నముని, నిఖిలేశ్వర్, జ్వాలాముఖి, చెరబండరాజు, భైరవయ్య, మహాస్వప్న అనేవి ఈ ఆరుగురూ పెట్టుకున్న ముసుగుపేర్లు. మరి 'దిగంబర కవుల'కీ ముసుగు పేర్లు ఎందుకు కావలసివచ్చాయో! "మేం ఆరుగురం. మాలోని నిజరూపాల్ని దర్శిస్తూ మా చుట్టూవున్న మనుషులందర్నీ ప్రేమిస్తూ వాళ్ళని కూడా ఆ ప్రయత్నం చెయ్యమంటున్నాం. అందుకే మేం దిగంబరకవులం. మంచికోసం, మనిషిలోని నిప్పులాంటి నిజమైన మనిషికోసం, కపటంలేని చిరునవ్వులు చిందే సమాజంకోసం, అహోరాత్రులు ఆరని అగ్నిలో నడిచిన ఆత్మలలో నుంచి పలుకుతున్న గొంతుకులం" అని ఆ ముఖంలో చెప్పుకున్నారు. కవిత్వంద్వారా వీళ్ళు ప్రబోధించదలచుకున్నది - "దేన్నీ నమ్మకు. నీలోపల, ఈ ముసుగులోపల, ఈ వంచన అంచులకిందవున్న నీ అసలుస్వరూపాన్ని, నీ 'తనాన్ని' నమ్ముకో. ఈ నాలుగు నిముషాలూ హాయిగా బతుకు. అది తెలుసుకున్నప్పుడు యింతకాలం ఈ ముసుగు నిన్ను ఎంత వ్యర్థుడిగా చేసిందో తెలుస్తుంది".... పోతే, కవితాప్రక్రియ గురించి - "వర్స్ లిబర్, బ్లాంక్ వర్స్, ప్రోజ్ పొయిట్రీ, ఫ్రీవర్స్ అన్నారు ఆంగ్లసాహిత్యంలో...." (వీళ్ళకు వర్స్ లిబర్, బ్లాంక్ వర్స్

ఒకటి కాదని తెలీదు :....) "స్వరూపాన్నిబట్టి, స్వభావాన్నిబట్టి మేం వ్రాస్తున్న దానిని 'వచన కవిత' అని మేం అనదలచుకోలేదు. అననివ్వ దలచుకోలేదు.... మాది దిగంబర కవిత. ఇది సాహిత్యంలో దిగంబర కవితోద్యమం...." అన్నారు.

కొత్తపేరుతో 'ఉద్యమం' అంటూ బయలుదేరిన ఈ యువకవుల రచనల్లో క్రొత్తదనం ఏమిటో పరిశీలిద్దాం. ప్రక్రియ 'వచన కవిత' అన టానికి వీళ్ళు అంగీకరించకపోయినా, యదార్థం అంతే: దృక్పథం మాన వతావాదం, అస్తిత్వవాదం, అభ్యుదయకవుల మార్క్సిస్ట్ శృంఖలాల్ని వదలించుకుని బయటపడటమే వీళ్ళ ఉద్యమంలో క్రొత్తదనం అనుకో వాలి; అలా చూచినా అభ్యుదయ కవిత్వంనుంచీ అంటుత్రొక్కబడి ప్రత్యేక మైన మనుగడని ఆశిస్తున్న 'కొమ్మ' లేక రెమ్మగానే తప్ప ఇదేదో భిన్న మైన జాతిమొక్కగా తోచటంలేదు: కారణం అభ్యుదయ కవిత్వంతో సంబంధం ఇంకా పూర్తిగా త్రెంచుకోలేని అశక్తత ఈ రచనల్లో స్పష్ట మవుతూ ఉండటమే:

ప్రత్యేకతనూ, వ్యక్తిత్వాన్నీ చాటుకోవాలనే తాపత్రయంతో కొన్ని తమాషాలు చేశారు ఈ ఉత్సాహవంతులు. శ్రీ నాంపల్లి పాండు అనే ఒక 'రిక్షావాలా' చేత 1965 మే 6 వ తేదీ రాత్రి 12 గంటలకి ఈ గ్రంథావి ష్కరణ చేయించారట: వీళ్ళ క్రొత్త కవిత్వంతో దిగంబరశకం ప్రారంభ మైనట్లూ, కాలమానంకూడా పునర్వ్యవస్థీకరింపబడ్డట్లూ ప్రకటించారు. ఆరుగురి కవులపేర్లూ ఆరు సంవత్సరాల పేర్లట. ఆశ, తపన, అగ్ని, మదిర, విరహ, విషాద ఋతువుల పేర్లట. స్నేహ, విశృంఖల, క్రాంతి, సృజన, వికాస, అనంత అనేవి వారాల పేర్లట. వేషంలో, జుత్తు పెంచ టంలో, హావభావాల్లో ఏవైనా ప్రత్యేకతలు చూపిస్తున్నారో లేదో తెలియ రావటంలేదు. అలా చేస్తే వీళ్ళని పాశ్చాత్యదేశాల్లోని Beatniks తో పోల్చవచ్చు. బహుశా ఈ ఉద్యమం ఆ ఉద్యమానికి అనుకరణా కావచ్చు:

'నన్నయ్యను నరేంద్రుడి బొందలోనే నిద్రపోనియ్యి ...ప్రబంధాంగనల తొడలు తాడిమొద్దులు.... భావకవుల నపుంసక హావభావాలకు నవాలు........ అభ్యుదయకవీ నల్లమందు తిని నిద్రపోయావ్! .... అంటూ తెలుగులోని పురాణ, ప్రబంధ, అభ్యుదయ కవిత్వాల సంప్రదాయం నుంచీ విముక్తి నాశిస్తూ ప్రారంభ రచన "ఆత్మయోని" సాగింది. "నయాగరా జలపాతంలో దూకలేకపోయిన అన్నయ్యా గుడ్‌బై!" అనటం శ్రీశ్రీకి వీడ్కోలు నమస్కారమే అయినా, "చప్పబడిన చపాతీ బ్రతుకు..... .... సమస్తం కాలనీ!.....చావు!" అనటం "ఎముకలు కుళ్ళిన వయస్సు మళ్ళిన సోమరులారా చావండి" అనే శ్రీశ్రీ ప్రస్థాన వాక్యాన్నే ప్రతిధ్వనించింది! కాని ఇక్కడ పుట్టుకొచ్చింది మరో ప్రపంచంకాదు. "మరొకడు - మరొకడు, నిండుగా నిజంగా వూపిరి పీల్చేవాడు ఆత్మయోనినుండి పుట్టుకొస్తున్నాడు." అదీ భేదం! వీళ్ళు దర్శించేది వ్యక్తిని, వ్యక్తిలోని మానవత్వాన్ని; అభ్యుదయ కవులు దర్శించింది ఒక వర్గాన్ని, వర్గసమాహితమైన మానవత్వాన్ని, అభ్యుదయకవులు ఆత్మవిమర్శను ధ్యేయంగా పెట్టుకోలేదు. ఈ దిగంబర కవులకు ప్రధానమైన ధ్యేయం అదే: "మీరు మొహమాటంతో కట్టుకున్న బట్టలిప్పి ఒంటరిగానైనా నగ్నంగా నిలబడి మీలోకి చూసుకోవాలి, ఎరువు తెచ్చుకున్న మెదడుతో మటుకు చూడకండి!" అంటారు.

వర్గద్వేషానికీ, వర్గకలహానికీ వీళ్ళు వ్యతిరేకులు. ధనికవర్గం వారిని చూచి జాలిపడతారు: "అయినా ఎందుకు ద్వేషం? నిజాన్ని చెప్పలేక నిర్మలంగా బతకలేక, ముసుగుని ముఖంనిండా కప్పుకున్న, బురదని భాష నిండా పులుముకున్న, నిన్ను చూస్తే నాకెందుకు ద్వేషం?.... నీ ఒంటి నిండా వలుకుబడి రసి కారుతున్నా నిన్ను ప్రేమిస్తాను, నిన్ను మంచితనంతో భయపెడతాను ... ఆత్మ ముందు నిలబడి నిన్ను నువ్వు చూసుకో.... చెప్పడానికి నువ్వెవరని గొంతు నొక్కడానికి ప్రయత్నించకు, మనిద్దరి

మధ్య బలమైన బంధం, ముందు మనం మనుషులం ...." అంటాడు 'నగ్నముని' ధనికవర్గానికి చెందిన వ్యక్తితో, 'సుఖరోగి' అనే రచనలో.

ఈ సంపుటిలో కవితాధ్యేయాన్ని వాచ్యంగా ఎలుగెత్తిచాటే రచనలే ఎక్కువగా వున్నా, శిల్పందృష్ట్యా కళాత్మకంగా ధ్యేయాన్ని అందుకున్న లేక అందుకునే ప్రయత్నం చేసిన రచనలు ఒకటి రెండు ఉండటం ముదావహం. నగ్నముని వ్రాసిన 'దిగంబరనృత్యం', జైల్లో సముద్రం', భైరవయ్య వ్రాసిన 'హూరే - హూరే' అటువంటివి.

'దిగంబర నృత్యం'లో కవిలోకాన్ని 'ఆకలి' ద్వారా దర్శిస్తాడు. ఇందులో చమత్కారం 'ఆకలి'ని ప్రేయసిని చేయటం -

"దొర్లి దొర్లి
ఊరువుల కొండచరియల్లోకి దొర్లి
నా నీగ్రో చెలి
ఇనప కౌగిలిలో సొమ్మసిలి ...."

అని ప్రారంభమైన ఈ రచన ముగింపు చక్కగా ఉన్నది :-

"....నిజాల వెనుక నా వూపిరి గట్టుపై నిలబడి పగలబడి నవ్వుతున్నది.

ఆకలి నా నీగ్రో చెలి."

'ఆకలిని' ప్రేయసిగా చేసి, ఆ 'ప్రేమ' ద్వారా లోకాన్ని దర్శించటమే కాదు; ఆ ప్రేయసి 'నీగ్రో చెలి' అవటంతో రచనకు మరింత అర్థస్ఫూర్తి కలిగింది.

'జైల్లో సముద్రం' ఒక నాగరకుని ఏకాంతం. "ఏది అర్థం? ఏది అద్దం పరమార్థం?" అని ప్రశ్నించుకుంటాడు, తన్ను తాను 'నగ్నంగా' దర్శించుకున్న తర్వాత. ఈ ఖండిక -

"సూర్యుని కడ్డంగా నుంచున్న
ఆ మబ్బుతునక పేరేమిటి"   అంటూ ప్రారంభమౌతుంది.
"ఎందుకో ఒక్కసారి ఏకాంతంలోకి
నిర్జరారణ్యాలు నడిచివస్తాయి
నిబిడాంధకార గహ్వరాలు తెరుచుకుంటాయి —
నా వేళ్ళ చివర
అ_స్తమయంలా వెలిగే గులాబీలా,
భయవిహ్వలతలా, అదుముకున్న
సిగరెట్టు చివర
ఏరి స్నేహితులు హితులు పార్టీలు పందిళ్ళు
...... ...... ...... ...... ...... ......"
జ్ఞాపకాల వాలు కుర్చీలో
కుక్క నోటిలో బొమికముక్కలాగు
చలిగాలి రాత్రి పళ్ళలో ఇరుక్కుంటాను
...... ...... ...... ...... ...... ......
రూపాయినోట్లో తలదూర్చి తన్నుకుంటున్న లోకంలా
సీసాలో బంధించుకుంటున్న ఆధునిక మానవుడి రూపంలా
ఎప్పటికీ  నాకర్థం కానిది  యీ అద్దం
...... ...... ...... ...... ...... ......
కేక పెగలనిచోట కోరికలాంటి శిశువు జన్మించి
ర_క్తమాంసాల నదిలో వూయల లూగుతుంది
...... ...... ...... ...... ...... ......
ర_క్తమాంసాల నదిలో కోరికలాంటి శిశుగర్భంలో
అణువు కోరదగింది
...... ...... ...... ...... ...... ......

ఏది అర్థం?
ఏది అద్దం? పరమార్థం?
మానవత అసలు రూపు మాసిపోకుండా చూపే భవితవ్యం?

.... .... .... .... .... ....

నీకూ నాకూ నడుమ
నాకూ ఈ నటనకీ నడుమ
ప్రపంచ దేశాల ప్రళయ పరాచికాల నడుమ
సత్యానికీ సత్యానికీ నడుమ నిలుచున్న
ఆ మబ్బుతునుక పేరేమిటి?"

అని ముగుస్తుంది. మానవుని మనస్తత్వాన్నీ మానవజాతి సమస్యల్నీ స్పృశించిన ఈ రచన మంచిప్రయత్నం. భైరవయ్య వ్రాసిన "హూరే - హూరే" మతవ్యవస్థయొక్క నగ్నస్వరూపాన్ని బట్టబయలు చేసే చక్కని గేయం.

'విష నాల్కలు', 'నైరాశ్య వూపిరి', 'జీవమొక్క' (బ్రదుకు అనే మొక్క) 'ప్రళయ పరాచికాలు వంటివి వీరు పరిహరిస్తే బాగుంటుంది. ఛందస్సునుంచీ విముక్తి లభించటంవల్లా, ఇతరత్రా భాషలో స్వేచ్ఛ చూపుతూనే ఉండటంవల్లా పైపద బంధాల విషయంలో శిష్టంగా నియమంతో వ్యవహరిస్తేనే అందం చందం!

'ఇటువంటి సంపుటాలు వరుసగా వెలువడుతాయి' అన్నారు. ఈ సంపుటిలో ప్రథమోత్సాహమే ఎక్కువగా కనిపిస్తోంది ప్రతిభకంటె. వచ్చే సంపుటాల్లో ఈ కవులు తమ ప్రతిభ నిరూపించుకునే ప్రయత్నం చేస్తారని ఆశిద్దాం. ( భారతి ) ❁

# ఋతచేతన

ఇందులో ఇరవై ఏడు ఖండికలున్నాయి. నలుగురు రచయితల పేళ్ళు పుస్తకంమీద ముద్రించారు. గాని ఏ ఖండిక ఎవరు వ్రాశారో తెలియజెయ్యలేదు. రచనలతీరుగాని, స్థాయిగాని ఒకరకంగాలేదు. అందువల్ల ప్రతిరచనా ఉమ్మడి ప్రయత్నం అనడానికి వీలులేదు. "ఎవరి నమ్మకాలు వాళ్ళకుంటాయి అనే నమ్మకంతో తోచినదాన్ని సిన్సియర్‌గా వ్రాయడమే" లక్ష్యమైనట్లు 'ముందుమాట'లో రచయితలే చెప్పుకున్నారు. ఖండికలన్నీ 1970 కి పూర్వమో, ఆ ఏడాదిలోనో వ్రాయబడినవి. అందువల్ల, రాజకీయ పరిస్థితులు మారడంతో కొన్ని రచనలు కాలదోషంపట్టి అప్రస్తుతంగా కనిపిస్తాయి.

ఈ సంకలనానికి 'ఋతచేతన' అనే శీర్షిక ఎందుకు పెట్టారో తెలియదు. ఇందులో తాత్వికదృష్టికాని, మనస్తాత్వికదృష్టికాని ఏమీలేదు. బహుశా 'చేతనావర్తం' కవుల సంకలనాన్ని చూచి అలాంటిపేరే పెడితే బాగుంటుందనుకున్నారో ఏమో ! ఇందులో మొదటి ఖండిక 'ఋతచేతన'లో ఒక చేతగానితనంతప్ప మరేమీ కనిపించడంలేదు. మనిషి "ఏమో" పోగొట్టుకొన్నాడు. అది "వస్తువు" కాదట. అది తన్ను వీడిపోలేదు. తనే దాన్ని మరచిపోయాడట. అయితే దానికోసం నిరంతరాన్వేషణ మాత్రం – "అనంతంగా విస్తరించిన ఆకాశం అంచుల చివరల్లో" (అనంతానికి అంచులూ, చివర్లూ ఏమిటో) "దిక్కుల అంచుల్లో, ఎన్‌జీవో ఖాళీ పర్సులో, నాచులా పెరిగిన ధనవంతుడి మైకంలో, సరిగమలు లేని సంగీతంలో, అనేకచోట్ల" – అన్వేషణ జరుగుతూందట ! అయితే, ఎక్కడ జరగాలో చెప్పలేదు. ఈ ఖండికల్లో రాజకీయకవిత్వమూ ఉన్నది; తిట్టు కవిత్వమూ ఉన్నది; ఆక్రందన కవిత్వమూ ఉన్నది. 'చైతన్యపంచాననం' వంటి ఖండికల్లో శ్రీశ్రీని అనుకరించే ప్రయత్నం, 'స్వేచ్ఛ' వంటి ఖండి

కల్లో కృష్ణశాస్త్రి ఛాయలూ, కొన్నిటిలో దిగంబరకవుల ప్రభావమూ, మరి కొన్నిటిలో తిలక్, ఆరుద్ర, దాశరథి, నారాయణరెడ్డి కవుల ప్రభావమూ కనిపిస్తుంది. సిన్సియర్‌గా వ్రాయడమంటే ఏమిటో ఈ కవులు పునరాలోచించుకోవలసిన అవసరం కనిపిస్తుంది. 'దేవతార్చన', 'మెరు....' అనే ఖండికల్లో వట్టి వాగుడుతప్పితే మరే గుణమూ లేదు. 'చూడలేను ప్రభాతాన్ని', 'ప్రగతిశీల సంగీతం', 'ఈ ప్రపంచంలో అడుగిడకు' ఖండికల్లో తిలక్ అనుకరణేఅయినా, మంచి కవిత్వపు ఛాయలున్నాయి. ఆలోచనలో, అభివ్యక్తిలో సాధించవలసినది చాలా ఉన్నది.

(ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక : 7-7-76) ❋

# బాపురెడ్డి గద్యకావ్యాలు

ఛందోబద్ధమైన మధురకవిత్వం వ్రాసి తరవాత వచనకవిత్వంలో ప్రవేశించినవారు బాపురెడ్డి. తనదైన బాణీ ఏర్పరచుకుని నలుగుర్నీ మెప్పించే కవిత్వం వ్రాస్తున్న లబ్ధప్రతిష్ఠులు. ఈ సంకలనంలో ఆయన 1975 వరకు వ్రాసిన వచన కవిత్వ ఖండికలన్నీ ఉన్నాయి. సంకలనం మొదటి ముద్రణ 1970 లో జరిగింది. ఇప్పుడిది విస్తృత ద్వితీయముద్రణ. ఈ గ్రంథం డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారికి అంకితం ఇవ్వబడింది. బోయి భీమన్నగారు 'శ్రుతి' అనే చక్కని పీఠికను వ్రాశారు.

'ఏ వస్తువును స్వీకరించినాసరే, ఆ వస్తుభావనను సౌందర్యీకరించడం కవిత" అన్న భీమన్నగారి నిర్వచనానికి లక్ష్యంగా ఉన్నదీ సంపుటిలోని కవిత. ప్రసాదమాధుర్యగుణాలు ప్రధానంగా కనిపిస్తాయి ఈ రచనలో.

కవి వ్యక్తిత్వంలోని ప్రసన్నత, ఔదార్యము, సౌందర్యాకాంక్ష, రసలోపత సర్వత్ర ప్రతిబింబిస్తున్నాయి. నేడు విరివిగా వస్తున్న కవిత్వాక్రందనలను, ఆక్రోశాలను, ఘోషణలను, వాగుడును, కేకలను, పొలికేకలను, నాదాలను, నినాదాలను విని, చదివి విసుగెత్తిన పాఠకులకు అమృతోపమానంగా ఉన్నదీ కవిత్వం.

ప్రధానంగా వర్ణనాత్మకమైన రచనలే ఇందులో ఉన్నాయి. తన విదేశీ యాత్రలో గ్రీన్, హాలండ్, స్కాండినేవియా, ఇంగ్లండ్, ఫ్రాన్స్, ఆస్ట్రియా, జర్మనీ, చెకొస్లోవేకియా, స్విట్జర్లాండ్, రోమ్ దేశాలనూ, ముఖ్యపట్టణాలనూ, ప్రజలనూ వర్ణించే రచనలు ఉత్తమంగా ఉన్నాయి. ఒక దేశాన్ని, ప్రజలని భావనాత్మకంగా ఒక ప్రతీకతో నేమి లేక నాలుగు గీతలతో చిత్రకారుడు రచించే బొమ్మల్లా అలతిపదాలతో చిత్రీకరించడంలో నేమి బాపురెడ్డి ప్రతిభ ఈ రచనల్లో అద్భుతంగా రాణించింది. పూలబాల-హాలండు, ధర్మవేణి - జర్మనీ, మయూరి - పారిస్, కాలకేశి రంగం - రోమ్ నగరం - ఇటువంటి శీర్షికలలోనే ఆయా దేశ విశిష్టతను హృదయానికి హత్తుకునేలా చేశారు కవి. ఈ కోవకు చెందినదే విశాఖపట్టణాన్ని వర్ణించే రచన 'విశాఖ లేఖ'.

పరిమిత కుటుంబాన్నిగూర్చి వ్రాసిన 'సంతానశాస్త్రం', ప్రమోద ప్రబోధాలు' నిజాయితీ తొణికిసలాడుతున్న చక్కనిరచనలు. 'ఎకనామిక్సు సుందరి' - సుందరిని ఎకనామిక్సు పరిభాషలో వర్ణించే చమత్కార రచన. 'ఉగాది సరసాలు' కవిగారి ఎకనామిక్స్ పరిజ్ఞానం, ఉగాది తీపేదుల కలయిక, నేటి బదుకులోని కష్టసుఖాలు అన్నింటినీ రంగరించిన ఉగాది పచ్చడిలా ఉన్నది. 'అంతరిక్ష పర్వం' చంద్రలోకంమీద మానవుడు అడుగు పెట్టిన ఉదంతాన్నిగూర్చి, 'శాంతిని చెరబట్టే మానవుని శాస్త్ర విజ్ఞానం' సీతను చెరబట్టిన రావణునిలానే అవుతుంది అంటూ మానవతాదృక్పథాన్ని

వ్యక్తంచేశారు. 'నీరవరావాలు', 'ఏకాంతంలో వేదాంతం' కవి అంతర్ముఖుడైన మూడ్స్‌ను తెలుపుతాయి. కాని బాపురెడ్డి మనఃప్రవృత్తికిది సహజంగా కనిపించదు. మానవునిమీదా, జీవితంమీదా బాపురెడ్డికిగల విశ్వాసం, అనురక్తి ఆయనకి ఏకాంతాన్నీ, నిర్వేదాన్నీ దూరం చేస్తున్నాయి. బాపురెడ్డి కవిత్వం మధుమాసంలా మనోజ్ఞంగా ఉన్నది.

( ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక 21-7-76 ) ❋

# చర్య

— కె. శివారెడ్డి

"జనంకోసం స్వజనాన్ని విడుస్తాను, జనమే నా స్వజనం, జనమే నా స్పృహ: ప్రజాజీవనజ్యోతికి ఒక తైలబిందువై రూపరతాను" అంటూ 'జనం కోసం' అనే శీర్షికతో వ్రాసిన పద్యం తొలిపంక్తులలో చెప్పినట్లు ఈ రచయిత కవితాధ్యేయం ఒక గాఢమైన సామాజిక విప్లవాభినివేశంగా ఈ సంపుటిలో వ్యక్తమౌతున్నవి. కవి విశ్వాసం కలంతో విప్లవాన్ని సృష్టించవచ్చునని. "దీపం చూడు: కాంతిని కురుస్తూ ఏరులా పారుతున్న విప్లవాన్ని సృష్టిస్తున్న కలం పాళీలా ...." సారథ్యం - పుట - 60). అందుకే ఇందులోని కవితా ఖండికలన్నీ విప్లవాన్ని ప్రోత్సహించడమే లక్ష్యంగా పెట్టుకున్నవి. సంకలనానికి శీర్షికకూడా 'చర్య'.

విప్లవ 'చర్య' మాటా, కవి విశ్వాసం సంగతీ ఎలాఉన్నా, ఇందులో కవితాచర్య ఎలా రూపొందింది? అనేది పరిశీలించదగిన విషయం. ఈయన ఆధునిక శిల్పమైన పదచిత్రాలనీ, భావచిత్రాలనీ, ప్రతీకలనీ ఆశ్ర

యించాడు. కాని చాలాచోట్ల అవి రూపకాలూ, ఉపమలూగానే కనిపిస్తాయి. ఒక్కొక్క శీర్షికకింద ఏమి చెప్పదలచుకున్నాడో, ఆ వస్తువుకూడా సుగమంగానే ఉంటున్నది. కాని రచనలో అంటే పదగుంభనంలో, వాక్య రచనలో, కూర్పులో, రీతిలో పరిపక్వతా, బిగువూ, పనివాడితనమూ లోపించడం సర్వత్ర కనిపిస్తుంది. ఉదా: "పొయ్యి మండుతూంది, పొయ్యిమంట వెలుగులో ఆ తల్లి పిల్ల ఒళ్ళో, ఆ పక్క కడుతున్న మేడకి, రాళ్ళు మోసే ఆ తల్లి ..." అనడం బదులు "ఒళ్ళో పిల్లతో ఆ తల్లి, పక్కన కడుతున్న మేడకి రాళ్ళు మోసే తల్లి" అని వ్రాస్తే వచ్చే స్ఫూర్తీ, బిగువూ రచయిత గ్రహించవలసిన అవసరం కనిపిస్తుంది. "కళ్ళనిండా దుమ్ము చిమ్మితే రెప్పలు చప్పరించి" అంటాడు "అప్పళించి" అనేందుకు. "నదులు కొండల్లోని నిర్భీతితో, అగ్నిలా పునీత మౌదా మంటే" (కొండల్లోని నదుల నిర్భీతిలో, అగ్ని లోలా పునీతమౌదామంటే) "అగ్ని వర్షించి ఉదయాన్ని పుట్టిస్తారు" (ఉదయమంటేనే పుట్టడం. 'పుట్టించు' బదులు మరేదైనా ఉండాలనిపిస్తుంది.) "ప్రతి పేదరక్తపు బొట్టూ" (ప్రతి పేదవాని రక్తపు బొట్టూ). "అతి గారాబంగా సుఖాలమధ్య పెరిగిన అందమైన ఆడదాని తెల్లనిముఖంలాంటి గచ్చుమీద ఊశాను" అంటూ షాకింగ్‌గా ప్రారంభమౌతుంది ఓ పద్యం. భావయుక్తమైన పద్యమే. కాని ఆ వాక్యంలో 'తెల్లని' అనకుండా 'అందమైన ఆడదాని ముఖంలాంటి గచ్చు' అంటే వచ్చే బిగువు రహస్యం రచయిత గ్రహించకపోతే, కవితా రహస్యమే గ్రహించనట్లు. పోతే విభక్తి ప్రత్యయాలు చాలా చోట్ల వ్యత్యస్తమైపోయాయి. "శిథిలతనుంచి, స్తబ్ధతనుంచి ....చచ్చిపోయిన నేను నీలో బతికాను, సూర్యుడూ" (శిథిలతలో, స్తబ్ధతతో చచ్చిపోయిన నేను) "చెట్టు ఆకాశంలో ఉదయిస్తుంది" (చెట్టు ఆకాశంలోకి ఉదయిస్తుంది, ఈయన కవిత్వంలో కొన్ని చక్కని మెరుపులూ ఉన్నాయి. ఉదా: "ఒక జాతి బతుకు అడుగంటటానికి కారణం సెగ ఎక్కువయికాదు, అసలు సెగ

లేకనే". "అప్పటిదాకా అక్కడక్కడ తిరిగొచ్చిన చంటాడిలా సాయంత్రం చల్లగాలి, చెట్టు మెడని వాచేసి ఊపుతుంది." తెలుగుభాష మెలకువలు తెలిసి వ్రాస్తే ఈయన కవితాభివ్యక్తి మరింత రాణిస్తుంది.

(ఆంధ్రప్రభ సచిత్రవారపత్రిక 10-11-78)

# అంతర్నేత్రం

— ఎస్. ఎ. రవూఫ్

యువకులు ఈ మధ్య వ్రాస్తున్న కవితల్లో నిస్పృహను, నైరాశ్యాన్ని వ్యక్తం చేస్తున్నారు. లోకంమీద, వ్యవస్థమీద విరుచుకుపడే ఉధృతం కాస్త తగ్గి, నైరాశ్యంలో పడిపోయే సూచనలు కనిపిస్తున్నాయి. ఆ నైరాశ్యంలో అస్తిత్వపు లోతుల్ని తరచి, లోకంపట్ల, జీవితంపట్ల ఆసక్తిని పునస్సృష్టించుకునే శక్తిని కూడా కొంతమంది ప్రదర్శిస్తున్నారు. వర్ధమానకవి రవూఫ్ ఆ కొద్దిమందిలో ఎన్నదగిన కవి. "వెతుక్కునే అర్థాల చెదలపుట్ట జీవితం." మేధాగతమైన అవగాహనకోసం జీవితాన్ని ఇజాలద్వారా అన్వేషించడంలో వైఫల్యాన్ని గ్రహించిన రవూఫ్ "అంతర్నేత్రాన్ని" ఆశ్రయించి, అస్తిత్వంలో అనుభూతిలో ఆనందాన్ని పొందగలుగుతున్నాడు. ఆ ఆనందంద్వారా జీవితంపట్ల దృక్పథాన్ని, మానవుల పట్ల, సమాజంపట్ల ప్రేమనూ కారుణ్యాన్ని చూపగలుగుతున్నాడు. ప్రేమ కారుణ్యం, మేధాగత ఆదర్శాలద్వారా పుట్టుకురావు; హృదయపు లోతుల్నుంచి వస్తాయి. ఈ విషయాన్ని నిరూపిస్తున్న రవూఫ్ కవితలు ఎంతో ఆమోదయోగ్యంగా వున్నాయి. ఈయన కవిత్వం పదచిత్రాలని, బింబాలని

ఆశ్రయిస్తుంది. అభిప్రాయాల్ని వెలువరించదు. బింబాలనీ, దృశ్యాలనీ హృదయస్పందనతో చిత్రించడంద్వారా పాఠకుల్లో అనుభూతినీ, ఆలోచననీ రేకెత్తింపజేస్తుంది. ఇది మంచిదారి. "పొడవాటి మెడని రిక్కించి పత్రాల్ని కిరీటంగా తలదాల్చిన తాటిచెట్టు.... మేఘాల్తో మాట్లాడుతూ, ఆకాశంలోకి నిక్కిచూస్తూ - వెలార్చిన మొహంలోంచి ఉట్టిపడే చింపిరి జీవితపు విషాదాన్ని - కళ్ళనుంచి పారే కల్లునీళ్ళనే కన్నీళ్ళని మెడకి చుట్టు కొన్న చీకటి కుండలో నింపుకుంటూ, ఆకస్మికంగా నలువేపులకి తలూపుతో ఉద్విగ్నమై నిలిచింది" (తాటిచెట్టు). ఈ తాటిచెట్టు చిత్రణలో మానవజీవితదర్శనం మూర్తీకట్టింది. అలాగే "కొబ్బరిచెట్టు"ని "శోక సంతప్తుడిలా ఆకాశం ఏడ్చిఏడ్చి గుక్కపట్టి విషాదాన్ని గుమ్మరిస్తూంటే.... వాననీళ్ళతో ఆడుకొంటున్న చిన్ని పిల్లల్తో అమాయికంగా నవ్వుతో తనూ అటూయిటూ ఊగుతోంది" అని చిత్రించాడు. నిస్పృహనూ విషాదాన్నీ కలిగించే జీవితంలో అంతర్గతంగా, సద్యఃస్ఫురణగా, ఆనందం వున్నదనే విశ్వాసాన్ని వ్యక్తం చేస్తున్నాడు. 'పరిత' అనే ఖండికలో పాతపేపర్లని కొంటాం అంటూ అరుస్తూ వీధులు తిరిగే కుర్రాడ్ని "కవిత్వంతో జీవితాన్ని నిర్వచించి నిగ్గదీసి నిజాల్ని గొంతు చించుకు చెప్పిన కవులకోసం" కేకవేసి రమ్మని, అడగలేక వాడి కళ్ళల్లోకి చూచి, "కష్టం మరచి, దారులు వెతికే పిడికళ్ళ మెరుపే కవిత్వం" అని నిర్ణయానికి వస్తాడు. "శ్రమ విలువని పరిస్తున్నాను" అని పద్యం ముగిస్తాడు. ఇక్కడ శ్రమవిలువ రాజకీయాలకోసంకాదు. జీవిత పరమార్థాన్ని అనుభూతికి తెచ్చుకోవడం కోసం. ప్రాచీనకాలంలో గ్రీకుల మహాకావ్యాలను గూర్చి చెబుతూ ఒక చోట మార్క్స్ అంటాడు : "ప్రాచీనయుగంలో ఉత్పత్తి ధ్యేయం మానవుడు. బూర్జువా యుగంలో మానవుని ధ్యేయం ఉత్పత్తి" మనిషి వస్తూత్పత్తికి అమ్ముడుపోవడంద్వారా అతని సృజనశక్తులు అలా వినియోగమై, మనిషి మూర్తిని పునస్సృష్టించలేకపోవడమే ఆధునిక జీవనంలో నిస్పృ

హాకు కారణమన్నాడు. అనుభూతిద్వారా అంతరంగ మథనంద్వారా, కవిత్వం మనిషి మూర్తిని పునస్సృష్టించి, జీవితంపై కొత్తవెలుగును ప్రసాదించగలదు అవడానికి పైనుదహరించిన "తాటిచెట్టు", "కొబ్బరి చెట్టు", "పతిత" వంటి రచనలు చక్కని సూచనలు. ఈ యువకవికి నా అభినందనలు. ( ఆంధ్రజ్యోతి )

# కలలో కవిత

— రావి రంగారావు

కలలో కవిత అల్లి నిద్రనుంచీ మేల్కొనగానే దాన్ని కాగితంమీద పెట్టిన ఆంగ్ల కవి. సుప్రసిద్ధుడు ఎస్. టి. కోల్‌రిడ్జ్ ఉన్నాడు. 'కుబ్లా ఖాన్' (Kubla Khan) అనే అద్భుతరచన ఆయన అలానే వ్రాశాడు. అయితే అది అసంపూర్ణం! వ్రాస్తూఉండగా ఎవరో వచ్చి పిలిచారు. ఆయన లేచి వెళ్ళి మాట్లాడి తిరిగి వచ్చేటప్పటికి కవిత్వం స్మృతినుంచి ఎగిరిపోయింది! మెలకువగా ఉన్న స్థితిలో తర్వాత దాన్ని పూర్తిచేసే ప్రయత్నం ఆయన చెయ్యలేదు!

తిలక్ వ్రాసిన రచనల్లో మధ్య తరగతి మనిషి మనస్తత్వాన్ని గూర్చి 'గొంగళిపురుగులు' కవిత మీరు చదివే ఉంటారు. గొంగళిపురుగు సీతాకోకచిలుకగా మారాలంటే కలల్ని తినాలి. కాని ఈ గొంగళిపురుగు –

"రోజూ పాడే పాతపాటకి
రోజూ ఏడ్చే పాతచావుకి

నిలువలేక, వినికూడ కదలకుండా........
సగం సగం తిన్న కలల్ని నెమరేస్తూ నిద్రపోతుంది"

చివరకూ అంతే। "తన జీవితాన్ని బల్లపరుపుగా పరుచుకుని, సగం సగం తిన్న కలల్ని నెమరేస్తూ సగం సగం చచ్చిన ప్రాణాన్ని జోకొట్టుతూ...." అయితే తిలక్ గొంగళీపురుగు చచ్చిపోతుందని ముగించలేదు। దానికి 'కలల్ని పూర్తిగా' తినే సాహసం. కలల్లో జీవితంలో క్రొత్తదనాన్ని అన్వేషిస్తూ పెరిగే శక్తి కలిగినప్పుడు, అది తప్పక సీతాకోకచిలుక అవుతుందనే హెచ్చరికను ధ్వనిస్తూ. ఆ కవితను ముగించాడు తిలక్। అందువల్ల 'కలలు' అనేవి తప్పకుండా మనిషిలోని సృజనశక్తికీ, నవోన్మేషిత్వానికీ సూచనలేతప్ప పరారితనం (escapism) పిరికితనం సూచించవు। మనిషి ఎదుగుదలకు అవి చాల అవసరం।

1, 2, 6 కవితలు యథాతథంగా కలల్లో అల్లి మెలకువ రాగానే వ్రాసినవి, పై సత్యాన్ని రుజువు చేస్తున్నాయి. కవిలోని నిజమైన మానవత్వం నేటి కుహనా మానవత్వసిద్ధాంతాలనూ, ద్వేషాన్నీ సంఘర్షణనూ ప్రేరేపించే రాజకీయ కవిత చలామణీ చేసే ప్రతీకలనూ కాదంటున్నది? మనిషి 'పరిమళాలనందం'గానూ, 'పసిపిల్లవాడు'గానూ, 'మల్లెపూలజేబు' (హృదయం) కలవాడుగానూ కవి అంతఃకరణయొక్క (Perception) స్పృహ. కాని సామాజికస్పృహ కవిని మనిషి అంటే మండే గోళంగానూ 'ప్రవహించే రుధిరంగానూ' చూడమంటుంది। రూపాయల దొంగల్ని విమానాల్లో, (కవితల్లో, భావుకతలో) పట్టేద్దామంటుంది। రూపాయల దొంగల్ని రాజకీయ, సాంఘిక కార్యాచరణద్వారా పట్టాలిగాని, కవిత్వంతోకాదు। అందుకే నేటి సామాజిక స్పృహతోపారే కవిత్వాన్ని 'మునిసిపాలిటీ మురుక్కాలుగానూ 'కాగితాలపై మూగే చీకట్లు'గానూ కవి అంతఃకరణ కవికి చెబుతోంది? హృదయస్పందనను లొలిమెట్టుప్రణయం

వలపు అదే ప్రేమగా కరుణగా పరిణమిస్తుంది భావుకునిలో. ఇంద్రగంటి కృష్ణశాస్త్రి గొప్ప తార్కాణం. 'కృష్ణపక్షం' నుంచీ 'ఊర్వశి' దాకా కృష్ణశాస్త్రి ఎలా ఎదిగేడో మనకు తెలుస్తుంది. తర్వాత ఆయన వ్రాసిన కవిత్వంలో ఎంత అనుకంప, తోటి మానవులమీద ప్రేమ, వాత్సల్యం వెల్లడికిస లాడేయో చూడండి? మొదటి రచనల్నే పట్టుకొని ఆయన్ని చివరిదాకా 'ప్రేయసి' పైన కవిత్వం వ్రాసిన కవిగా ముద్రవెయ్యడం ఎంత అన్యాయం! "ప్రతిరాత్రి ఓ స్త్రీమూర్తి పిడికెడేసి హృదయాన్ని భిక్షగా నా కందిస్తుంది" అనడంలో మాతృప్రేమనుంచీ, ప్రణయిని వలపునుంచీ, ప్రారంభమయ్యే హృదయస్పందన తర్వాత జీవితంలో ఆనందానికీ సౌభ్రాతృత్వానికీ పెట్టే ప్రథమ భిక్ష అంటూ కవి అంతరాత్మ కవికి ప్రబోధిస్తోంది! ఈ కవిలోని కవి అభివ్యక్తిని కవిత్వంలో పొందినప్పుడు ఒకటి లోనే వ్రాయనక్కరలేదు. మెలకువలోను వ్రాయవచ్చును. కవికి తర్వాత కలలు రాకపోవడానికి కారణం కవి ఆ అంతర్వాణి మాటైనా వినివుండాలి. లేక దాన్ని పూర్తిగా అణచివేసిఅయినా ఉండాలి. అణచివేసినంతే ఈ రోజు ఆ కవితల్ని ప్రచురించే ధైర్యం కవికి ఉంది ఉంటివ! వాటిని కవికి తెలియక వాటిని నిరాదరణ చేసే ఉందురు! అంటే కవిలోని కవి జయం పొందినట్లే!

3, 5, 7 కవితల్లో అభివ్యక్తికోసం తహతహలాడి, అవరోధాల్ని ఢీకొనే కవి అంతఃకరణే కనిపిస్తుంది, భావనకు చిక్కినట్లే చిక్కి, అభివ్యక్తిగా మారేప్పటికీ నీరుగా మారి జారిపోయే అనుభూతిని గురించి పడే కృత్యాద్యవస్థ 8 వ కవితలో కనిపిస్తోంది. కవిలోని స్వచ్ఛందమైన భావనాశక్తిని 'పిచ్చికుక్క'గా భయపడుతూ, దాన్ని చంపడానికి అణచి పెట్టడానికి, ముసలాణ్ని (అంటే సంప్రదాయాన్ని, నేడు ప్రచారంలో ఫాషన్‌లో ఉన్న రకం కవిత్వాన్ని) ఆశ్రయించినా జరిగిందేమిటి? అటు వంటి ప్రక్రియద్వారాకూడా కవిదైనా అంతఃకరణే అభివ్యక్తం కావడం

దాన్ని కవి చూస్తూఉంటటం : "కుక్కలో నాక్కనిపించాడప్పుడు నాలాగే పదేళ్ళున్న అబ్బాయి" ఆ కుక్క కవిలోని 'కవి'గా కవికి సాక్షాత్కరించడంలో కవి సమస్య తీరాలి. కాని ఎదురుగా ఉన్న 'ముసలాడు' బెదిరిస్తూనే ఉంటాడు. బేరను ముందున్న పిచ్చికుక్కా (లోపల అమ్మాయితో) ఒకదాన్ని మరొకటి మించినదిగా కనిపించే చెట్లవరుసలో అన్వేషణా, యివి 'లిబిడో', కవిత్వానికీ, శృంగారానికీ, సాహిత్యసృష్టికీ సంతాన సృష్టికి మూలకందమైన శక్తినే, సూచిస్తాయి. అయితే దివ్య విగ్రహం నీచంగా కారిపోవడంలాగే చెట్టు లోహ స్తంభంగా భాసించడం అనేది అభివ్యక్తిలో సృష్టికార్యంలో ఎదురయ్యే ఒక సమస్య : నిజానికి సమస్యకాదు, భ్రాంతి : ఎంత గొప్పకవికికూడా తాను వ్రాసిన రచనను తిరిగి చదువుకుంటే, తనలోని స్పందనకూ భావనకూ సరియైన రూపకల్పన చెయ్యలేకపోయాననే అసంతృప్తి మిగులుతూనే ఉంటుంది. అంతేకాదు లోకం : 'ముసలాడు', 'ఏమనుకుంటా'రనే భయమూ ఉంటుంది : కొత్తదైన స్వతంత్ర రచన చెయ్యాలనుకునే రచయిత పడే బాధ యిది. తప్పదు.

'ముసలాడు అంటే ఎవరు ? ఎక్కడ ? అని వెదుకోక్కనక్కర లేదు : "ప్రయోగాలకి కాలం చెల్లింది" అంటున్న మన అద్దేపల్లి రామమోహనరావు ఆ 'ముసలాడు', ఇంతకూ అద్దేపల్లివారి ఆక్షేపణ ఏమిటి ? "కవితలో పాఠకుడు తన అభిప్రాయానుసారం అర్థం లాక్కోగలిగిన అవకాశం" ఉండకూడదట : అదీ "అస్పష్టత" యట : ఇది "అస్పష్టత" కాదుగదా, యిదే కవితకు జీవం. ప్రాణం : "The mystery in the greatness of King Lear or Macbeth comes not from concealment but from revalation, not from something unknown or unknowable in the work but from something unlimited in it. (Northrop Frye, Anatomy of Criticism) ఒక రచన నుంచీ

ఏమీ అర్థం బోధపడకపోతే అది అస్పష్టత: ఎవరికి తోచిన అర్థం వారికి వైవిధ్యంతో బోధపడటం అనేది అందులో 'జీవం' ఉన్నట్టు ఋజువు: కవిత్వానికీ, వచనానికీ లేక శాస్త్రానికీ యిదే తేడా: 'ప్రయోగాలు పనికి రావని' చెప్పే అధికారం ఎవరిచ్చారీయనకి? కెన్యూట్ రాజా సముద్ర తరంగాల్ని ఆగమని ఉత్తర్వు యిచ్చినట్లుగా ఉంది: సామాజిక స్పృహపారే 'మురుగు కాలువ' పర్యవేక్షకాధికారి (డ్రెయినేజ్ యిన్‌స్పెక్టరు) ఉద్యోగాన్ని అద్దేపల్లి వారు స్వీకరించడం ఆశ్చర్యాన్నీ బాధనూ కలిగిస్తోంది: అందుకే యింత వ్రాయవలసివచ్చింది.



# శ్రీశ్రీ రేడియో నాటికలు

చతురస్రం, గవేషణ, అనంతర యాత్ర సుప్తాస్థికలు, విషాధకుటి ఆత్మహత్య, గ్రామఫోనురికార్డుల తిరుగుబాటు, గుమాస్తాగాల, ఒంటరిదావి, భూతాలకొలిమి, బలి, మరోప్రపంచం అనే పదకొండు నాటికల సంకలనం ఈ గ్రంథం.

'ఇచతురస్రం' నాటికకే మరోపేరు $1+1=1$ ఇది అద్వైతాన్ని ద్వంద్వాతీతమైన తత్వాన్ని ప్రతిపాదించే నాటిక. "మరణాన్ని మానవుడు జయిస్తే, తన మనస్సునే మానవుడు గెలిస్తే అప్పుడు నేను లేను, ఇప్పుడున్నాను నేను" అంటుంది 'స్త్రీ'. స్త్రీ మాయాశక్తి. అద్వైతసిద్ధితో మాయ అంతరిస్తుంది. అప్పుడు ఒకటే ఒకటీ కలిసి ఒకటే అవుతుంది. అంతదాకా ద్వంద్వం తప్పదు. ఆ ద్వంద్వాన్ని గుర్తిస్తూనే ద్వంద్వాతీతమైన తత్వాన్ని స్ఫురింపజేస్తుంది కవిత్వం అని కవిత్వం అని కవిత్వతత్వ నిరూపణ చేశారు శ్రీశ్రీ నాటిక చివర కవి పాడే గీతంద్వారా.

'గవేషణ'లో ఆత్మజిజ్ఞాస చమత్కారంగా నాటకీయం చేయబడింది. పుణ్యపాపాల వివేచన, దేశ కాలావధులకు నిబద్ధమైన శారీరకయాత్రకు సంబంధించిన విజ్ఞానం, ధర్మస్వరూపం, సృష్టితత్వం ఇలా ఒకదానినుంచీ ఒకదానికి గెంతుతూ వెళ్ళినా చివరకు మిగిలేదేమిటి? "ఓయి మానవుడా నువ్వు దేవతలని నమ్మకపోతేపోయావుగాని మానవత్వంమీద విశ్వాసాన్ని మాత్రం విసర్జించకు" అని తుదినిర్ణయం. అందుకే మళ్ళీ మళ్ళీ మానవ జన్మ. నాటకంలో చివరివాక్యం: మానవుని గొంతుకనుంచీ వెలువడు తుంది: "నేను చచ్చిపోలేను. నమ్మండి నేను బతికేఉన్నాను" (శిశువు రోదన ధ్వని) 'అనంతర యాత్ర'లో కాలం వ్యక్తిగతమైంది. అందువల్ల ఎవరి బ్రతుకు వాళ్ళది, ఎవరి అనుభవం వాళ్ళది అనే (M'ativ'ty) వత్వాన్ని

నొక్కిచెప్పారు. 'జీవితం కష్టాలమయం, జీవితంలో ఏముందీ? ప్రేమలో ఏముందీ? అని జీవితాన్ని అనుభవించిన వృద్ధులు చెప్పినా దాన్ని అనుభవించాలనే కుతూహలం, ఆకాంక్ష పసివాళ్ళలో నశిస్తుందా?

"మీరెంత తెలిసిన వాళ్ళయినా, మేము స్వయంగా అనుభవించకుండా, మీ వ్యాఖ్యానాలతో ఎలా తృప్తిపడగలం తాతగారూ? ఇతను చచ్చిపోయాడరా, చచ్చిపోయినవాడు బతకడంమీద మాట్లాడితే ఇలాగే ఉంటుంది...." అంటారు పసివాళ్ళు.

'సుపాస్థికలు' మహాత్మాగాంధి మరణానికి అశ్రుతర్పణం. హింసకీ అహింసకీ యుద్ధం ఆచంద్రతారార్కం! కానీ 'నీకెలా నిద్దర పడుతోందిరా తమ్ముడూ?' అని హెచ్చరిక. ఇది మానవజాతికి కవి హెచ్చరిక!

తతిమ్మా నాటికలు చమత్కారంతో, హాస్యంతో ఆసక్తి కలిగించేవి. చివరి నాటిక 'మరో ప్రపంచం' శ్రీశ్రీ వ్రాసిన ప్రసిద్ధగేయానికి వ్యాఖ్యానం. శ్రీశ్రీ కవిత్వం ఎలా మార్క్సిజమ్‌నుంచీ మానవత్వందాకా పురోగమించిందో నిరూపిస్తున్న ఈ నాటికలు ఒక విస్పష్టమైన తాత్విక దృక్పథాన్ని అభివ్యక్తం చేస్తున్నాయి. (ఆంధ్రపత్రిక 30-8-64) ❋

# ఎనిమిది నాటికలు

— అంగర సూర్యారావు

**1958-1971** మధ్యకాలంలో ప్రచరింపబడినవీ, ప్రదర్శింపబడినవీ అయిన ఎనిమిది నాటికలు ఈ సంపుటిలో ఉన్నాయి. వీటిలో వస్తువైవిధ్యం ఉన్నది. 'తాంతియాతోపే' ఒకటే చరిత్రాత్మక నాటిక. ఇందులో

మేజర్ రాక్ పాత్రపోషణ సంతృప్తికరంగా లేదు. సన్నివేశాన్ని చిత్రించే ముందు కొంత విషయ వివరణ పాత్రల సంభాషణద్వారా శ్రోతలకు అందజెయ్యవలసిన అవసరం ఉన్నప్పుడు, కేవలం ఆ అవసరానికి ముఖ్య పాత్ర పోషణని బలిచెయ్యడం శిల్పంలో లోపమే అవుతుంది. ఇందులో మేజర్ రాక్‌ని మరీ పసిపిల్లవాడిలాచేసి, రాబర్ట్ అనే సోల్జర్‌చేత అతనికి పాఠాలు చెప్పించడం సమర్థనీయంకాదు. "గూఢచారులుగా నల్లవాళ్ళే ఉండాలి; మన తెల్లవాళ్ళం పనికిరాం, సార్!" అని సోల్జర్ తన మేజర్‌తో చెప్పనవసరమే లేదు! ఒకవేళ చెప్పినా, ఆ మేజర్ అసహనంతో - "ఎందుకు పనికిరాం? మనకు బుర్ర తక్కువా? బుద్ధితక్కువా?" అనడం చూస్తే ఆ మేజర్‌కి యుద్ధంలో ఎ, బి, సి, డి లు కూడా రావని పిస్తుంది. అలాగే తాంతియాతోపే పాత్ర పోషణ ఆ చారిత్రక వీరునికి న్యాయం చేకూర్చేదిగా లేదు! ఒక నాటిక కేవలం విషయ వివరణకోసం ఉద్దేశించబడదు. ముఖ్యంగా ఒక చరిత్రాత్మక నాటిక పాత్ర పోషణలో మెరుపూ, సన్నివేశాల కల్పనలో చాతుర్యం కలిగి ఉంటే తప్ప ఆకట్టుకో లేదు! 'తాంతియా తోపే' ఆ విధంగా అసంతృప్తినే కలిగిస్తున్నది.

మిగతా ఏడు నాటికలూ వర్తమాన సమాజాన్ని చిత్రించేవి. 'ఇల్లు కూలింది' ఆఫీసుల్లో జరిగే జాప్యాన్నిగూర్చి, ఉద్యోగస్థుల - ఉపాధ్యాయుల సమస్యల్నిగూర్చి సాకల్యంగా చర్చించిన రచన. విషయప్రస్తారంలో, సమస్యని చర్చించటంలో ఈ నాటికని నేర్పుగా నడిపించారు రచయిత. సమస్యే తప్ప పరిష్కారంలేదు నాటికలో. అన్ని వర్గాలవారినీ ఆలోచింపజెయ్యడమే నాటిక లక్ష్యం. 'స్త్రీలకు ప్రత్యేకం' స్త్రీల సమస్యల్ని, తక్కువ పరిధిలో కొంత చమత్కారం మేళవించి చర్చించిన రచన. 'ఎవరో పిలిచారు', 'రాత్రించరులు', 'నాగరికులు' అనే మూడు నాటికలూ ఈ సంపుటిలో ఉత్తమరచనలు. నాటకశిల్పం, పాత్రపోషణ, జీవిత యధార్థ చిత్రణ ఈ నాటికల్లో రచయిత ప్రతిభకు గీటురాయిగా ఉన్నాయి. 'ఎవరో

పిలిచారు' అంతరాత్మ ప్రబోధాన్ని గూర్చి, నైతిక దృక్పధాన్నిగూర్చి హృదయానికి హత్తుకునేలా చెప్పే సున్నితమైన రచన. 'రాత్రించరులు' సహజమైన పాత్రపోషణతో, చక్కని వాతావరణ సృష్టితో, కొసమెరుపు ముగింపుతో, జీవితమంటే దగా తప్ప మరేమి లేదా? అనే ప్రశ్నతో దీర్ఘ నిశ్వాసం వదిలేలా చేస్తుంది. సాహిత్యపరంగా ఎంతో చక్కని రచన అని చెప్పాలి. 'నాగరికులు' అనే నాటికలో సహజత్వమూ, హాస్యమూ కూడా సరిపైన పాళ్ళలో మేళవించాయి. ఇందులో సుబ్బారాయుడు పాత్ర ఒక సజీవమైన చిత్రణ. 'చిత్రవధ' సినిమాకథలమీదా, సన్నివేశాలమీదా సెటైర్. 'ఒక గంట సంసారం' భమిడిపాటివారి నాటికల్ని గుర్తు తెచ్చే సన్నివేశ ప్రధానమైన చమత్కారంతో ఆకట్టుకునే నాటిక. ఇందులో రాజేశ్వరి పాత్ర పోషణలో రచయిత చూపిన పనితనం ప్రశంసార్హం. ఏతావాతా అన్నీ ప్రదర్శన యోగ్యాలైన నాటికలే అయినా, రసానుభూతిదృష్ట్యా 'రాత్రించరులు' ఎంత ఉత్తమనాటికో, 'తాంతియాతోపే' అంత పేలవమైన రచన. మిగతా ఆరూ ఈ రెండింటిమధ్యా అటూఇటూ వస్తాయి.

( 8-11-76 ) ❋

# చంద్రసేన

— ఆంగర సూర్యారావు

ఒకరాజు, అతని ప్రజలు, పరిపాలనా యంత్రాంగాన్ని నడిపే మంత్రి, సైన్యాధిపతి, రాజభటులు - ఈ కల్పిత పాత్రలతో రాజుకూ, రాజ్యానికీ గల ధార్మిక సంబంధాన్ని విశ్లేషించి చూపే నాటకం ఇది. సమ

కాలీన సమాజంలో ఎదురయే చాలా సమస్యలమీద విమర్శనా, వ్యాఖ్యానాలూ ఉన్నాయి ఇందులో. ఇందులోని ధనపతి పాత్ర ఒకవిధంగా నేటి పెట్టుబడిదారీ వ్యవస్థకు ప్రతినిధి. దండుడు విప్లవం రౌద్రస్వరూపం. జయంతుడు, అనంతుడు రాజకీయనాయకులు. చంద్రసేన పాత్ర మాత్రం సాంప్రదాయకమైన కాల్పనిక, చారిత్రక, కథాసాహిత్యంలో ఎదురయ్యే స్త్రీ పాత్ర. నాటకంద్వారా అభివ్యక్తమయే సామాజిక, రాజకీయ సందేశంలో ఈ పాత్ర కలిగించే స్ఫూర్తి చాలా అప్రధానమైనది. "నువ్వు నర్తకివి కావు చంద్రా! ప్రజలను పీడించే ఈ దుష్టపాలకులను అణచడానికి పుట్టిన ఆదిశక్తివి!" అంటాడు సమరసేనుని వేషంలో ఉన్న జయంతుడు. కాని చంద్రసేన ఈ కథలో నిర్వహించిన కార్యం ఏమీ లేదు. ప్రజలకు జరిగిన ఎన్నో అన్యాయాలలో చంద్రసేనకు జరిగిన అన్యాయమూ ఒకటి. అంతే. చంద్రసేన నాటకానికి నాయిక కాదు. ఈ నాటకంలో నాయకుడు అంటూకూడా ఒక ప్రధానపాత్ర లేదు! ప్రజలను హింసించే సైన్యాధిపతి ప్రధానంగా కనిపిస్తాడు. కాని అతనికి ప్రతిద్వంద్వి అయిన మంత్రి సుమిత్రుడూ, ఆ ఇద్దరిమీదా అధికారం నడిపే రాజు శూరసేనుడూ, రాజకీయ నాయకులైన అనంతుడు, జయంతుడుకూడా సమంగానే నాటకంలో ప్రాధాన్యం వహిస్తారు. అందువల్ల ఈ నాటకంలోని కథావస్తువు ఉన్మీలనం, రాజు అనే వ్యవస్థకీ ప్రజలకీ గల ధార్మిక సంబంధాన్నీ, దాని పరిణామాన్నీ చిత్రించేదిగానే అవగాహన చేసుకోవాలి. అంటే పాత్రలకంటే కథావస్తువు, దాని సందేశం ఈ నవలలో ప్రధానంగా గణించదగినవి. ఇది ఈ నాటకంలోని నవ్యత.

"రాజా! నా కొడుకును నేను చంపుకోవడం నేరం అని నువ్వంటున్నావు. సరే, ఒప్పుకుంటాను.... నువ్వు రాజువైన తరువాత తిండి లేక చచ్చిపోయిన ప్రజలు, కొన్నివేల మంది ఉన్నారు. తిండి పెట్టలేక ఒక్కణ్ణి చంపినందుకు నువ్వు నాకు శిక్ష విధిస్తే, వేలకొద్దీ ప్రజలను చంపినందుకు

నీకు దారుణమైన మరణశిక్ష విధించాలి.... నువ్వు బలప్రయోగంతో నా నోరు మూయించినా, కోట్లాది ప్రజల నోళ్ళు మూయించలేవు.... ఆహా! ఏమి న్యాయం! నా ప్రాణం నేను తీసుకుంటే నేరం! నా ప్రాణాలు నువ్వు తీస్తే న్యాయం!.... నీ దుష్ట వ్యవస్థకు అంత్య ఘడియలు సమీపించాయి" అంటాడు కౌశికుడు అనే ఒక పేదవాడు. దున్నే వాడికే భూమి ఉండాలి అనే తిరుగుబాటుదారుల ప్రచారానికి ప్రతిగా మంత్రి సుమిత్రుడు దరిద్రులందరికీ నెల కొకసారి అన్నసంతర్పణ ప్రభుత్వం ఏర్పాటుచేస్తున్నట్లు ప్రకటిస్తూ దాని ఖర్చు ధనవంతులు భరించేలా చెయ్యమని రాజుకి సలహా ఇస్తాడు. ప్రజలలో దైవభక్తి, రాజభక్తి కలిగించేలా ప్రచారం సాగించాలంటాడు. ఆ పని పీఠాధిపతులకు అప్పగించి, వాళ్ళకు రహస్యంగా ధన సాహాయ్యం చెయ్యాలంటాడు. ఇలా 'వంచనాశిల్పం'తో రాచరికపు వ్యవస్థను కాపాడిన మంత్రికీ రాజుతోబాటే ప్రజలు యావజ్జీవ కారాగారవాసం విధిస్తారు. ప్రజారాజ్య స్థాపన కథ ముగింపు. నాటకాన్ని రంగస్థలంమీద ప్రదర్శించి విజయవంతమైన తరవాతే ప్రచురించినట్లు గ్రంథకర్త చెప్పుకున్నారు. ప్రదర్శనకు యోగ్యమైన నాటకమే. (2-2-71) ❋

# శరత్ చంద్ర ఛటర్జీ

— సుబోధచంద్రసేన్ గుప్త

తెలుగులో శరత్‌చంద్రుని నవలల అనువాదాలు చాలా ప్రాచుర్యాన్ని పొందాయి. 1976 లో శరత్ శతజయంతి ఉత్సవం యావద్భారత దేశంలో చాలాచోట్ల జరిగింది. ఆ సందర్భాన్ని పురస్కరించుకుని కేంద్ర

సాహిత్య అకాడెమీవారు ప్రచురించిన ప్రామాణిక గ్రంథం, శరత్ నవలల మీద, కథలమీద విమర్శ ఇది.

మొదటి అధ్యాయంలో రవీంద్రుసీ, శరత్‌చంద్రుసీ వ్యక్తులుగా, రచయితలుగా పోల్చి వాళ్ళమధ్యగల విభేదాన్ని, సాదృశ్యాన్ని చక్కగా విశ్లేషించి చూపారు సేన్‌గుప్త. రెండవ అధ్యాయంలో శరత్‌చంద్రుని జీవితసంగ్రహం ఉన్నది. "తండ్రినుంచి సంక్రమించిన ఆరాటం, తపన, నిలుకడలేని చంచలస్వభావమే శరత్‌ని దేశసంచారానికి పురికొల్పింది." జీవితంలో శరత్‌ని ప్రభావితుణ్ని చేసిన ప్రధానవ్యక్తులకూ, ఆయన నవల ల్లోని కొన్ని ప్రధానపాత్రలకూ పోలికలు ఊహించారు రచయిత. ఎన్ని పోలికలు ఊహించినా, శరత్ సృష్టించిన స్త్రీ పాత్రలను గురించి కొన్ని ప్రశ్నలు మిగిలే ఉంటాయి అంటారు రచయిత: శరత్ వ్రాసిన చాలా నవలల్లో "అంతర్గతంగా ఆదిమమైన సహజ ప్రవృత్తులకూ, బాహ్యంగా మత సంబంధమైన విధి నిషేధాలకూ మధ్య జరిగే సంఘర్షణని వర్ణించ డానికి అతణ్ని పురికొల్పిన అనుభవమేమిటి? .... అంతమంది రసికాల స్త్రీలను ఎక్కడ చూచాడు?.... లేక కేవలం కళాకారుని సానుభూతితో వారిని భావన చేసి సృష్టించాడా? ఏమో, ఎవరికెరుక!"

శరత్ సాహిత్యంలో కథావస్తువుని విశ్లేషించి చూపే ప్రయత్నం మూడవ అధ్యాయం. సమష్టి కుటుంబ జీవితం ప్రధానవస్తువు, తరవాత వైవాహిక జీవితం. మూడవది గ్రామీణ సాంఘికజీవన స్థితి. నాల్గవది చిన్నపిల్లల చిత్రీకరణ. అయిదవది స్త్రీల సమస్యలు – ముఖ్యంగా సంప్ర దాయం ఆమోదించని ప్రేమలో చిక్కుపడ్డ స్త్రీ పాత్రలు. ఆరవ అంశం 'స్త్రీ ఏకకాలంలో ఇద్దరు పురుషులపైపు ఆకర్షితురాలవడం సాధ్యమా?' ఈ ప్రశ్నను 'స్వామి' అనే కథలో శరత్ రూపొందించిన స్త్రీ పాత్ర తీరును బట్టి వ్యాఖ్యానిస్తూ రచయిత లేవదీశారు. 'గృహదహనం'లోని అచలపాత్ర కూడా ఈ విధమైన ఆలోచననే పురికొల్పుతుందని తరువాత వ్రాశారు.

ఇది ఆలోచింపదగిన వ్యాఖ్యానం. శరత్ పాత్రలు, ముఖ్యంగా స్త్రీలు తమ వైఖరిని వాచ్యమూ, విస్పష్టమూ చెయ్యకపోవడంలోనే ఆ పాత్రల ఆకర్షణ, జీవలక్షణం ఇమిడి ఉన్నవని అంగీకరించక తప్పదు. ఈ విషయాన్నే విపులంగా నాలుగవ అధ్యాయంలో 'స్త్రీ హృదయం' అనే శీర్షిక పెట్టి చర్చించారు రచయిత. ఈ ముప్పై పేజీలలో రచయిత విమర్శనా ప్రతిభ బాగా ద్యోతకమవుతూ ఉన్నది. శరత్ నవలలు చదివినవారు రచయిత తీర్పులతో, వ్యాఖ్యానంతో చాలావరకు అంగీకరించక తప్పదు. శరత్ కొన్ని సన్నివేశాలనూ, కొన్ని చోట్ల పాత్రల ప్రవర్తననూ చిత్రించే విధానంలో 'భావావేశ రూపకమైన దౌర్బల్యం' (సెంటిమెంటాలిటీ) వ్యక్తమవుతున్నదని ఉదాహరణలు ఎత్తిచూపారు. ఈ విమర్శ న్యాయంగానే తోస్తుంది. చాలాసార్లు అలాంటివే మన రచయితలూ, రచయిత్రులూ సులువుగా అనుకరిస్తున్నారు శరత్‌ని చూచి. దేవదాసు కథ ముగింపు 'మెలోడ్రమాటిక్'గా ఉన్నదంటున్నారు ఈ విమర్శకుడు. నిజమే. కాని, సామాన్య పాఠకులకూ, విమర్శకులకూ అభిరుచిలో భేదం ఇక్కడే వస్తుంది. 'దేవదాసు' ప్రాచుర్యం ఆ రకం ముగింపుమీదకూడా చాలా వరకు ఆధారపడిఉన్నది.

అయిదవ అధ్యాయం : "జీవితం, ప్రేమ సమస్యలు". 'పథేర్‌దాబీ' ('భారతి'), 'శేషప్రశ్న' నవలలు చివర వ్రాసినవి చర్చకు వచ్చాయి. ఇవి మిగతా నవలలకంటే భిన్నమైన పద్ధతిలో రూపొందినవి. కథ, పాత్ర చిత్రణకంటే ఈ నవలల్లో 'వాదము' ఎక్కువ ఉన్నదని విమర్శ. అప్పట్లో ఈ విమర్శ రవీంద్రుడుకూడా చేశాడు. రవీంద్రుని 'గోరా'లో కథ ఎంత ఉన్నదో, వాదమూ అంతే ఉన్నదని శరత్‌చంద్రుడు సమాధానమిచ్చాడట. 'ఒక కథ చెప్పాలంటే కథకుడు ఆతని మేధాశక్తినీ, గ్రహణశక్తినీ బహిష్కరించాలని అర్థంకాదు' అన్నాడట. ఈ రెండు నవలల

వైశిష్ట్యాన్నీ, శరత్ మేధాశక్తినీ ఉగ్గడిస్తూనే, వాటి గుణదోష విమర్శ చేశారు రచయిత. ఇక్కడ అభిప్రాయభేదానికి అవకాశం ఉన్నది.

"శరత్‌చంద్రుడు లక్ష్యంలో ప్రచారకుడు. సన్నివేశ చిత్రణలో, పాత్ర కల్పనలో వాస్తవిక వాది. కాని ప్రవృత్తిలో కాల్పనిక ఆవేగం కలవాడు" అన్న నిగమనం బాగున్నది. శరత్‌చంద్రుడు ప్రధానంగా స్త్రీ పాత్రలద్వారా స్త్రీ హృదయాన్ని ఆవిష్కరించిన రచయిత అయినప్పటికీ, ఆయన జీవితతత్వం, దృక్పథం శ్రీకాంత, జీవానంద ('దేనాపావోనా' - భైరవి) అనే పురుషపాత్రల్లో అభివ్యక్తమవుతున్నదని రచయిత అభిప్రాయం. "శ్రీకాంత వ్యక్తిత్వంలో ప్రేమికుని ఉద్రేకం, సన్యాసి విరక్తి మిళితమై ఉన్నాయి." శరత్ వ్యక్తిత్వంలోనూ ఆ లక్షణాలే ఉన్నట్లు అతని రచనలన్నీ చెప్పక చెబుతున్నాయి. (21-8-77) ❋

# కుమారన్ ఆశాన్

— కె. ఎమ్. జార్జి

భారతీయ సాహిత్య నిర్మాతలనుగురించి సంగ్రహ జీవిత చరిత్రలను వెలయించే పథకంక్రింద సాహిత్య అకాడెమీ ప్రచురిస్తున్న పుస్తకాలలో ఒకటి. ఆంగ్లమూలంనుంచి శ్రీ డి. రామలింగం తెలుగు చేశారు. అనువాదం చక్కగా ఉన్నది. ఆధునిక మలయాళ కవిత్వంలో యుగపురుషులైన ముగ్గురు మహాకవులలో కుమారన్ ఆశాన్ ఒకరు. తక్కిన ఇద్దరూ వళ్ళతోళ్ నారాయణ మీనన్, ఉళ్ళూరు పరమేశ్వర అయ్యర్. 'ఆశాన్' అనే పదం తెలుగులో 'పంతులు' లాగ ఉపాధ్యాయవృత్తిని

సూచిస్తుంది. కుమారన్ 'వెనకబడిన తరగతుల్లో' ఒకటైన 'ఎజవ' కులంలో జన్మించాడు. 1873 ఏప్రిల్ 12వ తేదీన కాయిక్కర అనే కుగ్రామంలో, తిరువనంతపురానికి 30 మైళ్ళ దూరంలో. చిన్నతనంనుంచీ సంస్కృతం చదువుకున్నాడు. పధ్నాలుగో ఏటనే 'పంతు' లయ్యాడు. కాని చివరిదాకా సంస్కృతం, వేదాంతం, తర్కం, ఆంగ్లం అధ్యయనం చేస్తూనే ఉన్నాడు. పందొమ్మిదోఏట శ్రీ నారాయణగురు (1856-1928) అనే ఆధ్యాత్మికవేత్త శిష్యుడైనాడు. నారాయణ గురు వేదాంతి, సన్యాసి, సంఘ సంస్కర్త. 1903 లో నారాయణ గురు స్థాపించిన "శ్రీ నారాయణ ధర్మపరిపాలనా యోగం' (ఎన్. ఎన్. డి. పి. యోగం) అనే సంస్థకు కుమారన్ ఆశాన్ కార్యదర్శిగా 1919 వరకు పనిచేశారు, ఎజవ కులోద్ధరణకు, మలయాళ భాషాసాహిత్యాలకూ ఎనలేని సేవ చేశాడు. 4? వ ఏట తన శిష్యురాలు భానుమతి అనే 17 ఏండ్ల బాలికను వివాహం చేసుకున్నాడు. వివాహానికి గురువు ఆమోదం లభించలేదు : ఆయన మౌనం వహించాడు కాని అడ్డుచెప్పలేదట :

ఆశాన్ నారాయణ గురు శిష్యుడిగా బ్రహ్మచర్యదీక్ష నవలంబించినా, స్వభావతః రసహృదయుడూ, కవీ, అతని మొదటి ఆధునిక రచన 'వీణ పూవు' (రాలిన పూవు) అనే స్మృతికావ్యం ఇది మలయాళంలో భావ కవిత్వానికి నాంది పలికింది (1908). తరువాత 'నళిని' అనే కావ్యం. ఉదాత్త ప్రణయం దీని ప్రధానవస్తువు (1911). 'లీల' (1914) కావ్యంలో భగ్నప్రణయం వస్తువు. ఆశాన్‌లో బ్రహ్మచర్యానికీ, గృహస్థాశ్రమానికీ మధ్య జరిగిన సంఘర్షణకు ఈ మూడు కావ్యాలు అభివ్యక్తి అని రచయిత అభిప్రాయం. వివాహానంతరం వెలువడిన పెద్దకావ్యాలు 'ప్రరోదనము', 'సీత'. 'ప్రరోదనము' స్మృతికావ్యం. 'చింతావిష్టయాయి సీత' రవివర్మ చిత్రించిన 'సీత' వర్ణచిత్రాన్ని ధ్యానిస్తూ వ్రాసిన రామాయణ వ్యాఖ్యాన ప్రాయమైన రచన. ఇందులో సీత అంతర్యాన్ని అభివర్ణించే స్వగతం,

సీత పాత్రలోని ఔన్నత్యాన్నీ, విషాదాన్నీ అభివ్యక్తం చేస్తూ ఆమె వ్యక్తిత్వాన్ని కొత్తగా తీర్చిదిద్దిన రచన. 'దురవస్థ', 'చండాల భిక్షుకి' సాంఘిక పరిస్థితుల్ని ప్రతిబింబించే రచనలు. ఆశాన్ సాహిత్యకృషినిగూర్చి చదువుతూఉంటే తెలుగువారికి రాయప్రోలు, నాయని, దువ్వూరి, జాషువా స్మృతిపథంలో మెదలుతారు. ఈ శతాబ్ది మొదట్లో భారతీయభాషలన్నింటిలోనూ ఒకేవిధమైన నవచైతన్యం ఒక రకమైన నూత్న సాహిత్యదృష్టికి కారణభూతమైనదనే సత్యం గోచరిస్తుంది మనకు. (22-10-76)

# ఉదబిందువులు

— టి. వి. కృష్ణరావు

పద్యములు, కథానికలు, నాటిక, సాహిత్యవ్యాసాలు అను శీర్షికల క్రింద 1938-64 మధ్యకాలంలో తాము చేసిన వివిధ రచనలను సంకలితం చేశారు కృష్ణరావుగారు. రచయిత 'భావతరంగిణి' చిమ్మిన ఉదబిందువులు యీ రచనలు. ఇందులో కొన్ని కథలూ పద్యాలూ, సాహిత్యభవిత్యం' అనే వ్యాసమూ లోగడ "భారతి"లో ప్రచురించబడినవే.

1938 - 64 మధ్యకాలంలో రావుగారిలో క్రమంగా వచ్చిన పరిణామం ఈ సంపుటిలో చక్కగా గోచరిస్తోంది. ఉదాహరణకు - 'భిక్షాపాత్ర' నాటిక ఏప్రిల్ 1938 నాటిది. రెండు రంగాల ఏకాంకిక. వ్యాసుడు భిక్షం దొరక్కపోవటంతో కాశికాపురిని శపించటానికి ఉద్యుక్తుడుకావటం, అన్నపూర్ణాదేవి ఆయన్ని పిలిపించి భిక్ష పెట్టబోవటం, విశ్వనాథుడు ఆయన్ని శిష్యసమేతంగా పురినుండి వెడలగొట్టడం కథ. ఇందులో దృక్పథం పూర్తిగా మార్క్సిస్ట్ దృక్పథం. వ్యాసుడు తన రచనా

మ్మాసంగమంతా ఒక పెద్దపొరపాటని వాపోతాడు. ఈ జారిన అశ్రుకణమే ఇదిపరకే యీ భిక్షాపాత్రలో వర్షించి ఉన్నట్లయితే!.... జారలేదు, అందుకనే శ్రుతిలేని రాగమాలపించాను ...బీదలకు ద్రోహంచేసే కర్మ సిద్ధాంతమూ, అవతారవాదమూ బోధించి దాస్యం అంగీకరింపజేశాను. నా గీత యీ కర్మభూమిలో ఎంతకాలం ఉంటుందో అంతవరకు నివృత్తి లేకుండా చేశాను. ఈ సంఘమే మారిపోకుండా ఆశాసించాను....ఆ ఆధ్యాత్మికమనే పేరుతో తుచ్ఛ భౌతికతత్వాన్ని ఉపదేశించాను. భిక్షాపాత్ర నిచ్చి విద్యావంతుల్ని పాడుచేశాను.... అబ్బా, విప్లవహృదయాన్నే చిదిమివేస్తున్నాను...." ఈ ధోరణిలోనే, యీ దృక్పథంతోనే 1947 లో వ్రాయబడిన కథానికలు 'చేసుకున్న కర్మ', 'మాయి', అతడంటే 'వేదాంతి' అనేవి. శీర్షికలు వ్యక్తం చేస్తున్నట్లే కర్మ, మాయ, నిర్లిప్తత, వేదాంతం అనేవి హిందూసంఘంలో సిద్ధాంతరూపేణా వ్యక్తుల్లో క్రమంగా వాళ్ళ చేతకానితనాన్ని, బాధ్యతారాహిత్యాన్ని, కుళ్ళుబోతుతనాన్ని స్వార్థంలేక లోభగుణాన్ని కప్పిపుచ్చుకునేందుకు ఎలా దుర్వినియోగం అవుతున్నాయో నిరూపించే కథలివి. అవహేళన, వ్యంగ్యం ప్రధానంగా ఉన్న యీ రకం రచనలు సంఘానికి ముల్లుగర్రలా పనికివచ్చేవి. అయితే ఇవి సాహిత్యంలో ఏ శ్రేణికి చెందినవి? అని ప్రశ్నిస్తే, దానికి సమాధానంగా - ఈ సంపుటిలోనే కృష్ణారావుగారు 'సాహిత్య భవితవ్యం' అనే విమర్శ వ్యాసంలో పేర్కొన్న నాలుగు తరగతుల్లో రెండో తరగతికి చెందినవని చెప్పవలసిఉంటుంది. "1. మనః కాఠిన్యం సడల్చక అసక్తిని మాత్రం కలిగించే రచనలు సామాన్యాలు 2. మనః శైథిల్యం మాత్రమే కల్పించేవి మధ్యమాలు 3. చిత్తద్రుతి కలిగించి తన్మయీ భావ మాపాదించేవి ఉత్తమాలు 4. నిర్బీజ సమాధ్యవస్థ కల్పించేవి ఉత్తమోత్తమాలు." కృష్ణారావుగారి విభజన ప్రకారం 1938-47 నాటి ఆయన రచనలు మనః శైథిల్యం కల్పించేవి.

తర్వాత దృక్పథం మారింది. నాగార్జునుని మాధ్యమికవాదం రచయితకు ఆదరణీయమైంది. ఆ రచనలు - 'మాధ్యమిక వింశతి' (1968), 'వివేదనము' (1968). 'మాయ సిద్ధాంతాన్ని వెక్కిరించిన రచయితే 'మాధ్యమక వింశతి'లో యిలా అంటున్నారు.

"మాయ గల్గినదై చిత్రమాత్ర మగుచు
నీ సమస్త ప్రపంచమ్ము నెనఁగుచుండు
దానిచే శుభాశుభ కర్మ తతియు బొడము
దానిచే శుభాశుభము లుద్భవము పొందు
చిత్త చక్ర నిరోధంబుచేత సర్వ
ధర్మ సంఘాతములు నిరుద్ధంబు లగును
దానిచే ధర్మములు వనాత్మంబు లగును
దానిచేతనే యవ్వి శుద్ధంబులగును"

చిత్తచక్రగతి ఎలా ముఖ్యమో గుర్తించడంచేతే, రచయిత 'ఉద బిందువులు' (1968) అనే కథలో చిత్తవృత్తుల సంఘర్షణ, ఒకరినొకరు అర్థం చేసుకోలేకపోవడం ప్రధానవస్తువుగా చిత్రించారు. ఇది చిత్తదృతి కలిగించే రచన, కావున రావుగారి విభజనప్రకారం మూడో తరగతికి చెందింది.

ఈ సంపుటిలోని వ్యాసాలు - 'కావ్యాలలో నీతిబోధ', 'సాహిత్య భవితవ్యం' - సాహిత్య ప్రయోజనాన్నీ, సాహిత్య తత్వాన్నీ పరామర్శించేవి. ఎన్నదగిన వ్యాసాలు. రెండో వ్యాసంలో, ఇదివరకే సూచించినట్లు, రావుగారు సాహిత్యతత్వాన్ని నాలుగు తరగతులుగా విభజిస్తూ, ఆ విభజన "ముఖ్యంగా సామాజికుల హృదయస్పందనపై ఆధారపడింది" అన్నారు. అవును తర్వాత కవికీ లోకానికీ ఉన్న సంబంధాన్ని గట్టిగా నొక్కిచెబుతూ "అధివ్యాధి పీడితులు, క్షుత్పిపాసార్తితులు అయినవారు యోగానికి వలెనే కావ్యనిర్మాణా స్వాదనలకు అనర్హులు, అశక్తులు" అన్న నిర్ణయానికి

వచ్చారు. ఈ అభిప్రాయానికి, 1938 లో వ్యాసునిపాత్రద్వారా పలికించిన అభిప్రాయాలకూ ఎక్కడ పోలిక !

పోతే, రావుగారు సాహిత్య భవితవ్యాన్నిగూర్చి నిస్పృహ వ్యక్తం చేశారు. "సాయుధ సంఘర్షణ పరిహరించగలిగిన విశ్వకల్యాణప్రదలక్ష్యం కోసం రచయితలు అన్వేషణ సాగిస్తున్నారు. ఇంతవరకూ వారికి ఒక విస్పష్టదృష్టి ఏర్పడలేదు. విస్పష్టదృష్టి లేనప్పుడు రచన ఎలా వెలువడు తుంది? వెలువడినా అందులో జీవం ఎలా ఉంటుంది?" ఇది వారు చెప్పిన మొదటి కారణం. రెండోది: "భౌతిక భోగలాలసమైన ప్రజా నీకం కావ్యాస్వాదనను దూరమవుతున్నది.... ప్రభుత్వాలు రచయితలను, లలితకళాస్రష్టలను పూర్తిగా అనుశాసిస్తున్నవి ... భావస్వాతంత్ర్యం లేని చోట ఉత్తమకృతులు ఎలా వెలువడుతవి?" అన్నారు. నేటి పరిస్థితులను గూర్చిన పై పరామర్శ న్యాయంగానే ఉంది. కాని చిట్టచివర: "ఉత్తమ కృతుల ఆవిర్భావానికి సమాజంలో కొంత నిలకడ అవసరం.... స్థితిగతులు ఇంత త్వరగా మారుతున్నప్పుడు రచయితకుగాని పాఠకునకుగాని విస్పష్ట దృష్టి, విలువలు ఉండటానికి వీలున్నదా? ఈ యిరుపక్షాలు విభ్రాంతులై ప్రతిదీ తాత్కాలికమని భావించవా?.... సమాధ్యవస్థా పాదకాలైన కృతు లకు అవకాశం తక్కువ. తదాస్వాదన శక్తిగూడ సన్నగిలక తప్పదు...." అంటూ సందేహాన్ని నిస్పృహనూ వెలిబుచ్చారు. రావుగారిలా అనటం, నాగార్జునుల మాధ్యమికవాదంలో నిష్ణాతులైన రావుగారే యీ నిస్పృహకు లోనుగావటం ఆశ్చర్యం కలిగిస్తోంది. 'యత్సత్ తత్ క్షణికం', ఏది వాస్తవికమో అదంతయూ క్షణికమే. "యః ప్రతీత్య సముత్పాదః శూన్యతాం తాంప్రచక్షతే" ఈ 'ప్రతీత్య సముత్పాదః దృష్టిని ఆకళింపు చేసుకున్న రావుగారు 'నిలుకడ', 'విస్పష్టమైన విలువలు' అంటూ సమాజంలో జీవి తంలో, వాటిని కోరుతూ ఎలా భ్రాంతిలో పడుతున్నారో అర్థం కావటం

లేదు : 'సమాధ్యవస్థ' అంటే ఏమిటి?" అ స్థితి ఆర్య నాగార్జునుడు పేర్కొన్నట్లు "చతుష్కోటి (సదసదుభయానుభయాంతాల) వినిర్ముక్తం....మూర్త ప్రపంచంనుంచీ అమూర్త ప్రపంచానికీ, ఆ అమూర్త ప్రపంచంనుంచీ అసంవృతికీ వెళ్ళటమే"నని వ్రాసిన రావుగారే ఉత్తమ రచయితకు సమాజంలో పరిస్థితులు యిలా ఉండాలి అలా ఉండాలి అని కోరటం చూస్తే, ఆనాడు ప్రబంధకవులు 'రమణీప్రియ దూతిక తెచ్చి యిచ్చు....' అంటూ కోరికలు కోరినట్లుగా ఉంది. విలువలూ అభిప్రాయాలూ త్వరితంగా మారుతూ ప్రతిదీ తాత్కాలికమన్న భ్రాంతి' సర్వసామాన్యంగా అందరికీ కలుగుతూన్నదా సమాజంలో? అలా అయితే మంచిదే - అదే ప్రతీత్యసముత్పాద దృష్టి. అటువంటి దృష్టి కలుగుతూ విభ్రాంతులౌతున్న మనుష్యుల్లోనే 'అమూర్త ప్రపంచాన్ని' గురించీ 'చతుష్కోటి వినిర్ముక్తమైన' తత్వాన్ని గురించీ జిజ్ఞాసా, అన్వేషణా యితోధికంగా వృద్ధిచెందుతుంది. ప్రజానీకం భౌతిక భోగలాలసమౌతున్నదా. అవనీయండి? కామిగాక మోక్షగామి కాడు' ఇలాటి పరిస్థితులలోనే ఉత్తమ సాహిత్యసృష్టికీ, ద్రష్టా తత్వజ్ఞుడు అయిన రచయితకూ అవకాశం ఎక్కువగా లభిస్తుంది. షేక్స్పియర్‌నాటి ఆంగ్లప్రజానీకం, పెద్దననాటి ఆంధ్రప్రజ, కాళిదాసునాటి మనుష్యులూ భోగలాలసులే అనేమాట మరిచిపోతే ఎట్లా? నేటి రచయితలు వెదకవలసింది 'సాయుధ సంఘర్షణ పరిహరించగలిగిన విశ్వకల్యాణప్రద లక్ష్యం', అంటే కేవలం Political Solution కోసంకాదు : అలా చేస్తే అది పత్రికా రచనమే (Journalism) అవుతుంది. జర్నలిజం విపరీతంగా అభివృద్ధిచెందినంత మాత్రాన ద్రష్ట అయిన రచయిత నిస్పృహచెందవలసిన కారణం కనిపించదు. నేటి రచయిత 'ప్రతీత్యసముత్పాద దృష్టి' తత్వజిజ్ఞాసా, కలిగిఉండడమే కాదు, దాన్ని సాహిత్యకృషిలో రూపొందించే పద్ధతుల్నీ ప్రక్రియల్నీ అవలంబించాలి. అందుకు పరిస్థితులు ఈ యుగంలో అనుకూలించినట్లు గతంలో

ఎప్పుడూ అనుకూలింపలేదు అనే చెప్పాలి. రావుగారు యీ విషయమై యింకోసారి ఆలోచిస్తే, నిస్పృహను అధిగమించి, ఉత్తమ రచనలు చెయ్యగలుగుతారని ఆశిస్తున్నాను. (భారతి)

# హేతువాద మంటే ?

— ఎమ్. వి. రామమూర్తి

హేతువాదమంటే ఏమిటో ఆ దృక్పథాన్ని వివరించడానికి 41 ప్రశ్నలూ, జవాబులూ రూపంలో ఎమ్. వి. రామమూర్తి 'ప్రజాస్వామ్య ప్రచురణలు' అనే సంస్థ తరఫున తయారుచేసిన రచన ఇది.

"వ్యక్తివాదం, హేతువాదం, మానవవాదం ఈ సంస్థను శాసించే త్రికము" అంటూ ఎమ్. ఎన్. రాయ్‌ని మూలపురుషునిగా పేర్కొన్నారు పీటికలో రచయిత. హేతుత్వంద్వారా వ్యక్తి వికాసాన్నీ, వ్యక్తి వికాసం ద్వారా సమాజాభ్యుదయాన్నీ, తద్వారా మానవ కల్యాణాన్నీ అందుకోవడం ఈ దృక్పథలక్ష్యం. హేతుత్వం ప్రవృత్తేకాని, ప్రేరణకాదు. వ్యక్తి వికాసం ఏ ప్రేరణమీద ఆధారపడింది ? అంటే, దానికి "స్వేచ్ఛాపిపాస, సత్యాన్వేషణ మానవ మనుగడకు ప్రేరకాలు" అని సమాధాన మిచ్చారు.

"సౌందర్యోపాసన మానవునిలో అంతర్గతప్రేరణా ?" అన్న ప్రశ్నకు "మానవ జీవితంలో సౌందర్య ప్రభావాన్ని ఇదమిత్థమని నిర్ణయించలేము. మానవునిలో సౌందర్యోపాసన నిండి నిబిడీకృతమై ఉన్నది. అది అతని సృజనాత్మకశక్తి. ఇది హేతుత్వానికి వ్యతిరేకం కాదు. వైరుధ్యం లేదు. వ్యక్తి వికాసాన్ని దోహదపరిచేది, వ్యక్తిని పులకిత

పరిచేది హేతుయుతమే" అని సమాధానమిచ్చారు. ఇలా సంగీతంవంటి కళలూ, కవిత్వం, క్రీడలూ హేతువాదంలో చేర్చుకున్నప్పుడు సృజనాత్మక ప్రవృత్తిగా వ్యక్తి ఆధ్యాత్మిక అనుభూతుల్నీ, విశేష మానసిక స్థితుల్నీ చేర్చుకోవాల్సి వస్తుంది। అవన్నీ వ్యక్తి వికాసంలో భాగమే అవుతుంది కదా।

వ్యక్తి వికాసానికీ, సమాజశ్రేయస్సుకూ, సౌందర్యోపాసననీ క్రీడల్నీ అంగీకరిస్తూ, హేతువాదం మానవవాదంగా రూపొందినప్పుడు సంస్కృతిపరమైన వైయక్తిక, సామూహిక పద్ధతుల్లో, హేతుత్వానికి అందని, శాస్త్రీయదృష్టికి లొంగని, దోషరహితమైన ప్రక్రియలకు కూడా గుర్తింపుస్థానం ఇవ్వవలసి ఉంటుంది. అప్పుడు మతాన్ని హేతువాదం సంస్కృతిపరంగా పరామర్శింపవలసి ఉంటుంది, శాస్త్రదృష్ట్యా కాదు।

( 14-1.81 ) ❋

# సమానతా! నువ్వెక్కడ?

— వివిధ రచయితలు

ఇందులో పంద్రెండు మంది 'సమానత'నుగూర్చి వ్రాసిన వ్యాసాలున్నాయి. కాని సమానతను నిర్వచించి నిర్దేశించే ప్రయత్నం చెయ్యకుండా తమకు తోచిన, తెలిసిన అసమానతలను గబగబా ఏకరువుపెట్టే ప్రయత్నమే చాలామంది చేశారు. మహీధర రామమోహనరావు, కె.వి. రమణారెడ్డి, అల్లం రాజయ్య, జ్వాలాముఖి తమ వ్యాసాల్లో మార్క్సిజమ్ తాలూకు చిలుకపలుకుల్ని వల్లించేరు. అడవికొలను పార్వతి, మల్లాది

వెంకటసుబ్బమ్మ స్త్రీ - పురుషుల మధ్యగల అసమానతలను, స్త్రీకి అనాదిగా జరుగుతున్న అన్యాయాన్నీ, స్త్రీ సాధించవలసిన హక్కుల్నీ, స్థానాన్నీ వివరించారేతప్ప, సమాజాన్నిగాని జీవితాన్నిగాని సమగ్రంగా ఉపలక్షించే ప్రయత్నం చెయ్యలేదు. పోతే, వుప్పాల చిట్టిసాయిబాబు, గుంటుపల్లి రామారావు ఏవో తమకు తోచిన మాటలు నాలుగు చెప్పారు తప్ప విషయాన్ని సీరియస్‌గా తీసుకున్నట్లు తోచదు. గంటి శ్రీరామమూర్తి - "అసమానత ప్రకృతిసిద్ధం, సమానత మానవసాధ్యం. ప్రకృతిలో సర్వత్ర వైవిధ్యం, వ్యత్యాసం కనిపిస్తూంది" అంటూ ప్రారంభించారు కాని 'అసమానత'కూ 'వైవిధ్యం' లేక 'తేడా'కు గల భేదాన్ని వివేచించేబదులు, వైవిధ్యమే అసమానత అంటూ నిర్ణయించే స్థితిలో పడ్డారు : వైవిధ్యం లేకపోతే సృష్టి ఎలా ఉంటుంది ? అని ప్రశ్నించుకోలేదు. తరువాత 'అసమానత' తొలగించడం అంటే అందరికీ శాంతి, సౌఖ్యం, తృప్తి కలిగించడం అనే నిర్వచనంతో మరో ధోరణిలో సాగిపోయారు. దీని పర్యవసానం "నవమానవుడు రావాలి. వీణ్ని ప్రయోగశాలలో తయారుచెయ్యలేం. సంఘంలో వ్యక్తిలో మార్పు రావాలి. దానికి వీలుగా విద్యావిధానం మారాలి. క్షమ, సౌశీల్యం, ఇత్యాదులు అలవడాలి" అంటూ మతంలోకీ, సంస్కరణలోకీ తిరోగమించారు. నిష్ఠల వెంకటరావు ప్రపంచ మేధావుల్ని ముందు పెట్టుకుని విచ్చలవిడిగా శాఖాచంక్రమణం చేసి, 'రంగుదేసు, పొట్టిపొడుగులను నిర్మూలించాలి. ప్రపంచం మొత్తంమీద ఒకే భాష ఉండాలి' అంటూ పంచసూత్ర ప్రణాళిక తయారు చేశారు. మంథా వెంకటరమణరావు - సృష్టిలో 'వైవిధ్యం', 'అసమానత' ఒకటి అనే భ్రమలో పడలేదు : మనిషి కత్తీ, బల్లెం వగైరా కనిపెట్టిన నాటినుంచీ 'అసమానత' పుట్టింది అంటూ, "ఏదో విధంగా సాటి, తోటి మానవుడికన్న అధికుణ్ని అనిపించుకోవాలన్న జిజ్ఞాసే మనిషికీ మనిషికీ మధ్యని అసమానతకి మూలస్తంభం అవుతుంది" అన్న చక్కని నిర్ణయా

నికి వచ్చారు. ఈ భావాన్ని చరిత్ర రీత్యా విస్తృతపరుస్తూ, 'సమానత్వానికి కృషి చేస్తున్నాం' అని చెప్పే రాజకీయవాదులు ఎలా తమ ఆధిక్యతనీ, ప్రాభవాన్నీ నిలబెట్టుకునే ప్రయత్నం చేస్తున్నారో వివరించారు. "రిజర్వేషన్లు పెట్టి మన రాజ్యాంగం ఈ వర్ణవ్యవస్థకి శాశ్వత పునాదులు వెయ్యగా రాజకీయ నాయకులు తమ వోట్లు నిలబడి పదవులు పోకుండా ఉండడానికి కులతత్వాన్ని రెచ్చగొడుతూ వెళుతున్నారు". అసమానత తగ్గాలంటే పోటీ తగ్గాలి. మనిషికి 'సెక్యూరిటీ' కావాలి. దీనికి అనుగుణంగా ఒక 12 అంశాల పట్టిక ఇచ్చి ముగించారు వ్యాసం. 'అసమానత'ను గూర్చి సీరియస్‌గా, నిశితంగా ఆలోచించింది వీరొక్కరే. పోతే ఎమ్. వి. రామమూర్తి గారుకూడా వ్యాసంలో అన్నిరకాల అసమానతలను గూర్చి చర్చిస్తూ, చివర 'సమానత' యొక్క అసలైన అంతరార్థం వారికీ వీరికీ ఉండేదీ, లేనిదీ తనకున్నదా అన్న ప్రశ్నకాకుండా 'తన వ్యక్తిత్వ వికాసానికి అడ్డువచ్చే బంధాల నన్నింటినీ, శారీరక మానసిక ప్రతిబంధకాలను కూడా, అధిగమించే స్వేచ్ఛ తనకున్నదా అన్న ప్రశ్న ఒక్కటే 'సమానతను' నిర్వచిస్తుందన్నారు: ఇది సరియైన అవగాహన. "సమానత్వం లేనిది స్వేచ్ఛను అనుభవించలేము కదా, అట్లే స్వేచ్ఛలేనిది సమానత్వాన్ని సాధించలేము. ఇవి పరస్పర ఆధారితాలు. వీటిమధ్య వైరుధ్యం ఉన్నదని ప్రచారం చెయ్యడం ఉదాహరణకు ఆర్థిక అసమానత నిర్మూలించడంకోసం స్వేచ్ఛ కోల్పోయినా ప్రమాదం లేదని చెప్పడం వంచన, మోసం. అందువల్ల స్వేచ్ఛ సమానత్వం ఆశించే స్త్రీ పురుషులు, దాన్ని వారూ తదితరులూ ఎవరికి వారుగా అనుభవించే స్థితి రావాలి. ఇది ఏదో ఒక వ్యక్తివల్ల, ఒక మహాత్ముడు, నాయకుడు, ప్రవక్తవల్ల అయ్యే పనికాదు. ఇది ప్రజల మధ్య సహకారంపై (పోటీ కాదు) ఏర్పడుతుంది. మానవులందరిలో హేతుత్వం ఉన్నది కనుక వారంతా సమానులు. మానవాభ్యుదయానికి మానవుడే కొలమానం" అన్నారు. సమానతను నిర్వచించింది వీరొక్కరే.

ఈ పుస్తకంలో ఉపర చెప్పిన ఈ రెండు వ్యాసాలూ చదువదగినవీ ఆలో చింపదగినవీ. (7-1-81)

# దేవతలు అంతరిక్ష యాత్రికులు మాత్రమేనా ?

— ఎరిక్‌వాన్ డానికెన్

చంద్రునిమీద మనిషిపాదం పెట్టాక, అంతరిక్షంలో సౌరమండలా నికి చెందిన ఇతరగ్రహాలకు ప్రయాణం చెయ్యడాన్నిగూర్చి, సౌరకుటుం బాన్ని దాటి నక్షత్రాలకు వెళ్ళడాన్నిగూర్చి కౌతూహలం పెరిగింది. పెరగ డమే కాదు. మానవుని అటువంటి ప్రయాణాలు సాధ్యమే అన్న విశ్వా సమూ ఏర్పడుతోంది. దానితో మానవునివలెనే చైతన్యవంతులైన జీవులు, పరిణామస్థాయీ భేదంతో, వైవిధ్యంతో ఇతరగ్రహాలమీద తప్పక ఉంటా రనే వూహ ధృవపడుతోంది. ఈ దృక్పథంతో భూమియొక్క గత చరి త్రనూ, సుమేరియన్ ఈజిప్షియన్‌వంటి ప్రాచీన నాగరికతనూ, వాటి తాలూకు అద్భుతనిర్మాణాలనూ, హైందవపురాణ గ్రంధాలలోని కల్పన లనూ, బైబిలులోని పాత నిబంధనలోని అద్భుతాంశాలనూ పరిశీలించి నప్పుడు కొత్త వూహాలు జనించడానికీ, కొత్త సమన్వయాలూ, అర్థాలూ స్ఫురించడానికీ, మానవచరిత్రనుగూర్చి ఏర్పడిఉన్న పరిమితమైన, సంకు చితమైన సిద్ధాంతాలు తలకిందులు కావడానికీ, అవకాశం ఉన్నదనే ప్రతి పాదనను పటితలముందు పరిశీలనకు తెస్తున్నదీ గ్రంధం. ప్రతి దేశం లోనూ దేవతల్ని గురించీ, దేవతలకూ - మానవులకూ గతంలో గల

సంబంధాల్ని గూర్చి పరంపరాగతంగా వచ్చే కథలూ, సాహిత్యమూ ఎంతో ఉన్నది. ఆ సాహిత్యాన్ని కేవలం మతంతో మూఢవిశ్వాసంతోనూ ముడిపెట్టి హేతువాదంతో నిరాసం చెయ్యడంలో, బుద్ధిపూర్వకంగా కళ్ళకు గంతలు కట్టుకోవడమే అవుతున్నదేమో అనే శంకనూ, జిజ్ఞాసనూ రేకెత్తించే ప్రయత్నం జరిగింది పుస్తకంలో. రచయిత ఇందు చూపిన నిదర్శనాలూ చేసిన వాదమూ ఎన్నో భావాల్ని ధ్వనింపజేస్తున్నాయి. అంతరిక్షంనుంచీ వచ్చిన ఇతర గ్రహాల యాత్రికులు భూమిమీద ఉన్న మానవుల్ని ఒకప్పుడు ప్రభావితుల్నిచేసి, ఇక్కడి విజ్ఞానానికీ, సంస్కృతికీ కారకులయి ఉంటారనీ మానవ సమాజం తప్పుదారి తొక్కిన సమయంలో ప్రళయమూ, వినాశమూ కలిగించి మళ్ళీ ఆ పరిణామం పునరావృత్తం అయ్యేలా చెయ్యడానికి వాళ్ళే కారకులై ఉండవచ్చుననీ ఇలా చరిత్ర అనేది ఆదిమ మానవుని దగ్గరనుంచీ కేవలం అభివృద్ధిచెందుతూ వచ్చిన మనకు తెలిసిన ఒకానొక వైజ్ఞానిక, సాంస్కృతిక విన్యాసంమాత్రమే కాదనీ, ప్రకృతిలోని ఋతువుల్లాగే, మానవచరిత్ర చక్రనేమి అనీ, కాలంయొక్క అనంత పరిభ్రమణమనీ, అందులో భూమి అసంఖ్యాకమైన రంగస్థలాల్లో ఒకానొక రంగస్థలమనీ, మనం చూడబోతున్న భవిష్యత్తూ, సాధించబోతున్న విజయాలూ అవి గతంలోకి మళ్ళీ ప్రయాణమే తప్ప కొత్త విషయమేమీ కాదని చాలా భావస్ఫోరకంగా ఎన్నో వూహల్ని రేకెత్తిస్తున్నవీ పుస్తకంలోని విశేషాలు. ప్రతి హేతువాదీ తన హేతువాదపు భూమికలను పరిశీలించి, తన దర్శనాన్ని పునర్నిర్మాణం చేసుకోవలసిన అవసరం ఉన్నదనీ, అంతరిక్ష ప్రయోగాలూ, ఈ మధ్య వైజ్ఞానికంగా సాధ్యమయి అపూర్వవిజయాలూ ఆదర్శాన్ని చాలా విస్తృతం చేస్తూ, పురాణకల్పనలను వాస్తవాలుగా నిరూపించే శక్తి కలిగిఉన్నాయనీ రచయిత తన జిజ్ఞాసద్వారా స్పష్టం చేశారు. పఠిత భావనకూ. వూహకూ హేతు వివేచనకూ ప్రతి అంశాన్నీ చర్చాంశంగా వదిలిపెట్టడం ఈ పుస్తకంలో ఎన్నదగిన గుణం.

ఈ గ్రంథం జర్మన్‌నుంచీ ఇంగ్లీషుకీ, ఇంగ్లీషునుంచీ తెలుగులోకీ వచ్చింది. తెలుగులోనూ, విషయం సుబోధకంగానే ఉన్నది. కాని 'సెవేగో' అనే ఈ అనువాదపుడు చాలాచోట్ల తెలుగు నుడికారాన్ని గూర్చి అశ్రద్ధ వహించడంతో, కొన్ని పదాలను అపార్థం చేసుకోవడంతో, రచన ఉండ వలసినంత నిర్దుష్టంగా, సాఫీగా లేకపోవడం లోపమే అని చెప్పాలి. కళ్ళగంతులు (బ్లింకర్స్) అనేదాన్ని 'మిణుకరింపులు' (బ్లింకింగ్స్) అను కోవడం (పుట 66). "అనేక ప్రశ్నలతో, నిగూఢ రహస్యాలతో స్నేహం ఏర్పరచుకోవలసివస్తుంది. (పుట 67) వాటిని 'సమన్వయించుకోవాల్సి' ఉంటుంది అనడానికి (ఇంగ్లీషులో రికన్సయిల్ అని ఉంది కాబోలు). "వాళ్ళ నోటి దంతాలమీద సత్యవంతమైన, నీతివంతమైన కొత్త ప్రపం చాన్ని సృష్టించడానికి మనం సిద్ధంగా ఉండాలి. (పుట 63) - 'ఇన్ ది టీప్ ఆఫ్ దేర్ అపోజిషన్' అన్న ఇంగ్లీషు నుడికారానికి మక్కీకి మక్కీ తర్జుమా అన్నమాట. "వాస్తవంలో తొక్కివెయ్యబడతాడు" (క్రష్‌డ్ బై ది ట్రూత్). "ఆదిమానవులచేత నివాసితమై ఉన్నాయి" (పుట 64). ఇలాంటివి కోకొల్లలు. వీటిల్లోనూ తలమానికంలాంటివి, మనల్ని చకితుల్ని చేసేవీ నవ్వు పుట్టించేవీ కొన్ని ఉన్నాయి. మచ్చుకి ఒకటి "చార్లెస్ పియాన్‌స్మిత్ సుదీర్ఘ గ్రంథంలో మనం మన భూగోళానికీ ఈ ప్రపంచ ప్రఖ్యాత కూచిదిబ్బ సమాధికీ మధ్య ఉన్న అనేకమైన వెంట్రు కలను నిటారుగా నిలబెట్టగల సంబంధాలను చదవవచ్చు. (పుట 146). అంటే భూగోళానికీ - పిరమిడ్‌కీ సంఖ్యాశాస్త్ర రీత్యా చాలా అర్థవంతమైన సంబంధాలున్నాయి. అని గ్రహించేకొద్దీ మనకు 'రోమాంచం' కలిగి ఒళ్ళు పులకిస్తుంది అని భావం. కొన్నిచోట్ల 'పళ్ళు పులిసేలా' ఉంది అనువాదం. ప్రపంచ విజ్ఞానంతోబాటు తెలుగులో అనువాద పరిజ్ఞానమూ పెరగవలసిన అవశ్యకతను నిరూపిస్తున్నదీ పుస్తకం. (6-1-78)

35)

# తెలుగు నవలా సాహిత్యంలో మనో విశ్లేషణ

— కోడూరి శ్రీరామమూర్తి

1977-78 లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీవారు పై విషయం మీద నిర్వహించిన పోటీలో బహుమతి పొందిన గ్రంథం ఇది. తెలుగు నవల పుట్టుపూర్వోత్తరాలూ, దానిమీద పాశ్చాత్య సాహిత్యోద్యమాల ప్రభావమూ, రియలిజమ్, నేచురలిజమ్, మార్క్సిజమ్, ఎగ్జిస్టెన్షలిజమ్ దృక్పథాలనుగూర్చిన సంక్షిప్త వివరణ - అన్నీ కేవలం 18 పుటల పరిధిలో ఉపోద్ఘాతంగా మొదటి అధ్యాయాన్ని రూపొందించడంలోనే రచయిత శక్తిసామర్థ్యాలు గోచరమవుతున్నవి. విషయాన్ని డొంకతిరుగుడు లేకుండా అలతిమాటల్లో (వీలైనచోట్ల ఇంగ్లీషు పారిభాషికపదాల్నీ, తెలుగు అనువాదాల్నీ వాడుకుంటూ) సూటిగా చెప్పడం ప్రధానమైన మంచి లక్షణం. ఈ గ్రంథంలో రచయిత అర్థశాస్త్రంలో అధ్యాపకుడైనా, తెలుగు నవలా సాహిత్యాన్నీ, ఆధునిక మనోవైజ్ఞానిక, సాహిత్య విమర్శ గ్రంథాలనీ విరివిగా చదివి, సరియైన అవగాహనతో రచనకు పూనుకున్నట్లు తెలుస్తున్నది.

రెండవ అధ్యాయం "మనో వైజ్ఞానికశాస్త్రంలోని ప్రసిద్ధ సిద్ధాంతాలు." ఇందులో ఫ్రాయిడ్, ఆడ్లర్, యూంగ్‌ల మూడు విభిన్న ధోరణుల్ని వివరించే ప్రయత్నం జరిగింది. పై ముగ్గురి శాస్త్రవేత్తలలోనూ ఫ్రాయిడ్ సిద్ధాంతాలనుగూర్చి చేసినంత అధ్యయనం మిగతా ఇద్దరి సిద్ధాంతాలను గూర్చి రచయిత చేసినట్లు తోచదు. ముఖ్యంగా ఈ లోటు యూంగ్ విషయంలో కనిపిస్తుంది. యూంగ్ దృక్పథంలో ముఖ్యమైన 'సమగ్ర

వ్యక్తిత్వ సాధన' గూర్చి రచయిత వివరించలేదు. 'ఆధార గ్రంథ పట్టిక'ను బట్టికూడా రచయిత యూంగ్ మూల గ్రంథాలను బొత్తిగా చూడలేదనీ ఇతరులు యూంగ్‌ను గురించి వ్రాసిన పుస్తకంమీదే ఆధారపడ్డారనీ తెలుస్తోంది.

మూడవ అధ్యాయం - "నవలా రచనపై మనోవిశ్లేషణ సిద్ధాంతాల ప్రభావం, విశ్వసాహిత్యంలో." ఇందులో కొన్ని ప్రఖ్యాత రష్యన్, ఇంగ్లీషు నవలల్ని గురించీ, చైతన్యస్రవంతి పద్ధతి శిల్పాన్ని గురించీ మాత్రమే ఉన్నది. అమెరికన్ నవలల్ని గురించీ ఫ్రెంచి, ఇటాలియన్, జర్మను నవలల్ని గురించీ లేదు. లేనప్పుడు 'విశ్వసాహిత్యం' అనే శీర్షిక అనవసరం. నిజానికి ఒక్క చైతన్యస్రవంతి పద్ధతితప్ప, తాను తీసుకున్న విషయానికి (తెలుగు నవలలు) రష్యన్, ఇంగ్లీషు నవలల్ని గూర్చిన వివరణ ఈ అధ్యాయంలో అప్రస్తుతమే ! కాని తెలిసిందంతా వ్రాయలనే ఉబలాటం రచయితని ప్రేరేపించినట్లు తోస్తుంది.

నాలుగూ, అయిదూ అధ్యాయాల్లో "తెలుగు నవలా పరిణామంలో మనస్తత్వ విశ్లేషణ," రెండు భాగాలుగా మొదటితరం నవలల్లోనూ, తర్వాత అస్తిత్వవాదం ప్రధానమైన నవలల్లోనూ ఎలా అభివ్యక్తమైనదీ చర్చించారు. రాజశేఖర చరిత్రము, గణపతి, తుఫాను, అడివి శాంతిశ్రీ, మాలపల్లి, ఆత్మబలి (శ్రీపాద), మంచీ - చెడూ (శారద), కీలుబొమ్మలు నవలల్లో కొన్ని భాగాలు, కొన్ని పాత్రలు ఇక్కడ చర్చకు వచ్చాయి. తర్వాత అస్తిత్వవాదం ప్రధానమైన గోపీచంద్ నవలలూ, హిమజ్వాల (వడ్డెర చండీదాస్), మైనా (శీలా వీర్రాజు), సంసారవృక్షం (అర్. ఎస్. సుదర్శనం) పరిశీలించబడ్డాయి. ఈ అధ్యాయాలలో చర్చా, పరిశీలనా సహేతుకంగానూ, అవగాహనతో కూడినదిగానూ ఉన్నది. ఆయా నవలలు చదివిన పాఠకునికి ఆసక్తి కలిగించి, అవగాహనను పెంచే ధోరణిలో

ఉన్నది. పండితులకోసమే వ్రాయబడినట్లు లేకపోవడం ఒక గొప్ప సుగుణం.

ఆరు, ఏడు అధ్యాయాల్లో "మనస్తత్వ విశ్లేషణ ఒక స్థూలదృష్టి" అనే శీర్షికక్రింద విశ్వనాథ, చలం నవలల పరామర్శ ఉన్నది. ఈ అధ్యాయాలలో రచయిత మనస్తత్వ విశ్లేషణ తాలూకు సూత్రాలని అన్వయించిన తీరు వివాదగ్రస్తంగా ఉన్నది. అన్నీ వివరించడానికి ఈ సమీక్ష చాలదు. ఉదాహరణకి - 'మైదానం' నవలలో రాజేశ్వరిని 'నింఫోమేనియక్'గా ముద్రవెయ్యడం కుదరదు (131వ పుట). అమీర్, మీరాల నిద్దరినీ రాజేశ్వరి అంగీకరించడమంటే, తద్వారా రాజేశ్వరిలోని స్త్రీత్వానికి వలపు కత్తెగా, తల్లిగా రెండు విధాల పరిపూర్ణత నివ్వడానికే చలం ప్రయత్నించాడు. మనోవైజ్ఞానిక శాస్త్రరీత్యాకూడా కేవలం ఇద్దరు ప్రియుల్ని ఆదరించడంవల్లనే ఒక స్త్రీ 'నింఫో' అయిపోదు. ఆ లక్షణాలు వేరు. చలం పాత్రలమీద రచయితకు సానుభూతి లేనట్లు చలం నవలలమీద చేసిన పరామర్శలో చాలచోట్ల వ్యక్తమవుతున్నది.

ఎనిమిదో అధ్యాయం 'చైతన్య స్రవంతి పద్ధతి'ని గురించి. ఆ పద్ధతి తెలుగులో ఏయే నవలల్లో ప్రయుక్తమైందో ఒక రిపోర్టువలె తప్ప, పద్ధతిని గూర్చిన పరిశీలన నిశితంగానూ, క్రమబద్ధంగానూ రూపొందలేదు.

తొమ్మిది, పది, పదకొండు అధ్యాయాల్లో "తెలుగులో ప్రసిద్ధ మనోవిశ్లేషణ నవలలు" శీర్షికక్రింద చివరకు మిగిలేది, అసమర్థుని జీవయాత్ర, అల్పజీవి, వ్యక్తిత్వం లేని మనిషి నవలలు చర్చకు వచ్చాయి. మొదటి మూడు నవలలుకున్న సాహిత్య ప్రతిపత్తి నాలుగోదానికి లేదు. ఈ అధ్యాయాల్లో రచయిత ఇదివరకే ఈ నవలలమీద వచ్చిన మనోవైజ్ఞానిక విమర్శమీద ఎక్కువగా ఆధారపడి, సరియైన అవగాహన వ్యక్తంచేశారు. ఈ మూడు అధ్యాయాలూ ఈ గ్రంథం తాలూకు 'గుంజు' అని చెప్పవచ్చు.

పంద్రెండు, పదమూడు, పధ్నాలుగు అధ్యాయాల్లో "మానవ మనస్తత్వంలోని వైచిత్రి కొన్ని నవలలు" శీర్షికక్రింద ప్రసిద్ధమయినవీ, కానివీ చాలా నవలలు చర్చకు వచ్చాయి. ఉదాహరణకు - రంగనాయకమ్మ నవలల్లోని పురుషద్వేషం 'కేస్ట్రేషన్ కాంప్లెక్స్' ఫలితంగా అవతరించిన విపరీత మనస్తత్వం అన్నారు (238 వ పుట). ఈ మూడు అధ్యాయాలూ ఆధునిక, తెలుగు నవలల్ని గురించి మనోవిజ్ఞానశాస్త్రరీత్యా ఆసక్తి కలిగించే వ్యాఖ్యానాల్ని అందిస్తున్నాయి. అవి నవలలు చదివే సామాన్య పాఠకులందరికీ కుతూహలం కలిగించేలా ఉన్నాయి. రచయిత వెలిబుచ్చిన అభిప్రాయాలన్నింటితో ఏకీభవించకపోవచ్చు. అది వేరే విషయం.

పదిహేనో అధ్యాయం చివరిది - 'పరిశిష్టము, పర్యాలోకనము'. ఇందులో ఒక్క ఎరిక్ ఎరిక్‌సన్‌మీదే ఆధారపడి రచయిత మానవజీవత దశల్ని పేర్కొంటూ తెలుగు నవలా సాహిత్యాన్ని పర్యాలోకించే ప్రయత్నం చేశారు. ఫలితంగా ఐడింటిటీ క్రైసిస్‌ని చిత్రించిన నవలలు సకృత్తుగా ఉన్నాయి అన్నారు....తర్వాత 'యూంగ్' సిద్ధాంతం తెలుగు నవలాకారులను అంతగా కదిలించలేకపోయింది అన్నారు (253 వ పుట). ఇది నిజం కాదు : రచయిత యూంగ్ సిద్ధాంతాన్ని లోతుగా అధ్యయనం చెయ్యక పోవడమే అందుకు కారణం. చలం నవలల్లో అరుణ, అమీనావంటి ఆర్కిటైపల్ పాత్రలేకాదు, 'మళ్ళీ వసంతం' నవలలో సమగ్ర వ్యక్తిత్వ సాధన కూడా ఉన్నది. (చూ. డా. ఉప్పలపాటి శ్రీరామమూర్తి ఈ నవలను గూర్చి 'సమాలోచన' పత్రికలో వ్రాసిన వ్యాసం). ఇవి రచయితకు కనిపించలేదు.

తెలుగు నవలలమీద శాస్త్రీయమైన పద్ధతిలో సరళంగా వ్రాసినందుకు ఈ విమర్శ గ్రంథ రచయితకు హార్దికాభివందనలు.



# తెలుగు నవలా వికాసం

— మొదలి నాగభూషణ శర్మ

'నవలను వర్తమానకాలపు మహాకావ్యం అనవచ్చు. ఇంత సంఘర్షణమయమూ, క్లిష్టమూ అయిన యుగంలో కావ్యం అదృశ్యంఅయి, దానిస్థానే గద్యం - అందునా గద్యకావ్యం ప్రచురంకావడం సహజమే' నాటకం, కావ్యం మొదలైన అన్ని ప్రక్రియల పద్ధతులు నవలలో మనరుద్యోతం అవుతాయి. అందువల్లనే ఈనాడు మిగిలిన అన్ని సాహిత్య ప్రక్రియలకన్న 'నవల' అత్యంత సమాదరణీయమైంది.' (2 వ పుట). గ్రంథ ప్రారంభంలో ఈ వాక్యాల్ని చూచి ఆధునిక సాహిత్యప్రక్రియగా నవలలో వచ్చిన పరిణామం. నాటకం కావ్యంవంటి ఇతర ప్రక్రియలు అందులో అంతర్నిహితంఅయిన వైనం, సోపపత్తికంగా నిరూపిస్తుందేమో ఈ గ్రంథం అని ఆశిస్తే ఆశాభంగం తప్పదు. గ్రంథం మొదటనున్న పై వాక్యాలు కేవలం యాదాలాపంగా లోకాభిప్రాయాన్ని వెలిబుచ్చడం తప్ప మరేమీ కాదు.

పోతే, నవల లక్షణాలను పేర్కొని, దాని సంక్షిప్త చరిత్రనూ, విషయానుగతమైన విశ్లేషణనూ జతచేసి ఆ ప్రక్రియలో వచ్చిన ఉత్తమ రచనలను పరిచయం చేస్తూ, 'పరిచయాత్మకమైన' గ్రంథాన్ని వ్రాయబూనుకున్నట్లు 'ప్రస్తావన'లో చెప్పుకున్నాడు రచయిత. రచయిత ఉద్దేశం ఎంతవరకు నెరవేరిందో ఈ పరామర్శలో తెలుసుకుందాం.

గ్రంథం మొదటిభాగంలో నవల లక్షణాలను వింగడించడంలో రచయిత పడిన తికమక వర్ణనాతీతం. నవల 'స్వరూపస్వభావాలు' అంటూ 14 సూత్రాలను చెప్పి, తర్వాత 'నవలలో ఉండే ముఖ్యమైన అంశాలు' అంటూ ఇతివృత్త నిర్మాణము, పాత్రచిత్రణ, సంభాషణ, కాలస్థల ఐక్య

తలు, శైలి, ఉద్దేశం అనే ఆరింటిని పేర్కొనడం జరిగింది. ఏమాత్రం ఆలోచించినా, ఈ ఆరింటిలోనే ఆ మొదటి 14 సూత్రాలు వివరణ ప్రాయంగా యిమిడిపోతాయని తెలుస్తుంది। ఉదాహరణకు పై 14 సూత్రాల్లో 8వది 'సహజమైన, స్వాభావికమైన శైలి దీనికి ప్రాణం' అనే సూత్రాన్ని 'శైలి' అనే అంశంక్రింద వివరణగా తీసుకోవచ్చును కదా। నిజానికి పై జెప్పిన చతుర్దశ సూత్రాలూ సూత్రాలు కావు। నవలనుగూర్చి ప్రచారంలో ఉన్న పదిమంది అభిప్రాయాలూ వరుసగా అంకెలు వేసి ఒక చోట ఉటంకించడం మాత్రమే। ఒక ప్రక్రియయొక్క లక్షణాల్ని నిర్ణయించే పద్ధతి ఏమిటో ఈ రచయితకు బొత్తిగా అంతుపట్టలేదు। ముఖ్యాంశాలుఅంటూ ఆరింటిని పేర్కొన్నా, వాటినిగూర్చి వివరణ వచ్చేప్పటికి ఇతివృత్తం, పాత్రచిత్రణ, ఉద్దేశం, భావచిత్రాలు, కాలం అనే 5 శీర్షికలే తేలాయి. అందులో భావచిత్రాలు పై ఆరింటిలో పేర్కొన్నది కాదు। ఇలా జరగటానికి కారణంకూడా బోధపడుతూనే ఉంది. పై ఆరింటిలో సంభాషణ, కాలస్థల ఐక్యతలు, శైలి అనే అంశాలు నిజానికి పాత్రచిత్రణలో, ఇతివృత్తనిర్మాణంలో అంతర్భాగాలే తప్ప వేరుగా 'అంశా'లుగా చెప్పవలసినవి కావు. నిజానికి 'కాలం'కూడా అటువంటిదే. అందువల్ల ఇతివృత్త నిర్మాణం (కథా సంవిధానం), పాత్ర చిత్రణ, ఉద్దేశం అనే మూడు ముఖ్యాంశాలనూ ప్రధానంగా తీసుకుని ఆ మూడింటి పరస్పర సంబంధాన్ని వివరించే ప్రయత్నం చేసిఉంటే పై జెప్పినన్ని అంశాలతో సూత్రాలతో తికమకపడవలసిన అవసరం తప్పేది। రచయిత అలా చెయ్యలేకపోయాడనేది స్పష్టం.

ఒక లక్షణాన్ని వివరించినప్పుడు, ఒక అభిప్రాయాన్ని ఉటంకించినప్పుడు వెంటనే ఉదాహరణలుకూడా యివ్వడం, దాన్ని సోపపత్తికంగా నిరూపించే ప్రయత్నం చెయ్యడం అవసరం. ఈ రచయితకు ఆ అలవాటు

లేమి! ఎక్కడైనా ఉదాహరణలు యిచ్చినా అవి సందర్భం లేనివిగా ఉంటాయి. తీర్థానికి తీర్థం. ప్రసాదానికి ప్రసాదం! ఇతివృత్తాన్ని సంఘటనాత్మకమైనది (Action Plot), వ్యక్తిశీలం ప్రధానమైనది (Character Plot) భావాత్మకమైనది (Thought Plot), అంటూ మూడురకాలుగా విభజించి మొదటిదానికి - చలం నవలలు, వేయిపడగలు; రెండవదానికి చంఘిజ్ ఖాన్, రుద్రమదేవి; మూడవదానికి - చివరకు మిగిలేది, అల్పజీవి ఉదాహరణలుగా యిచ్చాడు. నిజానికి చలం, విశ్వనాథ నవలల్లో ఇతివృత్తం 'భావాని'కి (అంటే దృక్పథానికి) సంబంధించినది. సంఘటనలూ పాత్రలూ ఆ దృక్పథ నిరూపణకే! వారి నవలలు న్యాయంగా మూడవ విభాగానికి (Thought Plot) చెందుతవి. అలాగే చంఘిజ్ ఖాన్, రుద్రమదేవి నవలలలో చారిత్రక సంఘటనలూ తత్పరిణామాలూ ప్రధానమైనవి కాబట్టి అవి మొదటి విభాగానికి (Action Plot) చెందుతవి. పోతే దయానిధీ (చివరకు మిగిలేది), సుబ్బయ్యా (అల్పజీవి) విశిష్టమైన పాత్రలు కావడంద్వారా ఆయా నవలల్లో సంఘటనలు ఏర్పడ్డాయీ, విలక్షణమైన జీవితదృక్పథాలు సిద్ధించాయి కాబట్టి ఆ నవలలు రెండవ విభాగానికే (Character Plot) ఉదాహరణలు. ఇలా ఏమాత్రం ఆలోచనా విచక్షణా లేకుండా పొసగని ఉదాహరణ లిచ్చినచోట్లు ఈ గ్రంథంలో ఎన్నో ఉన్నాయి. ఎత్తిచూపుతూపోతే మళ్ళీ ఒక గ్రంథం అవుతుంది!

ఇతివృత్త నిర్మాణానికీ (కథాసంవిధానము, సంఘటనలు) పాత్ర చిత్రణకీ శిల్పం దృష్ట్యా ఉన్న సంబంధాన్ని సంతృప్తికరంగా వివరించ లేకపోయాడు రచయిత :- 'పాఠకుడు ఎప్పుడూ 'ఫలానా పాత్ర అట్లా ప్రవర్తించి ఉండదు' అనుకోకూడదు. పైగా నేనైతే అలానే చేసి ఉందును' అనిపించేట్లు వ్రాయాలి. (ఈ వాక్యానికి అర్థమేమిటో సమీక్షకు నికి బోధపడటం లేదు!) ఈ విధంగా పాత్రచిత్రణని ఆయాపాత్రలు

చేసే కార్యాలద్వారా నిర్ధారించవచ్చు' (పుట 12) ఈ ధోరణిలో ఏమేమిటో వ్రాసుకుపోయాడు.

'మిగిలిన అన్నికళలకంటె సాహిత్యంలో 'వాక్కు'కు ఎక్కువ అవకాశం' అంటూ ఓ గొప్ప సత్యాన్ని కనిపెట్టిన ధోరణిలో 14వ పుటలో ఏమిటేమిటో ఆత్మాశ్రయపరాశ్రయ Subjective and Objective రచనల్నిగూర్చి సెలవిచ్చాడు రచయిత. ఇలాంటిచోట్ల రచయిత ఏమి చెబుతున్నాడో ఆయనకే తెలియాలి! బహుశా 'వాచ్యం'గా చెప్పడానికీ 'వ్యంగ్యం'గా చెప్పడానికీగల భేదాన్ని వివరించి, సాహిత్యంలో వ్యంగ్యమే ప్రధానమని చెప్పడానికి పడ్డ బాధ కాబోలు! 'వాచ్యం' అనడానికి 'ఆత్మాశ్రయ'మనీ, 'వ్యంగ్యం' అనడానికి 'పరాశ్రయ'మనీ వ్యవహరించడం ఎక్కడ నేర్చుకున్నాడీయన? అలాగే 'ప్రతిబింబా'నికి 'ప్రతీక'కూ భేదం ఏమిటో తెలియకుండా వ్యవహరించడం ఉన్నది. (పుట 21)

ఈ గ్రంథం మొదటిభాగాన్ని (1) నవల: స్వరూప స్వభావాలు (2) తెలుగు నవల: కొన్ని లక్షణాలు అనే అధ్యాయాలుక్రింద విభజించాడు. మళ్ళీ నాలుగో భాగంలో 'తెలుగు నవల: కథా కథన శిల్పం' అనే విషయం ప్రవక్తమౌతుంది. నవల లక్షణాలను చర్చించి, తర్వాత దాని చరిత్ర, కొంత విషయానుగతిక విశ్లేషణా, చివర కొన్ని నవలల పరిచయమూ చేయదలచుకొన్న రచయిత గ్రంథాన్ని మొత్తం నాలుగు భాగాలు చేసి, మొదటిభాగంలోనే 'కథా కథన శిల్పం' అనే విషయాన్ని కూడా చర్చించి ఉంటే విభజన సహేతుకంగా సవ్యంగా ఉండేది కదా!

అంతేకాదు. 'తెలుగు నవల: కొన్ని లక్షణాలు అంటూ 1 భా. 2 అధ్యాయంలో తెలుగు నవల పుట్టుకనూ, తెలుగు నవలల్ని ప్రథమంగా ప్రోత్సహించిన 'చింతామణి' పత్రికనూ, ఆ పత్రిక పేర్కొన్న తెలుగు నవల లక్షణాలనూ ప్రస్తావించిన రచయిత, ఆ సంగతుల్నే చర్విత చర్వ

ణంగా 'తెలుగు నవల - యుగ విభజన - ప్రా... అనేలు - మొదటి దశ' అంటూ II భా. 1వ అధ్యాయంలోనూ, 'తొలి తెలుగు నవల' అనే II భా. 2వ అధ్యాయంలోనూ, 'తెలుగు నవల - సంక్షిప్త చరిత్ర - ప్రారంభయుగం' అనే II భా. 3వ అధ్యాయంలోనూ, మళ్ళీ మళ్ళీ ప్రస్తావించాడు. అంటే I భా. 2వ అధ్యాయం, II భా. 1, 2, 3 అధ్యాయాల్లోని విషయమంతా ఒకటే అయినప్పుడు ఒక్క అధ్యాయంలోనే వ్రాసివుండ వలసింది. ఒక విషయాన్నిగూర్చి కొంత ప్రసక్తి తీసుకురావడమూ - ముగించడమూ, మళ్ళీ అదే ప్రసక్తి తీసుకురావడమూ చెప్పిందే చెప్పి పూర్తిచెయ్యకుండా పోవడమూ, దాన్ని మళ్ళీ మూడోమారు నాలుగోమారు చెప్పడమూ, ఈ పద్ధతి చూస్తే ఈ రచయితకు విషయాన్ని వింగడించడం గాని, పునరుక్తి లేకుండా చెప్పడంగాని, చెప్పదలచుకున్నదాన్ని సంపూర్ణంగా అసందిగ్ధంగా చెప్పడంగాని చేతగాదని తోస్తుంది.

తెలుగునవల పుట్టుకా, దాని ప్రాథమికదశా చర్వితచర్వణంగా చెప్పడం జరిగిందన్నాను. కాని ఈ దోషం ఇంతటితో ఆగలేదు. తెలుగు నవల సంక్షిప్తచరిత్రని 'ఆయా కాలాలలో ఉన్న ముఖ్యమైన ప్రవృత్తు లనుబట్టి' 5 భాగాలుగా విభజించాడు రచయిత - (1) ప్రారంభయుగం (2) అనువాదయుగం (3) వికాసయుగం (4) మనోవైజ్ఞానికయుగం (5) సమకాలీన యుగం. ఈ అయిదు శీర్షికలక్రింద గ్రంథం II భాగంలో ఏ సంగతుల్నీ అభిప్రాయాల్నీ చెప్పాడో మళ్ళీ II భాగంలో (1) తెలుగు నవల - సాంఘిక జీవితం - 1 (2) తెలుగు నవల - సాంఘిక జీవితం 2 (3) తెలుగు చారిత్రక నవల (4) తెలుగు నవలల్లో హాస్యం (5) అను కరణలు, అనువాదాలు (6) మనస్తత్వ నిరూపక నవలలు (7) తె. నవల - జాతీయోద్యమం (8) డిటెక్టివ్ నవలలు అనే శీర్షికలక్రింద కూడా ఆ సంగతుల్నే అభిప్రాయాలనే పునశ్చరణ చెయ్యడం జరిగింది. మొదటి విభజన కాలానుగతమూ, రెండవ విభజన విషయానుగతమూ

అనుకోవడానికి విషయప్రసక్తిలో ఏమైనా క్రొత్తదనం, భేదం ఉంటే కదా! మొదటిదాన్లో కేవలం శిల్ప పరిణామాన్నిగూర్చి, రెండోదాన్లో ఇతివృత్త పై విధ్యాన్నిగూర్చి సామర్థ్యంతో వేరుగా వ్రాయగలిగితే బాగుండేది నిజమే కాని, ఆ శీర్షికలకు పుష్టితెచ్చి కొత్త 'సరుకు' లేనప్పుడు, ఈ పిష్టపేషణం ఎందుకు ? చెప్పదలచుకున్నది కాస్తా ఒక్కచోటే చెబితే, గ్రంథవిస్తరణా, ముద్రణఖర్చులూ, పుస్తకం ఖరీదూ, పాఠకునికి చిరాకూ తగ్గేవి !

ఈ రచయితతో వచ్చే మరో చిక్కేమిటంటే యితని అభిప్రాయాలు నిష్కర్షగా ఏమిటో మనకు తెలియజెప్పకపోవడం ! ఉదాహరణకి - 'శ్రీ రంగరాజు చరిత్ర (1872)....కొంత వైచిత్రి, కథాకల్పన వుండి, నవల అన్న పదానికి అనువైన రచనగా సాగింది' (పుట 46) తర్వాత ఆ నవలలో కథని క్లుప్తంగా వివరించి, రచయిత ప్రక్కపుటలో యిలా తీర్పు యిస్తాడు : ఇదీ కథ. కథలో కల్పన నామమాత్రం....' (పుట 47) అయితే రచయిత అభిప్రాయం ఆ నవలలో 'కథకల్పన' ఉన్నదనా ? లేదనా ? 46 వ పుటనుంచీ 47 వ పుట కొచ్చేసరికే అభిప్రాయం మారిపోయిందా ?

> '1872 లో వచ్చిన శ్రీ రంగరాజు చరిత్రకూ 1880 లో వచ్చిన చరిత్రకూ మధ్య నవలలు ఏమీ వ్రాయబడ్డట్టు లేదు' (పు. 47)
> ' వివేక చంద్రికలో వరుసగా ప్రకటింపబడి 1880 లో పుస్తక వచ్చింది....రాజశేఖర చరిత్రము' (పు. 48)

వలం పాశ్చాత్య నాగరకతమీద వ్యామోహం ఉన్నవాడు కాదు . 'ఇంగ్లీషు చదువుల ప్రభావంవల్ల ఉత్తేజితులై, పాశ్చాత్య దాని పద్ధతులు, దాని ఆచార వ్యవహారాలు కేవలం బాహ్య మాత్రమే చూచిన కొందరు రచయితలు ఆ సమాజం విలువ ట్టి జీవితాన్ని తెలుగునాట సుస్థాపితం చెయ్యాలని ఉద్దేశించారు.

అట్టివారిలో అగ్రగణ్యుడు చలం' (పు. 129). చలంగారికి పాశ్చాత్య నాగరకతా వ్యామోహం ఉన్నదనా? లేదనా?

'అయితే వీటిని (చలం నవలలు) ఏ రకంగానూ సాంఘిక నవలలు అనడానికి వీలులేదు. ఈయన వ్రాసినవన్నీ వ్యక్తుల చరిత్రలు. ఈ వ్యక్తుల్నీ వారి జీవితాల్నీ సార్వజనీనం: సర్వకాలికం చేయడానికి వీలు లేదు' (పు. 130). 'స్త్రీ పురుషుల సంబంధాన్ని వాస్తవికంగా, నిత్యజీవితానికి అతి సన్నిహితమైన సామాజిక వ్యవస్థగా చూపిన అతి ముఖ్యుల్లో చలం మొదటివాడు' (పు. 304). చలం నవలలు సాంఘిక నవలలు అయినట్లా? కానట్లా?

'మతాంతర వివాహాలలోని మంచిచెడ్డలను ఎత్తిచూపిన 'బలిపీఠం' శక్తిమంతమైన నవల' (పు. 131). 'వర్ణాంతర వివాహం చేసుకొన్న జీవితాలు ఎలా నడుస్తాయో చూపి 'కులాల ఆధిక్యత' అర్థంలేని సిద్ధాంతం అని రచయిత్రి ఈ నవలలో ప్రతిపాదించింది' (పు. 216). 'బలిపీఠం వంటి నవలలోకూడా సాంఘికంగా విభిన్నమైన అలవాట్లున్న ఇద్దరు వ్యక్తుల సాంసారిక జీవితం ఎంత కష్టమయం కాగలదో వివరించబడ్డది' (పు. 141). బలిపీఠం మతాంతర? వర్ణాంతర? వివాహాలని సమర్థిస్తున్నట్లా? లేనట్లా? ఏమిటి ఈ రచయిత అభిప్రాయం ఆ నవలని గురించి?

ప్రసిద్ధులైన రచయితలనుగూర్చి, వారి నవలలనుగూర్చి, క్లుప్తంగా కొన్ని వాక్యాలలో చెప్పవలసివచ్చినప్పుడు ఈరచయిత వెలిబుచ్చే అభిప్రాయాలు సత్యందూరంగాకాని, విడ్డూరంగాకాని, అర్థశూన్యంగాకాని ఉంటున్నాయి.

'రవీంద్రనాథ్ ఠాకూర్ సాంఘిక దురాచారాలమీద కత్తిగట్టాడు. వర్ణవ్యవస్థమీద ఆయన వ్రాసిన నవలలన్నింటిలోనూ ఆయన తీవ్రమైన విమర్శలు చేశాడు' (పు. 68)

'విశ్వనాథ సత్యనారాయణ. ఈయనమీద జాతీయోద్యమ ప్రభావం ఎక్కువగా కనిపిస్తుంది (పు 130). 'జాతీయోద్యమ'మంటే ఈ రచయిత అవగాహన ఏమిటో ప్రత్యేకంగా రచయితనే అడిగి తెలుసుకోవాల్సిన అవసరం కనిపిస్తోంది !

'ఇందులో (వేయి పడగలు) రచయిత తనకు నచ్చిన ఒక ఉద్దేశం ఎడ ఎక్కువ అభినివేశం చూపాడు. ఇందులో 1920-40 ల మధ్య కాలంలో తెలుగుదేశంలో జరిగిన సాంఘిక పరివర్తనం అంతా మనకు ద్యోతకం అవుతుంది' (పు. 130). 'వేయి పడగలు' ఏ సంవత్సరంలో వ్రాయబడిందో ఈ నవలా చరిత్రకారుడికి తెలీదా ఏమిటి ?

'జాతీయోద్యమంవల్ల ప్రభావితుడై చదువులకు స్వస్తిచెప్పిన సుందరం అన్న యువకుని కథ 'చదువు' (పు 131). సుందరం చదువు మానెయ్యడం ఆస్తి ఖర్చయిపోయి డబ్బు లేకనా ? జాతీయోద్యమం కోసమా ? రచయిత నవలని మళ్ళీ చదివితే బాగుంటుంది !

'కుటుంబ జీవితానికీ, ఆర్థికసమస్యకూ ఉన్న అవినాభావ సంబంధం గోపీచంద్ 'అసమర్థుని జీవయాత్ర'లోనూ, రాచకొండ 'అల్పజీవి'లోనూ, మనకు ద్యోతకం అవుతుంది' (పు 143). ఆ నవలల అంతర్యం అదేనా ?

'బుచ్చిబాబు 'చివరకు మిగిలేది' ఫ్రాయిడ్ సిద్ధాంతాలను నిశితంగా పరిశీలించి వానిని నేటి మానవజీవితానికి అనుగుణంగా ప్రత్యాఖ్యానం చేయడానికి ఉద్దేశించబడ్డ నవల'. (పు 202). అంటే ఏమిటో అర్థం ? 'ఇందులో ('చివరకు మిగిలేది') చూపబడ్డది 'ఎలక్ట్రా కాంప్లెక్స్'. దీనితో పాటు ఈ నవలలోని 'హామ్లెట్' చర్చకూడా 'ఈడిపస్ కాంప్లెక్స్'లోని మరో దృక్పథాన్ని చూపుతుంది' (పు 203). ఈ 'కాంప్లెక్స్' గొడవలేమిటో రచయిత, పాపం చాల తికమకపడిపోయారు !

ఫ్రాయిడ్‌నుగూర్చి, మనోవైజ్ఞానిక సిద్ధాంతాలనుగూర్చి 'పరిచయాత్మకంగా' రచయిత 'తెలుగునవల : 'మనోవైజ్ఞానికత' అనే 8 భా. 6

అధ్యాయంలో కొంత వివరణకు పూనుకున్నాడు. కాని కీలకమైన కాంప్లెక్స్'ల గొడవ సరిగా అవగాహన చేసుకున్నట్లు లేదు. 'తల్లిదండ్రులకూ, పిల్లలకూ మధ్య ఉండే ద్వేషానురాగాలను 'ఈడిపస్ కాంప్లెక్స్' అన్నాడు ఫ్రాయిడ్.... తండ్రివలన పిల్లలు పొందే భయ, అనురాగ, ద్వేషాలను ఈడిపస్ కాంప్లెక్స్ అనీ, తల్లి వలన పొందే భావాలను ఎలెక్ట్రా కాంప్లెక్స్ అనీ అంటారు.' (పు 198 - 199). ఇది శుద్ధతప్పు. తల్లిపట్ల తనయునికి ఉండే లైంగిక [రాగ] బంధం మూలంగా అతనిలో అజ్ఞాతంగా తండ్రి ప్రతిద్వంద్వి అనే భావం ఉండడంవల్ల పురుషునిలో ఏర్పడే మనోవైఖరి ఈడిపస్ కాంప్లెక్స్. అలాగే తండ్రిపట్ల కొమార్తెకు ఉండే లైంగిక [రాగ] బంధంమూలంగా ఆమె అజ్ఞాతంగా తల్లిని ప్రతిద్వంద్విగా భావించడంవల్ల స్త్రీలో ఏర్పడే మనోవైఖరి ఎలెక్ట్రా కాంప్లెక్స్. హామ్లెట్‌లోగాని దయానిధి [చివరకు మిగిలేది]లోగాని వ్యక్తమయ్యేది ఈడిపస్ కాంప్లెక్స్ మాత్రమే। రచయిత ఈ పుస్తకంలో మనోవైజ్ఞానిక సిద్ధాంతాలనుగూర్చి చెప్పినవదిగాని, ఆ నవలలనుగూర్చి వ్యాఖ్యానించినదిగాని సందిగ్ధంగానో లేకపోతే తప్పుగానో ఉండటం పాఠకులు గమనించాలి. తస్మాత్ జాగ్రత।

'తెలుగు చారిత్రక నవల' అనే అధ్యాయంలో చారిత్రక నవల విశిష్ట లక్షణ మేమిటో వర్ణించబోయి కృతకృత్యుడు కాలేకపోయాడు రచయిత. 'చారిత్రక నవల గతాన్ని గురించి చేసే చిత్రణ చరిత్రకన్నా కూడా సత్యానికి దగ్గరగాకూడా ఉండవచ్చు' [పు 149]. ఇక్కడ రచయిత ఏ 'సత్యా'న్ని నిర్దేశిస్తున్నాడో ఎక్కడా వివరించకపోవడంవల్ల చరిత్రకూ కల్పనకూ నవలారచనలో ఏర్పడే సంబంధాన్నిగూర్చిన చర్చ అంతా వృథా అయిపోయింది. వస్తునిష్ఠమైన సత్యానికీ (Factual Truth) భావనాత్మకమైన సత్యానికీ (Poetic Truth) తేడా ఉంది; ఒకచో రెండింటికీ వైరుధ్యంకూడా ఉంటుంది. వస్తునిష్ఠమైన సత్యాన్ని భావనాత్మకమైన

సత్యంగా మార్చేదే కావ్యసృష్టి; చారిత్రకనవలాసృష్టికూడా. ఇందులో చారిత్రక ఆధారాలు ఎంతమేర? కవి కల్పన ఎంతమేర? అనే మేళవింపునుబట్టి ఒక నవలయొక్క 'చారిత్రక' లక్షణం నిర్ణయమౌతుంది 148-151 పుటల్లో రచయిత ఈ విషయాన్ని చర్చించికూడా స్పష్టం చెయ్యలేకపోయాడంటే రచయిత సామర్థ్యాన్నిగూర్చి వేరుగా చెప్పనక్కరలేదు. ఇలా ప్రతి అధ్యాయాన్నీపట్టి చూడనక్కరలేదు. ఎక్కడ ఏ నాలుగు పుటలు చదివినా రచయిత అవగాహన భావవ్యక్తీకరణ ఏపాటిదో తెలిసిపోతూనే ఉన్నది.

పోనీ ఆయా నవలలు పట్టికలూ, అని వ్రాయబడిన తేదీలు అయినా నిర్దుష్టంగా, సమగ్రంగా యివ్వబడినాయా? అంటే ఆ ప్రయోజనమూ సిద్ధించలేదు ఈ పుస్తకంద్వారా.

ఈ పుస్తకంలో ప్రసిద్ధరచనలుగా ఎన్నుకోబడి అభివర్ణింపబడిన నవలలమీద ఎంతో విమర్శ యిదివరకే ఉన్నది. ప్రక్రియలో వచ్చిన ఉత్తమమైన రచనలపైకూడా విమర్శ అంతగా రాలేదు అని ప్రస్తావనలో రచయిత అన్న వాక్యం సరికాదు. ఈ రచయిత ప్రసిద్ధమైన తెలుగు నవలల్నిగూర్చి క్రొత్తగా, సొంతంగా చేసిన విమర్శకాని, ఏర్పరచిన దృష్టికాని ఈ పుస్తకంలో ఏమీలేదు. ఇదివరకే వచ్చిన విమర్శమీద తను ఎంతవరకు ఆధారపడి ఉన్నాడో రచయిత ఎక్కడా సూచన చెయ్యకపోవటంకూడా సముచితంకాదు. పోతే, ప్రక్రియమీద ఒక సమగ్ర గ్రంథం వ్రాయాలనే సంకల్పంతో పూనుకున్నందుకు రచయిత అభినందనీయుడు.

గ్రంథం నిర్మాణంలో, అభివ్యక్తిలో, చివరకు ఎన్నోచోట్ల వాక్య నిర్మాణంలో, భాషలో, లోపభూయిష్ఠంగా ఉన్నది. అంటే ఈ పరామర్శ ఉద్దేశం రచయిత తన గ్రంథాన్ని ఆమూలాగ్రం సవరించుకోవలసిన అవసరం ఎంతైనా ఉన్నది - అని చెప్పడమే!

ఈ గ్రంథముద్రణకు విద్యాశాఖ, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ కొంత ధనసాహాయ్యం చేసినట్లు తెలుస్తున్నది. గ్రంథాన్ని పరిశీలించి, సవరింపజేసి, ఆ సాహాయ్యం చేసిఉన్నట్లయితే మరింత బాగుండేది: యువరచయితలకు ప్రోత్సాహమే కాకుండా శిక్షణను కూడా యివ్వవలసిన బాధ్యత పై సంస్థలు స్వీకరించాలి. (భారతి 1972)

# తెలుగులో తొలి సమాజ కవులు

— వ్యాససంకలనం

సారస్వతవేదికవారు 1981 అక్టోబరునుంచీ 1982 సెప్టెంబరువరకు ఏర్పాటుచేసిన తత్వకవులను గూర్చిన 12 ఉపన్యాసాలు యిందులో సంకలితం. చూర్ణికలు వ్రాసి శ్రీకారం చుట్టిన భక్తకవి కృష్ణమాచార్యులనుంచీ వరుసగా ప్రజాకవులనదగిన అన్నమయ్య, రామదాసు (గోపన్న) వేమన, పోతులూరి వీరబ్రహ్మం, క్షేత్రయ్య, త్యాగయ్య, భక్తతత్వ కవయిత్రులూ ఈ సంపుటిలో ప్రసక్తమయ్యారు. "సమాజానికి దగ్గరగా ఉండి, సంస్కరణ స్వభావం కలిగిన" భక్త - తత్వకవులనుగూర్చి వివరించడంలో సమాజానికీ వారికీగల సంబంధాన్ని ముఖ్యంగా చిత్రించవలెననే వేదిక వారి ఉద్దేశం. ఈ ఉద్దేశాన్ని తృప్తికరంగా నెరవేర్చిన ప్రసంగవ్యాసం ఇందులో శ్రీ ఎన్. గోపి "కర్మయోగి వీరబ్రహ్మం" ఒక్కటే. ఏవిధంగానూ తృప్తి కలిగించని వ్యాసం జ్వాలాముఖి" సామాజిక వైరుధ్యాల మధ్య వేమన" ఈ రెండు వ్యాసాలు ప్రక్కనే ముద్రితం కావడమే కాదు. వేమన, వీరబ్రహ్మం సమకాలీనులై పదిహేడవ శతాబ్దికి చెందినవారు కావడంచేత

ఆ కవులకూ, ఆనాటి సామాజిక సంక్షోభానికీ గల సంబంధం ఎద్నానిన్ గోపీ ఎంత సమర్థవంతంగా చిత్రించారో జ్వాలాముఖి అంత అయోమయంగా తికమకగా చిత్రించిన తీరు పోల్చిచూస్తే తెలుస్తోంది. వాచాలతతో 44 పుటలు సాగిన వేమనమీది సుదీర్ఘ వ్యాసం తేల్చి చెప్పిందేమిటంటే - "ఆర్థికజగత్తు దివాలాని ఆత్మలోకం దివాలాగా భావించి, పలాయన వాదాన్ని ఆశ్రయించాడు వేమన" వేమన ఆత్మాశ్రయకవిత్వం వ్రాశాడు. ఆయన "అభ్యుదయశక్తులతో మమేకం చెందలేదు." అనీ ఇదే సంపుటిలో గజ్జెల మల్లారెడ్డి "వేమన తాత్విక చింతన పలాయనవాదాన్నీ మెట్టవేదాంతాన్నీ ఆశ్రయించలేదు. సామాజిక జీవితంలో అక్రమాలను, ఆడంబరాలనూ కులాల హెచ్చుతగ్గులనూ అతినిశితంగా ఖండించాడు" అన్నారు. తన 'రాయలసీమ తత్వకవులు అనే రచనలో ఈ అభిప్రాయంతో వేమనను పేర్కొన్న మిగతా రచయితలూ ఏకీభవించారు. అసలు వేమనకాలంలో "అభ్యుదయ శక్తులేమిటో జ్వాలాముఖి నిర్దేశించలేకపోయారు. కవయిత్రులనుగూర్చి ముదిగంటి సుజాతారెడ్డి వ్రాసిన ప్రసంగ వ్యాసంలో దేశికవితను, పదాలనూ కూర్చిన కవయిత్రులనేకాక మొల్లవంటి వారినికూడా పేర్కొన్నారు. "క్షేత్రయ్యలో మధురభక్తిని దర్శించడం కంటె అతన్ని కేవల శృంగార వాగ్గేయకారుడుగా గుర్తించడం నిజాయితితో కూడిన పని" అని పేర్వారం జగన్నాథం అభిప్రాయపడారు.

'కవుల చరిత్రలో స్థానం పొందని' సమాజ కవులను ఒకచోట చేర్చి సమీక్షించిన ఈ సంపుటి ఆహ్వానించదగినది. జరుగవలసిన పరిశోధనను తెలుగువారికి గుర్తు తెస్తున్నదీను. ( ఆంధ్రపత్రిక ) ❋

# డా. సి. ఆర్. రెడ్డి పీఠికలు

కట్టమంచి రామలింగారెడ్డిగారి శతజయంతి సందర్భంగా చిత్తూరు జిల్లా రచయితల సహకార ప్రచురణసంఘం వెలువరించిన సంపుటి యిది. సంపాదకుడు డాక్టర్ బి. భాస్కరచౌదరి. 1. స్వీయకృతుల పీఠికలు 2. అభిజనకృతుల పీఠికలు 3. కావ్య పీఠికలు 4. సంకీర్ణ కృతుల పీఠికలు 5. ఆంగ్ల పీఠికలు 6. (రచయితలకు) అభినందన లేఖావళి అను ఆరు విభాగములుగా రెడ్డిగారు వ్రాసిన గ్రంథపీఠికలు, రచయితల కిచ్చిన అభిప్రాయములు సేకరింపబడినవి. ఈ సంకలనానికి రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ, ఆచార్య కె. ఆర్. శ్రీనివాసయ్యంగార్, శేషాద్రిరమణ కవులు ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారలు రెడ్డిసిగూర్చి, వారి సాహిత్యకృషిని గూర్చి వ్రాసిన నాల్గు వ్యాసములు 'ప్రవేశిక'గా చేర్చబడినవి. సంపాదకుని నివేదనలు 'భూమిక' పేరుతో సందర్భోచితమైన మరో వ్యాసం. కొత్త తరానికి రెడ్డి రచనలు అందుబాటులో ఉండేలా యీ ప్రచురణకు పూను కొన్న చిత్తూరు రచయితల సహకారసంఘాన్ని అభినందిస్తున్నాను.

కావ్యపీఠికల్లో 'కళాపూర్ణోదయం', 'రంగనాథ రామాయణము', 'కృషీవలుడు', 'తొలకరి' కావ్యాలకు వ్రాసినవి యిదివరకే ప్రసిద్ధమైనవి. అలాగే స్వీయకృతులైన 'ముసలమ్మ మరణము', 'నవయామిని', 'కవిత్వ తత్వ విచారము' గ్రంథాలకు వ్రాసిన పీఠికలూ బాగా తెలిసినవే. ఈ సంపుటిద్వారా ప్రత్యేకంగా ఆకర్షిస్తున్నవి : 'అభిజనకృతుల పీఠికలు'. రెడ్డిగారి ముత్తాత పెద్దరామలింగారెడ్డి సంస్కృతాంధ్ర పండితుడు, కవి. ఆయన శిష్యుడు కుప్పనయ్యంగార్లు హైస్కూలులో తెలుగుపండితుడుగా రెడ్డిగారి గురువు. వీరి వ్యక్తిత్వాలనుగూర్చి పీఠికల్లో సజీవచిత్రణ చేశారు రెడ్డి. అలాగే తండ్రి సుబ్రహ్మణ్యరెడ్డినిగూర్చి, తమ కుటుంబ జీవితాన్ని

హూర్చి బంధుమిత్రజనాన్నిగూర్చి కన్నులగట్టేలాగ వర్ణించి ఎన్నో విశే షాలు తెలిపారు. మణియము సుబ్బయ్య, కుప్పనయ్యంగార్లు, కోటిగారి మునుస్వామిశెట్టివంటి బ్రాహ్మణ వైశ్యమిత్రులు కుటుంబసభ్యులుగా, సుబ్రహ్మణ్యరెడ్డికి ఆత్మీయులుగా ఉండేవారు. "పూర్వము గ్రామస్థుల విభక్త కుటుంబము లట్లుండేవారు. ఇప్పటివలె మన హిందూసంఘము విచ్ఛిన్నత దాల్చియుండలేదు." పల్లెల్లో ఆనాటి దైనందిన జీవితాన్నీ, సాంఘిక పరిస్థితులనూ, వ్యక్తుల మధ్య సంబంధాలనూ వివరంగా చిత్రించే ఈ పీఠికలు అమూల్యమైనవి.

'భారత అర్థశాస్త్రము' (1913) ను వ్రాయుటలో తన ఉద్దేశాన్ని గూర్చి చెబుతూ విజ్ఞానం ఎన్నో శాఖలుగా విస్తరిల్లుతున్న ఆధునిక యుగంలో వాటి సమన్వయం ముఖ్యమనీ, మానవుని సమగ్రమూర్తిత్వాన్ని విస్మరించగూడదనీఅన్నారు. "సంఘ మనశ్శాస్త్రాది తత్వంబుల వాసన ఏమాత్రమును లేనివాడు చరిత్ర శాస్త్రములను సైతము చక్కగా గ్రహింప జాలడనుట నిక్కువము", రెడ్డి వ్యక్తిత్వంలో యీ సమగ్రత బహు ముఖాల పాండితీప్రజ్ఞలుగా రాణించింది. "ఉజ్జ్వలమై సర్వంకషమైన ప్రతిభ, అసాధారణమైన తర్క కౌశలం. ఎదుటివారిని నోరుమూయించే వాగ్మిత, వశీకరించే హాస్య చాతుర్యం, గంభీరమైన రసభావానుభవ శక్తి - ఇవి ఆయనకు ఆజన్మసిద్ధమై వచ్చిన వరప్రసాదాలు" అన్నారు రాళ్ళపల్లి వారు. ఆ రస భావానుభవశక్తి ఎంత గాఢమైనదో ఒక సన్నివేశాన్ని ఉదహరించారుకూడా. 'ఒకనాడు జయదేవునిగూర్చి ప్రస్తావించి 'లలిత లవంగ లతా పరిశీలన కోమల మలయ సమీరే' అన్న చరణార్థం పాడి చూపేంతలో రెడ్డి ఒక్కదూకుగా లేచి చేతి షర్టును మీదకీడ్చి చూపి, 'నా పులకోద్గమం చూడవయ్యా! అద్భుతరచన' అన్నారట! ఆయన రోమాం బాలు 'నారుపోసి'నట్లుండి తన కాశ్చర్యం కలిగించాయని వ్రాశారు రాళ్ళ

పల్లి. (6 పుట) అయితే ఆవేశంలో కొట్టుకొనిపోయి ద్రవించే మనస్తత్వం కాదాయనది! భారతమువలన రచించినట్లు భాగవతముపట్ల అభిమానము చూపలేదు. పోతన శైలినిగూర్చి రెడ్డి యిలా అన్నాడు: "శైలియన్న దాసరివారి ఘంటానాదమువోలె లింగులింగని యుండునేమో! భాగవతము యొక్క శైలిని అనుక్రమించుట యంత కష్టముకాదు. 'అంతి' అనుట ఏలననగా భారతముయొక్క శైలితో బోల్చినయెడలనని". (పుట 68) హృదయముగల మేధావి రెడ్డి అభిరుచిని నిర్దేశించే మాటలివి. రెడ్డి ఉద్వేగంలో ధర్మదీక్ష, నమ్మినదానిని ఆచరించి ప్రకటించే నిర్భయత్వమూ స్వార్థమెరుగని నైర్మల్యమూ మనల్ని ఆకట్టుకొంటాయి. ఈ లక్షణాల్నే రాళ్ళపల్లి వారు ఆయనలో 'రాజస ప్రవృత్తి'గా పేర్కొన్నారు. "నీవు వట్టి ద్విజుడవై పోవద్దు. కొంతైనా వీర ధర్మాన్ని సంపాదించుకొని బతుకు అనేది నా కాయన చేసిన ఉపదేశాలలో ఒకటి" అని రాళ్ళపల్లి చెప్పుకొన్నారు. 1931 లో ఇంగ్లీషులో తన వ్యాస సంకలనానికి వ్రాసిన పీఠికలో నాటి రాజకీయపరిస్థితిని రెడ్డి సమీక్షించారు. అంతకు పూర్వమే వైస్ ఛాన్సలర్ పదవికి రాజీనామా యిచ్చారు. ఆ సమీక్షలో గాంధీగారిని గూర్చి ఆయన అన్నమాటలు:

"He is slowly evolving a People who will be Indians politically without ceasing to maintain.....their religions and cultural individuality, and who will be able to act with the courage and honour of a free people.....While others feast, he fasts: while others prey, he does so with an 'a'! If he goes half-naked to the horror of Churchills, it is probably because he feels..... that no man can enjoy a higher honour and respect than what pertains to his nation..... And this volume I offer at his feet as my little flower of worship."

గాంధీజీ వహిస్తున్న పాత్రను లోతుగా అర్థంచేసుకుని, పూజ్య భావంతో, భారతీయుడుగా పులకించి, తన పదవికి రాజీనామా యివ్వడమే కాకుండా, గ్రంథాన్ని ఆయనకు అంకితమిచ్చారు. కాంగ్రెసు వేషధారి కాకపోయినా రెడ్డి అచ్చమైన దేశాభిమాని! కెరీరిస్ట్ కాడు!!

తెలుగుదేశంలో రచయితలను, రచయిత్రులను మాత్రమేకాదు, తమిళ, కన్నడ ప్రాంతాల రచయితలు యింగ్లీషులో వ్రాసిన గ్రంథాలకు పీఠికలు వ్రాసి, వారినికూడా ప్రోత్సహించారు. దక్షిణదేశ మేధావులలో చంద్రునిలా ప్రకాశించారు రెడ్డి!

'ఆంధ్ర - తెలుగు' శబ్దాల చారిత్రకార్థమును అన్వేషించిన రచనగా ప్రొఫెసర్ పి. టి. రాజు 'తెలుగు సాహిత్యము' అను ఆంగ్ల గ్రంథానికి రెడ్డి వ్రాసిన పీఠిక చాల విలువైనది. ఆయన విషయ గ్రంథన సామర్థ్యానికి తార్కాణ అది. అలాగే 173 పుటలో 'ఖండకావ్యము' అను ఆధునిక ప్రక్రియకు ఆ పేరు సమంజసమా? కాదా? అను చర్చ ఎంతో నిశితమైనది. "అర్థము నిండుగా మెండుగా లేనిది కావ్యము కానేరదు.... వామనావతారము సైతము విష్ణువే! రసాత్మకమైనది ఒక వాక్యమైనను కావ్యమే....అఖండముకానిది కృతి కానేరదు.... చైతన్యముతోడి సంపూర్ణమైన ఆకృతిగ నుండుటే కదా జీవకళ లక్షణము! నిర్జీవము కవిత్వమా? ఇక జీవముండినయెడల ఖండత్వ మెక్కడిది?" ఏ విషయాన్ని స్పృశించినా నిశితమైన పరిశీలన, నిష్కర్షమైన తీర్పు రెడ్డి ధోరణి. రెడ్డి వ్యక్తిత్వాన్ని గుబాళిస్తూ ఈ నాటికీ పసివాడని ఈ రచనలు తెలుగు సరస్వతికి ఆయన చేసిన సుమార్చనగా సమాదరణీయాలు. ( భారతి )

# చలం శ్మశాన సాహిత్యం

— నిమ్మగడ్డ వెంకటేశ్వరరావు

చలం రచనలమీద ఆసక్తి ఈమధ్య పునరుత్థానమైనట్లు తెలుస్తూంది. అందుకీ పుస్తకం ఒక తార్కాణ. ఆసక్తి పునరుత్థానం కావడమే కాదు, విమర్శకూడా పునరావృత్తమయ్యే సూచనలున్నాయి. చలం సమాజానికి విరోధి. అరాచకవాది. నిర్మాణాత్మకమైన సమాజానికీ, స్త్రీ ప్రతిపత్తికీ ప్రగతిశీలమైన సిద్ధాంతాలుకానీ, ఉపదేశంకానీ ఆయన రచనల్లో కనిపించవు. ఈ విమర్శ నాడూ ఉన్నది; నేడు ఈ పుస్తకంలోనూ అదే ఉన్నది. ఈ విమర్శను మార్క్సిస్ట్ దృక్పథంతో చెయ్యబూనుకున్న రచయిత, ఆ కార్యాన్ని తనకు అనుకూలంగానైనా నిర్వహించలేకపోయారు. పుస్తకమంతా మొదటినుంచి చివరిదాకా చలం రచనలనుంచి కొటేషన్స్, చలం దృక్పథాన్నిగూర్చిన వివరణా ప్రధానంగా ఉంటూ నడిచింది. అక్కడక్కడా ఇది సమాజానికి పనికిరాదు; ఇది తెలుగువాళ్ళని గూర్చిన దూషణ; ఇక్కడ నాగరకతను నిరాకరించి ఆటవికతను ఉద్బోధిస్తున్నాడు చలం, అంటూ ఉట్టంకింపులు కూర్చారు. ఫలితం ఏమిటంటే పుస్తకం ముగించిన పాఠకునికి చలం భావాలూ, దృక్పథమే ఎక్కువగా తెలిసిన అనుభూతి కలుగుతుంది కాని, దానికి ప్రత్యామ్నాయమైన దృక్పథమూ, విమర్శ తాలూకు ఔచిత్యమూ నిరూపణ అయినట్లు తోచదు. ఈ విధంగా చలానికి మరో పుస్తకం ద్వారా ప్రచారం జరిగిందే తప్ప తద్భిన్నంగా జరగలేదు. చలం రచనలు చదవని యువతరంవారు ఎవరైనా ఉంటే, వాళ్ళీ పుస్తకం చూచిన తరవాత తప్పక చలం రచనలకోసం ఎగబడతారు. ఇదే చలం నాటికీ, నేటికీ తన విమర్శకులమీద సాధిస్తున్న విజయం - లేచే దుమారం ఆయనకే అనుకూలం కావడం.

చలం దృక్పథం పూర్తిగా వైయక్తిక దృక్పథం. ఆయన కాల్పనిక వాది (రొమాంటిసిస్టు). అరాచకవాది (అనార్కిస్టు). దీన్ని గుర్తించిన సామాజికవాది ఆయన జోలికి పోకపోవడమే ఉత్తమం. మార్క్సిజమ్ పూర్తిగా సామాజిక దృక్పథం, వాస్తవికత, రాజకీయాలు దాని ఊపిరి, వ్యవస్థ పునర్నిర్మాణం దాని ధ్యేయం. ఇలాంటి భిన్న ధ్రువాలు కలుసుకునే అవకాశం ఎక్కడా లేదు. తాతాచార్యులకూ, పీర్ల పండగకీ ఎక్కడ సంబంధం? చలం ధనస్వామ్య వ్యవస్థకేకాదు, సోషలిస్టువ్యవస్థకే కాదు, అసలు 'వ్యవస్థ' అనే దానికే విరోధి అని స్పష్టంగా తెలుస్తున్నప్పుడు, ఆయన్ని ధనస్వామ్యవ్యవస్థకి తొత్తుగా, బానిసగా, దాన్ని సమర్థించే రచయితగా నిరూపించుకోవడం శుష్కప్రయత్నం. అది నిలిచే విమర్శకాదు. తరువాత ఈ రచయిత అనుకున్నట్లు ఆయన్ని తాంత్రిక, వామాచార సంప్రదాయాలకు ఔరసుడుగా ఊహించడమూ గురి తప్పడమే అవుతుంది. పోనీ, చలం సామాజిక విప్లవం ఏదో తెచ్చాడని విమర్శిద్దామా? ఈ పుస్తకానికి 'ముున్నుడి' వ్రాసిన చలసాని ప్రసాదరావు అన్నారు - "చలం తెచ్చిన 'విప్లవం' ఫలితంగా ఇన్నేళ్ళ తరువాత స్త్రీ ఈనాడు కొనుక్కోగల వస్తువుగానే ఉందీ." ఒక రచయితవల్ల పెద్ద విప్లవం వచ్చేసి, మనుష్యుల సామాజిక సంబంధాలు మారిపోతాయని అనుకోవడం ఎటువంటి మార్క్సిస్ట్ అవగాహన? విప్లవం రాలేదనీ, ఆ బాధ్యత చలందే అయినట్లు చనాన్ని దుయ్యబట్టడం ఏమి విమర్శ? దీనికి చలం ఎప్పుడో ఇచ్చిన సమాధానం - "నేనే సంఘ విప్లవాన్ని కాని, భావ విప్లవాన్ని కాని తలపెట్టలేదు. ఆంధ్రులను దూరంగా జరిగేట్లు తన్నగలిగాను అని గర్వపడుతున్నాను".... చలాన్ని విమర్శించేప్పుడు ఆయన హాస్యధోరణిలో

అన్నవీ, చమత్కారంకోసం అన్నవీ సీరియస్‌గా తీసుకుని, "ఆంధ్రులను తన్నడమేమిటి? ఎంత ఇన్సల్ట్!" అని కోప్పడి విమర్శించినా, అందులో స్వారస్యం కనిపించదు! అలాగే సోషలిస్టు వ్యవస్థనిగూర్చి చలం - "మీ రాజ్యం వస్తే, ఎండలో ఒకడు బస్తాలు మోస్తోంటే, ఇంకోడు వెనక విసురుతూంటాడా?" అంటూ హాస్యోక్తి విసిరాడని ఉడుక్కుని ఏం లాభం? చలం ఒక సామాజిక దృక్పథాన్నంటూ ప్రచారం చేస్తేకదా, మనం విమర్శించడానికి? తొత్తిగా వ్యక్తివాదీ, రసలోలుపుడూ, సౌందర్యారాధకుడూ, వ్యవస్థా వ్యతిరేకీ అయిన రచయితను పట్టుకుని ఏం విమర్శించాలి?

అయితే చలం విమర్శకు లొంగడా? లొంగిపోతే ఇలాంటి రచయితని ఏం చెయ్యాలి? ఈ సమస్య సామాజికవాదులందరికీ వస్తుంది. ఏం చేస్తారు? 'మీ రాజ్యం వచ్చినప్పుడు నా పుస్తకాలు నిషేధించండి' అంటాడు బహుశా చలం. అప్పుడూ అతనిదే పైచేయి - "నే నప్పుడే చెప్పానుగా. వ్యక్తి స్వేచ్ఛను వీళ్ళు సహించరని నేను చెప్పిందే నిజమైంది" అంటూ చలం నవ్వడమే మిగులుతుంది. సామాజిక చైతన్యానికి లొంగని వ్యక్తి చైతన్యానికీ, నిరంతరమైన వ్యక్తి తిరుగుబాటుకూ చలం ప్రతినిధి. అటువంటి ప్రభావాన్ని కాదంటే లేదంటే ఎక్కడ పోతుంది? దీనికి సమఉజ్జీ మార్క్సిజమ్. మార్క్స్ సిద్ధాంతాన్ని ఎంతోమంది విమర్శించారు, తార్కిక - చారిత్రక సంబంధమైన లోటుపాట్లు చూపిస్తూ నిరాకరించారు. కాని మార్క్సిజమ్ నేటి సామాజిక విప్లవానికీ, పరిణామానికీ కీలకమైన శక్తి అనే సత్యం, ప్రపంచ వ్యాప్తమైన దాని ప్రభావం, ఎవరెంత గింజుకున్నా కాకుండా లేకుండా పోదు! ఇలా సమాంతర రేఖల్లో సాగే మానవ చైతన్యశక్తి భిన్నరూపాల్ని ఒక దానితో ఒకటి పోటీ పెట్టబోవడం, గాలితో యుద్ధం, నేలవిడిచిన సాము. (27-10-78) ✱

## ★ ఉత్తమ సాహిత్య గ్రంథాలు ★

### శ్రీమతి ఆర్. వసుంధరాదేవి రచనలు :

| | |
|---|---|
| 1. గాలిరథం (కథాసంపుటి) | రు. 10-00 |
| 2. నీడలు (కథాసంపుటి) | రు. 9-00 |
| 3. రెడ్డెమ్మగుండు (నవల) | రు. 10-00 |

### శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం రచనలు :

| | |
|---|---|
| 1. సాహిత్యంలో దృక్పథాలు | రు. 20-00 |
| 2. సాహిత్య నేపథ్యం (వ్యాసావళి) | రు. 12-50 |
| 3. మధుర మీనాక్షి (కథాసంపుటి) | రు. 8-00 |
| 4. సంసారవృక్షం (నవల) | రు. 16-00 |
| 5. మళ్లీ వసంతం (నవల) | రు. 20-00 |
| 6. నూరు సమీక్షలు | రు. 35-00 |